శ్రీమతే రామానుజాయ నమః.

    

# చరమశ్లోక త్రయము.

---

శ్రియఃపతియై శ్రీవైకుంఠనికేతనుఁడై నిత్యముక్తానుభావ్యుఁడై నిరతిశయానందయుక్తుఁడై "వీఱ్ఱిరున్దేఴులకుమ్ తనిక్కోల్ శెల్ల" అనే ప్రకారముగా "నలమన్దమిల్లదోర్ నాడు" అని నిరవధికానన్దస్థానమైన పరమపదమునందు పేరోలగముగా వేంచేసియుండు సర్వేశ్వరుఁడు; ఆనిత్యసూరులతోపాటి తన స్వరూపరూపగుణముల ననుభవించి నిత్యకైంకర్య భోగముగలవారై యుజ్జీవించుటకు (ప్రాప్తి) అనఁగా శాధ్యత, కలిగియుండియు దానినిఁబోగొట్టుకొని "అసన్నేవ" అనే శ్రుతి ప్రకారముగా (అసచ్ఛబ్దవాచ్యమైన) అనఁగా స్వరూపమే లేదని చెప్పఁదగిన, వాటితోడఁగొంచెము తక్కువగా సమానులై పడియుండు సంసారి చేతనులయొక్క దుఃఖము ననుసంధించి, యత్యంత వ్యాకుల చిత్తుఁడై; వీరలు కరణకళేబరములులేక ఱెక్కలులేని పక్షులవలెపడియుండు దశయందు, దేహేంద్రియాదుల నిచ్చి, పిదప, వీరలా దేహేంద్రియాదులను శబ్దాది విషయములయం దుపయోగపరచి నశింపక, తన్నాశ్రయించి యుజ్జీవించుటకై; అపౌరుషేయమై నిత్యనిర్దోషమై తనకుతానే ప్రమాణమైన వేదమునున్ను, వేదార్థములను వివరించునట్టి స్మృతీతిహాస పురాణాదులనున్ను, ప్రవర్తింపఁజేయఁగా; అట్టి శాస్త్రాభ్యాసమునకు సర్వశాఖాప్రత్యయ న్యాయాదులైన

అనేక యోగ్యతలు కావలసి యుండుటవల్ల, వీరలు వాటియర్థములనె తెలిగి జ్ఞానముఁ దెచ్చుకొని యుజ్జీవించుట యరుదుగా నుండుటను తన దివ్య చిత్తమునందుఁ దలపోసి "నాట్టిల్ పిఱన్దు" అనే శ్రీసూక్తి ప్రకారముగా "పరమయోగివాఙ్మనసా పరిచ్ఛేద్య" మని బొగడొందిన తన వైభవమునకుఁ దరముగాని "ఇరుళ్ తరుమాఞాల" మయిన యీ ప్రపంచమందు మత్స్య కూర్మాది రూపములతో "ధర్మసంస్థాపనార్థాయ సంభవామి" అనే ప్రకారముగా నవతరింపుచు, తన యనుష్ఠానముచేతనున్ను ఉపదేశముచేతనున్ను వీరికి జ్ఞానముకలుగునట్లు వర్తించుచు చేతనుల నుజ్జీవింపఁ జేయుచుండును. "ఆస్తాం తే గుణరాశివద్గుణపరీవాహాత్మనాం జన్మనాం సంఖ్యా" అనుప్రామాణికోక్తి ప్రకారముగా భగవదవతారము లసంఖ్యాతములై యుండినను, అందు మత్స్యకూర్మాది దశావతారములు మాత్రమే మిక్కిలి ప్రధానములుగా నున్నవి.

"తేవుడైయ మీనమా యామైయా యేనమా యరియాయ్ కుఱళాయ్, మూవురులిరామనాయ్ క్కణ్ణనాయ్ క్కఱ్కియాయ్".

అని యీయవతారములను "మయర్వఱ మతినల మరుళప్పెఱ్ఱవర్కళ్" అనిపొగడొందిన వారిలోపల "ఆழ్వార్కళెల్లారైయుమ్ పోలల్లర్ పెరియాழ్వార్" అనిప్రామాణికాగ్రేసరులచేత కొనియాడఁబడినట్టి పెరియాழ்వార్లు ప్రశంసించి యున్నారుగదా?

శ్లో॥ ఇచ్ఛామీన విహారకచ్ఛపమహాపోత్రిన్ యదృచ్ఛాహరే
రక్షావామన రోషరామ కరుణాకాకుత్స్థ హేలాహలిన్ ।
క్రీడావల్లవ కల్కివాహన దశాకల్కిన్నితి ప్రత్యహం ।
జల్పంతఃపురుషాః పునంతుభువనంపుణ్యౌఘపణ్యాపణాః ॥

అనునభియుక్తోక్తియుఁ దేజరిల్లుచున్నది గదా?

ఇట్టి దశావతారముల లోపల వరాహ రామ కృష్ణావతారము లందు సంసారిచేతనులు ఉజ్జీవించుటకు విధిరూపములైన చరమ శ్లోకములను సాయించి యుండుటవల్ల యీ మూడవతారములున్ను విద్ధ్యవతారము లనంబడును. "జ్ఞానప్పిరానై యల్లాలిల్లై నాంకండనల్లతువే" అనిన్ని; తయరతట్కు మర్ఱ తన్నైయన్ఱి మఱిలేన్" అనిన్ని; "అన్ఱు తేర్ కడవియ పెరుమాన్ కనై కழల్ కాణ్బతెన్ఱుకొల్ కణ్గళే" అనిన్ని; మయర్వఱ మతినల మరుళప్పెఱ్ఱవర్" అని పొగడొందినవారు, ప్రాయశః, ఈయవతారములనే తమకుపాయోపేయములుగా ననుసంధించి యుండుటంబట్టి, ఇవి మిక్కిలి కృపా ప్రకాశకములైనవి.

ఇట్లు సర్వోత్కృష్టములైన యీ యవతారముల యందు, సర్వేశ్వరుఁడు పరమకృపతో సాయించిన చరమ శ్లోకముల లోపల మొదటిది శ్రీవరాహ చరమము. "భూతధాత్రీ" అని సర్వభూతములనున్ను పోషించుటయే తనకు నిరూపకముగా పొగడొందిన శ్రీభూమిప్పిరాట్టి, సమస్త సంసారిచేతనుల యుజ్జీవనార్థముగా తన్ను ప్రార్థించగా సర్వేశ్వరుఁడు పరమకృపతో నీ చరమ శ్లోకమును ప్రసాదించినారు.

## శ్రీ వరాహ చరమము.

శ్లో॥ స్థితే మనసి సుస్వస్థే శరీరే సతి యో నరః ।
ధాతుసామ్యే స్థితే స్మర్తా విశ్వరూపఞ్చ మామజమ్ ॥

శ్లో॥ తతస్తం మ్రియమాణన్తు కాష్ఠపాషాణ సన్నిభమ్ ।
అహం స్మరామి మద్భక్తం నయామి పరమాఙ్గతిమ్ ॥

## రెండవది శ్రీరామాయణ చరమము.

ఇది శ్రీరామావతారమునందు శ్రీవిభీషణాఴ్వార్ శరణాగతి సమయములో శ్రీసుగ్రీవ మహారాజును చూచి శ్రీచక్రవర్తి తిరుమక నాళ్లు సాయించినది. దీనికే అభయ ప్రదానమని తిరునామము.

శ్లో॥ సకృదేవ ప్రపన్నాయ తవాస్మీతి చ యాచతే ।
అభయం సర్వభూతేభ్యో దదామ్యేత ద్వ్రతంమమ ॥

## మూడవది శ్రీగీతోపనిష చ్చరమము.

ఇది శ్రీ కృష్ణావతారమునందు మహాభారత యుద్ధరంగములో తిరుత్తేరులో నుండి అర్జుననిచూచి అనుగ్రహ రూపముగా విధించినది.

శ్లో॥ సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ ।
అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః ॥

ఈమూడు చరమశ్లోకములున్ను ఏకకంఠముగా శరణాగతిచేయు అధికారినిన్ని, ఆశ్రయణకాలమునున్ను, ఆశ్రయించు ప్రకారమునున్ను, ఆశ్రయింపబడు వ్యక్తినిన్ని, అట్టివ్యక్తివల్ల పొందుఫలమునున్ను వివరించిచూపును.



శ్రీమతేరామానుజాయనమః.



# శ్రీవరాహ చరమము.

శ్లో॥ స్థితే మనసి సుస్వస్థే శరీరేసతి యోనరః ।
ధాతుసామ్యే స్థితే స్మర్తా విశ్వరూపఞ్చ మామజమ్ ॥ ౧॥

శ్లో॥ తతస్తం మ్రియమాణన్తు కాష్ఠపాషాణ సన్నిభమ్ ।
అహం స్మరామి మద్భక్తం నయామి పరమాఙ్గతిమ్॥ ౨॥

అర్థము.—మనసి - చిత్తము, సుస్వస్థే - విషయాంతరములను వెంబడించి పరుగులెత్తుటను మాని మిక్కిలి నిలుకడగానున్న, శరీరే - దేహము, సుస్వస్థే - రోగపీడ లేక సెమ్మదిగానున్న, స్థితేసతి - కుదిరికతో నుండగా, ధాతుసామ్యేస్థితే - వాతపిత్తశ్లేష్మ ధాతువులు హెచ్చుతక్కువ లేక సమముగా నుండగా, యోనరః - ఏచేతనుఁడు, మాం - నన్ను, విశ్వరూపం - ప్రపంచమే శరీరముగా గలవాడుగానున్న, అజంచ - కర్మాధీనమైన జన్మము లేనివాడుగానున్న, స్మర్తా - అనుసంధింపఁగలఁడో, తంతు - అట్టి చేతనునియైతే, తతః - ఇట్లు సకృత్తుగా స్మరణమాచేసిన వెనుకటికాలమునందు, మ్రియమాణం - మృతిఁజెందునప్పుడు, కాష్ఠపాషాణ సన్నిభం - అచేతనములైన కట్టెలు రాళ్లు వీటితో సమానుఁడై యుండఁగా, (అనఁగా „ప్రాణప్రయాణసమ

యే " ఇత్యాది శ్రీముకుందమాలా శ్రీసూక్తియందు సాయించినట్లు అంతిమ స్మరణము నకు కూడా తెలివిలేక యుండఁగా) అహంస్మరామి- అతఁడు చేయఁదగినట్టి యంతిమ స్మరణమును నేనే చేయుచున్నాను, (ఇంతేకాదు) మద్భక్తం - నాయందు భరన్యా సముచేసి ప్రయోజనాంతరమును కోరనివాఁడైన అట్టి మద్భక్తుని, పరమాం - పునరావృత్తి రహితమై సర్వోత్కృష్టమైనట్టి, గతిం - ప్రాప్యస్థానమును, నయామి - పొందించుచున్నాను.

## పెరియవాచ్చాన్ పిళ్ళై వ్యాఖ్యానము.



అవతారికై. (స్థితేమనసీత్యాది) అనుభావ్యవస్తు లాభత్తుక్కు నిరపాయోపాయమాన ఆశ్రయణ కాలత్తైయుమ్, ఆశ్రయణాధికారియైయుమ్, ఆశ్రయణప్రకారత్తైయుమ్, ఆశ్రయణీయవ్యక్తి విశేషత్తైయుమ్, ఆశ్రయణఫలత్తైయుమ్ శొల్లుకిఱతు ఇన్దశ్లోకద్వయమ్. "స్థితే మనసిసుస్వస్థేశరీరేసతి, ధాతుసామ్యేస్థితే" ఎన్ఱు ఆశ్రయణకాలత్తై చ్చొల్లుకిఱతు ; "యోనరః" ఎన్ఱు ఆశ్రయణాధికారియై చ్చొల్లుకిఱతు, "స్మర్తా" ఎన్ఱు ఆశ్రయణ ప్రకారత్తైచ్చొల్లుకిఱతు ; "విశ్వరూపం చమామజమ్" ఎన్ఱు ఆశ్రయణీయ వ్యక్తివిశేషత్తై చ్చొల్లుకిఱతు ; మేల్ శ్లోకమ్ ఆశ్రయణఫలత్తైచ్చొల్లుకిఱతు.

(మనసిసుస్వస్థే) మనస్సావతు ఏతు ? అతుక్కు అవస్థానమావతు ఎతెన్నిల్ ; మనస్సావతు- అహఙ్కార కార్యమాయిరుప్పతొరు అన్తఃకరణవిశేషమ్. అతుక్కు అవస్థానమావతు - అనాదికాలపాపవాసనైయాకిఱ మహావాతత్తాలే ప్రేరితమాయ్, తనక్కావాసభూమియాన హృదయగుహైయిల్ క్షణకాలమ్ తఙ్గప్పెఱాతే కణ్డవిషయఙ్గళిలే మణ్డిప్పుక్కుత్తిరికిఱనెఞ్జు నిర్విషయమాకై. ఆక ఇతిల్ మనస్సినుడైయ విషయాధీనమాన అన్యపరతైయవిర్ న్దపడి శొల్లుకిఱతు. అనన్తరమ్ శరీరాలస్యనిబన్ధనమాన మనస్సినుడైయఅన్యపరతాశాన్తిక్కు

హేతుశొల్లుకిఱారు (శరీరేసుస్వస్థేసతి) ఎన్ఱు. శరీరమ్ స్వస్థమాయిరుక్కిఱానవళవిలే, వ్యాధినామాకరమాయిత్తే శరీరమిరుప్పతు; అన్దవ్యాధికళిలొన్ఱు తలైయెడుత్తతాకిల్ తజ్జనితమాన దుఃఖానుభవత్తిలే ఉపక్షీణమాకైయాలే భగవద్విషయత్తుక్కు యోగ్యమాకమాట్టాతిఱే నెఞ్జు. ఆకైయాలే శరీరాలస్యనివృత్తి మనస్స్వాస్థ్యత్తుక్కు హేతు. అన్దశరీరాలస్య నివృత్తిక్కు హేతుశొల్లుకిఱతు (ధాతుసామ్యస్థితే) ఎన్ఱు. ధాతుక్కళావన — వాతపిత్తశ్లేష్మజ్గళ్. అన్దధాతుక్కళుక్కు సామ్యముణ్డాకైయావతు — ఒన్ఱుక్కొన్ఱు న్యూనాతిరేకమఱ ఒత్తిరుక్కై. అన్దధాతుక్కళినుడైయ న్యూనాతిరేకజ్గళ్ వ్యాధిహేతు; మూన్ఱినుడైయ ప్రకోపమ్ మరణముఱే. ఆకైయాల్, అన్దవ్యాధి హేతుక్కళ్ తన్నిలొత్తవాఱే అవఱ్ఱినుడైయ నిమ్నోన్నతత్వాల్ వరుమ్ వ్యాధి ఉణ్డాకాతు; వ్యాధి యుణ్డాకామైయాలే శరీరమ్స్వస్థమామ్; శరీరస్వాస్థ్యత్తాలే మనస్స్వాస్థ్యమ్ పిఱక్కుమ్; పిన్బు మనస్సుస్మరణక్షమమామ్. ఆఃకీ ప్రీత్తనైయాలుమ్ స్మరణైక్కాప్తమాన కాలవిశేషత్తై చ్చొల్లుకిఱతు.

అనన్తరమ్ స్మరణాధికారియై చ్చొల్లుకిఱతు. (యోనరః) ఎన్ఱు. నరశబ్దమ్ మనుష్యవాచి. ఇతిల్ దేవతైకళైయుమ్ ఉపలక్షిక్కిఱతు. ఇత్తాల్ భగవత్సమాశ్రయణత్తుక్కు కరణపాటవమే అపేక్షితమెన్ఱతాయిఱ్ఱు. వక్ష్యమాణమాన స్మరణత్తుక్కు జన్మవృత్తాదికళ్ అప్రయోజకజ్గళ్, ఏతేనమ్ జన్మమాకవుమామ్, వృత్తమాకవుమామ్; కరణపాటవముమ్ రుచియుమే వేణ్డువతు.

(స్మర్తా) స్మరణమావతు — ఒరుజ్ఞానవిశేషమ్; మేలే „విశ్వరూపమ్" ఎన్ఱు శేషిత్వత్తైయుమ్, „నయామి" ఎన్ఱు ఉపాయత్వత్తైయుమ్, „పరమాంగతిమ్" ఎన్ఱు ఉపేయత్వత్తైయుమ్ శొల్లుకైయాలే ఇమ్మూన్ఱుమ్ ఇన్దస్మరణత్తుక్కు విషయమాకక్కడవతు. ఆకవిత్తాల్ ఆశ్రయణప్రకారమ్ శొల్లిఱ్ఱాయిఱ్ఱు.

అనన్తరమ్ ఆశ్రయణీయవస్తువై చ్చొల్లుకిఱతు (విశ్వరూపమ్) ఎన్గిఱపదమ్. విశ్వత్తైయుమ్ తనక్కు రూపమాక వుడైయవన్ విశ్వరూపియాకిఱాన్. ఇవన్ విశ్వశరీరియాయిరుక్కుమాకిల్ ఉభయగతమాన దోషముమ్ స్పర్శియాతో వెన్న చ్చొల్లుకిఱతు; (అజమ్) జననమరణాది శూన్యమ్. ఇన్దజననమ్ శరీరధర్మమాన షడ్భావ వికారఙ్గళుక్కుమ్ ఆత్మధర్మమాన అజ్ఞానదుఃఖాదికళుక్కు ముపలక్షణమ్, (చ) ఇచ్చేతననుడైయ హితాహిత జ్ఞానవిశేషత్తైయుమ్, జ్ఞానానుగుణమాక కార్యమ్ తలైక్కట్టుకైక్కీడానశక్తియైయుమ్, దయైయైయుమ్, కణిశిక్కిఱతు. (వరామ్) ఎన్నైయెన్ఱపడి, అసాధారణ విగ్రహత్తై ఆశ్రితాదికళ్ కణ్ణుక్కు విషయమాక్కి క్కొణ్డునిఱ్కుమ్ సౌలభ్యత్తైయుమ్, "మానమిలాప్పన్ఱి" ఎన్ఱ అత్యన్త విహీనమాన వరాహజన్మత్తిలే అత్యభినివిష్టనామ్పడియాన సౌశీల్యాతిశయత్తైయుమ్, మాదలిత్తు క్కాట్టినపడి.

అనన్తరమ్ తతఇత్యాదిశ్లోకత్తాలే ఆశ్రయిత్తవనుక్కు ఈశ్వరనుణ్డాక్కుమ్ ప్రయోజనవిశేషత్తై చ్చొల్లుకిఱతు. (తతః) పిన్బెన్ఱపడి. అత్తాల్ ఇన్దస్మృతియినుడైయ నైరన్తర్యత్తై క్కాట్టుకిఱతు. (తమ్) "స్మర్తా" ఎన్గిఱపడియే ఎన్నైయే ఉపాయోపేయమాక అధ్యవసిత్తవధికారియై. ఇవనుక్కు ఫలఙ్గొడుప్పతు ఎప్పోతో వెన్నిల్; (మ్రియమాణమ్) మరణోన్ముఖనాన సమయత్తిలే. (తు) శబ్దమ్ సాధకనిఱ్కాట్టిల్ ఇవ్వధికారిక్కు వక్ష్యమాణమాన విశేషత్తై ద్యోతిప్పిక్కిఱతు. అన్దవిశేషమెన్నెన్నిల్; (కాష్ఠపాషాణసన్నిభమ్) జ్ఞానసంసర్గ శూన్యమాన కాష్ఠపాషాణఙ్గళో డొత్తిరుక్కవమైయుమ్. శాస్త్రమ్ అన్తిమస్మృతికొణ్డు జీవిక్కవేణుమెన్ఱుశొల్లానిఱ్క అన్తిమస్మృతియొఴియ ఉజ్జీవిప్పిక్కక్కడవ నెన్నై శాస్త్రవిరుద్ధమన్ఱో వెన్నిల్; ఇతువుమ్ అప్పడియే; ఇతిల్ అంశమ్ ఎన్నతెన్గిఱాక (అహంస్మరామి) ఎన్ఱు.

అపేక్షిత స్మరణత్తుక్కు కర్త్తానానే. కృష్యాశమ్ కర్షకనుక్కన్రో? (స్మరామి) ఇవనొరుకాల్ స్మరిత్తానాకిల్ అనవరతభావనై పణ్ణక్కడవేన్. నీ ఇప్పడిమేల్విழுన్దు నినైక్కైక్కు ఇవన్ పక్కల్ తన్నెఞ్జుమెన్నెన్నిల్; (మద్భక్తమ్) ఎనక్కునల్లవనన్రో? మద్భక్తనెన్రు ప్రపన్నాధికారియై చ్చొల్లుకిఱతు. ఆకవెన్నక్కలిలే అనన్యప్రయోజన భక్తియై యుడైయవనాకైయాలే అవన్ కాష్ఠపాషాణ సన్నిభనేయాకిలుమ్ నాన్స్మరిప్పన్. ఇఙ్గుచ్చొల్లుకిఱ స్మరణమావతు - ఇవన్తన్ కార్యత్తిల్ కై వాఙ్గి నన్బక్కలిలే తన్ సర్వభరఙ్గళైయుమ్ సన్న్యసిత్తాన్; ఆనపిన్బు ఇవన్ కార్యమడైయ నమక్కే భరమ్; ఇవన్ ఇన్నమొరుకాల్ ఉత్క్రాన్తిక్లేశమనుభవిత్తల్, యమన్ముఖత్తిల్ విழுత్తల్, గర్భగుహైయిలేకిడత్తల్ శెయ్యాతే నిత్యకైఙ్కర్యమ్ పణ్ణి నిత్యానన్దియాక్కేణుమ్, ఎన్రిఱసఙ్కల్పమ్. (నయామిపరమాంగతిమ్) ఎన్రతు - పరమప్రాప్యప్రకారత్తై చ్చొల్లుకిఱతు. (పరమాంగతింనయామి) పరమైయాన గతియైక్కొణ్డు స్వీకరిప్పిక్కక్కడవన్. గతియావతు - "గమ్యత ఇతి గతిః" ఎన్రిఱవ్యుత్పత్తియిలేయాయ్ ప్రాప్యత్తై చ్చొల్లుకిఱతు. అతిల్ పరమగతియావతు. అతుక్కవ్వరుకిల్లాత ప్రాప్యమ్. అతావతు - పరమపురుషార్థ లక్షణమోక్షమ్. నాట్టిల్ పురుషార్థమాకవేణ్డువతు - ధర్మార్థకామమోక్షమ్; ఇవై పురుషార్థమాకక్కాట్టానైయాలే అత్తైవ్యావర్త్తిత్తు స్వయంపురుషార్థమాయ్ స్వరసమాయ్ నిరతిశయమాన భగవత్కైఙ్కర్య రూప పరమ ప్రాప్యత్తై చ్చొల్లుకిఱతు. (నయామి) అన్నప్రాప్యత్తై ప్రాపిక్కుమిడత్తిల్ ఆతివాహికన్కళ్కైయిలే కాట్టిక్కొడేన్; అత్తవాళత్తలైయాలే ముట్టాక్కిట్టు నానేకొండుపోకక్కడవేన్. లఙ్కాజనపదత్తిలిరున్ద పిరాట్టియై పుష్పకత్తిల్ మేలేతానే ఎడుత్తువైత్తుక్కొణ్డు పోనాప్పోలేకాణుమ్ ఇవ్వాత్మావై కొండుపోవ్పడియుమ్.

పెరియవాచ్చాన్బిళ్ళై తిరువడిగళేశరణమ్.

ఈవ్యాఖ్య ననుసరించి యాంధ్రవ్యాఖ్య వ్రాయఁబడు చున్నది.



అవతారిక. (స్థితేమనసీత్యాది) ఇందు, ముక్తచేతనులచే నను భవింపఁదగిన పరబ్రహ్మమును, బొందుటకు అపాయములేని యుపాయము, తత్పాదారవింద ప్రపత్తి దక్క వేరు లేకుండుటంబట్టి, అట్టి ప్రపత్తికి కాలమిదియనియు, దానికధికారి యిట్టివాడనియు, ఆశ్రయణవిధంబును ఆశ్రయింపఁదగిన వ్యక్తివిశేషంబును ఆశ్రయణ ఫలంబును నిట్టిట్టిదనియు, చెప్పఁబడుచున్నది.

అది యెట్లనిన. "స్థితేమనసి సుస్వస్థే శరీరేసతి, ధాతుసామ్యేస్థితే" అనుపదములచే నాశ్రయణకాలము చెప్పఁబడుచున్నది; "యోనరః" అనుపదములచే నాశ్రయణాధికారి చెప్పఁబడుచున్నాడు; "స్మర్తా" అని యాశ్రయణ ప్రకారము చెప్పఁబడుచున్నది; "విశ్వరూపంచ మామజం" అను పదములచే నాశ్రయణీయ వ్యక్తి విశేషము చెప్పఁబడుచున్నది; (వ్యక్తివిశేషమనగా మిక్కిలి విలక్షణమైన వ్యక్తి) రెండవ శ్లోకము ఆశ్రయణఫలమునుఁ జెప్పుచున్నది.

వ్యా. (మనసి సుస్వస్థే స్థితే)మనస్సు నిలుకడతోనుండగా. ఇచట మనస్సనేది యేది? దానికి నిలుకడయనేది యేది? అనఁగా; మనస్సనేది (శ్రీమత్తత్త్వత్రయ రహస్యమునందు సాయించియుండు రీతిగా) సాత్త్వికాహంకారమునుండి జనించినట్టి యొకయంతఃకరణవిశేషము. ఇది, ప, అనేయక్షరముచేత సూచింపఁబడిన యిరువదియొక్కటియవ తత్త్వము. దీనికి నిలుకడయనేది, అనాదికాల పాపవాసనయనియెడి పెనుగాలిచేత ప్రేరితమై తనకునికి పట్టుగానుండు హృదయగుహయందు క్షణకాలమును నిలువనోపక కంటికగుపడిన విషయము లన్నిటియందును మునుఁగుచుఁ దిరుగునట్టి స్వభావము పోయి నిర్విషయమగుట. (నిర్విషయమనఁగా నేవిషయమందుననుంటక గాలి

లేనిచోటనుండు దీపమువలెనుండుట.) ఇందువల్ల నీపదమునందు మనస్సు విషయములను మరిగి పరుగులెత్తుటను వదలునట్టి విధము చెప్పఁబడియె. మనస్సుకు యిట్టినిలుకడ భగవత్కటాక్షమువల్ల కలుగునట్టి కర్మసామ్యదశలో కలుగునుగాని యంతకుముందు కలుగనేరదు. కర్మసామ్యదశయనగా, పూర్వకృతములైన పుణ్యాపాపకర్మములయొక్క ఫలములను స్వర్గ నరకాదులయందు పెద్దకాల మనుభవించి, ఇఁక జరుగఁబోవు కాలమందు పూర్వకర్మవాసనను అనుసరించి పుణ్యాపాప కర్మముల నాచరించుటకు ప్రవర్తించు నంతేగాని వేరులేదను నంతటి స్థితిలో, కర్మఫలానుభవముగాని వేరొకకర్మముఁజేయఁ బ్రవర్తించుట గాని లేక చేతనుఁడు తీరికతోనుండుదశ. ఈయర్థమును వచనభూషణ దివ్యశాస్త్రమునందు ‹‹ పూర్వకృత పుణ్యాపుణ్యాఫలంగళై చిరకాలమ్ భుజిత్తు ›› ఇత్యాది శ్రీసూక్తులచే శ్రీపిళ్లైలోకాచార్య స్వాములవారు స్పష్టముగా సాయించియున్నారు.

అనన్తరము శరీరాలస్యమువల్ల మనస్సుకు కలుగునట్టి, యన్యపరత్వము (అనఁగా వేరొకచింతయందుఁ దగిలియుండుట) ఉపశమించుటకు కారణము చెప్పఁబడుచున్నది, (శరీరేను స్వస్థే)అని. శరీరము ఆరోగ్యముకలిగి మంచిస్థితిలోనుండగా, అని దీనియర్థము. (ఇచ్చట శరీరారోగ్యమును చెప్పనేల, రోగము సకృత్తుగావచ్చి పోవుచుండునే గాని ఆరోగ్యము సహజముగా నుండునుగదా? అనితలఁచఁగూడదు, ‹‹ వ్యాధీనామాకరం వపుః ›› అని తత్త్వవేత్తలు దీనిని రోగములకు నికి పట్టుగానుండునని వక్కాణించి యున్నారు. ఇది యెల్లవారికినిఁ దెలిసిన విషయముగానే యున్నది. ఇదియిట్లుండని. ఇచ్చటమఱియొక తటస్థ శంకగలదు, అదియెట్టిదనిన; ఓయీ, దేహారోగ్యస్థితిని మనశ్చాంచల్యనివృత్తికి కారణముగా చెప్పవచ్చునా? లోకమునందు రోగములేక నెమ్మదిగా నుండువారందఱు, భోగానుభవము లందును

వాటికిఁ గావలయునట్టి యుపకరణముల నొడగూర్చుటయందును దానికి ప్రతికూలము సేయువారిని సాధించుటయందును కాలమంతయు నుప యోగపరచి, దేహమునకంటే వేరైనదొకటి యున్నదని యెఱుంగక విషయాంతరమగ్నులై యుండలేదా? మహర్షులందఱు నీవిషయమును చక్కగా నాలోచించిరిదా, "విపదస్సంతు నశ్శశ్వద్యాసు సంకీర్త్య తేహరిం" అని, వ్యాధి పీడ మొదలయిన ఆపదలు కలిగినప్పుడు భగ వంతుని స్మరణముకలుగును కాబట్టి యట్టియాపదలు మాకు పలుమా ఱును కలుగుచుండ వలయునని ప్రార్థింపుచుందురు. అని యిట్టి తటస్థ శంకరాగా, దానికు త్తరము; ఓయీ దేహారోగ్యస్థితిచేతనే మనశ్చాం చల్య నివృత్తి కలుగుచున్నదని యీ పదములకు తాత్పర్యముకాదు. కరణపాటవము చక్కగా నుండుకాలమే భగవదాశ్రయణమునకు ఏ కాంతమైన (అనఁగా మిక్కిలి విరామమునుగల) కాలమని చెప్పుటయే యీపదములకు ముఖ్యతాత్పర్యము. ఇందువల్ల వార్ధక్యము రాకము నుపే భగవదాశ్రయణము చేయవలయునని యేర్పడినది. ఈ యర్థ మును శ్రీభాగవతము సప్తమస్కంధము ఆరవయధ్యాయము మొదటి శ్లోకమునందు, "కౌమార ఆచరేత్ప్రాజ్ఞోధర్మాన్ భాగవతాన్" అని, శరీరము ఆరోగ్యముకలిగి నుంచిస్థితిలో నుండునట్టి కౌమారవయ స్సులోనే భగవంతుని యాశ్రయించవలయునని శ్రీప్రహ్లాదాళ్వానులు సాయించినదేగాక "మయర్వాఱ మతినల మరుళ్ప్పెఱ్ఱవన్ కళ్" అని పొగడొందిన పెరియాళ్వారులు "ఎయ్ప్పెన్నైవన్దు నలియుమ్బోదగ్గ తునానునై ఎన్నైక్కమాట్టేన్, అప్పోదైక్కిప్పోదే శొల్లివైత్తేన్" అని, వాతపిత్తశ్లేష్మములు ప్రకోపించుటవల్ల బడలిక కలుగునట్టి కాల మందు అణుమాత్రమైనను నిన్ను స్మరింపఁజాలను, కాబట్టి యిప్పటికి గాను యిప్పుడే నీసన్నిధియందు నన్ను చెయ్యావిడువకుమని విన్నవిం చియున్నానని ప్రార్థించియున్నారు. "కిళరొళియిళమై కెడువదన్

మున్నమ్" అనిగదా ప్రపన్నజనకూటస్థుల శ్రీసూక్తి. కాఁబట్టి వ్యాధులకు అంతఁగా నవకాశము లేక కరణపాటవము కలిగియుండు కౌమార దశయందే భగవదాశ్రయణము చేయవలయునని యభిప్రాయము. వృద్ధత్వము రాగానే కరణపాటవము తప్పుటయు, పిదప వ్యాధులు నానాటికి ప్రకోపించి బాధింపఁ బూనుటయు, శ్రీనారద భగవానులు, ప్రాచీన బర్హిస్సు అనేరాజునకు అన్యాపదేశముగా నెఱుఁగఁజేసినట్టి యధ్యాత్మవిద్యయగు పురంజనోపాఖ్యానమునందు స్పష్టముగా నెఱుఁగవచ్చును. (శ్రీభాగవతము స్కంధము, ౪, అధ్యాయం, ౨౮, మొదలు చూడుఁడు) ఇంతేకాదు, వృద్ధత్వము లేకుండినా, శరీరము రోగములకు నివాసస్థానమని తత్త్వవేత్తలు చెప్పియుండుటం బట్టి కరణపాటవము చక్కఁగా నుండునట్టి కౌమారాది వయస్సులయందు కూడా వ్యాధులు సంభవించుట లోకప్రసిద్ధిగానున్నది కాబట్టి, అసంఖ్యాతములై దేహమునందంటియుండునట్టి వ్యాధులలో నేదైన నొక్కటి తలయెత్తెనేని దానివల్ల కలిగిన దుఃఖానుభవముతోనే కాలయాపనమై పోవును కాఁబట్టి మనస్సు భగవద్విషయమునకు యోగ్యముకానేరదు; ఇదియు నెల్లవారలకునుఁ దెలసినదిగానే యున్నది. ఇట్టికారణములవల్ల శరీరారోగ్యము మనస్సు నిలుకడకు కారణమని చెప్పఁబడియె.

ఇంక నట్టి శరీరారోగ్యమునకు కారణమేమనిన, సాయింపుచున్నారు (ధాతుసామ్యస్థితే) అని. ధాతువులనఁగా వాతపిత్త శ్లేష్మములు; వాటికి సామ్యము కలుగుటయనఁగా నొకటికొకటి హెచ్చుతక్కువలుమాని పొందియుండుట. అవి హెచ్చుతక్కువలుగా నుండెనేని వ్యాధులు జనియించును; మూఁడును ప్రకోపించెనేని మరణము కలుగును. ఈయర్థము వైద్యశాస్త్రజ్ఞులయెడ ప్రసిద్ధము. కావున వ్యాధిహేతువులైన ధాతువులు తమలో నొకటితోనొకటి పొందిసమ

ముగా నుండెనేని మనుష్యులకు వ్యాధికలుగనేరదు; వ్యాధికలుగకుం డినప్పుడు శరీరస్వాస్థ్యమున్ను, దీనివల్ల మనస్సుకు స్వాస్థ్యమున్ను, కలుగును. తరువాత మనస్సు భగవద్విషయ స్మరణమునకు సమర్థమగును. ఇట్లు, ఇంత పర్యంతమునుఁ జెప్పినవన్నియును భగవంతుని స్మరించుటకు మిగుల ననుకూలమైన కాలమునుఁ దెల్పినవి.

ఇఁక నీ స్మరణమున కిట్టివారధికారులనియు నిట్టివారధికారులు కారనియు నియమము కలదా? అనిన నుత్తరము సాయించుచున్నారు, (యోనరః) అని. ఇచ్చట నరశబ్దము మనుష్యజాతిని చెప్పుచున్నది; ఇది దేవజాతికిన్ని, ఉపలక్షణము. ఇందువల్ల భగవత్సమాశ్రయణమునకు కరణపాటవమే కావలసినదిగాని, మనుష్యులు మాత్రమే అధికారులనియు దేవతలు మాత్రమే అధికారులనియు నియమము లేదని స్థాపింపఁబడియె. ఇట్లనే వెనుకఁజెప్పఁ బోవునట్టి స్మరణమునకుకూడా జన్మవృత్తాదులప్రయోజకములు; ఏజన్మమైనను, కులాచారమెట్టిదిగా నుండినను, కరణపాటవము, రుచి, అనునవి రెండే ముఖ్యములు.

ఇఁక ననంతర పదమునకు వ్యాఖ్యానము సేయుచున్నారు. (స్మర్తా) స్మరణమనునది యొకజ్ఞాన విశేషము, (ఇది తనకుద్దేశ్యమైన విషయముదప్ప మఱియొకటి యున్నదనిగూడఁ దెలియనివ్వదు) వెనుక "విశ్వరూపం" అనేపదముచేత శేషిత్వమునున్ను, "నయామి" అనే పదముచేత నుపాయత్వమునున్ను, "పరమాంగతిం" అనేపదములచేత నుపేయత్వమునున్ను, చెప్పఁబోవుచున్నారు కాఁబట్టి యీ మూడున్ను ఈ స్మరణమునకు విషయములుగా నుండవలయును. (అనఁగా నతఁడు సర్వశేషియనియు; తానతనికి శేషభూతుఁడగుటంబట్టి యత్యంత పరతంత్రుఁడనియు; "ఇన్నినైవు పిఱన్దపోతే కృతకృత్యా" ఇత్యాది ప్రకారముగా పూజ్యతములైనట్టి శ్రీ పిళ్లైలోకాచార్యుల

వారు మొదలగు మన పూర్వాచార్యులచే కొనియాడఁబడిన, ఇట్టియత్యంత పారతంత్ర్య జ్ఞానముచేత దేహయాత్ర యందుగాని ఆత్మయాత్రయందుగాని యతని తిరువుళ్లము నెదురుచూచు చుండుటదప్ప స్వప్రవృత్తియనునది లేశమాత్రమైనను లేకుండునట్టి యధికారిని, అతఁడు (నయామి ఇత్యాది ప్రకారముగా తానేయుపాయ భూతుఁడై యాతివాహికులనియెడి దివ్యపురుషులచేతఁగూడ చూపించియివ్వక పరమగతినిఁ బొందించు చున్నాడనియు ; అట్టిపరమగతి యనునది యతనిపాదారవిందద్వయమందును నంతకన్న తదీయుల పాదారవింద ద్వయమందును నిరతిశయప్రీతి పూర్వకముగాఁ జేయఁబడునట్టి యశేష శేషవృత్తిదక్క వేఱుకాదనియు ; స్మరించవలయునని తాత్పర్యము.) ఇందువల్ల నాశ్రయణ విధంబు సెప్పఁబడియె.

ఇఁక నాశ్రయించఁ దగినవస్తు విట్టిదని సాధించు చున్నారు, (విశ్వరూపం) ఇత్యాదిగా. విశ్వమ్, అనఁగాజగత్తు, అదితనకు రూపముగాఁగలవాడు విశ్వరూపి, అనఁగా చేతనాచేతన శరీరియనిభావము. ఇట్లైన పక్షమందు అచేతమునకు స్వభావములై యుండు గర్భ జన్మ బాల్య యౌవన వృద్ధత్వ మరణములనియెడి షడ్భావ వికారములనే దోషమున్ను ; స్థూలసూక్ష్మ భేదముచేత రెండు విధములుగా నుండు ప్రకృతియొక్క సంసర్గముచేత చేతనునకు స్వభావముగానుండు, అజ్ఞానము దుఃఖమున్ను ఇత్యాదిదోషములున్ను, సర్వేశ్వరుని యందంటదా ? అని చోద్యమువచ్చును కాబట్టి, వెంటనే యుండునట్టి (అజం) అనేపదము ఆచోద్యమును పరిహరించుచున్నది. అజుఁడనఁగా జనన మరణాది శూన్యుఁడని యర్థము. ఇందువల్ల శరీరధర్మములైన షడ్భావ వికారదోషములు లేనివాడనియు, ఆత్మధర్మములైన అజ్ఞాన దుఃఖాది దోషములులేని వాడనియు, నుపలక్షింపఁబడుచున్నది. (“అవికారాయ శుద్ధాయ” అనే శ్రీపరాశరభగవచ్ఛ్రీసూక్తి యందును,

మఱియుఁ బరశ్నతమునైన (శ్రుతిస్మృతీతిహాసాదులయందును, బ్రహ్మ సూత్రములందును, చేతనాచేతనగతములైన దోషములు సర్వేశ్వ రుని యందంటఁజాలవని ప్రతిపాదింపఁబడి యున్నదిగదా.) (చ)అనే యవ్యయము సముచ్చయార్థకము. (సముచ్చయమనఁగా దీనికిముందటి పదములకర్థముగా నేర్పడిన విషయములుగాక మఱికొన్ని విషయ ములు వాటితోడఁ జేరుచున్నదని తెలియఁజేయుట.) ఇది, ఈ చేతను నకుహితమిది అహితమిదియని తెలుసుకొనుటకుఁదగిన, జ్ఞానవిశేషము నున్ను; అట్లు తెలుసుకొనిన పిమ్మటఁ దదనుగుణముగా పనులు నెర వేర్చి యుచ్చుటకుఁదగిన, శక్తినిన్ని; ఇట్లు చేతనుల నుజ్జీవింపఁజేయు టకు మూలకారణమైన, దయనున్ను; ఎత్తి చూపుచున్నది. (మాం) నన్ను. అసాధారణ విగ్రహమును అస్మదాదుల చక్షుర్గోచరమగునట్లు చేసుకొని నిలఁబడియుండు సౌలభ్యమున్ను, "మానమిలాప్పన్ని" అని యత్యంత నిహీనమైన వరాహదేహమును మిక్కిలి మనసాప్పియ పేక్షించుటకు హేతుభూతమైన సౌశీల్యాతిశయమున్ను, ఈపదమువల్ల ససాక్షికముగాఁ జూపింపఁబడు చున్నది. (సౌశీల్యమనఁగా "నిఖిలజ గదుదయ విభవలయ హేతుభూత" అని పొగడఁబడుచుండు తనగొప్ప తనమునుచూడక, జగత్సంరక్షణార్థముగా తనయంతస్తుకు మిగుల తక్కువగా నుండునట్టి వరాహాది జన్మములను మిక్కిలి మనసాప్పియ పేక్షించుటయు; ఇట్లనే పరార్థైక ప్రయోజనుఁడై తన యంతస్తుకు తరముగానివారలతో మిక్కిలి మనసాప్పి కలసి యుండుటయు.) "గు హేన సహితో రామః" "శబర్యాపూజిత స్సమ్యక్" "ఆత్మానం మానుషం మన్యే" ఇత్యాదిసూక్తుల నీయర్థమునకు ప్రమాణముగా పూర్వాచార్యులు సాధించియున్నారు. శ్రీచక్రవర్తి తిరుమకనాఁగ్లు శ్రీగుహప్పెరుమాళ్లతోడ కలసి స్నేహించినారనియు; శ్రీ శబరిచేత చక్కఁగా నారాధింపఁ బడిరనియు; తన్ను మనుష్యమాత్రుని గానే

తలంచి యుండినారనియు; ఈశ్లోకములకు తాత్పర్యము. మనుష్యమాత్రుండనుటచేత నవతారమందు తనయంతస్తును లేశమాత్రమునుం దలంచండనిభావము.

ఇంకమీాద (తత స్త్వం) ఇత్యాది రెండవశ్లోకమునకు వ్యాఖ్యానము చేయంబడుచున్నది. ఇట్లు నిర్హేతుక భగవత్కటాక్షమువల్ల మన స్సాస్థ్యముకలిగి, అదియునుం గరణపాటవముగల కాలమందుకుదిరి, పిమ్మట, ,, విషయ నియమమేయుళ్లతు '' ఇత్యాది శ్రీసూక్తులయందు వివరించియుండు ప్రకారముగా నత్యంత విలక్షణమైన వస్తువు నాశ్రయించి, స్వస్వరూపజ్ఞాన మంతరంగమందుగల భగవత్స్వరూప జ్ఞానముగలవాండై, వీటిచేత నుపలక్షితముగావచ్చునట్టి యర్థపంచక జ్ఞానమువల్ల నధికారసంపత్తిలో కొదువలేకయుండునట్టి యీా యధికారికి; సర్వేశ్వరుండు, వేదాంత విహితమైన భక్త్యుపాయమునుపాసించువారికిం గలుగంజేయునట్టి ప్రయోజనవిశేషములకన్నను అత్యంత విలక్షణమైన ప్రయోజనమును కలుగంజేయుచున్నాండని యీా శ్లోకమందుం జెప్పంబడుచున్నది. (తతః) పిమ్మట అని దీనికర్థము. ఈపదముచేతం బూర్వోక్త స్మరణము నిరంతరముగా నుండవలయుననేయర్థము త్రోయంబడుచున్నది. అనంగా సకృత్ స్మరణమే చాలునుగాని నిరంతర స్మరణ మనావశ్యకమని భావము. (ఇది భగవదభిప్రాయమే గాని యీా యధికారికి స్వరూపాను రూపమైనది కాదు; సర్వేశ్వరుండు తన నిర్హేతుకకటాక్షము మొదలైన కృపిపరంపరలచేత నీచేతనున కధికారిసంపదలనన్నింటినిం గొదువలేక కుదురుపరచియిచ్చినపిమ్మట నితండింతటివాండై యుండంగా, సకృత్ స్మరణమేచాలుననే వాక్యమునుంబట్టి మరల నితండన్య విషయములందుం దగిలేనేని, ,,ఉణ్ణుఙ్శో రుపరుకునీర్ '' ఇత్యాది శ్రీసూక్తులందుం బ్రసాదించిన ప్రకారముగా ధారకపోషక భోగ్యము లతండేగాని యన్యము లేదని యుండవలసినట్టి

యధికారిస్వరూపమునకు వినాశము సంభవించుచున్నది. ఇదిగాక „ తన్నై న్నయు మీాశ్వరనై యుమ్ ఫలత్తైయుమ్ " ఇత్యాది సూక్తుల యందు సాయించిన ప్రకారముగా స్వస్వరూప పరస్వరూప పురుషార్థ స్వరూపములను భగవత్కటాక్షమువల్లఁ దెలిసికొనియుండు నీయధి కారి, విషయాంతరములయందుఁదగులుటకు లేశమాత్రమైన నవకాశ ముకలుగదు గదా ? „ అన్నునాఁ పిఱన్దిలేఁ పిఱన్దపిఁ మఱన్దిలేఁ " అనునట్టి యీయధికారి „ అగ్నిజ్వాలై యై విట్టజ్గి " ఇత్యాది సూత్ర ద్వయముచేత శ్రీలోకాచార్య గురువులు సాయించిన ప్రకారముగా, దర్శనమాత్రముచేతనే సత్తానాశమును కలుగఁజేయునట్టి విషయము లను తానే యపేక్షించునా ? అయితే అస్మదాదులకెల్ల నీశ్లోకానుసం ధానమునం దధికారమెట్లుకలుగుననిన „ పొయ్యేకై మెయ్మశొల్లిప్పుఱ మే పుఱమేయాడి " అనునంతమాత్రమేగాని వేఱులేదు. మెయ్యేపె ఱ్ఱొమ్లిన్దేఁ " అనునట్టిదియు సిద్ధింపవచ్చు గదా? యనిన నది „ అ హంస్మరామి " అనువాని దోషభోగ్యత్వమువల్ల పుట్టునట్టి నిరంకుశ స్వాతంత్ర్య కార్యమేగాని వేఱుకాదు.)

ఇఁక (తం) అనే రెండవపదమునకు వ్యాఖ్యానము సాయించు చున్నారు. (తం) „ స్మర్తా " అనుచోట నిర్ణయింపఁబడిన జ్ఞానముతో నుపాయోపేయంబులు రెండును నేనేయని యధ్యవసించి (అనఁగా కలవరములు లేని నిశ్చయజ్ఞానము నవలంబించి) యుండునట్టి యీయ ధికారిని ; అని యీపదమునకు భావము

ఇఁక ననన్తరపదమునకు వ్యాఖ్యానము. ఇతనికి ఫలమిచ్చుట యెప్పుడో ? యనిన సాయింపు చున్నారు. (మ్రియమాణం) „ ఆశై వాయ్చ్చెన్ఱ శిన్దైయరాకి " అనే శ్రీభట్టనాథ శ్రీసూక్తియందుఁ బ్రసా దించినరీతిగా మరణాభిముఖుఁడైన సమయమునందు ; అని యీపద మునకు భావము.

ఇఁక (తు) అనెడి యవ్యయము, వేదాంతవిహితమైన భక్తి యోగమును అష్టాంగాదిక్రమముచొప్పున సాధించునట్టి సాధకుని కన్నను, వెనుకఁజెప్పఁబోవునట్టి విశేష మీయధికారికిఁ గలదని సూచించుచున్నది. (సూచనయనునది, సూర్యోదయమున కరుణోదయము వంటిదిగా నుండును.

ఆ విశేషంబెద్ది యనిన. (కాష్ఠపాషాణ సన్నిభం) జ్ఞానసంబంధము లేశమాత్రంబును లేని, యెండుకట్టె, పాషాణము, అనే వీటితో సమానుఁడై యుండు (మరణాభిముఖ) దశయందు; అని యీపదమున కర్థము. ,, పరుకు నీరుముదుక్కుమ్ కూఱైయుమ్ పావమ్ శెయ్‌తన తాళ్ " అనే శ్రీసూక్తి వ్యాఖ్యానము నందు, నామరూపవిశిష్టములైన సకలవస్తువులందును నొక్కొక్క జీవాధిష్ఠాన మున్నదనునర్థము గ్రహించనలయు ననియు; ఘటపటాదులుగానుండు పదార్థములందు జీవాధిష్ఠానమున్నదని తోపకుండుటకు కారణము ఆజీవుని కర్మానుగుణమైన జ్ఞానసంకోచాతి శయమువల్లనేగాని వేరుకాదనియు; సాయించి, ,, అప్రాణిమత్సు స్వల్పాసా స్థావరేషు తతోధికా " ఇత్యాది ప్రమాణములనున్ను చూపించి యుండుటవల్ల, మ్రాకులు తీగెలు మొదలయిన యచేతనములయందున్ను చైతన్య సంబంధముగలదని యేర్పడుచున్నది; మనుస్మృతి, పురాణరత్నము, ఇత్యాదులందును నీయర్థము స్పష్టముగానున్నది. కాఁబట్టి, యిచట నంతమాత్రముగలదని చెప్పటకుఁగూడ నవకాశము లేనిదశను, ,, కాష్ఠపాషాణ సన్నిభం " అనే పదము దెలియఁజేయు చున్నది.

చేతనుఁడు దేహమును విడిచి యుత్క్రమించు (అనఁగా హృదయస్థానమునుండి యూర్ధ్వముగా వెలువడు) దశయందు శుభాశ్రయుఁడైన సర్వేశ్వరుని స్మరించుట యంతిమ స్మరణమనఁ బడుననియు; ఇట్టి యంతిమ స్మరణమువల్లనే సమస్త చేతనులు నుజ్జీవించ వలయున

నియు; శాస్త్రములెల్ల నొకటేయభిప్రాయముగా సెప్పుచున్నవి. ఇచట నీయధికారి కాష్ఠపాషాణ సదృశుఁడుగా నుండునెడ నంతిమ స్మరణమున కవకాశమే లేదుగదా? ఇట్లుండగా నితని నేనుజ్జీవింపఁ జేయుచున్నానని సాయించుట శాస్త్రవిరుద్ధముకాదా? అనిన, నిది యును శాస్త్రమర్యాద నతిక్రమింప కుండునేగాని వేరుకాదు; అయి తే, యితఁడుచేయవలసిన యంతిమ స్మరణమునకు నేనేకర్తగానిలచి చేయుచున్నానని సాయించుచున్నారు; (అహంస్మరామి) అని. ("తక్ శ్లోల్లాల్ తాక్ తస్మై క్కీర్తిత్తమాయక్" అనునది యీతనికి నెల్ల ప్పుడును స్వభావముగాఁ గనుబడుచున్నది గదా?) మోక్షార్థముగా నపేక్షింపఁబడునట్టి యంతిమ స్మరణమునకు కర్తనేనే! వ్యవసాయము నందుఁ దగులునట్టిపనులు పైరుచేయువానిదేగాని వేరుకాదుగదా? (స్మరామి) అనఁగా, అతఁడు నన్నొకతూరి స్మరించెనేని నేనతనిని నిరం తరభావనచేయు చున్నానని యర్థము. (ఈ క్రియాపదము వర్తమానా ర్థకముకాఁబట్టి యీయర్థము నిచ్చుచున్నది. అయితేమున్ను, ఆశ్రయ ణవిధంబు సెప్పినప్పుడును. "స్మర్తా" అనే క్రియాపదము భవిష్యదర్థ కము కాఁబట్టి, యాశ్రయణము సేసినవెనుక నీయధికారికి శరీర విశ్లేష ముగలుగు నంతవఱకునుఁగల కాలమందునుఁగూడ నీస్మరణము నిరంత రముగా నుండవలయుననేయర్థము చెప్పవలసిన నిర్బంధమువచ్చును గదా? యనిన నదియునుముఖ్యమే; అయినను నాయర్థము, ఆశ్రయ ణము సకృత్తుగానే యుండుననుటకు బాధకముగానేరదు. అదియెట్ల నిన; ఆపదమునందుండు భవిష్యదర్థము, ఆశ్రయించినట్టి యధికారికి శరీరవిశ్లేషమువఱకు నుండవలసిన కాలక్షేపమిట్టిది యని విధింపుచు న్నది. ఇంతేగాని, "అప్రతి షేధద్యోతక" ముగా విధింపఁబడిన స్మర ణము నిరంతరముగానుండవలయునని చెప్పఁజాలదు. ఇట్లుగాక నిరం తరస్మరణమునే విధింపుచున్నదనిన పక్షమందు "సకృదేవహిశా

స్త్వార్థః । ప్రాయశ్చిత్తిరియం" ఇత్యాది వచనములయందు, ఆశ్రయణము సకృత్కరణీయమనియు; నేదైన నొక్కసమయమందు మనస్సుచెదరి, రెండవతూరి ప్రపత్తిచేయుపక్షమున, నట్లు చేసినందుకు ప్రాయశ్చిత్తార్థముగా నొక ప్రపత్తినే చేయవలయుననియు; చెప్పఁబడియున్న యర్థములకెల్ల విరోధముసంభవించును కాఁబట్టి, యీయధికారికి శరీరవిశ్లేషపర్యంతము కాలక్షేప మిట్టిదని సూచింపుచున్నదనుటయే యీభవిష్యదర్థమునకుఁ దాత్పర్యము. "ద్వయమర్థానుసంధానేనసహ సదైవంవక్తా యావచ్ఛరీరపాతమత్రైవ శ్రీరంగే సుఖమాస్వ" అనే చూర్ణికయందు, ఈయధికారికి శరీరవిశ్లేషపర్యంతము కరణత్రయమునకును గాలక్షేపమిట్టిదని శ్రీభాష్యకారుల వారు బ్రసాదించియున్నారు గదా ?)

ఇఁక ననర్తర పదమునకు వ్యాఖ్యానము. దేవరవారింతయభినివేశముతో పైఁబడి, యీతనికార్యముచేయుటకు వీనియందుఁగల యాధిక్యమెట్టిదనిన, (మద్భక్తం) నాకు ప్రియుడైనవానిని; అని యీ పదమున కర్థము. నాయందు స్నేహపూర్వకమైన నిరంతరానుసంధానముగల వానిని; అని తాత్పర్యము. ఇందువల్ల "యమేవైషవృణుతేతేనలభ్యః" అనే శ్రుతియొక్క అర్థము చెప్పఁబడినది. "ప్రియతమ ఏవహి వరణీయోభవతి, యస్యాయం నిరతిశయ ప్రియస్సఏవాస్యప్రియతమోభవతి. యథాయం ప్రియతమ ఆత్మానం ప్రాప్నోతి తథాస్వయమేవ భగవాన్ ప్రయతతే" ఇత్యాది భాష్యముచేత నీ శ్రుత్యర్థమును శ్రీ భాష్యకారులవారు వివరించియున్నారు. ఇందువల్ల భగవంతునియందు నిరతిశయ ప్రీతిగలయధికారి యాభగవంతునికిఁ బ్రియతముండనియు; అట్టి ప్రియతముండు దనపాదారవిందములను బ్రాపించుటకుఁగానుఁ దానే ప్రయత్నించుచున్నాడనియు; చెప్పఁబడినది. కాఁబట్టి "మద్భక్తంనయామి పరమాంగతిం" అని

సెలవిచ్చుచున్నారు. (ఆశ్రయణము సకృత్తుగా నుండుటవల్ల నిది యత్యంతప్రీతిపూర్వకముగా నుండినను నిందుద్భవించినప్రీతి యనంతర కాలమందున్ను అనువర్తించునా ; అనిన ; "యాప్రీతి రవివేకినాం" అనే పురాణరత్నవచనమందు కాముక స్త్రీ పురుషుల కొకతూరి సంశ్లేషము గలిగినను, అప్పుడు సంభవించిన ప్రీతి నిరంతర భావనకు హేతువగునని చెప్పఁబడి యుండఁగా ; పరమ పురుషార్థరూపమైన భగవత్కామము సకృత్తుగాఁ గలిగినను నందుద్భవించినప్రీతి యనంతర కాలమందును నవిచ్ఛిన్నమై యనువర్తించుననుటకు సందేహముగలదా ? ఇంతేకాదు, భావనా ప్రకర్షమువల్ల "శెఱ్రనీర్ తడత్తుక్కయల్ మిళిర్న్దాలొప్ప" అని యుపక్రమించి "అవావఱ్ఱావీడుపెఱ్ఱ" అనిన భగవత్ప్రాప్తి కలుగునంతవఱకు "దృఙ్మనస్సంగసంకల్పౌ జాగరః కృశతారతిః । హ్రీత్యాగోన్మాద మూర్ఛాంతా ఇత్యనంగదశాదశ" అని శృంగార రస ప్రధాన కావ్యములందుఁ జెప్పఁబడినట్టి కాముక దశావస్థలనుసైత మనుభవింపఁ జేయుటకు ఈ ప్రీతి కారణమగుచున్నది.) వేదాంత విహితమైన భక్తియోగమునందు నిష్ఠుఁడై యుండు సాధకునికిని, ఇంతటి భావన యుండవచ్చునని చెప్పవలసి యుండినా, ఇచ్చట నతఁడు వివక్షితుఁడుకాడు కాఁబట్టి యీ భక్తశబ్దము ప్రపన్నాధికారినే చెప్పుచున్నది. ఇట్లు మత్పాదాంబుజద్వయ ప్రపన్నుండై యనన్యప్రయోజనమైన భక్తిగలవాఁడై యుండుటంబట్టి కాష్ఠపాషాణసన్నిభమైన యిట్టిదశయం దితనికిఁ గర్తవ్యమైన యంతిమ స్మరణంబును నేనేచేయు చున్నానని తాత్పర్యము. అయితే నీత నికిగాను భగవంతుఁడుసేయు స్మరణమనునది యేరూపముగా నుండుననిన, ఇతఁడు తాను మొదటసేసిన యాశ్రయణమునందుఁగల నమ్మకముచేతఁ దన కార్యములన్నింటియందును స్వస్వాతంత్ర్యమును వదలి నాపాదములయందుఁ దన సర్వభారమున్ను సమర్పించియు

న్నాడు. ఇఁక వీనికిఁ జేయఁదగిన హితకార్యములెల్ల నాకే భరముగా నేర్పడినది. కాఁబట్టి యితఁడు మరలనొకతూరి యిట్టి మరణదశా దుఃఖముల ననుభవించుటగాని, యమరాజు ముఖమునుఁ జూచుటగాని, మాతృ గర్భగుహాయనే నరకమందు పడుటగాని, యెఱుంగక, నాకును మద్భక్తులకును నిత్య కైంకర్యములు గావించి నిత్యానంద భరితుఁడు గావలయునని భగవంతుఁడు తన దివ్యచిత్తమునందుఁ దలపోయు చుండుటవల్ల నతని స్మరణమనునది యీ రూపముగా నుండును.

ఇఁక నన్తర పదములకు వ్యాఖ్యానము సాయించుచున్నారు, (నయామి పరమాంగతిం) అని. "పరమాంగతిం" అనేపదములు పరమ ప్రాప్యమైనదిట్టిదని చెప్పుచున్నవి. "పరమాంగతిం నయామి" అని వాక్యాన్వయము. "నచపునరావర్తతే" అనఁబడిన యావదాత్మ భావికైంకర్య భోగముకలిగి "పరాఙ్గతి" అను శ్రీసూక్తిప్రకార ముగా స్వర్గాదులకన్నను ఐశ్వర్య కైవల్యాదుల కన్నను నుత్కృష్టమై అస్పృష్ట సంసారగంధముగల నిత్యసూరులకు నివాసస్థానమైన పరమ పదమునుఁ బొందించుచున్నానని యీవాక్యమునకుఁ దాత్పర్యము. "గమ్యత ఇతిగతిః" అని గతిశబ్దమునకు వ్యుత్పత్తిగావున, పొందఁ బడునట్టిస్థానము అని దీనికర్థము. ఇందువల్ల ప్రాప్యమైన స్థానము చెప్పఁబడు చున్నది. "పరమాంగతిం" అనఁగా "పరాఙ్గతి" అనే శ్రీ సూక్తియొక్క అర్థమే యగుచున్నది. ఇదే పరమపురుషార్థ లక్ష ణమైన మోక్షము. లోకజనులు ధర్మార్థకామ మోక్షములని పురుషా ర్థములను నాలుగువిధములుగానున్ను, అందాత్మప్రాప్తిని మోక్ష మనే పురుషార్థముగానున్ను గ్రహించుచున్నారు. ఇచటనవి పురుషార్థ ములుగానేరవు కాఁబట్టి వాటిని వ్యావర్తించి; (అనఁగా మనగోష్ఠిలోఁ జేర్చక ప్రత్యేకపరచి;) స్వయం పురుషార్థమున్ను స్వతః భోగ్యమున్ను నిరతిశయమున్ను (అనఁగా సర్వోత్కృష్టమున్ను) అయినభగవత్కైం

కర్యరూప పరమపురుషార్థ మిచట మోక్షమని నిర్వహింపఁబడినది. (నయామి) అట్టి ప్రాప్యమునుఁ బొందించునెడ నాతివాహికులను దివ్యపురుల చేతఁగూడా చూపించి యివ్వఁజాలననియు; మదీయదివ్య పీతాంబరమునే *యుల్లడగాఁ బట్టుకొని నేనేపిలుచుకొని పోవుచున్నా ననియు; తిరుపుళ్లమని యీ పదమువల్ల నేర్పడుచున్నది. భగవదభి ప్రాయ మిట్లుండుటంబట్టి, పిరాట్టిని, లంకాద్వీపమునుండి తోడ్కొని వచ్చునప్పుడు "అంకేనాదాయ వై దేహీం" అని, తానేఁగుచ్చి కౌఁగి టఁజేర్చి యెత్తుకొని పుష్పకవిమానమునందు వేంచేపు చేయించుకొని తిరువయోధ్యకు వేంచేసిన రీతిగా, నీయాత్మను పరమపదమునకుఁ దోడ్కొని పోవుచున్నాడని తోఁచుచున్నది.

ఇట్టి పరమార్థములుగల శ్రీ వరాహచరమ శ్లోకములవల్ల "తు ప్పడైయార్కై యడైవతెల్లామ్" అనే తిరువాయ్మొழி యొక్క యర్థమున్ను; సర్వేశ్వరునికి స్వాశ్రితులయందుగల యభిమానవిశే షముయొక్క వైభవమున్ను; ఇట్టి భగవదభిమానముంబట్టి యీ యధికారి నిర్భరుఁడుగా నుండఁదగుననియు; ప్రతిపాదింపఁబడినది.

పెరియవాచ్చాన్ పిళ్లై తిరువడిగళేశరణమ్.

అస్మద్గురుభ్యోనమః.



---

* ఉల్లడ, మేలుకట్టు, అనఁగా వివాహాది మంటపముల కలంకారముగా పట్టు వస్త్రము మొదలైన వాటిచే విచిత్రముగా పైభాగమునందు కట్టునట్టి యలంకార విశే షము. సంస్కృతమందు దీనికి వితానమని పేరు. వివాహాదులందు మంగళ ద్రవ్యములు గొని పోవునప్పుడు, ఉల్లడపట్టించుకొని పోవుట, కొందఱి యాచారము, ఇది ప్రసిద్ధము.

శ్రీమతేరామానుజాయనమః.



# రెండవదియగు శ్రీరామాయణ చరమము.

## ఉపోద్ఘాతము.

ఇది శ్రీరామాయణపురుషులలో మొదటివారైన శ్రీచక్రవర్తి త్తిరుమకనార్లు అనుగ్రహించినది. దీనికి శ్రీగోవిందరాజీయ వ్యాఖ్యానమునునసరించి యొక్క యుపోద్ఘాతము వ్రాయఁబడుచున్నది. 1 "మర్యాదానాంచ లోకస్యకర్తాకార యితాచసః" అని సకలవర్ణా

1 [మర్యాదానాంచ ఇతి] సః- ఆచక్రవర్తి త్తిరుమకనార్లు, (తాను వర్ణాశ్రమ ధర్మమర్యాదలను తప్పక యనుష్ఠించుటయేగాక) లోకస్యచ - లోకమునకున్ను, మర్యాదానాం - వర్ణాశ్రమ ధర్మనిబంధనలను, కర్తా - ఏర్పాటు చేయువారున్ను, కారయితాచ - తాను దగ్గఱనుండి యట్టిధర్మముల ననుష్ఠింపఁజేయు వారున్ను, (అగుచున్నారు.)

శ్రమధర్మ మర్యాదలను లోకమునందు స్థాపించుటయే యీయవతార మునకు ముఖ్యప్రయోజనముగా నున్నదిగదా ? ఇంతకుపైన సూక్ష్మ దృష్టితో యోచించితే శరణాగత రక్షణరూప విశేషధర్మసంస్థాపనమే యీయవతారమునకు అంతరంగమైన పరమప్రయోజనముగా నున్నది. ఇదిగాక తత్త్వ యాథాత్మ్యజ్ఞాన పరిపూర్ణులైన మనపూర్వాచార్యులందఱును శ్రీరామాయణము దీర్ఘ శరణాగతిగ్రంథమని కొనియాడుచున్నారు. దానికి కారణంబేమనిన ; 1"ఇతిహాసపురాణాభ్యాం వేదాంతార్థః ప్రకాశ్యతే" అనే ప్రమాణానుసారముగా వేదాంతార్థములను ప్రకాశింపఁజేయునట్టి యీయితిహాసశ్రేష్ఠము, 2 "ముముక్షుర్వై శరణమహంప్రపద్యే" అనే శ్రుతియందు చెప్పఁబడిన శరణాగతియనే యుపాయమును మొదటినుండి కడవఱకును అధికారివిశేషంబులును ఫలవిశేషంబులును చూపుచుఁ బ్రతిపాదించుచున్నది. కాఁబట్టి దీర్ఘశరణాగతియని వారుప్రసాదించినారు. ఇఁక నీగ్రంథరత్నము మొదటినుండి కడవఱకుఁ బ్రపత్త్యుపాయమునే ప్రతిపాదించువిధము కొంత వివరింపఁబడుచున్నది.

---

1 [ఇతిహాసపురాణాభ్యామితి] "ప్రాయేణ పూర్వభాగార్థ పూరణం ధర్మశాస్త్రతః" అనునది యీశ్లోకమునకు పూర్వార్థము. ధర్మశాస్త్రతః – ఆచార వ్యవహార ప్రాయశ్చిత్తాదులను ప్రతిపాదించునట్టి మను యాజ్ఞవల్క్యాది విరచిత ధర్మశాస్త్రములచేత, ప్రాయేణ – తఱుచుగా, పూర్వభాగార్థ పూరణం– కర్మప్రతిపాదకములైన వేదపూర్వ భాగార్థములు పూర్తిగాఁ (దెలియఁజేయఁబడుచున్నవి) ఇతిహాసపురాణాభ్యాం – శ్రీరామాయణ మహాభారతాది ఇతిహాసములచేతనున్ను, బ్రాహ్మపాద్మవైష్ణవాది పురాణముల చేతనున్ను, వేదాంతార్థః – బ్రహ్మప్రతిపాదకములైన యుపనిషత్తులయొక్క అర్థము, ప్రకాశ్యతే – తెలియఁజేయఁ బడుచున్నది.

2 [ముముక్షుర్వై ఇతి] ముముక్షుః – భగవత్ప్రాప్తినిఁ గోరి సంసారమునందరుచిపుట్టిన, అహం– నేను, శరణం – (ఇష్టప్రాప్తికిని అనిష్ట నివారణమునకును తప్పని) ఉపాయముగా, ప్రపద్యే – (ఈ శ్రుతియొక్క పూర్వ వాక్యమునందుఁ బ్రతిపాదింపఁబడిన సర్వేశ్వరుని)ఆశ్రయింపు చున్నాను.

1 "రక్షాపేక్షాం ప్రతీక్షతే" అనేరీతిగా రక్ష్యభూతులయిన చేతనులు, తానుచేయునట్టి రక్షణము నపేక్షించు సమయము చిక్కునా! అని సర్వశేషియయిన సర్వేశ్వరుఁ డెదురుచూచు చుండును కాఁబట్టి; 2"ఏతస్మిన్నంతరే విష్ణురుపయాతో మహాద్యుతిః। శంఖచక్రగదాపాణిః పీతవాసా జగత్పతిః" అని, శ్రీదశరథచక్రవర్తి పుత్రకామేష్టి సేయుచుండు సమయమందు భాగ ప్రతిగ్రహార్థముగాఁ జేరియుండు దేవతలందఱును తమతోడ నచ్చోటికి విచ్చేసియుండు బ్రహ్మ

1 [రక్షాపేక్షాం ప్రతీక్షతే] "సర్వజ్ఞోఽపిహి సర్వేశస్సదా కారుణికోఽపిసన్। సంసారతంత్ర వాహిత్వాత్" అనునది యీప్రమాణమునకు పూర్వగ్రంథముగానున్నది. దేవేశః - నిత్యసూరి నిర్వాహకుఁడైన సర్వేశ్వరుఁడు, సర్వజ్ఞః - చేతనునియొక్క స్థితి యిట్టిదని యెఱింగినవాడును, సదాకారుణికః - నిత్యకారుణ్య పూర్ణుఁడును, సన్నపి - అగుచున్నప్పటికిన్ని, సంసారతంత్ర వాహిత్వాత్ - సంసార - సంసారమునందుగల, తంత్ర - భోగమోక్షములనే రెంటికిని సాధనములగు నుపాయములకు, వాహిత్వాత్ - నిర్వాహకుఁ డగుటవలన, రక్షాపేక్షాం - రక్షణ మందుగల చేతనుని యపేక్షను, ప్రతీక్షతే, ఎదురుచూచు చున్నాడు. అనఁగా భోగవిరోధులనుఁ బోఁగొట్టి నిరవధిక భోగములనిచ్చి రక్షించమని యపేక్షింపు చున్నాడా? మోక్షవిరోధులనుఁబోఁగొట్టి పునరావృత్తి రహితమైన తనప్రాప్తినిచ్చి రక్షించమని యపేక్షింపు చున్నాడా? అనిచేతనుని యపేక్ష యుండునట్టి విధము నెఱుంగ నెదురుచూచు చున్నాడని భావము.

2 [ఏతస్మిన్నంతరే ఇతి] ఏతస్మిన్నంతరే - ఇంతలోపల, (అనఁగా శ్రీదశరథ చక్రవర్తి పుత్రకామేష్టి సేయుకాలమందు భాగప్రతి గ్రహార్థముగాఁ జేరియుండు దేవతలందఱును బ్రహ్మదేవునిఁజేరి, రావణునివల్ల లోకములకు కలిగియుండు నుపద్రవముల విన్నవించి మొఱపెట్ట నతండు వారలకు రావణ వధోపాయమునుఁ జెప్పుచుండఁగా నని భావము.) మహాద్యుతిః - రక్షాపేక్షా సమయము చిక్కెననే సంతోషమునల్ల నతిశయించియుండు తేజస్సుగల వాడును, జగత్పతిః - లోకరక్షకుఁడును, శంఖచక్రగదాపాణిః - (ఆశ్రితవిరోధి నిరసనార్థముగా సన్నద్ధుఁడై వచ్చుచున్నాడో? అనితోఁచునట్లు) శంఖచక్రగదాది దివ్యాయుధములను ధరించియుండువాడును, పీతవాసాః - దివ్య పీతాంబర ధారియును, (అయిన) విష్ణుః - సర్వేశ్వరుఁడు, ఉపయాతః - ఆయజ్ఞసదస్సునకు వేంచేసెను.

దేవునిఁజేరి రావణభయమువల్ల మొఱపెట్టుచుండునప్పుడు, ఇట్టి సమయము తనకు లభించెననే సంతోషము దివ్యమంగళ విగ్రహములో నణఁగక దివ్యతేజోరూపముగా వెలుపలఁ బ్రకాశింపుచుండఁగా రక్షణోపకరణములైన శంఖచక్రాది దివ్యాయుధములతోడ సన్నద్ధుఁడై వేంచేసి యచ్చోట సుఖాసీనుండయ్యెను. అప్పుడు 1 ,, దేవగంధర్వయక్షాశ్చ తతస్త్వాం శరణంగతాః " అని, రావణవధరూపఫలమునుఁగోరి దేవజాతీయులందఱును శరణాగతిఁ బొందిరని ప్రతిపాదింపఁబడినది. పిమ్మట 2 ,, నాన్యాంగతింగమిష్యామి నాన్యశ్శరణమస్తి మే " అని త్రిశంకు మహారాజున్ను, 3 ,, త్రాతుమర్హసిమాం సౌమ్య ధర్మేణ మునిపుంగవ " అని శునశ్శేపుఁడను మునికుమారుఁడున్ను, విశ్వామిత్రులను శరణాగతిఁజొందిన వృత్తాంతమువల్ల శరణాగత రక్ష

---

1[దేవగంధర్వయక్షాశ్చేతి] (ఇట్లు వేంచేసిన సర్వేశ్వరునిఁజూచి బ్రహ్మాదిసమస్త దేవతలును వారి సన్నిధియందు రావణోపద్రవమును విన్నవించి) తతః - ఆకారణమువలన, (అనగా రావణోపద్రవము నోర్వఁజాలని కారణమువలన) దేవగంధర్వయక్షాశ్చ- దేవగంధర్వ యక్షాదులందఱును, త్వాం - నిన్ను, శరణంగతాః - శరణాగతిఁ బొందినారము. (అని విన్నవించిరి.)

2 [నాన్యాంగతిం గమిష్యామీతి] (గురుశాపహతుఁడైన త్రిశంకు మహారాజు విశ్వామిత్రుల కడకేగి, ఓమునిశ్రేష్ఠుఁడా నేను) అన్యాం - వేఱైన, గతిం - గమ్యస్థానమును, నగమిష్యామి - పొందఁజాలను, మే - నాకు, అన్యః - వేఱైన, శరణం -రక్షకుఁడు, నాస్తి - లేఁడు, అని విన్నవించి శరణాగతిఁ బొందెనని భావము.

3 [త్రాతుమర్హసీతి] (అంబరీష మహారాజుకు యజ్ఞపశు నిమిత్తముగా తల్లిదండ్రులచేత విక్రయింపఁబడిన శునశ్శేపుఁడను మునికుమారుఁడు విశ్వామిత్రులను శరణాగతిఁబొంది,) హేసౌమ్య - మునిపుంగవ - అనుగ్రహస్వభావముగల ఓమునిశ్రేష్ఠుఁడా, మాం - (తల్లిదండ్రులచే విక్రయించుటవల్ల వేఱుదిక్కులేని) నన్ను, ధర్మేణ - శరణాగత రక్షణరూప ధర్మముచేత, త్రాతుం - రక్షించుటకొఱకు, అర్హసి - తగినవాఁడవగుచున్నావు. (అని మొఱపెట్టుకొనెను.)

ణము పరమధర్మమనియు నది సమర్థుఁడై కారుణ్యముగలవానియెడఁ దప్పక ఫలించుననియుఁ దెలియఁ జేయఁబడినది.

పిమ్మట, అయోధ్యాకాండము నందు వనవాసమునకుఁ బ్రయాణమైన కాలమున 1 "సభ్రాతుశ్చరణౌ గాఢం నిపీడ్యరఘునందనః। సీతామువాచాతియశా రాఘవంచ మహావ్రతం" అని, ఇళైయపెరు

1 [సభ్రాతుశ్చరణావితి] శ్రీచక్రవర్తి తిరుమకనార్లు వనవాసమునకుఁ బ్రయాణమై కౌసల్యా దేవియొక్క మంగళాశాసనమునుఁ బొంది పిరాట్టినిఁ దనతోడఁదోడ్కొనిపోవ సమ్మతించి యాత్రాదానము సేయఁబూను నవసరంబున, ఇళైయపెరుమాళ్లు తానును పెరుమాళ్లతోడ వేంచేయునిమిత్తముగా వారిని శరణాగతిఁ బొందు విధము, ఈ శ్లోకమునందుఁ జెప్పఁబడు చున్నది. అతియశాః - (బాల్యాత్ప్రభృతి సుస్నిగ్ధః" అని, తొట్లలో పవళించు ప్రాయమునుండి పెరుమాళ్లయందు నిరతిశయ ప్రేమగలిగి యుండుటవల్ల) నిరవధిక కీర్తిసంపన్నులును, రఘునందనః - (జ్యేష్ఠానువర్తన రూప మహాగుణముచే) రఘువంశపు రాజులకెల్ల నానందావహులుందును, (అయిన) సః - ఆ యిళైయపెరుమాళ్లు, భ్రాతుః - తోడఁబుట్టినవారై ("భ్రాతా భర్తాచ బంధుశ్చసఖాచ" అని, తనకు సర్వవిధప్రాప్యులునై యుండు) పెరుమాళ్లయొక్క, చరణౌ - తిరువడి త్తామరలను, గాఢంనిపీడ్య - (బదులు సెప్పుటకు సాధ్యముగాకుండునట్లును తన మనోనిశ్చయమెల్లఁ దెలియునట్లును) దృఢముగాఁబట్టుకొని, సీతాం - పిరాట్టిని (ముందుఁ) బురుషకారముగాఁ బరిగ్రహించి, (తరువాత) మహావ్రతం - పితృవాక్య పరిపాలన రూప మహానియమమునందు నెలకొని యుండునట్టి, (ఇచట "ఏతద్వ్రతం మమ" అనే శరణాగత రక్షణరూప మహానియమమందు నెలకొని యుండువారను నది విశేషార్థము) రాఘవం - (శరణాగత రక్షణ దీక్షగల వంశమునందు జనించిన) పెరుమాళ్లనుఁజూచి, (ఇచట "చ" అనే, అవ్యయము, ఇళైయపెరుమాళ్లు తనతోడ నరణ్యమునకు వేంచేయువిషయమై తాను మున్నే సమ్మతించియుండఁగా నిపుడువారు పురుషకార పురస్సరముగా తన్ను శరణాగతిఁబొంది వేడుకొనుట, "ఉపస్థైరుపస్థితః" అనురీతిగా నాశ్రితులుండు చోటికి తానే వేంచేయునట్టి, తన తిరువుళ్లము యొక్క స్వభావమునకు, అధికమని తలఁచి యుండుదురనే, పెరుమాళ్ల తిరువుళ్లమును సూచింపు చున్నది.) ఉవాచ - (స్వాభిప్రాయ ప్రార్థనా రూపమైన వాక్యమును) విన్నవించిరి.

మాళ్లు శ్రీచక్రవర్తి తిరుమకనార్లను శరణాగతిఁ బొందిన వృత్తాంతమువల్ల నీశరణాగతి పురుషకార పురస్సరముగా ననుష్ఠించఁదగినదని నిర్ణయింపఁబడినది. పిమ్మట, చిత్రకూట పర్వతమునందు శ్రీభరతాళ్వానులు 1 "ఏభిశ్చ సచివైస్సార్థం శిరసా యాచితో మయా । భ్రాతుశ్శిష్యస్య దాసస్య ప్రసాదం కర్తుమర్హసి" ఇత్యాది ప్రకారముగా పెరుమాళ్లను వనవాసమునుండి మరలించి పట్టాభిషేకముఁ గావించుటకై శరణాగతిఁబొందిన వృత్తాంతము సెప్పఁబడినది. అయితే, ఈ శరణాగతి, యింతకుముం దనుష్ఠింపఁబడిన దేవశరణాగతి యడ్డపడి యుండుటచేత నప్పుడే సాక్షాత్ఫలము నివ్వక పాదుకా కైంకర్యరూపమైన ఫలమును మాత్రమిచ్చి దేవశరణాగతికి ఫలమగు రావణవధమైన పిమ్మట పట్టాభిషేకరూప సాక్షాత్ఫలము నొసంగినది.

పిమ్మట, ఆరణ్యకాండమునందు దండకారణ్యవాసులైన ఋషు

1 [ఏభిశ్చ సచివైరితి] కైకేయిచేసిన కార్యమువల్ల గుహ భరద్వాజాదులున్నై తము తనయందు సందేహముఁ బొందునట్లు లోకాపవాదమునకు పాత్రులైన శ్రీభరతాళ్వానులు, స్వామివారిని వనమునుండి మరలించుకొని వచ్చుటకుగాను చిత్రకూట పర్వతమునకు వేంచేసి పెరుమాళ్లనుఁగాంచి పరమాతురులై శరణాగతిఁ బొందినవిధము ఈ శ్లోకమునందుఁ జెప్పఁబడుచున్నది. "ఏభిస్సచివైశ్చసార్థం॥-రాజ్య నిర్వాహకులై పూజ్యులైన యీమంత్రులున్ను నాతోడసమాన దుఃఖముగలవారై గలసియుండగా, మయా-నాచేత, శిరసాయాచితః-సాంగప్రపత్తిచేసి యాచింపఁబడిన మీరు, భ్రాతుః-"యవీయానాత్మనః పుత్రః" అనేరీతిగా కనిష్ఠభ్రాతయైన నేను మీకుఁ బుత్రుఁడగుటచే వదలఁదగని వాఁడున్ను, శిష్యస్య - (అంతకుపైన) విద్యాభ్యాస మంత్రోపదేశములకు పాత్రభూతుఁడున్ను, దాసస్య - (అంతకు నుంపైన) క్రయ విక్రయార్హుఁడున్ను, (అయిన) నాకు, ప్రసాదం - అనుగ్రహమును, కర్తుం - చేయుటకొఱకు, అర్హసి - మీరే తగుచున్నారు.

ఇట్టిచోట్లఁ బ్రతిపాదింపఁదగిన విశేషార్థములెల్ల గ్రంథ విస్తరభయముచే విరమింపఁబడినవి.

లందఱును, 1 „ రక్షోభిర్భ్హీమ కర్మభిః। క్రియతేకదనం మహత్ । తత స్త్వాం శరణార్థంచ శరణ్యాం సముపస్థితాః ” అని, తమకు విరోధుల యిన ఖరదూషణాది రాక్షసుల నిరసనార్థముగా శరణాగతిఁబొందిన వృత్తాంతము సెప్పఁబడినది.

---

1 [రక్షోభిర్భీమకర్మభిరిత్యాది] జనస్థానమందుండు ఖరదూషణాదులైన పదు నాలుగు వేలమంది రాక్షసులు, దండకారణ్యమందు తపంబు సేయుచుండు ఋషులను బహువిధంబుల హింసింపు చుండఁగా నా ఋషులందఱును పెరుమాళ్ల సన్నిధియందు శరణాగతిఁ బొందినవిధ మీశ్లోకములవల్ల జెప్పఁబడుచున్నది. „ సోయంబ్రాహ్మణ భూయిష్ఠోవాన ప్రస్థగణోమహాన్ ” అనునది మొదలు అయిదు శ్లోకములు ఇచ్చోటికి సంబంధబడు చున్నవి.

పెరుమాళ్లు శరభంగాశ్రమమునకు వేంచేసినప్పుడా శరభంగ మహాముని పెరు మాళ్లనుసేవించి కృతార్థుఁడై స్వర్గమున కరిగినపిమ్మట, దండకారణ్య వాసులైన ఋషు లందఱును పెరుమాళ్ల సన్నిధికివచ్చి, స్వామీ, మీరు సమస్త జనులనున్ను రక్షించు నట్టి ప్రభువుగా వేంచేసియుండియు నీయరణ్యమందుఁగల వానప్రస్థ బ్రాహ్మణ సమూ హమెల్ల రాక్షసులచే మితిలేకఁ జంపఁబడుచున్నది. ఆత్మజ్ఞాన సంపన్నులై తమంతట మననము సేయుచుండు వారి శరీరములను, రాక్షసులు ఛేదించియు భేదించియు భక్షిం చియుఁ జంపియుండు విధముల నిటు వేంచేసి కటాక్షింపుడు ; చిత్రకూట పర్వతము నందును మందాకినీ నదీ తీరమందును పంపానది తీరమందును వసింపుచుండు తాపసుల నీరాక్షసులు వధియించువిధ మిట్టిట్టిదని వచియింపఁ దరముగా కున్నది. దేహాభిమాన మును వదలి బ్రహ్మజ్ఞాననిష్ఠులై యుండువారము సైతము, అన్యాపేక్ష లేక తమంతట స్వాశ్రమధర్మముల ననుష్ఠింపుచుండు వానప్రస్థగణముల యాపదనుఁజూచి యోర్వఁ జాలకున్నాము ; కాఁ బట్టి, స్వరాజ్యమునందు వసించువారిని ప్రియపుత్రులభంగిఁజూ చుచు వారి రక్షణమునం దెల్లప్పుడు సావధాన మనస్కుఁడై యుండునట్టి నీవు రాక్ష సులచే చిత్రహింసగాఁ జంపఁబడుచుండు మమ్ము రక్షింపుము ; అని విన్నవింపుచు మఱి యును.

తతః - ఇదివఱకుఁ జెప్పినట్టి కారణములుగాక, సమస్త జనులకును నీవు దక్క రక్షకుఁడు లేకుండుటవల్ల, శరణ్యం - శరణ వరణమునకుఁ దగినవాఁడైన, త్వాం-నిన్ను, శరణార్థం - రక్షణ నిమిత్తముగా, సముపస్థితాః - ఆశ్రయించితిమి. (అనిశరణాగతిఁ బొందిరని యన్వయము.)

పిమ్మట, కిష్కింధాకాండమునందు 1" సుగ్రీవం శరణంగతః " అనిసుగ్రీవ మహారాజును పెరుమాళ్లున్ను ; 2" వాలినో మే మహాభాగభయార్తస్యాభయంకురు " అని పెరుమాళ్లను శ్రీసుగ్రీవ మహారాజున్ను ; శరణాగతిఁ బొందిన వృత్తాంతమును సెప్పి ; మఱియు, వాలివధానంతరమందు సీతాన్వేషణమునకు వర్షాకాలము నాలుగు మాసములు గడచినపిదప యత్నింతమని సమయముఁ జేసికొని పెరుమాళ్లును ఇళైయ పెరుమాళ్లును మాల్యవంతమను పర్వతము నందున్న మహారాజు కిష్కింధా నగరమందున్న వసింపఁగా, వర్షాకాలము గడచిన పిమ్మటఁగూడ సీతాన్వేషణప్రయత్నము లేక భోగపారవశ్యమువల్ల మఱచియుండునట్టి సుగ్రీవమహారాజువిషయమున మిక్కిలి కోపించిన పెరుమాళ్లచేత ప్రేరేపింపఁబడిన యిళైయ పెరుమాళ్లు వారికన్న నత్యంత కుపితులై సుగ్రీవవధ పర్యంతము సంకల్పించి కిష్కింధా నగ

1 [సుగ్రీవం శరణంగత ఇతి] పెరుమాళ్లును ఇళైయ పెరుమాళ్లును పిరాట్టిని వెదకుచు ఋశ్యమూక పర్వత సమీపమునకు వేంచేయఁగా, వారల తెలుంగెలుంగ వచ్చిన తిరువడితో, ఇళైయ పెరుమాళ్లు సంభాషించునప్పుడు, ఈవాక్యమును సాయించినారు. " పితాయస్య " ఇత్యాది రెండుశ్లోకములు దీనికి సంబంధపడినవిగా నున్నవి. తనతండ్రియైన దశరథ చక్రవర్తియు సర్వలోక శరణ్యుఁడై యతని గుణములకుఁ దగిన పుత్రుండగు దానునట్టి వారైన పెరుమాళ్లు, ఇప్పటి దుర్దశననుసరించి తిర్యగ్జాతిప్రభువైన శ్రీసుగ్రీవ మహారాజును శరణాగతిఁ బొందినారని యిళైయ పెరుమాళ్లు తిరువడితో సాయించినారని యీ వాక్యమునకుఁ దాత్పర్యము.

2 [వాలినో మే ఇతి] పెరుమాళ్లకును శ్రీసుగ్రీవ మహారాజుకును అగ్నిసాక్షికముగా చెలిమిగలిగిన తరువాత, సుగ్రీవమహారాజు వాలివల్లఁ దనపడినపాటును పెరుమాళ్లసన్నిధిలో సంగ్రహముగా విన్నవింపుచు నీవాక్యమును సెప్పి శరణాగతిఁ బొందినారు. మహాభాగ్య సంపన్నులైన ఓస్వామీ! వాలి భయమువల్ల దుఃఖితుఁడై యుండునాను, అభయ ప్రదానము గావించి రక్షింపుమని ప్రార్థింపుచు శరణుచొచ్చిరని యీ వాక్యమునకు తాత్పర్యము.

రమునఁ బ్రవేశించి మహారాజాంతః పురపర్యంత మప్రతిహతులై వేం చేసినప్పుడు, భయభ్రాంతుఁడై యెద్దియుందోఁపకయున్న సుగ్రీవమహా రాజుం జూచి 1,, కృతాపరాధస్యహితే నాన్యత్పశ్యామ్యహం క్షమం అంతరేణాంజలింబధ్వా లక్ష్మణస్య ప్రసాదనాత్ " అని, ఎచ్చరికలేమిచేఁ నపరాధియయినట్టి నీకు శరణాగతి సూచకమయిన యంజలిబంధముతోడ ఇళైయపెరుమాళ్లను వేడికొనుట దక్క వేరెద్దియు నుపాయములేదని తిరువడి యుపదేశించిన ప్రపత్తి వృత్తాంతమున్ను; పిదప నట్టి ప్రపత్తి ననుష్ఠించుటచేత సుప్రసన్నులైన యిళైయ పెరుమాళ్లతోడ మాల్యవాంతంబునకరిగి పెరుమాళ్ల సన్నిధిలో ,, పాదయోః పతితం మూర్ధ్నా " అని సుగ్రీవమహారాజు తన స్వరూపమున కనురూపముగా పెరుమాళ్ల తిరువడిత్తామరల యందుఁ దన కిరీటమునుఁ జేర్చి ప్రపత్తిసేసిన వృత్తాంతమున్ను; ప్రతిపాదింపఁ బడినది.

తదనంతరము సుందరకాండము నందు, ,, విశ్లేషదశైయిల్ చేతనన్నై త్తిరుత్తుమ్ " అని వచనభూషణ దివ్యశాస్త్రమందుఁ బ్రసాదించియుండురీతిగా, పెరుమాళ్ల నెడబాసి రావణ భవనము నందుండు పిరాట్టి 2 ,, తృణమంతరతః కృత్వా " అనియు 3,, రాక్షసంప్రష్ఠతః

---

1 [కృతాపరాధస్యహితే] అనే శ్లోకమునకున్ను. [పాదయోః పతితం మూర్ధ్నా] అనేశ్లోకమునకున్ను మూలగ్రంథమందుండు తాత్పర్యమే చాలియుండుటవల్ల నిచ్చోట నేమియు వ్రాయలేదు.

2 [తృణమంతరత ఇతి] (పిరాట్టి రావణభవనమందు పదినెలలు వేంచేసియుండినప్పుడు పదియవ నెలకడపట తిరువడి యశోకవనమందు వారిం గాంచి శింశుపా వృక్షమందణఁగి యుండఁగా, వేకువజామున రావణుఁడచ్చోటికి వచ్చి పిరాట్టి సన్నిధియందు కామోపహతచిత్తుఁడై కొన్ని యసంబద్ధ ప్రలాపంబులు వలుక నదియాలకించినపిరాట్టి వానికుత్తరము సాయించునప్పుడ న్నిచుఁడు సాక్షాత్సంభాషణమున కర్హుండు గాకుండుటవలన) తృణం - ఏదో వొకవిధమైన కసవును, అంతరతః - ఆతనికినిఁ దనకును మధ్యభాగమందు, కృత్వా-ఉంచి, అతఁడు వదరిన హీనవాక్యముల కుత్తరముసాయించిరని యన్వయము.

3 [రాక్షసం ప్రష్ఠతః కృత్వేతి] (ఈరీతి నొకటిరెండు మాటలు సాయించిన

కృత్వా" అనియు 1 "త్వంనీచ" అనియు, భాషించుటకు గాని కన్నెత్తి చూచుటకు గాని అర్హుఁడుగాక నీచుఁడైన రావణునికి 2 "విదితస్సహి ధర్మజ్ఞ శ్శరణాగత వత్సలః । తేనమైత్రీ భవతుతే" ఇత్యాది ప్రకారముగా, పరమకృపతో నుపదేశించిన ప్రపత్తి వైభవము ప్రతిపాదింపఁబడినది. మఱియు, పిరాట్టియొక్క

---

పిమ్మట) రాక్షసం - జాతిపేరు సెప్పినమాత్రమున దౌర్జన్యము సూచింపఁబడునట్టి రావణుని, పృష్ఠతః కృత్వా - అనాదరించి, (అనగా నీకంఁటెఁ డొక వస్తువనియునుంగూడ దలంపక) మఱియుఁ గొన్ని వాక్యములు సాయించిరని యన్వయము. పృష్ఠతః కృత్వా - అనుపదమునకు అతని కభిముఖముగా నుండక మఱియొక్కదిక్కు మరలుకొని యనియు నర్థముగలదు.

1 [త్వంనీచేతి] ఈ వాక్యము వెనుకటి సర్గమందున్నది. ముందుసర్గమున పిరాట్టి సాయించిన వాక్యములవలన మిక్కిలికుపితుఁడైన రావణుఁడు, రెండు మాసములకు పిమ్మటనిన్నుఁజంపి వంటసాలకుఁ బంపెదనని పిరాట్టిని బెదరించఁగా, తన పాతివ్రత్య బలమువల్ల నాతని బెదరింపుమాటలను లక్ష్యపెట్టక "త్వంనీచ" అని సాయించుచున్నారు. హేనీచ - బ్రతికినంతకాలము దౌర్జన్యముగాఁ బరస్త్రీలను చెఱపట్టుటయే యాత్రగాఁ గల యోరి నీచుఁడా, శ్రీరాములకును నీకునుఁ దారతమ్యంబుఁ జూచునెడ వారు మదపుటేనుఁగు చందముగానున్న నీవు దర్శనమునకుం గూడ నర్హంబుగాని కుందేలు చందముగాను నున్నారని పిరాట్టి సాయించిరని యన్వయము.

2 [విదిత ఇతి] ఇట్టి వానికిన్ని సర్వోత్కృష్టమైన ప్రపత్తి నుపదేశించుటవల్ల పిరాట్టి కృపారూపిణి (అనఁగా కృపాగుణమే తానుగానుండువారు) అనే యర్థంబును ప్రపన్నుఁడిట్లుపదేశించుటయే యానుకూల్య సంకల్పమనఁబడుననే యర్థంబునుఁ బ్రతిపాదింపఁబడినది. ఇంతకుముందు "తృణమంతరతః కృత్వా" "రాక్షసం పృష్ఠతః కృత్వా" అని యాతనిఁ దృణీకరించి యనాదరముతోఁ బ్రత్యుత్తరము సాయింపుచుండినను, మాతృత్వ ప్రయుక్తమయిన దనవాత్సల్యమునకుఁ దగుభంగి నీశ్లోకమందుహితోపదేశము సేయుచున్నారు. "మిత్రమౌపయికంకర్తుం రామః స్థానంపరీప్సతా । వధంచానిచ్ఛతాఘోరం త్వయాసౌ పురుషర్షభః" అనే దీనికిముందు శ్లోకమున్ను దీనితో నన్వయించ వలసియున్నది. స్థానం - (అతఁడు సార్వభౌముఁడగుటవల్ల) సేలమీఁదఁగలూని నిలచునంత మాత్రము స్థలమును, పరీప్సతా - నీవుగోరినను, (అంతకుపైన) ఘోర

పరుషవాక్యములువిని యత్యంత కోపోద్దీపితుండైన రావణునిచే నాజ్ఞాపింపఁబడిన ఏకాక్షి ఏకకర్ణి మొదలయిన రాక్షసస్త్రీలు పిరాట్టిని తర్జన భర్త్సనాదులచేత హింసించుచుండఁగా, త్రిజట తనస్వప్న వృత్తాంతమును వారలకెఱుంగఁ బల్కి రావణవినాశంబును రామవిజయంబును సిద్ధంబని సెప్పి యిట్టి సమయమందు 1 "అభియాచామ వైదేహీమేతద్ధిమ మరోచతే" అని, మనమందరము నీమెను శరణుచొచ్చి ప్రార్థించుటయే యుక్తమని రాక్షసస్త్రీలకు ప్రపత్త్యుపదేశము సేయుచుండగా నపుడు వారలు దానికి సమ్మతింపకుండినను 2 "భవేయం శరణంహివః" అని పిరాట్టి వారల కభయమొసంగి, రావణవధానంతరంబున తిరువడి యీరాక్షస స్త్రీలనెల్ల చిత్రవధంబుగాఁ జంపవలయునని తన్ను వేడినపుడు, ఈయభయ ప్రదానమును పరిపాలిం

---

వధంచ - చిత్రహింసగలైన మరణమునున్ను, అనిచ్ఛతా - నీవపేక్షింప కుండినను, త్వయా - నీచేత, పురుషర్షభః - పురుషశ్రేష్ఠుడైన, అసౌరామః - నిన్నుఁజంప సన్నద్ధుఁడై సమీపించి వచ్చుచుండునట్టి యీ స్వామివారు, మిత్రంకర్తుం - మిత్రుఁడుగాఁ జేసుకొనుటకు, ఔపయికం - తగియున్నారు. (ఇచట స్వామివారిని శరణాగతిఁజొందుట యుక్తమని యుపదేశించిన పక్షమందు దురభిమాని యయిన యాతులువ యా వాక్యమును తన గౌరవంబునకుఁ దక్కువగాఁ దలఁచునని యెంచి "మిత్రమౌపయికంకర్తుం" అని యుపదేశించినారు,) నేనుసేసిన యపరాధంబును దన మనంబునఁదలంపక వారు నన్నంగీకరించుదురా ? అని సందేహించకుము ; సః - ఆపెరుమాళ్లు, ధర్మజ్ఞః - శరణాగత రక్షణము పరమధర్మమని యెఱింగినవారనియు, శరణాగతవత్సలః - శరణుచొచ్చిన వారియందు గల దోషములఁజూడక రక్షించునట్టి పరమవత్సలు రనియు, విదితోహి - జగత్ప్రసిద్ధులు గదా? కాఁబట్టి, జీవితు మిచ్ఛసియది- బ్రదికియుండఁగోరిక గలవాడవైతివేని, తే - నీకు, తేన, ఆస్వామి వారితోడ, మైత్రీ - స్నేహము, భవతు - కలుగని, అని యుపదేశించిరి.

1 [అభియాచామేతి] దీనికి మూలగ్రంథము నందుండు తాత్పర్యమే చాలును.

2 [భవేయమితి] వః - మీకు, (అహం - నేను) శరణం - రక్షకురాలుగా, భవేయం - కాఁగలను, అనియర్థము.

చుటకై తిరువడి ననేకవిధంబుల సమాధానపరచి వీరల రక్షించుటవ లన నొకరికై మఱియొకరు (అనఁగా రాక్షసస్త్రీలకై త్రిజట) సేసిన ప్రపత్తియు కార్యకరమగునని ప్రతిపాదింపఁబడినది. పిమ్మట తిరువడి 1" సంశ్రవే మధురం " అని బొగడొందిన శ్రీరామకథను పిరాట్టికిఁ గర్ణామృతంబుగా వినిపించి వారి కటాక్షమునకుఁ బాత్రభూతుఁడై, మఱిమఱి పెరుమాళ్ల దివ్యమంగళవిగ్రహ రూపసంస్థాన వైభవంబుల నభివర్ణించి వారి తిరువుళ్లంబునఁ దానంతరంగ భృత్యుఁడను విశ్వాసం బును జనింపఁజేసి, పిమ్మట 2" అర్హా సేచకపి శ్రేష్ఠమయా సమభిభాషి

---

1 [సంశ్రవే మధురమితి] ఇట్లు రావణునకుఁ బ్రపత్త్యుపదేశము సేసినను దుర్వి నీతుండైన (అనఁగా హితోపదేశమున కణఁగనివాఁడైన) యారావణుం డమ్మాటలఁబెడ చెవులంబెట్టి యంతనిలువక పిరాట్టిని తర్జనభర్త్సనాదులవల్ల వశపరుచుఁడని రాక్షస స్త్రీలకు నియమించి చనిన పిమ్మట, వారికి త్రిజటసేసిన ప్రపత్త్యుపదేశమును పిరాట్టి విని, యంతమాత్రంబుననే వారలకెల్ల నభయంబొసంగి " సీతాయాదారుణాం దశాం " అనునట్టి యతిదుస్సహమైన దుర్దశలో నుండునపుడు, శింశుపా వృక్షమందణఁగి వీరిసం వాదంబులెల్ల వినుచుండు తిరువడి, ఈదేవిని నేనూరార్చకుండినఁ గార్యహానియగు నని యూ, నూరార్చువిధం బెట్టులనియునుఁ దనలో ననేక విధంబులుగా నాలోచించియిక్ష్వాకు వంశ వృత్తాంతంబు నద్దేవికి వినుపింపఁదొడంగెను. అప్పుడా వాక్యంబులు పిరాట్టిచెవు లఁబడు నప్పటినుండి యానందా వహముగా నుండెనని యీవాక్యమున కర్థము. లోక మునందు, మానసేంద్రియము జ్ఞానేంద్రియ ద్వారా బాహ్యవిషయమును గ్రహించిన పిమ్మట, మనంబున నానందము జనించును ; ఇదియట్లుగాక " రాజా దశరథో నామ " అని యుపక్రమించినది మొదలు, (నీచజనులకు నివాసస్థానంబైన యిచ్చోటనున్న, ఇట్టి శబ్దము వినవచ్చెఁగదా ? యని) ఆనందా వహముగా నుండెనని భావము. " భావ సాప్రకర్ష త్తాలే ఇడైనడైయుమ్ ఇడైముడియుమ్ ఇడై ప్పెచ్చుమ్ ముడైవా ప్రియుమాయ్ విట్టతు." అనునట్లు గోపజన్మము నందవగాహించి " అవనై విట్టకష్టయిరాప్ప్రకిల్లా " అని కృష్ణగుణైక ధారకులుగా నుండు వారు సైతము " మనత్తుక్కినియానై " అని పరవ శులై పొగడునంతటి మాధుర్యము శ్రీచక్రవర్తి త్తిరుమకనార్ల తిరునామమునకు సహజ గుణముగదా ?

2 [అర్హా సేచేతి] హేకపిశ్రేష్ఠ - ఓయివానర శ్రేష్ఠుఁడా, మయా - నాలోడ,

తుం" అని పిరాట్టి తన్ను బహూకరించి సమభిభాషణము సేయు ప్రకరణమందు, పూర్వము చిత్రకూట పర్వతమునందు పెరుమాళ్లునుం దాను నేకాంతరస మనుభవించుదశలో 1"మత్కృతే కాకమాత్రేతు బ్రహ్మాస్త్రం సముదీరితం" అని యొకపక్షిమాత్రుఁడు దనయందపరాధము సేసి బ్రహ్మాస్త్రము పాలాయెనని, యిట్టి యంతరంగ వృత్తాంతంబులఁ బ్రసాదింపుచుఁ దత్ప్రసంగంబున 2"సపిత్రాచ పరిత్యక్తస్సురైశ్చ సమహర్షిభిః త్రీఁల్లోకాఁ సంపరిక్రమ్య తమేవ శరణం

---

సమభిభాషితుంచ - పెరుమాళ్లు నేను ననుభవించినట్టి యేకాంతరస వృత్తాంతమును సైతము నీతోఁజెప్పి సంభాషించుటకునుం గూడ, అర్హాసే - తగినవాడవగుచున్నావు. అని యీవాక్యమున కర్థము. ఇచట, భాషణమనఁగా బహిరంగమైన కార్యములందుఁ గలసి భాషించుటయనియును, అభిభాషణమనఁగా నంతరంగమయిన హితకార్యములందుఁగలసి భాషించుటయనియును, సమభిభాషణ మనఁగా నంతఃపుర రహస్యంబులందునుంగూడ కలసి సంభాషించుట యనియును, సంప్రదాయార్థము.

1 [మత్కృత ఇతి] మత్కృతే - నానిమిత్తముగా, కాకమాత్రేతు - కాష్ఠలోష్టాదులఁగొని యదలించఁ దగినట్టి యల్పపక్షియందే, బ్రహ్మాస్త్రం - జగదుపసంహారము సేయవలసినంతటి సమయమందుఁ బ్రయోగించఁదగిన బ్రహ్మాస్త్రము, సముదీరితం - ప్రయోగింపఁబడెను. (ఇట్లుండఁగా రావణుని యపరాధము సైర్చి యున్నారని యీశ్లోకశేషముతో నన్వయము.)

2 [సపిత్రాచ ఇతి] ఈశ్లోకమునకు పూర్వాచార్యకృత వ్యాఖ్యానములు మెండుగా నుండుటవల్ల నిచ్చోట విస్తరింపలేదు. అయినను సంగ్రహముగా వ్రాయఁబడుచున్నది. చిత్రకూట సమీప పర్వతమునందలి తాపసాశ్రమములలో వేంచేసియుండినప్పుడు, మందాకినీ తీరవృక్ష వాటికలయందలి సుగంధికుసుమనికరభరిత ప్రదేశములందు, పెరుమాళ్లును పిరాట్టియు నేకాంతరసము ననుభవించి యొకరియొడిలో నొకరు మాఱ్చిమాఱ్చి పవళింపుచు రసోత్తర దశలోనుండు నప్పుడు, ఇంద్రపుత్రుండైన జయంతుండను వాడు తమోగుణ ప్రాచుర్యముచేతఁ బ్రాప్తాప్రాప్త వివేకశూన్యుఁడై దేవవేషము మాటుసేసి క్షుద్రమైన కాకవేషమును ధరియించి పిరాట్టి విషయమున నపరాధముఁగావించి బ్రహ్మాస్త్రమునకు గుఱియై వాయువేగముతో మూడులోకములును సంచరించి యెందును నేదిక్కుంగానక యంతకంతకు నంతరిక్షంబునం బఱచుచు కేకియుడిగి

గతః" అని సాయించిన కాకాసుర శరణాగతి వృత్తాంతము ప్రతిపాదింపఁబడినది.

పిమ్మట యుద్ధకాండమునందు శ్రీవానర వీరులతోడ దండయాత్ర వెడలి సముద్రతీరంబున విడసినపెరుమాళ్లు సముద్రతరణార్థముగా 1" అంజలిం ప్రాఙ్ముఖః కృత్వా" ఇత్యాది ప్రకారముగా సముద్రుని

---

చేయునది లేక, మరల స్వామివారి సన్నిధికేవచ్చి శరణాగతిఁబొందిన వృత్తాంతంబును, పిరాట్టి, తిరువడికిఁ జెప్పిన విధంబీ శ్లోకమునఁ జెప్పఁబడుచున్నది.

సః - ఆకాకము, (మొదటఁ దండ్రికడకేగి యచట) పిత్రాచ - తండ్రియైన దేవేంద్రుని చేతనున్ను తల్లిచేతనున్ను, సురైశ్చ - బంధువులైన దేవతలచేతనున్ను, సమహర్షిభిః - (పరదుఃఖమునఁ జూడలేని) మహర్షుల చేతనుంగూడ, పరిత్యక్తః - (తన దర్శనము సైతము దోషావహామనిరోసి) విడువఁబడినవాడై, త్రీఁల్లోకాన్ సంపరిక్రమ్య - భూమ్యంతరిక్ష స్వర్గములను మూడులోకము లందునఁ బలుమాఱుఁదిరిగి, తమేవ - (కోపించినను పాదములు బట్టుకొనుటకుఁ బ్రాప్తిలయిన) ఆపెరుమాళ్లనే, శరణం గతః - శరణుచొచ్చెను. (అనిపిరాట్టి తిరువడికి సాయించిరని యన్వయము.)

1 [అంజలిం ప్రాఙ్ముఖ ఇతి] ఈవాక్యము " తతస్సాగర వేలాయాందర్భానాస్తీర్య రాఘవః । అంజలిం ప్రాఙ్ముఖః కృత్వా ప్రతిశిశ్యే మహోదధేః । బాహుంభుజగభోగాభ ముపధాయారి సూదనః" అనే ముందును వెనుకనుంగల శ్లోకశేషంబుతో నన్వయింపుచున్నది. తతః - సముద్ర తరణార్థముగా పెరుమాళ్లు ఆసముద్రుని శరణాగతిఁబొందఁ దగునని శ్రీవిభీషణాళ్వానులు సాయించిన వాక్యము నాలకించినపిమ్మట, సాగరవేలాయాం - సముద్ర తీరమునందు, దర్భాన్ - దర్భలను, ఆస్తీర్య - పరిశుద్ధార్థముగా క్రిందపఱచుకొని, రాఘవః - వంశ పరంపరగా సర్వశరణ్యులైన శ్రీచక్రవర్తి తిరుమకనార్లు, మహోదధేః - జడ స్వభావముగల సముద్రునికి, అంజలిం కృత్వా - అంజలిజేసి, భుజగభోగాభం - సహజ మార్దవముగల సర్పశరీరమువంటి, బాహుం - భుజదండమును, ఉపధాయ - తలగడగాఁ జేసుకొని, ప్రాఙ్ముఖస్సన్ - తూర్పు తిరుముడిగా - ప్రతిశిశ్యే - సముద్రాభిముఖులై పవళించిరి. ఇది శ్రీవిభీషణ పెరుమాళ్ల శరణాగతికి వెనుకఁ జెప్పవలసినదిగా నుండినను ప్రకృత గ్రంథము శ్రీవిభీషణ శరణాగతి ప్రతిపాదకముగానే యుండుటంబట్టి దీనితో సంబంధపఱచుటకై, అది (అనఁగా శ్రీవిభీషణ శరణాగతి) కడపట సెప్పఁబడినది.

శరణాగతిఁబొందిన వృత్తాంతము చెప్పఁబడినది. ఇట్లు దేశకాలాధికారి ఫలనియమ నిర్బంధములు లేకనే యీప్రపత్తి, అందఱికి నన్నియెడల నన్నికార్యంబు లందును నప్రతిహత సాధనంబగునని యీ యితిహాస రత్నము నందంతట నెడతెగక ప్రతిపాదింపఁ బడుచున్నది. మఱియు దీనికి సంబంధపడునట్టి విషయము లనేకములిచ్చటఁ జెప్పవలసియుండి నను నుపోద్ఘాతము విస్తరించుననే భయముచే నింతమాత్రముతో విరమించినాను.

ఈ ప్రకారముగా దీర్ఘశరణాగతియని కొనియాడఁబడిన యీ యితిహాస శ్రేష్ఠమునందు శ్రీవాల్మీకి భగవానులు ప్రసాదించినట్టి వేదాంతతాత్పర్యమైన యీపరమార్థము శరణ్యహృదయమునకు మిక్కిలిసమ్మతమై యున్నదనేయర్థ మీ శ్లోకమువల్లఁ బ్రతిపాదింపఁ బడుచున్నది. 1 “నతేవాగనృతా కావ్యేకాచిదత్రభవిష్యతి” అని చతుర్ముఖుఁడు శ్రీవాల్మీకి భగవానులకు అనుగ్రహించి యుండుటవల్ల నీగ్రంథమందు ప్రతిపాదింపఁబడిన యర్థమొక్కటియు నసత్యము కానేరదుగదా? కావున సత్యమై పరమార్థములలో మిగుల నుత్తమంబైన యీ యర్థమును2 “మచ్ఛందాదేవతే బ్రహ్మన్ప్రవృత్తేయం సరస్వతీ” అన్నట్లు శరణ్య హృదయమును బయలు పఱుచునట్టి యీ శ్లోకరూపముగా నాతఁడే యీఋషి వాక్కునుండి ప్రకాశింపఁ జేసినాడని.

1 [నతేవాగితి] అత్రకావ్యే- ఆదికావ్యమని కొనియాడఁబడిన యీ యితిహాస శ్రేష్ఠమునందు, తేవాక్ - నీవాక్యము, కాచిత్ - ఒక్కటియును, అనృతా - అసత్యమయినది. నభవిష్యతి - కానేరదు. ఇది బ్రహ్మదేవుఁడు శ్రీవాల్మీకి భగవానులఁజూచి శ్రీరామాయణము రచియించుమని నియమించి నప్పుడు సాయించినవాక్యము.

2 [మచ్ఛందాదేవేతి] హేబ్రహ్మన్ - బ్రాహ్మణ శ్రేష్ఠుఁడైన యోవాల్మీకి మహాముని, తే - నీయొక్క, ఇయం సరస్వతీ - ఈవాక్కు, (అనఁగా క్రౌంచదంపతులలోఁ బురుషపక్షినిఁ జంపిన బోయవానికి శాపమిచ్చు నెపంబున నీవాక్కునుండి జనించిన “మానిషాద ప్రతిష్ఠాంత్వం” ఇత్యాదిశ్లోకమని తాత్పర్యము) మచ్ఛందాదేవ- నాయభిప్రాయము వల్లనే, ప్రవృత్తా - బయలువెడలినది, అని (బోయవానికి శాపమి

స్పష్టముగా నూహించవచ్చును. శ్రీవిభీషణాళ్వానులకు అభయమిచ్చు టంబట్టి యభయప్రదానమని దీనికి తిరునామము ప్రకాశించుచున్నది, ఇతిహాస శ్రేష్ఠమైన యీగ్రంథమందు, ఇంతకుముందు ప్రతిపాదింపఁ బడిన శరణాగతు లన్నింటిలోనిది **నాయక** రత్నమువంటిది.

ఉపోద్ఘాతము సంపూర్ణము.



శ్రీమతే రామానుజాయనమః.

శ్రీ మ ద భ య ప్ర దా న శ్లో క మ్

పెరియవాచ్చాన్పిళ్ళైయరుళిచ్చెయ్‌త మణిప్రవాళ

వ్యాఖ్యాన సహితమ్.

శ్లో॥ సకృదేవ ప్రపన్నాయ తవాస్మీతిచ యాచతే ।

అభయం సర్వభూతేభ్యో దదామ్యేతద్వ్రతంమమ ॥

అవతారికై॥ (ఠ3వదు పుఱైయిల్ తుడఙ్గప్పడుకిఱతు.)

దీనికసరియయిన ఆంధ్రవ్యాఖ్యానము.

శ్లో॥ సకృదేవ ప్రపన్నాయ తవాస్మీతిచ యాచతే ।

అభయం సర్వభూతేభ్యో దదామ్యేతద్వ్రతంమమ ॥

ప్రతిపదార్థము.—సకృదేవ - ఒకతూరిమాత్రమే, ప్రపన్నాయ - శరణుచొచ్చినవాఁడై, (అంతకుపైన) తవాస్మీతిచ - నేను నీవాఁడనియును, యాచతే - వేడుచున్నవానికి, సర్వభూతేభ్యః - స్థావరజంగమ రూపములైన సమస్త భూతములవల్లనున్ను, అథవా, యాచతే - సర్వభూతేభ్యశ్చ - ఇట్లువేడుచున్న యీయధికారికిన్ని యీతనితో సంబంధలేశముగల స్థావరజంగమ రూపములైన సమస్త భూతములకున్ను, అభయం - భయములేమిని, దదామి, ఇచ్చుచున్నాను, ఏతత్ - అనుకూల్యలేశమును, బట్టి యీరీతిగా నభయప్రదానము సేయుట యనేయిది, మమ - నాకు, వ్రతం - ఎప్పుడునుఁ దప్పఁగూడని నియమము.

[శ్రీపెరియవాచ్చాన్‌పిళ్ళై నాయించిన మణిప్రవాళ వ్యాఖ్యానములోని అవతారిక సేవించువారి సౌకర్యార్థము ౧-౨ భాగములుగా విభజింపబడినది.]

చ్చిన వాక్యము భగవదవతార సూచక శ్లోకరూపమై నందుకు కారణమునుఁ దలపోయుచున్న) శ్రీవాల్మీకి భగవానులఁజూచి బ్రహ్మదేవుఁడు సెలవిచ్చిరని యన్వయము

1. అవతారిక॥ „సరావణస్యభ్రాతాంమనస్వినాం" ఇత్యాది. ఈ యవతారికయం దిది మొదలు „ఆత్మానంసర్వథారక్ష" అనే వాక్యమువఱకు, శ్రీవిభీషణాళ్వానులు రావణునిఁ బరిత్యజించుటకు కారణమునుఁ బ్రతిపాదించుచున్నారు. ఇందు, ప్రపత్తికావశ్యకమైన „ప్రాతికూల్యస్యవర్జన" (ప్రతికూలవిషయ త్యాగ)మున్ను „అనుకూల్యస్య సంకల్ప)మున్ను ప్రకాశింపుచున్నవి.

2. పిమ్మట „అజగామ ముహూర్తేన" అనునది మొదలు „నిన్ఱనిలైయిలే విణ్ణప్పమ్ శెయ్తునిన్ఱార్" అనువఱకు రామగోష్ఠియొక్క వైలక్షణ్యంబును ద్వారశేషి పురస్సరముగాఁ బ్రపత్తి సేయవలయుననే క్రమంబునుఁ దెలియఁజేయుచున్నారు.

3. తరువాత, „ఇత్తైక్కేట్ట మహారాజర్" అనునది మొదలు „వన్దవర్కళ్లైయు మివనైయుమ్కొల్ల ప్రాప్తమెన్ఱుశొల్ల" అనువఱకు శ్రీవిభీషణాళ్వానుల నంగీకరించు విషయమందు సుగ్రీవమహారాజుయొక్క అభిప్రాయమునుఁ బ్రతిపాదించుటవల్ల „అతిస్నేహఃపాపశంకీ" అనురీతిగా అపరిమిత స్నేహముగలవార లన్నియెడల సందేహించుదురనే యర్థము దెలియఁజేయఁబడినది.

4. పిమ్మట, „ఇత్తై క్కేట్టరుళిన పెరుమాళ్ తిరువుళ్లమ్తళుమ్బి" అనునది మొదలు పెరుమాళ్లు విభీషణపరీక్షార్థముగా మంత్రులతో నాలోచించు వృత్తాంతంబును, అందు, „ఒఱ్ఱుకవిచారిత్తు క్కైక్కొళ్ల ప్రాప్తమెన్ఱుశొల్లి త్తలైక్కట్ట" అనువఱకు నంగదాది మంత్రుల యభిప్రాయంబును సాయించుచున్నారు.

5. పిమ్మట, „ఇత్తైక్కేట్ట తిరువడియు మెఱ్ఱన్దిరున్దు" అనునది మొదలు „ఇని త్తిరువుళ్లమానపడి శెయ్తరుళీరెన్ఱు తలైక్కట్ట" అనువఱకు తిరువడియొక్క యభిప్రాయమును సాయించుచున్నారు.

6. పిమ్మట "అథరామః ప్రసన్నాత్మా" అనునది మొదలు శ్రీచక్రవర్తి త్తిరుమకనార్ల తిరువుళ్లమునున్ను; అందు "తస్యాను బంధాఃపాప్మానః" అనునది మొదలు "ఎన్గిఱారిశ్లోకత్తాల్" అను వఱకు, ప్రపన్నునికి సర్వభయంబులునుఁ బోగొట్టుచున్నానని యీ శ్లోకమునందుఁ బ్రసాదింపుచున్నారను నర్థవిశేషమునున్ను; సాయించు చున్నారు.

7. పిమ్మట "వేదోపబృంహణార్థాయ" అనునది మొదలు "శరణంప్రపద్యే, ఎన్ఱుశొల్లుకిఱతు" అనువఱకు నీ యితిహాసరత్నము వేదాంత ప్రతిపాదితమైన ప్రపత్త్యుపాయవైభవమునుఁ బ్రకాశింపఁ జేయుచున్నదని సాయింపుచు, అచ్చోట నుదహరింపఁబడిన శ్రుతులకు తాత్పర్యార్థములను సాయించుచున్నారు.

8. పిమ్మట, "ఇవ్వాక్యత్తైయిశ్లోకమ్" అనునది మొదలు "అభయమస్తు, ఎన్గిఱపదఙ్గళైయుమ్ ఉపబృంహిక్కిఱతు," అనువఱకు "ప్రయతపాణిః" ఇత్యాది ప్రపత్తిప్రతిపాదక శ్రుతులను, ఈశ్లోకము వివరించు విధమును సాయించుచున్నారు.

9. పిమ్మట "ఆకిఱతు, ప్రపద్యే, ఎన్ఱు" అనునది మొదలు "ఒరుత్తన్ శెయ్ద్దార్ క్కెల్లామ్ ఫలమాకక్కడవతు" అనువఱకు, ఒకఁడు ప్రపన్నుఁడైతే తదభిమానమునఁ జేరినవారెల్ల ముక్తులగుదురనే యీ యర్థము "ప్రయతపాణిః" ఇత్యాది శ్రుతియందున్నదని ప్రతిపాదించుచున్నారు.

10. పిమ్మట "ఆకిఱతు ప్రపత్తి ఉపాయమెన్బతు" అనునది మొదలు "ఉపచరిత్తు చ్చొల్లుకిఱతాకైయాలే యొరువిరోధముమిల్లై" అనువఱకు, ప్రపత్తి యుపాయమా? ఈశ్వరుఁడుపాయమా? అనే శంకను తర్కన్యాయము ననుసరించి పరిహరించుచున్నారు.

11. పిమ్మట ""ఆకిఙ్చతు, సర్వైసైవఫలప్రదః" అనునది మొదలు ""ఉత్పాద్యమన్త్రికే- యొళ్ళిక్కై యాలుమ్ నిత్యమాకిఙ్చతు, ఎన్నవృ మామ్" అనువఱకు, ఉపాయభూతుఁడైన యీశ్వరునకు, ఉపేయత్వ ము కలుగుటకు కావలసినంత యుపపత్తులను తర్కన్యాయానుసార ములైన శంకాపరిహారములతోఁడ నుపన్యసించి సిద్ధాంతపరచు చున్నారు.

12. పిమ్మట ""అన్వైయుమప్పడియేయాకిఱతు ; ఇప్రదేశమ్ ప్రప త్త్యుపబృంహణమ్" అనునది మొదలు "ఆకైయాల్ ఇన్దలక్షణముమ్ పుష్కలమ్" అనువఱకు, ఈశ్లోకమునందు ప్రపత్తికి కావలసిన లక్షణ ములన్నియు నిండియున్నవని ప్రతిపాదించుచున్నారు.

ఇందు 3-4 సంఖ్యలుగల విభాగములు రెండుమాత్రము ఆంధ్రీకరించునప్పుడు ఒకేపేరాలో చేరియున్నది.

---

## పెరియవాచ్చాన్పిళ్ళై అవతారికై.

"సరావణశ్శత్రుభృతామ్మనస్వినాంమహాబలానాంసమితౌమన స్వీతస్యాంసభాయాంప్రభయాచకాశేమద్ధ్యేవసూనామివవజ్రహస్తః" ఎన్ఱు-పెరుమాళుమ్పెరికరముమాక క్కడఱ్కరైయిలే కుఱుకవన్దువిట్టా రకళెన్ఱుకేట్టరావణన్, సచివసామన్తమన్త్రిపురోహితాదివర్గత్తైక్కూ ట్టైవఱకూట్టి, "భవద్భిర్మన్త్ర్యతామ్మన్త్రస్సునీతంచాభిధీయతామ్"

---

(""సరావణశ్శత్రుభృతాంమనస్వినాం మహాబలానాం సమితౌ మనస్వీ। తస్యాంసభాయాంప్రభయాచకాశే మధ్యేవసూనామివ వజ్ర హస్తః,,) పెరుమాళ్లును శ్రీవానరవీరులును సముద్రతీరమునకు వచ్చి విడిసినారని వినినపిమ్మట, మంత్రాలోచనకాల మతిక్రమించి పోయిన దని యెఱుంగలేని రావణుఁడు, మంత్రిపురోహిత సామంత సహాయా దులచే నిండారునట్టి సభలో వైడూర్యమణిమయ సింహాసనమందుఁ గూర్చుండి వారలఁ గనుంగొని (""భవద్భిర్మంత్ర్యతాం మన్త్రస్సునీతం

ఎన్ఱునియమిత్తుక్కార్యవిచారమ్పణ్ణుకిఱవళవిలే శెయ్తునిన్ఱనిలై కళై యుమ్ శెయ్యవేణ్డుమ్ కార్యఙ్గళైయుమ్ శొల్ల, ,,తస్య కామపరీతస్య నిశమ్య పరిదేవితమ్। కుంభకర్ణః ప్రచుక్రోధవచనఞ్చేదమబ్రవీత్'' ఎన్ఱు-ఇత్తైక్కేట్టకుంభకర్ణనుమ్ కుపితనాయ్, ,,యదాతు రామస్య సలక్ష్మణస్య ప్రసహ్యసీతా ఖలుసాఇహాహృతా। సకృత్సమీక్ష్యైవసునిశ్చితంతదా భజేతచిత్తంయమునేవయామునమ్'' ఎన్ఱు-ఇవనపహరిత్తవన్ఱే ఇప్పడివిళైయుమెన్ఱు అఱియిట్టోమే యెన్ఱు స్వబుద్ధిసంవాదత్తైసంవదిత్తు, ''సర్వమేతన్మహారాజకృతమప్రతిమంతవ। విధీయేతసహాస్మాభి రాదావేవాస్యకర్మణః'' ఎన్ఱు - శెయ్యక్కడవ శెయ్తవళవిలే పణ్ణినాయ్ ఎన్ఱు రావణనై యధిక్షే

చాభిధీయతాం,, అని) మన్త్రాలోచన భారమును వారియందు మోపి, ఇఁకఁ జేయఁదగిన పనియేది యని యాలోచించునప్పుడు, తాను ముందే చేసినట్టి సీతాపహారరూపమయిన కార్యమునున్నూ; ఇఁకఁ జేయవలసిన కార్యమునున్నూ (అనఁగా పిరాట్టిని పెరుమాళ్లసన్నిధియందు సమర్పించక, పెరుమాళ్లను ఇళైయపెరుమాళ్లతోడ సంహరించవలయునని తాను నిశ్చయించియుండు కార్యమునున్నూ) తెలియఁజేయఁగా (,,తస్య కామపరీతస్య నిశమ్యపరిదేవితం। కుంభకర్ణః ప్రచుక్రోధవచనంచేదమబ్రవీత్,, అని.) కామాతురుఁడైన యారావణుని రోదనమును కుంభకర్ణుఁడు విని మిగులఁగోపించి (,,యదాతురామస్య సలక్ష్మణస్య ప్రసహ్యసీతా ఖలుసాఇహాహృతా। సకృత్సమీక్ష్యైవసునిశ్చితంతదా భజేతచిత్తంయమునేవయామునం,, అని,) ఈతఁడు పిరాట్టినపహరించి తెచ్చినప్పుడే యిట్టియనర్థము సంభవించఁబోవుచున్నదని నేను నిర్ణయించి యుంటినిగదా? యని తన యభిప్రాయమునుఁ దెలియపరచి (,,సర్వమేతన్మహారాజ కృతమప్రతిమంతవ। విధీయేతసహాస్మాభిరాదావేవాస్యకర్మణః,, అని,) ఈ మంత్రాలోచనమును మూలో

పిత్తు, ఎజ్ఞళ్ శొఙ్కట్టు చ్చెయ్యవిరున్దాయాకిల్ ఇస్సీతాపహారత్తుక్కు మున్బేయన్ఱో శెయ్యవత్తెన్ఱుమ్, "యఃపశ్చాత్పూర్వ కార్యాణి కర్మాణ్యభి చికీర్షతి। పూర్వంచాపరకార్యాణి నసవేద నయానయౌ॥" ఎన్ఱు-పూర్వోత్తరకార్యజ్ఞనై క్రమహీనమాక ప్పణ్ణుకిఱవన్ నయాపనయజ్ఞనైయఱియానెన్ఱుమ్, "దిష్ట్యాత్వాంనావధీద్రామో విషమిశ్రమివామిషమ్" ఎన్ఱు - నఞ్జూట్టిన పళమ్బోలే ఇనియరా యిరుక్క చ్చెయ్తేయుమ్ ఉకన్దుడియ పెరుమాళ్ అవరునైక్కొల్లాతొళిన్దతు ఉన్ పుణ్యమెన్ఱుమ్, అతిలొక్కపిత్తు ఇవన్ వెఱుక్క వార్ణాతెన్ఱు, "సమీకరిష్యామి" ఎన్ఱు-పళ్ళ

---

గలసి యాలోచించి చేయువాడవైతే సీతాపహారము జేయుటకు ముందుగానే యాలోచించవా? అని (ఇతరులెవ్వరిని లక్ష్యపెట్టక నేను సేసినపనికి సమానమైనదిగూడ నొక్కటిగలదా? యను తలంపుతో విఱ్ఱవీగుచుండు) రావణుని దూఱిపలికి, ("యఃపశ్చాత్పూర్వ కార్యాణి కర్మాణ్యభిచికీర్షతి। పూర్వంచాపరకార్యాణి నసవేదనయానయౌ,, అని) ఎవఁడైతే ముందుఁజేయఁదగిన కార్యములను వెనుకనున్ను; వెనుకఁ జేయఁదగిన కార్యములను ముందున్ను; చేయుచుండునో, వాఁడు, ఇది నీతియుక్తమనియు, ఇది నీతియుక్తముగాదనియు నెఱుంగఁజాలఁడని నొక్కివక్కాణించి, ("దిష్ట్యాత్వాంనావధీద్రామో విషమిశ్రమివామిషం,, అని) ఓయీ, రాముఁడు, చూచువారల కింపు మీఱఁ గనుబడుచుండినను, భోగ్యమైన ఫలము విషమిశ్రమై యుండునట్లు పరులకీడు నించుకైనను బాటించని దయాహీనుఁడు; అట్టివాడిదివఱకు నిన్నుఁ జంపకుండినది నీ పుణ్యఫలమేగాని వేఱుగాదని నొవ్వఁబలికి; ఇఁక నింతకుపై నీతనికిఁ గోపంబుగలుగునట్లు పలికి విరసపరచఁగూడదని తలపోసి, ("అహంసమీకరిష్యామి,, అని) ఇట్లు నీ గౌరమునకుఁ దగనిదై యితరు లెవ్వరిచేతనున్ను పరిహారింప నశక్యం

త్తుకుక్కమే త్తైనిరవుమాప్పోలే ఉన్ననీతియై యెన్త్తోళ్ వలియాలే ఒక్క విడుకిత్తే నెన్ఱు సమాధాన మ్బణ్ణ, మహాపార్శ్వను మవనుక్కప్ప్రియ మాక చ్చిలవార్తైకళై చ్చొల్ల,

బైన యీ యాపదను పల్లమును మిట్టచేత నించునట్లుగా నాభుజబల ముచేతఁ బరిహరించి సరిపరచుచున్నానని సమాధానముగా మాట లాడుచుండునప్పుడు, మహాపార్శ్వుఁడను మంత్రి, రావణుని చిత్త వృత్తి నెఱింగి కుంభకర్ణుఁడు సెప్పిన మాటలవల్ల నితనికి కోపంబు గలిగి యున్నది, వీనినెట్లు సమాధానపరుచుదునని తనలో నొక్కింత సే పాలోచించి యతనిబుద్ధికిఁ దగినట్టి (సభాయోగ్యముగాని) ప్రియవచ నములు గొన్ని సెప్పి యా వెంగలిని సమాధానపరచెను.

(ఇదివఱకు సాయించిన గ్రంథంబువల్ల, రావణునియందు నీతి లేదనుటయు; మంత్రుల హితవాక్యంబులు వినఁడనుటయు; తన బుద్ధి ననుసరించి సెప్పువారి హీనవచనంబులందు ప్రీతిగలిగి యుండుననుట యు; ప్రతిపాదించుటవలన, పరమధార్మికులైన శ్రీవిభీషణాళ్వానులు తన సహోదరుఁడైన రావణుని యిట్టి యాపత్కాలంబునం దేలపరి త్యజించినారని కలుగునట్టి శంకకు పరిహారముగా, వా రాతనిఁ బరిత్య జించుటకు మూలకారణంబిదియని సూచింపఁబడినది. మఱియును, అహంకార మమకారగ్రస్తులై యత్యంతనీచమైన నిషిద్ధవిషయమందు ప్రవణులై యుండువారల సహవాసమున్ను, వారియభిమానమున్ను, ప్రపన్నునికి పరిత్యాజ్యములుగావున నవియు నిచ్చోట సూచింపఁబడి నవి. ఇందువల్ల నవర్జనీయ దేహసంబంధము గలవారైనను నిట్టి స్వ రూపవిరుద్ధ దుర్గుణంబులున్నచో నీయధికారి వారల సహవాసాభిమాన ములను నిశ్శేషముగాఁ బరిత్యజించవలయునని సెప్పఁబడినది.)

ఇఁక రావణునకుఁ దాను సహోదరుఁడును హితమంత్రియునై

"నిశాచరేన్ద్రస్య నిశమ్యవాక్యం సకుంభకర్ణస్యచగర్జితాని ।
విభీషణో రాక్షస రాజముఖ్య మువాచవాక్యం హితమర్థ యుక్తమ్"
ఎన్ఱు-అవర్ కళ్ నిరర్థకమాక ప్పితఱ్ఱిన వార్తైకళై క్కేట్టు విభీషణప్పెరుమాళ్, హితరూపమాక, "వృతో హిబాహ్వన్తరభోగరాశి శ్చిన్తా విషస్స్మితతీక్ష్ణదంష్ట్రః । పఞ్చాఙ్గుళీ పఞ్చశిరోతికాయ స్సీతామహాహి స్త్వకేన రాజన్" ఎన్ఱు - *పామ్బోడొరు కూరైయిలే యిలువార్కై పోలే సీతైయాకిఱ పెరుమ్బాప్పినరుకే కైయైనీట్టువానన్ఱో; "యావన్నలఙ్కాం సమభిద్రవన్తి వలీముఖాః పర్వతకూటమాత్రాః
యుండుటంబట్టి యీ రెంటికి ననుకూపంబగునట్లుగా శ్రీవిభీషణాళ్వాను లాతనికిహితోపదేశము సేయువిధమును సాంగించుచున్నారు.

("నిశాచరేంద్రస్య నిశమ్యవాక్యంసకుంభకర్ణస్యచగర్జితాని।
విభీషణో రాక్షసరాజముఖ్యమువాచవాక్యం హితమర్థయుక్తం," అని) ఇట్లు వారలు పలుకుచున్న వాక్యంబులను శ్రీవిభీషణాళ్వాను లాలకించి, యివియెల్ల నిరర్థకప్రలాపంబులేగాని పెరుమాళ్లసన్నిధియందు వీరిగర్జనము లొక్కటియుఁ బనికిరావని తనలో నిశ్చయించి రావణుంజూచి, మొదట, పిరాట్టిని స్వామివారిసన్నిధిలో సమర్పించకూడదనే పక్షమును ఖండనముఁ జేయువాఁడై, ("వృతోహిబాహ్వంతరభోగరాశి శ్చింతావిషస్స్మితతీక్ష్ణదంష్ట్రః । పంచాంగుళీపంచశిరోతికాయ స్సీతామహాహి స్త్వకేనరాజన్," అని) ఓరాజా "తీక్ష్ణకోపాభుజంగమాః," అనేప్రకారముగా నెల్లప్పుడుఁ గోపమే స్వభావముగానుండునట్టి ప్రాణాంతకరమయిన సర్పముతోడఁ బొత్తుకాఁపురము సేయువారివలె, సీతారూపమయిన కాలసర్పమునంచుకుఁ జేయి చాచువారును గలరా? యనిపలికి పిమ్మట రామలక్ష్మణులఁ జంపవలయుననే రెండవయభిప్రాయమును ఖండనసేయుంబూని ("యావన్నలంకాంసమభిద్ర

దంష్ట్రాయుధాశ్చైవనఖాయుధాశ్చ ప్రదీయతాం దాశరథాయమైథిలీ ॥
యావన్నగృహ్ణన్తి శిరాంసి బాణా రామేరితా రాక్షసపుఙ్గవానామ్ ।
వజ్రోపమావాయుసమానవేగాః ప్రదీయతాం దాశరథాయమైథిలీ"
ఎన్ఱు తొడఙ్గి. కురఙ్గుకళ్ కడలైయడైత్తు ప్పడైవీట్టైయడర్క్కప్పార్క్కప్పుకుకిఱార్కళ్ ; రామశరఙ్గళ్ కుఱుత్తెరువునెడుత్తెరువుమాకప్పుకున్దు తలైకళైత్తిరుకప్పుకుకిన్ఱన ; అతుక్కుమున్నే పిరాట్టియైప్పెరుమాళ్ పక్కలిలే పోకవిడాయన్ఱాప్పోలే శిలవార్త్తైకళైచ్చొల్లి ;

వంతివలీ ముఖాః పర్వతకూటమాత్రాః । దంష్ట్రాయుధాశ్చైవ నఖాయుధాశ్చప్రదీయతాం దాశరథాయమైథిలీ ॥ యావన్నగృహ్ణంతిశిరాంసిబాణా రామేరితారాక్షసపుంగవానాం । వజ్రోపమావాయుసమానవేగాః ప్రదీయతాందాశరథాయమైథిలీ" అని యిత్యాదిప్రకారముగా) శ్రీవానరవీరులు సముద్రమును బూడ్చి మనరాజధానిని ముట్టడివేయుచుండఁగా, రామబాణంబులు పట్టణంబునందుగల రాజవీధులందును నిఱుకువీధులందునుఁ జొచ్చి, నీవు మెచ్చుచుండునట్టి రాక్షసవీరుల శిరంబుల ఖండించఁబోవుచున్నవి, కాఁబట్టి యంతకు ముందుగానే పిరాట్టిని స్వామివారి సన్నిధియందు సమర్పించి బ్రతుకుమా అని యిప్పాటి హితవాక్యంబుల నుపదేశించెను.

(ఇచట శ్రీవిభీషణాళ్వానులు రావణునికన్న వయస్సులో చిన్నవారైయుండియు హితోపదేశము సేయుటవలన వయోవృద్ధులకన్న జ్ఞానవృద్ధులు, ఆచార్యపదంబున కర్హులనేయర్థము సూచింపఁబడుచున్నది. "పితౄనధ్యాపయామాస శిశురాంగిరసఃకవిః" అని యీయర్థమును స్వాయంభువమనువును సెప్పియున్నారు. ఇదియునుంగాక ప్రపన్నుండు భగవద్భాగవతాచార్య ముఖోల్లాసార్థముగాఁ దనకు శక్యమైనంతవఱకుఁ బ్రతికూలచేతనులకు సైతము హితమునుపదేశించి వారలఁ జక్కఁబరచఁబూనుటయే తనకు స్వరూపంబనే యర్థమున్ను, ఇచ్చోట సూచింపఁబడుచున్నది.)

ప్రహస్తేన్ద్రజిత్ప్రభృతికళుమ్ అతుక్కు విపరీతమాకచ్చొలవాక్తై కళైచ్చొల్ల, శ్రీవిభీషణప్పెరుమాళుమ్ కుపితరాయ్, “నతాతమన్త్రేతవనిశ్చయోస్తి బాలస్త్వమద్యాప్యవిపక్వబుద్ధిః । తస్మాత్త్వయాప్యాత్మవినాశనాయవచోర్థహీనం బహువిప్రలప్తం॥ పుత్రప్రవాదేనతురావణస్య త్వమిన్ద్రజిన్మిత్రముఖోసి శత్రుః । యస్యేదృశం రాఘవతో వినాశంనిశమ్య మోహాదనుమన్యసేత్వమ్॥ త్వమేవవధ్యశ్చ సుదుర్మతిశ్చ సచాపివధ్యోయఇహానయత్త్వామ్। బాలందృఢం సాహసికంచయోద్య ప్రావేశయన్మన్త్రకృతాం సమీపమ్”, ఎన్ఱుతొడఙ్గి, ఉనక్కువచ్చలభి

ఇట్లు శ్రీవిభీషణాళ్వానులు హితోపదేశము సేయుచుండగా, ప్రహస్తుఁడు ఇంద్రజిత్తు మొదలయినవారలు, శ్రీవిభీషణప్పెరుమాళ్లు సాయించినట్టి పరమధర్మయుక్తవాక్యములకు విరుద్ధముగా, 1“ననోభయంవిద్మ” అనియును 2“కనిష్ఠవాక్యం” అనియును 3“భీషయసేస్మభీరో” అనియును, ఇత్యాది విపరీతవాక్యంబుల నుపన్యసించుటయు, శ్రీవిభీషణప్పెరుమాళ్లు కోపించి, (“నతాతమన్త్రేతవనిశ్చయోస్తి బాలస్త్వమద్యాప్యవిపక్వబుద్ధిః। తస్మాత్త్వయాప్యాత్మవినాశనాయవచోర్థహీనం బహువిప్రలప్తం ॥ పుత్రప్రవాదేనతురావణస్య త్వమింద్రజిన్మిత్రముఖోసిశత్రుః । యస్యేదృశంరాఘవతోవినాశం నిశమ్యమోహాదనుమన్యసేత్వం ॥ త్వమేవ వధ్యశ్చసుదుర్మతిశ్చ సచాపివధ్యోయఇహానయత్త్వాం । బాలందృఢంసాహసికంచయోద్య ప్రావేశయన్మంత్రకృతాంసమీపం” అని యిత్యాదిప్రకారముగా) ఇంద్రజిత్తుంజూచి, ఓయి బిడ్డడా, నీవిప్పటికిన్ని బుద్ధియెఱుంగని బిడ్డగానే యుండుటవల్ల నీకిట్టి

1 “ననోభయంవిద్మ” మాకెందును భయములేదు.

2 “కనిష్ఠవాక్యం” నీవుపలుకునవి తక్కువమాటలు.

3 “భీషయసేస్మభీరో” ఓయి పిఱికివాడా, మమ్మందఱ బెదిరింపుచున్నావా యేమి.

యోగమిల్లై; పెఱ్ఱపిళ్ళైయాననీ తాఁ పుత్రనెన్ఱాలు శత్రువాయిరున్దా య్తకప్పననర్థత్తై యిప్పడియిశైవారుణ్డో? శత్రుక్కళైక్కొల్లిల్ ముఱ్ప డవున్నైక్కొల్లవేణుమ్; అతినిలైయాయ్*మకనాన వున్నై యుఱైత్త వనైయుమ్ పుకురవిట్ట వనైయుమ్ కొల్లవేణుమెన్ఱువార్తైశొల్లి, ,,ధనా నిరత్నాని విభూషణాని వాసాంసిదివ్యాని మణీంశ్చ చిత్రాన్ । సీతాం చరామాయ నివేద్య దేవీం వసేమ రాజన్సహవీతశోకాః” ఎన్ఱు-ఉపహార పురస్సరమాక ప్పిరాట్టియై ఉడైయవర్ వశత్తిలే విట్టు ఉజ్గళ్ ముడి యోడే సెజ్గాఅల్ కెట్టియుక్కప్పారుజ్గోళెన్ఱు సర్వార్కుమ్ హితజ్ఞాళ్ళ,

---

మంత్రాలోచనములందుఁ బ్రవేశించుటకుఁ దగినంత యోగ్యతలేదు. కాఁబట్టి నీకే ప్రాణహానిఁదెచ్చునట్టి మాటలను నీ యిచ్ఛవచ్చినట్లు వదిరినావు. ఇంతేగాక నీతండ్రికి శ్రీరాములవల్లఁగలుగునట్టి వినాశమునుఁ దెలుసుకొనునంత జ్ఞానములేక రామవిరోధరూపమయిన యీ యనర్థమునకు సమ్మతించినావు. కాఁబట్టి నీవు రావణునకు పుత్రుఁడవుగావు; లోకులెల్ల నిన్ను పుత్రుఁడని యనుకొనుచున్నారేగాని నీవతనికిప్రాణాంతకరుఁడైన శత్రుఁడుగా నున్నావు. ఇఁక శత్రువులఁ జంపఁబూనుటకు ముందు నిన్నే చంపవలసియున్నది. అదియట్లుండఁగా వివేకహీనుఁడైన నిన్నీమంత్రాలోచనసభకుఁ దోడ్కొనివచ్చినవానిని నీకంటే ముందుగాఁ జంపవలసియున్నది. అని యిట్లు కొంచెమైనను మోమోటము లేక నిర్భయంబుగా మాటలాడి యంతనిలువక, (,,ధనానిరత్నాని విభూషణాని వాసాంసిదివ్యాని మణీంశ్చచిత్రాన్ । సీతాంచరామాయ నివేద్య దేవీం వసేమరాజన్సహవీతశోకాః” అని) మనయొద్దనుండునట్టి సమస్తధనములును శ్రేష్ఠములైన భూషణములును దివ్యవస్త్రములును విచిత్రరత్నములును స్వామికుపహారములుగాఁ జేకొని చని యిన్నింటితోడన పిరాట్టిని వారిసన్నిధియందు సమర్పించి, మీ మీకిరీటంబులఁ

---

* పా. మూర్ఖనాన.

గోలుపోక నిర్విచారంబుగానుండునట్టి మార్గమును జూడుడీ; అని లంకారాజ్యమునకును రాక్షసకోటికిని హితముపదేశించి నిలచెను.

(ఇట్లు శ్రీవిభీషణాళ్వానులు నిర్దాక్షిణ్యముగా నుపదేశించుటవలన, హితోపదేశము సేయువారు తమకుఁ గీడుఁగలుగుటను సైతము పాటించక పరహితవాక్యముల నిట్లుపదేశించవలయుననియును; భగవత్సాన్నిధ్యముగలవారలు, అవి లేనివారల నిట్లునిగ్రహించి పలికినైననుఁ జక్కఁబెట్టఁ జూడవలయుననియును భావము. "తిరువరఙ్గమెన్నామిణ్డర్ పాయ్న్దుణ్ణుమ్ శోఱ్ఱై విలక్కి నాయ్క్కిడుమ్మినీ", అనియు; "కూడుమేల్ తలైయైయాఙ్గేయఱుప్పతేశరుమమ్" అనియుఁగదా? భగవత్ప్రవణులు పరోపదేశము సేయుప్రకారము. ఇచట "నిశాచరేంద్రస్యనిశమ్యవాక్యం" అనునది మొదలు ఇదివఱకు శ్రీవిభీషణాళ్వానులయందుగల (ప్రపత్త్యుపాయాంగములైన) ప్రాతికూల్యవర్జనమున్ను అనుకూల్యసంకల్పమున్ను ప్రతిపాదింపఁబడినవి. అదియెట్టులనిన; "ప్రాతికూల్యస్యవర్జనమావతు:-అతిప్రవృత్తి వ్యవసాయనివృత్తి" అనే తనిచరమశ్రీసూక్తిప్రకారముగా, నిషిద్ధానుష్ఠానమందుగల అతిప్రవృత్తి వ్యవసాయమును త్యజించుట ప్రాతికూల్యవర్జన మనఁబడుచున్నది. ఇచట శ్రీవిభీషణాళ్వానులు రావణునకు ఈ అతిప్రవృత్తి వ్యవసాయనివృత్తి రూపమైన హితమునుపదేశించినారు. ఈస్వభావము తనయందు సుదృఢముగా నెలకొనియుండుటవల్ల పరులకున్ను దీనినే యుపదేశించిరి. ఇందు తనయం దీస్వభావమును నెలకొనుపుకొనుట ప్రాతికూల్యస్యవర్జనమనియు, దీనినే ప్రతికూలజనంబులకు సైతముపదేశించుట అనుకూల్యసంకల్పమనియు నిచట గ్రహింపవలయును. "అనుకూల్యమిదంప్రోక్తం సర్వభూతానుకూలతా" అనే ప్రపన్నపారిజాత ప్రమాణమందు, అనుకూలజనులనియు ప్రతికూలజనులనియు భేదమెంచక

ఇత్తైక్కేట్టరావణన్, “సునివిష్టంహితంవాక్య ముక్తవన్తం విభీష ణమ్। అబ్రవీత్పరుషంవాక్యం రావణఃకాలచోదితః” ఎన్ఱు-ఇప్పడి హిత ఞ్ఞానాల్, “ఎన్నైత్తీమనక్కెడుత్తా యునక్కేన్ శెయ్ కేన్,, ఎన్ఱుమ్-“అఱియాతనవఱివిత్త వత్తానీ శెయ్తన” ఎన్ఱుమ్-కాలిలే విఴప్రాప్తమా యిరుక్క త్తక్కవశమిన్ఱియిలే కాలపరవశనానపడియాలే పరుషజ్గళై చ్చొల్లి, “త్వాంతు ధిక్కులపాంసనమ్” ఎన్ఱు ధిక్కరిక్క, “ఉత్పపాతగదాపాణి శ్చతుర్భిస్సహరాక్షసైః” ఎన్ఱు-సోదరభ్రాతావుమాయ్

---

సందఱికిన్ని, అనుకూలమును అనఁగా హితమునుపదేశించుటయే ఆనుకూల్యసంకల్పమని ప్రసాదించియున్నారుగదా? ఈయర్థమును ఉత్తరగ్రంథమునందు శరణాగతికంగములను ప్రతిపాదించుచోట కొంచెము భేదముగా సాయించఁబోవుచున్నారు; అయినను తనిచరమ శ్రీసూక్తినాధారముగాఁ గైకొని యిబ్బంగియు నొక్కనిర్వాహము సేయఁబడినది.)

పిమ్మట రావణుండిమ్మాటలవిని (“సునివిష్టంహితంవాక్యముక్తవంతంవిభీషణం। అబ్రవీత్పరుషంవాక్యం రావణఃకాలచోదితః” అని) తనకు మరణకాలము సమీపించియుండుటవలన, “ఎన్నైత్తీమనక్కెడుత్తా యునక్కేన్ శెయ్కేన్” “అఱియాతనవఱివిత్త వత్తానీ శెయ్తన” అనే శ్రీసూక్తులప్రకారముగా, చెడుబుద్ధినిఁబోగొట్టి, తానెఱుంగని మంచిమార్గము నెఱింగించిన యుపకారమునకై, యాతనితిరువడిలోఁ బడఁదగునుగదా? అనే జ్ఞానము లేక శ్రీవిభీషణాళ్వానులఁజూచి పరుషవాక్యంబులు సెప్పి, (“త్వాంతుధిక్కులపాంసనం” అని) పరంపరగా భగవద్ద్వేషముగల మాకులమునఁ జెఱుపఁబూనిన నీవు మాగోష్ఠినుండి క్రిందికిఁద్రోయఁదగిన దుర్మార్గుఁడవని నిందించుటయు, శ్రీవిభీషణాళ్వారుమాళ్లు (“ఉత్పపాతగదాపాణి శ్చతుర్భిస్సహరాక్షసైః” అని) సోదరభ్రాతయై హితోపదేశము జేసిన నన్నిట్లాడి, వీఁడేమిచేటుఁబొందఁ

హితోపదేశమ్బణ్ణిన వెన్నై యిప్పడికొన్నవివన్ ఎన్నడప్పుకుకిఱానెన్ఱు తళర్న్దు తడియూన్ఱియెత్తిర్న్దిరున్దు తనక్కు భవ్యరాయిరుప్పార్ నాలు పేరోడే కిళమ్బి, పిన్నైయుమ్, ,,ఆత్మానంసర్వథారక్షు పురీఙ్కేమాం సరాక్షసామ్ । స్వస్తితేఽస్తుగమిష్యామి" ఎన్ఱు నాలువార్తైశొల్లి,

,,ఆజగామముహూర్తేన యత్ర రామస్సలక్ష్మణః" ఎన్ఱు ఇన్ఱు వానిల్లా

బోవుచున్నాఁడో? అని మనంబున జనియించిన పశ్చాత్తాపంబువల్ల శిథిలకరణుండై గదాదండమునూనుకొనుచు, అనల శరభ సంపాతి ప్రఘసులను దనమంత్రులు నలుగురితోఁడ దిగ్గునలేచి నిరవధిక తేజోవిరాజమానుండై యంతరిక్షంబుననిలచి రావణుంజూచి తత్కాలమునం దప్రియంబునుఁ బిమ్మటికిఁ బథ్యంబునుఁగా మఱియు నాలుగుమాటలు సెప్పి, (,,ఆత్మానం సర్వథారక్షు పురీంచేమాంసరాక్షసాం । స్వస్తితేస్తుగమిష్యామి" అని) నీప్రాణంబులనున్ను నిన్ను నమ్మినరాక్షసుల ప్రాణంబులనున్ను మీకందఱికినాధారంబైన యీలంకానగరమునున్ను, అన్నివిధంబులం గాపాడుకొనుము, నీకు మేలుగలుగుఁగాక, నేఁబోయి వచ్చెదననియుఁ బలికి యచ్చోటువాసి వెడలెను.

(ఇచ్చట, హితవాక్యములువినక మిక్కిలి ప్రతికూలించినట్టి వార లెట్టియవర్జనీయ బంధువులైనను, అగ్నిసంస్పృష్టంబైన గృహంబునుంబోలె వారలఁ ద్యజింపవలయుననియు ; భగవద్భాగవతద్రోహులున్న చోటు వదలుట ప్రపన్నునకావశ్యకమనియు ; భావమేర్పడుచున్నది. (ఇది యొకవిధమైన ప్రాతికూల్యవర్జనము.)

పిమ్మట, (,,పరంహుతవహాజ్వాలా" అనురీతిని) నలుదిక్కుల నగ్నిగ్రముఁగొనిన స్థలమును విడిచి సాంద్రశీతల తరుచ్ఛాయల నాశ్రయించు విధంబుగా(,,ఆజగామముహూర్తేన యత్రరామస్సలక్ష్మణః" అని) భాగవతములయుమారుత నిత్యసాన్నిధ్యంబుగల *వాసుదేవతరు

నెఞ్జు పిరివతఱ్కుమున్నే తమ్బిశొల్లు జీవియాతరావణగోష్ఠియిల్ నిన్ఱుమ్
తమ్బిశొల్లుజీవిక్కు అ రామగోష్ఠియైనోక్కివన్దు, రాఘవాయమహాత్మనే

---

చ్ఛాయ నాశ్రయించెను. ఇట్లు భ్రాతృవాక్యము బ్రదుకని రావణ గోష్ఠిని రోసినమనస్సు, నిలచినచోట నిలువని తనస్వభావము ననుసరించి యాస్థితినివదలుటకు ముందుగానే, 1"మహాసారంప్రతిజగ్రాహతద్వచః" అనే ప్రకారముగా భ్రాతృవచనము జీవించునట్టి రామగోష్ఠికి, అదియె పరమోద్దేశ్యముగావచ్చి; అచ్చటనుండు వానరవీరుల నైకమత్యమునున్న రామభక్తినిన్నిచూచి, మనమిచ్చోటఁ గ్రమముఁ దప్పి వీరలఁ దొలఁగఁద్రోచుకొని పోవఁదగదు; అట్లుపోయినచో వీరలు మనయందు సందేహపడుటయేగాక కీడుసేయుటకునై తము యత్నింతురు; కాఁబట్టి ద్వారశేషులయిన వీరలఁగొని పెరుమాళ్లసన్నిధిలో విన్నపముసేయించి, "ఆనయ" అని స్వామివారునియమించిన పిమ్మట నీగోష్ఠిలోఁ బ్రవేశించవలయునని నిశ్చయించి, "ఖస్థఏవవ్యతిష్ఠత" అని నిరాలంబమైన యాకాశమునందేనిలచి, ఓవానరవీరులారా! నేను దుర్మార్గుఁడైన రావణునితమ్ముఁడ, విభీషణుండనువాఁడ, శ్రీసీతాదేవి విషయమం దపరాధముసేసిన యాదుశాత్మునకు బహువిధంబుల హితవాక్యములుసెప్పినను నాతం డవివినక, హితముపదేశించిన నాయందు గోపించి యవమానపరచుటంబట్టి నేను దారాపుత్రాదుల సైతము

---

1 "మహాసారం ప్రతిజగ్రాహతద్వచః" మిక్కిలి సారముగల యాయిళైయ పెరుమాళ్ల వాక్యమును పెరుమాళ్లు అంగీకరించినారని యర్థము. ఇది, ఆరణ్యకాండమునందు సీతావియోగ, దుఃఖసంతప్తులైన పెరుమాళ్లు జటాయువుచేత భగ్నమై పడియుండు రావణరథమునుఁజూచి కోపోద్దీపితమానసులై జగత్సంహారము సేయఁబూనఁగా, ఇళైయపెరుమాళ్లు వారినూరార్చుచు సీతాపహారముసేసినవాఁ డొక్కఁడైయుండ వానికై యిట్లు జగత్సంహారము సేయఁబూనితిరేని ప్రజలెందుబోదురు, కాఁబట్టి రక్షకులైన దేవరవారు సకలప్రజానాశహేతువైన యీయుద్యమంబును మానుండని విన్నవించినవాక్యము.

“నివేదయతమాంక్షిప్రం” ఎన్ఱు-నెఱికెడ మదుత్తుక్కొణ్డువుకలాకాతు, అతిశజ్ఞైయుమ్ పణ్ణువర్కళ్, ద్వారశేషికళైక్కొణ్డు పెరుమాళుక్కు విణ్ణప్పఞ్జెయ్‌తు, “ఆసయ,, ఎన్నప్పుక వేణుమెన్ఱు నిఱ్ఱనిలై యిలేనిన్ఱు విణ్ణప్పఞ్జెయ్యై,

---

వదలి శ్రీస్వామివారిని శరణాగతిఁ బొందెనాడ; (“సర్వలోకశరణ్యాయ రాఘవాయమహాత్మనే। నివేదయతమాంక్షిప్రం” అని) సర్వలోకశరణ్యులైన శ్రీరాములసన్నిధియందు నారాకను విన్నవింపుడు. అని యందఱికిని వినునట్టి స్వరముతో విజ్ఞాపనము సేసెను.

(ఇందువల్ల నన్నివిషయంబులందునుఁ బరిజ్ఞానంబుగలవారలైనను, పెరుమాళ్లు, లక్ష్మణపెరుమాళ్ల వాక్యము నంగీకరించువిధంబుగా ఆప్తబంధువులు సెప్పునట్టి హితవాక్యముల నంగీకరించవలయుననియు; రాజభక్తిగల భృత్యులందఱు నైకమత్యంబుగా రాజునందు ప్రీతిగలిగియుండుట గర్తవ్యంబనియు; ప్రపన్నాధికారి భగవదాశ్రయణంబు సేయుచో నచ్చోటఁ బురుషకారభూతులు నిత్యసన్నిధి సేసియుండుటవల్ల నితనికి భయపడంబనిలేదనియు; ఆశ్రయించునవుడు ద్వారశేషుల ముందిడికొని ప్రవేశించుట స్వరూపమేగాని విచ్చలవిడిగా భగవత్సన్నిధియందుఁ బ్రవేశించుట స్వరూపముగాదనియు; సూచింపఁబడుచున్నది. ఉత్తరగ్రంథమునందు శరణాగతికంగములను తామే ప్రతిపాదించఁ బోవుచున్నారుగదా? అయినను ఇచ్చటనుండు వాక్యములనుబట్టికూడా ఆయంగములు ప్రతిపాదింపఁదగి యుండుటవల్ల నింతకుముందే ఆనుకూల్యసంకల్ప ప్రాతికూల్యవర్జనములు ప్రతిపాదింపఁబడినవి. ఇఁక, “రక్షిష్యతీతివిశ్వాసః గోప్తృత్వవరణం ఆత్మనిక్షేపకార్పణ్యే” అని సెప్పఁబడినట్టి మిగిలిన నాలుగంగములున్ను ఇచ్చోటఁ బ్రతిపాదింపఁబడుచున్నవి. అదియెట్టులనిన; “ఆజగామముహూర్తేన యత్రరామస్సలక్ష్మణః” అను వాక్యమునందు “ముహూర్తేన” అని, శ్రీ

విభీషణాళ్వానులు పెరుమాళ్లసన్నిధికి అతిశీఘ్రముగా వచ్చినట్లు చెప్పఁబడినది. „యత్ర రామః" అని, రమయత్యఖిలంజగదితిరామః, అనే వ్యుత్పత్తి ననుసరించి సర్వలోకమునున్ను సంతోషింపఁజేయునట్టి పెరుమాళ్ల గుణవిశేషము చెప్పఁబడినది. ఇట్టి గుణమువల్లనేగదా? („రిపూణామపివత్సలః" అని) శత్రువులయందును వత్సలుఁడని పెరియతిరువడి పారవశ్యమునుఁ బొందినారు. „సలక్ష్మణః" అని పురుషకారసాన్నిధ్యము చెప్పఁబడినది. „గుణైశ్చైవతథావిధః" అని పెరుమాళ్లతో సమానగుణములు గలవారని యీ పురుషకారభూతుల వైభవమును పిరాట్టి తామే ప్రసాదించియున్నారు. అంతు, ఈ మూడుపదములవల్ల „రక్షిష్యతీతివిశ్వాసః" అనే ప్రపత్త్యంగము ప్రతిపాదింపఁబడినది. „రక్షిష్యతీతివిశ్వాసః" అనఁగా రక్షించగలఁడనే నమ్మకమని యర్థము. ఈ నమ్మకము కలుగుటకు „రామ" అనే పదమునందుగల గుణములున్ను, లక్ష్మణసాన్నిధ్యమున్ను, కారణములై యున్నవి. „మహాత్మనే" అనేపదము ఇట్టి నమ్మకము శ్రీవిభీషణాళ్వానులయందు గలిగియుండుటనుఁ దెలియఁజేయుచున్నది.

ఇఁక, „గోప్తృత్వవరణ" మనునది, నాకు రక్షకుండవగుమని ప్రార్థనాపూర్వకముగా నాశ్రయించుట; కాఁబట్టి యిది, „సర్వలోకశరణ్యాయ" అనే వాక్యమందుండునట్టి „రాఘవంశరణంగతః" అను వాక్యమువల్లఁ బ్రతిపాదింపఁబడినది. „గోప్తృత్వ"మనఁగా, అనిష్టనివృత్తిపూర్వకముగా ఇష్టార్థములనిచ్చి రక్షించుట; దీనికి సర్వశరణ్యత్వమున్ను జ్ఞానశక్తులున్ను సాధకములు. ఇవి „సర్వలోకశరణ్యాయ, మహాత్మనే" అనే పదములవల్ల నేర్పడుచున్నవి.

ఇఁక, ఆత్మనిక్షేపమనగా తన సకలభరమునున్ను భగవదధీనముసేయుట, ఇది „నివేదయతమాం" అనే పదములవల్ల సూచింపఁ

ఇత్తైక్కేట్ట మహారాజన్, "ఏతత్తువచనంశ్రుత్వా సుగ్రీవో లఘువిక్రమః" ఎన్ఱు-ఇవన్ వార్త్తైయైక్కేట్టు పెరుమాళ్ ముత్పాడ రాయ్ వరువతఱ్కు-మున్నే తామ్కడునడై యిట్టుచ్చెన్ఱు, రాజకార్యజ్గళ్ విచారిక్క-వేణ్డావో; ఒరుశరణాగతి పోవ్కవిడవేణ్డావో, నమ్ముళుమివర్కళ్ ముఱ్పట్టార్కళ్; "ప్రణిధీరాత్మ సేన్ద్రస్య రావణస్యాభ వేదయమ్,, ఇజ్గే ఆకాశత్తిలే నిఱ్క-ఱవివన్ రావణప్రణిధికళిల్ ఒరుత్తనాకవేణుమ్; అథవా, ఇవన్ రావణన్-తమ్బియేయాకిలుమ్ తన్ప్రిశిహితనాయ్ కపట

---

బచుచున్నవి. ఇచట "నివేదయమాం" అనుటకు నన్ను స్వామిసన్నిధిలో సమర్పింపుఁడు, అనియర్థముసేయుట స్వరసము.

ఇఁక, కార్పణ్యమనఁగా దీనత్వము. ఇది శ్రీవిభీషణాళ్వానుల యొక్క యిప్పటిస్థితియందు స్పష్టముగా నేర్పడుచున్నది. బలవంతుఁడైన రావణునితో విరోధించి యిచ్చటికి రాగా, ఇచ్చట శ్రీవానరవీరులెల్ల మహావృక్షములనున్ను పర్వతములనున్ను చేతఁబట్టుకొని సన్నద్ధులై తన్నుఁ జంపఁజూచుచుండ నిరాలంబనమైన యాకాశమందు నిలచియుండుటకన్న దీనదశ వేరులేదుగదా?)

అంత నావాక్యంబులు వినిన సుగ్రీవమహారాజు, ("ఏతత్తువచనంశ్రుత్వా సుగ్రీవోలఘువిక్రమః" అని) "శరణంగతః" అనే వీని మాటలవిని పెరుమాళ్లు ముందుమించుదురేమో? యని యతిశీఘ్రగమనంబునఁజని వారియెదుట నిలచి యిట్లై యపెరుమాళ్లనున్ను తనతోఁజేర్చుకొని యిట్లను, స్వామీ, రాజకార్యముల నాలోచించ పని లేదా? మనవారిలో నొకరినిఁబనుపి యితని నిజస్థితినిఁ గనిపెట్ట పని లేదా? శత్రువులు మనకంటే ముందుపని సేయుచున్నారు, కాఁబట్టి ("ప్రణిధీ .భవేదయం") ఇచట నాకాశములో నిలచియుండువాడు రావణగూఢచారులలో నొక్కఁడు కాఁబోలు; అట్లుగాక వీఁడు రావ

బుద్ధియోడే నమ్మైనలియవన్దానిత్తనై ; ఇవనైక్కొట్ట్రిలుజ్కాలిలుమ్ కోక్క వడుక్కుమెన్నతు ; అతు పెరుమాళ్ శెవిక్కు మ్బురుత్తవాత్తే వన్దవర్కళైయు మివనైయుజ్కొల్ల ప్రాప్తమెన్ద్రుశొల్ల,

ఇత్తైక్కేట్టరుళిన పెరుమాళ్ తిరువుళ్ళమ్తళుమ్బుముతలికళై ప్పార్త్తు, "యదుక్తం కపిరాజేన రావణావరజంప్రతి । వాక్యం హేతుమదర్థ్యంచ భవద్భిరపితచ్ఛ్రుతమ్," ఎన్ఱ్తోఱనార్ రాజాక్కళాయ్ శె

ణుని దమ్ముండేయయినను కపటబుద్ధితో సమయముచూచి మనకు కీడుసేయ వచ్చియుండుట నిశ్చయము. ఇంక నిట్టివానిని కాలికిమెడకు నంటగట్టి త్రోయుటయుక్తము, అనిసెప్పి ; యంతమాటను పెరుమాళ్లువిని యోర్చియుండుటయు, వీనినిన్ని వీనివెంట వచ్చినవారినిన్ని తీవ్రదండముగా జంపుట యుక్తమనిసెప్ప ; దీనిని విన్నమాత్రమున స్వామివారి తిరువుళ్లము తత్తఱపడి అంగదాది మంత్రులనెల్లఁ గలయం గనుంగొని ("యదుక్తం...తచ్ఛ్రుతం" అని) మా ప్రియమిత్రులు ప్రభుస్థానమందునిలచి స్వతంత్రించిపలికిన వాక్యములను, (౧ శరణాగత

౧ (శరణాగతరక్షణముసేసిన జాతిలోఁబుట్టిన) అనుసప్పుడు ; ఒకానొకవానరుఁడు (వ్యాఘ్రము తఱుముకొని వచ్చుటవల్ల భయపడి) తాను వసించుచున్న వృక్షము నెక్కిన యొకబోయవాని కభయమిచ్చి రక్షింపఁగా, నామ్రానిక్రిందనే నిలచి సమయము నెదురుచూచుచుండు వ్యాఘ్రము, ఆవానరంబు నిద్రఁబోవుతఱి నెఱింగి యక్కిరాతుంజూచి, ఓరీ, కోతిని పడద్రోసితివేని నిన్ను రక్షించెదనని పలుకుటయు, పాపస్వభావుండైన యక్కిరాతుండు దన్నురక్షించినవానరుని వృక్షమునుండి పడఁద్రోసెను, అప్పుడా వ్యాఘ్రము వానరునిఁబట్టుకొన్ని, ఓరీ, నీవుజేసిన యుపకారము నిప్పుడేమఱచి నీకు ద్రోహముసేసిన బోయవాని నివృక్షమునుండి పడఁద్రోసితివేని నిన్ను విడచిపెట్టెదనని (తనకు మనుష్యమాంసంబునందుగల యాశవల్ల) పలికెను. అంతటఁ బరమధర్మజ్ఞుఁడైన యావానరుఁడు ప్రాణహానిదశ గలిగియుండుటవల్ల నావ్యాఘ్రవచనమునకు సమ్మతించి నట్లుభినయించి, దానిచేవిడువఁబడి మ్రానిపైకెక్కి, తనకపకారముసేసిన బోయవానికి వేరుగతి లేకుండుటంబట్టి, తననివాసవృక్షంబు నాశ్రయించినాడనే మాత్రముఁగొని యాతని మరల రక్షించినాడనేకథ ననుసంధించవలయు.

రుక్కుచ్చొన్నవార్త్తైయై శరణాగతరక్షణమ్ పణ్ణినజాతియిలేపిఱన్ద నీఙ్గళుమ్ కేట్టిరోళే; ఉఙ్గళ్ నినైవుకళై చ్చొల్లుఙ్గోళెన్న; "స్వంస్వమ్మతమత ద్రితాః । సోపచారస్తదారామ మూచుర్హితచికీర్షవః,, ఎన్ఱు-పెరుమాళుక్కాకమాట్టార్కళ్, మహారాజర్క్కాకమాట్టార్కళ్, ఉభయావిరుద్ధమాక పరీక్షిత్తు ఒఱ్ఱుకవిచారిత్తు క్కైక్కొళ్ళ ప్రాప్తమెన్ఱుశొల్లిత్తలైక్కట్టి,

ఇత్తైక్కేట్ట తిరువడియుమెళున్దిరున్దు, "నవాదాన్నాపిసఙ్ఘర్షాన్నాధిక్యాన్నచకామతః। వక్ష్యామివచనం రాజన్ యథార్థం రామగౌర

---

రక్షణముసేసిన జాతిలోఁబుట్టిన) మీరును వింటిరిగదా? ఇఁక నిందు మీ యభిప్రాయంబులఁ జెప్పుఁడు; అనుటయు, ("స్వంస్వంమత... చికీర్షవః" అని) తాము మహారాజు పక్షముగాగాని పెరుమాళ్లపక్షముగాగాని పలుకఁజాలరు కాఁబట్టి యిద్దఱి యభిప్రాయములకును విరుద్ధముగాకుండునట్లు బలుకఁదగునని నిశ్చయించి యొక్కొక్కరును దమతమ యభిప్రాయంబుల విన్నవించు విధంబుగా, స్వామీ, ఈవచ్చియుండువానినిఁ జక్కఁగాఁ బరీక్షించి వీని వృత్తాంతంబు నాద్యంతంబుగా విచారించి వీమ్మట నంగీకరించుట యుక్తమని నిర్ణయము సేసిరి.

ఇట్లుపలికిన వీరివాక్యంబుల విని రాజనీతిశాస్త్రమునందు సంస్కారసంపన్నులైన తిరువడి లేచి ("నవాదాన్నాపి...రామగౌరవాత్" అని) స్వామీ, నేను విన్నవించునది, కొందఱితో వివాదమునకునుఁ గాదు, అందఱిని మించి నేను నియామకుఁడుగా నుండవలయునని గోరియునుఁగాదు, ఇచ్చవచ్చినట్లు కొన్నిమాటలు సెప్పుదమని తలంచియునుఁగాదు,("౧భృత్యకార్యంహనుమతా సుగ్రీవస్యకృతంమహత్"

---

౧ [భృత్యకార్యమితి] కుశలుఁడైన భృత్యుండుగల్గుటచే సుగ్రీవమహారాజునొక్క మహాత్కార్యము నెఱవేఱెనని తాత్పర్యము. ఇది మొదలు మూడు ప్రమాణశ్లోకములు, పిరాట్టినికనిపెట్టి అశోకవనికాభంగాదులచేత రావణుని గర్వమడంచివచ్చిన తిరువడినిఁజూచి పెరుమాళ్లు పరమసంతుష్టులై సాయించినవాక్యములు.

వాత్" ఎన్ఱు - ఇప్పత్తజ్గళై యుమ్రక్క ప్పుకుకిఱవనాకైయాలే, శిలరోడే పిఱక్కడ్గాయల్ల, ఎల్లార్ క్కుమ్మేలాయ్ నియామకనాయల్ల, ప్రతిపన్నవాదియాయల్ల, "అప్యహంజీవితంజహ్యామ్" ఎన్గిఱ పెరుమాళై

---

అని యుపక్రమించి, ౧"తమాహుఃపురుషోత్తమం" అని) నన్ను మీరు, ఉత్తమభృత్యునిగా నెంచి (౨"ఏషసర్వస్వభూతస్తు పరిష్వంగోహనూమతః। మయాకాలమిమంప్రాప్య దత్తస్తస్యమహాత్మనః" అనే) సర్వస్వదానముచే సన్మానించుటవల్ల విన్నవించెదనని సెప్పి, యందఱుఁ గలయుంగనుంగొని మనమందఱము నెట్లుపలికినను స్వామివారి ప్రకృతిని జూడవలసియున్నదిగదా? వారు శరణాగతవత్సలుఁడని లోకమంతటఁ బ్రసిద్ధులు, ఇట్టివారు స్వాశ్రితుల కించుక కీడుగలిగినచో, (౩"త్వయికించిత్సమాపన్నే" అని) నిత్యానపాయినిని సైతముపేక్షించి ("అప్యహంజీవితంజహ్యామ్" అని) తన ప్రాణహానిపర్యంతముఁ దెగు

---

౧. [తమాహురితి] ("యోహిభృత్య" ఇత్యాది యీవాక్యమునకు ముందు గ్రంథము,) తనప్రభువుచేత దుష్కరకార్యంబునందు నియోగింపఁబడిన భృత్యుఁడు, ఆ కార్యమును నెఱవేర్చుటయేగాక యతని యాజ్ఞ లేకుండినను దద్భక్త్యతిశయమువల్ల నక్కార్యమున కనుకూలముగా మఱియొక కార్యము సేసెనేని యాతం డుత్తమభృత్యుండని తాత్పర్యము.

౨. [ఏషసర్వస్వభూతఇతి] నన్నును లక్ష్మణునిన్ని మావంశమునున్ను రక్షించిన యీమహాత్మునకు ప్రత్యుపకారము సేయఁదగిన యీకాలమునందు నాచేఁజేయఁబడునట్టి యీగాఢాలింగనమే సర్వస్వదానము (అనఁగాఁ దనకుఁగల సకలవస్తువుల నిచ్చుట) యగుగాకయని, ప్రీతిహృష్టాంగులై పెరుమాళ్లు తిరువడిని గాఢాలింగనము సేసికొనిరని తాత్పర్యము,

3 [త్వయికించిదితి] సేతుబంధనముఁగావించి శ్రీవానరవీరులతోడను లంకాద్వీపముఁజేరి యందఱును రాత్రి సువేలపర్వతమున వసియించి మఱునాఁడుదయమున నా సువేలశిఖరమునుండి లంకానగరమునుఁ జూచునప్పుడు, అచ్చటి గోపురశిఖరప్రదేశమునందు విజయచ్ఛత్రమును వింజామరంబులును మొదలగు వైభవంబులతో నొడ్డోలగంబుగానుండు రావణుంజూచి, సుగ్రీవమహారాజు సహింపక తత్క్షణంబునఁ గుప్పించి వా

యిబ్రుక్కవరుమెన్ను పెరుమాళ్ పక్కలాదరత్తాలే శొల్లుకిఱేనెన్ను అవై యడైక్కచ్చొల్లి, పుకురవిట్టాల్ పరీక్షిప్పతు, పరీక్షిత్తాల్ పుకురవిడువ

వసేయఁజూతురు; కాఁబట్టి మనము వీరిం గోలుపోవలసివచ్చునో? యని, స్వామివారియందుగల యాదరాతిశయమువల్లఁ గొంతపలుకు చున్నానని వారికెల్లఁ దెటపడంబల్కి యిట్లనియె.

ఇచట, తిరువడి, ,, సఏష దేశఃకాలః " అని, శ్రీవిభీషణపెరుమాళ్లు వచ్చుట కిదియెకాలమనియు, ,,యుజ్యతేతత్రసంగ్రహః'' అని, వారిని పెరుమాళ్లంగీకరించుటకు సందేహమే పనిలేదనియు, ప్రతిపాదించఁబోవుచున్నారు కాఁబట్టి, దీనికిఁ బ్రతికూలముగాఁ బల్కినవారి మతములను ఖండింపఁబూని, యందు సుగ్రీవమతము రాజమతముగా నున్న కేవలము తొందరపడి యోచించక సెప్పినదిగానున్న, ఉండుటవల్ల దానికుత్తరము సెప్పనేలయని యుపేక్షించి, అంగదాదిమతముల నొక్కొక్కటిగా దూషించుచున్నారు.

స్వామీ, విభీషణపరీక్షార్థముగా మీమంత్రులు ప్రతిపాదించిన వాక్యములలో; ఏదైన నొకకార్యమందు నియోగించి గుణదోషముల నెఱింగినపిమ్మట నీతనిఁ ద్యజియించుటగాని యంగీకరించుటగాని సేయఁదగునని యొకపక్షము సెప్పిరిగదా? ఇట్లు పరీక్షించుట శక్యము గాదు కాఁబట్టి యామతము సరియైనదిగాదు. అదియెట్లులనిన, ఏదైన నొకగొప్పకార్యమునందు నియోగించినంగాని గుణదోషములు పరీ

దున్నచోటికి లంఘించి రత్నమయంబైన యాతనికిరీటంబు నేలంగూల్చి ముహూర్త మాత్ర ద్వంద్వయుద్ధంబున గర్వమడంచి కట్టెదురనున్నట్టుగానే యామాయావినివంచించి మరల స్వామిసన్నిధియందువచ్చి నిలచినప్పుడు పెరుమాళ్లతని సాహసంబునకునొచ్చి యీవాక్యము సాయించిరి. ఓప్రియమిత్రుఁడా, నీకేదైన నించుక యాపదగలిగినచో, సీతచేఁగాని లక్ష్మణ భరతశత్రుఘ్నాదులచేఁగాని తుదకు నాశరీరముచేఁగాని నాకేమిపని యున్నదని యీవాక్యమునకుఁ దాత్పర్యము.

తెన్ఱు అన్యోన్యాశ్రయణమ్వరుమ్ ; "తత్రమిత్రంప్రదుష్యేత మిథ్యా పృష్టంసుఖాగతమ్" ఎన్ఱు - సామభేదఙ్గళై క్కూఱై త్తెళిక్క ప్రాప్త మాయిరుక్కత్తన్నై యేవిశ్వసిత్తువన్దవనై యఱిశక్తైక్కణ్ణినాల్ కుఱై

---

క్షింప శక్యములుగావు ; పరీక్షించుటకుముందుగా నట్టికార్యములందు నియోగించుట కీడని నాకుఁ దోఁచుచున్నది. ఇందువల్ల, పరీక్షించితే గాని మనకార్యములందుఁ బ్రవేశించఁగూడదు. మనకార్యములందుఁ బ్రవేశించినంగాని పరీక్షగానేరదు, అని యన్యోన్యాశ్రయదోషము వచ్చుచున్నది. ఇదియే యీమతము సరిగాదనుటకుఁ గారణము. అని మొదట నంగదమతంబును దూషించి, పిదప శరభమతమునున్ను జాంబవంతుని మతమునున్ను ఖండించి, యనంతరము మైందమతమును దూషింపఁబూని, స్వామీ, గుఱుతెఱుంగని మనుష్యులఁగోని, యాతని వృత్తాంతమడిగింతమను పక్షమందు నాబుద్ధిలోఁ జక్కఁగాఁగనిపెట్టఁ బడిన యొకయుక్తిగలదు వినుడు, ఎంతబుద్ధిమంతుండైనను పరిచయములేని జనులు ప్రశ్న సేయునప్పుడు, వీరు నమ్మికసేకదా ? అడుగుచున్నారు, ఇట్టివారితోనే మాటసెప్పిన నెట్టియనర్థము సంభవించునో ? అని బదులుసెప్పుటకుఁ బలుఁదెఱంగుల సందేహించును. అట్టియెడ ("తత్రమిత్రం...సుఖాగతం" అని) తనయందు దోషములేమింజేసి మిక్కిలి నమ్మికముతో మనకడకువచ్చిన మిత్రుఁడు, ఇట్టి వ్యర్థప్రశ్నలచేఁ జెడిపోవును. శత్రువులయొద్ద నున్నవారిని సామభేదోపాయంబులచేత మనమే చీళఁదీసి రప్పించుకొనవలసియుండఁగాఁ దనంతట తానే వారియొద్ద భేదమునుఁబొంది వెడలి మనలను నమ్మివచ్చినవానియందిట్టి యతిశంకలు సేయుటవల్ల మిత్రలాభము చెడిపోవును కాఁబట్టి యీమతము రాజనీతిశాస్త్రమునకు విరుద్ధముగానున్నది. అనియిట్లు వరుసగా వారిమతములనెల్ల ఖండించి, పిమ్మట దనమతంబు సెప్ప

స్థుపోమ్; అప్పోతు రాజనీతియల్ల, శాస్త్రవిరుద్ధమెన్ఱు పరపక్షదూషణ
జ్ఞోళ్లి, "నత్వస్య బ్రువతో జాతులక్ష్యతేదుష్టభావతా । ప్రసన్నంవద
నఞ్చాపి" ఎన్ఱుమ్-"అశఙ్కితమతిస్స్వస్థోనశఠః పరిసర్పతి" ఎన్ఱుమిప్ప
డైకళిలే స్వపక్షస్థాపనత్తైయుమ్బణ్ణి, తిరుమున్బే నామొరుశీలవతిన్ఱో
మాక వేణ్డాతెన్ఱు, "యథాశక్తిమయోక్తన్తు రాక్షసస్యార్జవంప్రతి ।
త్వంప్రమాణంహిసర్వస్యశుశ్రూత్వాబుద్ధిమతాంవర" ఎన్ఱు అడియేనుక్కు
త్తోన్ఱిన వళవువిణ్ణప్పఞ్జెయ్ తేనత్తనై; "నల్లారఱివీర్ తీయారఱివీర్

---

చున్నారు. అదియెట్లనిన; ("నత్వస్య...వదనంచాపి" అనియు, అశం
కిత...పరిసర్పతి" అనియు,) ౧"రావణోనామదుర్వృత్తః" అనునది
మొదలీతండు వలికిన వాక్యములన్నింటిలో నొకమాటయయినను చెడ్డ
తలంపును చూపించునదిగాఁ దోఁచ లేదు. ముఖమందునుఁ గపట
సూచనలేక ప్రసన్నముగానున్నది. గూఢంబుగాఁ గీడుసేయఁదలంచి
వచ్చినవాడు మనసునెమ్మదితో శంకలేక మనదగ్గఱకు రాడుగదా?
ఇట్టికారణంబులవల్ల నాకీతనియెడ సందేహము లేదు. అని యీప్రకా
రంబుగా స్వపక్షస్థాపనంబు సేసి యిఁక స్వామిసన్నిధిలో నేఁగొంతఁ దెల
సినవాఁడనని యుండుటఁదగదని తలపోసి, (౨"యథాశక్తి...మతాం
వర" అని) స్వామీ, మీపాద సేవకుఁడైన దాసునికిఁ దోఁచినంత విన్న
వించినాడగాని, "నల్లారఱివీర్" ఇత్యాది ప్రకారముగాఁ గాలత్త్వ

---

౧ [రావణోనామదుర్వృత్తఇతి] శ్రీవిభీషణప్పెరుమాళ్లు రావణునివదలి స్వామి సన్నిధికివచ్చి యంతరిక్షంబుననిలచి శ్రీవానరవీరులఁజూచి పలికిన వాక్యమిది. పేరు చెప్పినమాత్రమందే లోకకంటకుఁడనఁదగిన దుర్మార్గుఁడగు రావణునికి నేను తమ్ముఁడ. నా పేరు విభీషణుఁడు, నేఁ తనిచే నవమానితుండనై సర్వలోకశరణ్యులైన పెరుమాళ్లను శరణుచొచ్చినాఁడ, ఇత్యాదులీవాక్యమునకుఁ దాత్పర్యము.

౨ [యథాశక్తీతి] వచ్చియుండువాఁడు రాక్షసుఁడైనను నాతనియందుగల నిష్కాపట్యమునుగుఱించి నాబుద్ధికొలదిని విన్నవించినాఁడ; ఇఁక నన్నికార్యంబులకును దేవరవారే కర్తలని, తిరువడి పెరుమాళ్లసన్నిధిలో విన్నవించిరని తాత్పర్యము.

ఇవ్వులక త్తెల్లామటిపిర్" ఎన్ఱు-దేవరీర్ తిరువుళ్ళత్తి లకలత్తుక్కు-ఇత్తెజ్జే, ఇని త్తిరువుళ్ళమానపడి శెయ్తరుళీరెన్ఱు తల్తైక్కట్ట;

ముందువఱకుఁ బొగడంబడునట్టి దేవరవారి మనోవిస్తారమున కిది యెంతమాత్రము; ఇఁకఁ దిరువుళ్లముననుసరించి కటాక్షింపుఁడు. అని తన వాక్యములఁ బూర్తిసేసెను.

(ఇచట శ్రీసుగ్రీవమహారాజు వాక్యంబులవల్ల నిరవధికస్నేహము గలవారి స్వభావమిట్టిదనియు; నది శేషికతిశయావహ మగుటవలన స్వరూపానురూపంబును శేషిహృదయరంజకంబునునై యుండుననియు. సెప్పఁబడినది. ౧"ప్రియోహిజ్ఞానినోత్యర్థం" అనునది యిట్టి నిరవధిక స్నేహమునకుఁ బ్రమాణము.)

పిమ్మట, పెరుమాళ్ల వాక్యమువల్ల, ప్రభువుగానుండువాఁడు, తానెంత కార్యనిర్వాహకుఁడైనను మంత్రుల యభిప్రాయంబు ననుకూలపరచుకొనియే రాజకార్యంబులందుఁ బ్రవర్తించవలయునను నీతియును; ౨"సచమమప్రియః" ౩"ప్రియతమఏవహివరణీయోభవతి" ఇత్యాది ప్రమాణానుసారముగా నిరవధిక స్నేహయుక్తులు శేషికి ప్రియులును నభిమానపాత్రులును నగుచున్నారను నర్థవిశేషంబును సూచింపఁబడినది.

పిమ్మట నంగదాది మంత్రుల వాక్యంబులవల్ల నూతనాశ్రితుని యందు, భాగవతుల యభిప్రాయమిట్టిదని సెప్పఁబడినది.

---

౧ [ప్రియోహీతి] జ్ఞానికి నేను ప్రియుండైయుండుట యింతమాత్రంబని సెప్పవలనికాదని తాత్పర్యము.

౨ [సచమమప్రియఇతి] అట్టిజ్ఞాని నాకున్ను ప్రియుఁడని తాత్పర్యము.

౩ [ప్రియతమఏవేతి] ఈశ్వరునికి నిరతిశయప్రియుఁడైనవాఁడే వరణీయుఁడగుచున్నాఁడు. (అనఁగా నట్టివానికి స్వప్రాప్తినిఁ దానే గలుగఁజేయుచున్నాఁడని భావము.)

త్యాగహేతువులఁ బ్రతిపాదించుచున్న మహారాజుంజూచి తద్వచన ప్రశంసాపూర్వకంబుగా రాజనీతి విశేషంబులుపన్యసించి యప్పటికిని నాతఁడు శంకవదలక యుక్తియపెరుమాళ్లనుఁ జేర్చుకొని శరణాగతి పూర్వకముగా నిర్బంధింపఁ దనయప్రతిహత దివ్యశక్తి నెఱింగించియు, ౧, కపోతోపాఖ్యాన, ౨, కండుగాథాదుల నుపన్యసించియు, వారల

౧ [కపోతోపాఖ్యానము] "శ్రూయతేహికపోతేన శత్రుశ్శరణమాగతః" ఇత్యాదిగా, శ్రీసుగ్రీవమహారాజు మొదలయినవారలకు పెరుమాళ్లు సాయించినది. శరణాగతి ధర్మము నెఱింగిన యొకకపోతము, (మహాదరణ్యంబున గాలివానచేఁ బీడితుండై తన యున్నవృక్షముంజేరి యావృక్షమందెవ్వరేని దేవతలుగలరేని వారిని నేశరణంబుసొచ్చి నాడనని యింతమాత్రము సెప్పిన) తనకు సహజశత్రువైన బోయవానిని (అంతకుముందే వాఁడు తనభార్యనుఁబట్టి వలలోవేసుకొనియుండుట యెఱింగియు) అనేక విధోపచారం బులఁబూజించి, యాకలికై తన్నర్థించినట్టి యాబోయకుఁ దనమాంసంబు నాహారంబు గానిచ్చి, యతండునుఁ దానునుఁ దనభార్యయు నుత్తమగతిఁబొందిరని; శ్రీమహాభారతము శాంతిపర్వము, ౧౪౩, వ అధ్యాయము మొదలుకొని సెప్పఁబడిన యీయుపాఖ్యాన మిచ్చ్యెడ ననుసంధించఁదగును.

౨ [కండుగాథ] ఇదియును "ఋషే కణ్వస్యపుత్రేణ" ఇత్యాదిగా, పెరుమాళ్లు శ్రీసుగ్రీవాదులఁజూచి సాయించినది. ఈగాథ (అనఁగాసూక్తి) నాలుగుశ్లోకములుగా నున్నది. దీనితాత్పర్యం బెట్లనిన; శ్రీకణ్వమహామునియొక్క కుమారుఁడును విశేషధర్మ తత్త్వవేత్తయునైన, కండు, అనే మునివరునిచేత, గాథారూపముగా సాయించఁబడిన చతుశ్శ్లోకి (అనఁగా నాలుగుశ్లోకములయొక్క పొందిక) విశేషధర్మతత్త్వయాథాత్మ్య ప్రతిపాదకమైయున్నది. దానిని మీ కెఱింగించెద వినుఁడని, సాయించుచున్నారు. అంజ లిబంధమాత్రమే సేయుట, దీనత్వముదోఁప నిలచియుండుట, తనయభిప్రాయమును ప్రా ర్థనారూపముగాఁ దెలియఁజేయుట, రక్షకుఁ డున్నచోటికివచ్చుట, ఈనాలుగింటిలో నేదైననొక్కటి నవలంబించినవాఁడు దనకుఁ బ్రత్యక్షశత్రువుగానుండినను (పరదుఃఖా సహిష్ణుత్వరూపమైన యానృశంస్య మహాగుణమునుఁ గాపాడుకొనవలయునని తలంపు గలవాఁడు) వానిని సంరక్షించుట పరమధర్మము. ఇంతేకాదు, వానికితరులవల్లఁగూడఁ గీడుగలుగకుండ (తనకుఁ బ్రాణహానిపర్యంతమైనను విడువక) సంరక్షించవలయును. అట్లుగాక యేదైన నొక్క కారణంబుఁగొని వానినివదలునేడ, నాపాపము పరలోకమం దు బాధకమగుటయేగాక యిహమునందును సకలజన నింద్యుఁడుగానుండును. మఱియు

భావేనసంప్రాప్తః" సదోషసేయాకిలుమైకై విభీషణస్తు శ్రోష్ఠ, "తస్యా నుబన్ధాః పాప్మానస్సర్వే నశ్యన్తి తత్ క్షణాత్" ఏష్ట - ప్రపన్నానపహోత్తే నిర్దోషః; ఇప్పుడిప్రపన్నానాం సదోషనానననుకూలుడున్నారు మన్నా

యలిశంకం దీర్చి, పిమ్మట "సకృదేవ" ఇత్యాది ప్రకారముగా నభయం బొసంగి, యిట్టి యనన్యసాధారణ శరణాగతరక్షణరూప కల్యాణగుణ విద్ధులైన మహారాజుంగోని శ్రీవిభీషణప్పెరుమాళ్లనుం బిలుపించి యనుగ్రహించిరి.

(ఇచట "రక్షిష్యతీతి విశ్వాసః" అని యీయధికారికి నియతి ముగా నుండందగిన మహావిశ్వాసంబునకుం బ్రధానాపేక్షితంబైన, స్వామివారి యానృశంస్య గుణవిశేషమున్ను; ఆగుణము తానుకార్య కరమగుటకుం బ్రతిబంధముగావచ్చిన యితరశరణాగతిని సైతము సవ రించుకొని యేవిధంబుననున్ను కదలింపంగూడనిదై పెరుమాళ్ల తిరు వుళ్లమందు నెలకొనియుండుననియు; ప్రతిపాదింపంబడినది. ఇందువల్లం బ్రపన్నునికిం గలుగునట్టి నిర్భరత్వమున్ను సూచింపంబడుచున్నది. మ ఱియు మహారాజున్ను ఇళైయపెరుమాళ్లున్ను శ్రీవిభీషణప్పెరుమాళ్ల నంగీకరించంగూడదని సేసిన శరణాగతి, ప్రసక్తికేరాకపోయినందున, శేషికి అతిశయావహముకాక, భాగవత ప్రతికూలమున్ను, అయిన శర ణాగతి, శేషి తిరువుళ్లమునకు గోచరపడకనే మానిపోవునదియు సూ చింపంబడుచున్నది. గోచరపడినను పూర్వశరణాగతికి విరుద్ధమగునేని యిది కార్యకరము గాదుగదా?)

ఇందు ("తస్యానుబంధాః...తత్ క్షణాత్" అని) భగవత్ప్రప న్నుండైన మాత్రమున, వానిననుబంధించియుండు పాపములెల్ల (ప్రా

---

తనచే నాశ్రయింపంబడినవాండు దన్నుం బరిత్యజించుటవల్ల నాతనియెదుట వ్యతినొందిన శరణాగతుండు, వీండు సేసియుండు సుకృతములనెల్లం గొనిపోవును. (అని పెరుమాళ్లు శ్రీసుగ్రీవాదులంజూచి సాయించిరని యన్వయము.)

లుమ్ పిఱరాలు మెల్లారాలుమ్ వరుమ్ భయఙ్గళైప్పోక్కిక్కొడవెన్ఱి ఱారిస్స్లోకత్తాల్.

"వేదోపబృంహణార్థాయ తావగ్రాహయత ప్రభుః" ఎన్ఱు- వేదోపబృంహణప్రబన్ధమన్ఱోవితు. ఇవ్విడత్తి లుపబృంహిక్కిఱ వేదార్థమెతు. వేదవాక్యఙ్గళానవైతెన్నిల్, "తంహదేవమాత్మబుద్ధిప్రసాదంముముక్షుర్వై శరణమహంప్రపద్యే" "ప్రయతపాణిశ్శరణంప్రపద్యే" "స్వస్తిసంబాధేష్వభయంనోఅస్తు" ఎన్ఱుమ్ - శొల్లుకిఱప్రపత్త్యుపాయవైభవమ్ ఇవిడత్తిలుపబృంహిక్కిఱతు. వాక్యముమ్, "ప్రయతపాణిశ్శరణ

---

శబ్ధ, పూర్వాఘ, ఉత్తరాఘములనునవి యెల్ల) తత్క్షణంబున రూపుమాసిపోవునని యీప్రమాణమునుసరించి, యిట్లు ప్రసన్నుండై నిర్దోషియైనవానిక, మీవల్లఁగాని నావల్లఁగాని మఱియు నితరులెవ్వరివల్లఁగాని వచ్చునట్టి భయములఁ బోఁగొట్టుచున్నానని యీశ్లోకమువల్ల బ్రసాదించుచున్నారు.

"వేదోపబృంహణార్థాయ తావగ్రాహయత ప్రభుః" అని శ్రీవాల్మీకిభగవానులే సాయించియుండుటవల్ల శ్రీరామాయణము వేదోపబృంహణ ప్రబంధముగదా? (ఉపబృంహణమనఁగా సంగ్రహముగానుండునట్టి యర్థమును వివరించి తెలియఁజేయుట) ఇచ్చోట నుపబృంహణము సేయఁబడునట్టి వేదార్థమేది? అట్టి వేదవాక్యములేవి? యనిన, "తంహదేవమాత్మ...మహంప్రపద్యే" "ప్రయతపాణిశ్శరణంప్రపద్యే" "స్వస్తిసంబాధేష్వభయంనోఅస్తు" అనే వేదవాక్యంబుల కర్థంబైన ప్రపత్త్యుపాయముయొక్క వైభవమిచ్చోట నుపబృంహణము సేయఁబడుచున్నది. ఈయర్థమునకుఁ బ్రమాణభూతములైన శ్రుతివాక్యములలోపల నిచ్చోట నుపబృంహణము సేయఁబడువాక్యము "ప్రయతపాణిశ్శరణం

ప్రపద్యే" ఎన్గిఱవితు. ,,చరణౌశరణప్రపద్యే" ఎన్గుమ్ – ,,చరణౌ గాఢంనిపీడ్య" ఎన్గుమ్ – తిరువడిక్కళైక్కైయాలే పిడిక్కుమ్బోతు శుద్ధహస్తనాకవేణుమ్. అశుద్ధహస్తనాయావతు – ,,సర్వధర్మాన్ పరిత్యజ్య" ఎన్గుమ్ * పితరంమాతరంతొడఙ్గి ,,సర్వధర్మాంశ్చసన్త్యజ్య సర్వకామాంశ్చసాక్షరాన్" ఎన్గుమ్–,,వీడుమిన్ముఴువదుమ్" ఎన్గుమ్– ,,మఱ్ఱారుమ్పఱ్ఱిలేన్" ఎన్గుమ్– ఉపాయాన్తరఙ్గళై విట్టుప్పఱ్ఱుకై.

---

ప్రపద్యే" అనునది. ,,చరణౌశరణంప్రపద్యే" అనియును, ,,చరణౌ గాఢంనిపీడ్య"అనియును,,,వడివిణైయిల్లామలర్ మకళ్ మఱ్ఱైనిలమకళ్ పిడిక్కుమ్ మెల్లడియైక్కొడువినైయేనుమ్పిడిక్క నీయొరునాళ్ కూవుతల్ వరుతల్ శెయ్యాయే" అనియునుంగల ప్రమాణములననుసరించి యీయధికారి సర్వేశ్వరుని తిరువడిత్తామరలను దనహస్తంబులతోఁ బట్టునప్పుడు, శుద్ధహస్తుఁడై యుండవలయును. హస్తములకు శుద్ధియెట్టి దనిన, ,,సర్వధర్మాన్ పరిత్యజ్య" అనియును, ,,పితరంమాతరందారాన్ పుత్రాన్ బంధూన్ సఖీన్ గురూన్ । రత్నానిధనధాన్యాని క్షేత్రాణిచ గృహాణిచ । సర్వధర్మాంశ్చసంత్యజ్యసర్వకామాంశ్చసాక్షరాన్" అనియును, ,,వీడుమిన్ ముఴువదుమ్" అనియును, మఱ్ఱొరుమ్పఱ్ఱిలేన్"అనియునుంగల ప్రమాణంబుల ననుసరించి యుపాయాంతరములనున్ను, వాటికి సహకారులైన తండ్రి, తల్లి, భార్య, బిడ్డలు, బంధువులు, చెలికాండ్రు, ఉపాయాంతరోపదేశముసేయుగురువులు, రత్నధనధాన్యగృహక్షేత్రాదులు, సాంగములైన కర్మయోగాద్యుపాయములు, ఐహికాముష్మికములైన యైశ్వర్యములు, ఆత్మానుభవరూప కైవల్యము, వీటినన్నింటినిన్ని ,,ఇవై యనుపాయంగళాన మాత్రమన్ఱిక్కే కాల్ కట్టెన్గిఱతు" ,,నల్లపుతల్వర్ మనైయాళ్ నవై యిల్ కిళై" అనే యిట్టి నిశ్చయజ్ఞానముతో సవాసనముగాఁ ద్యజించుట. ,,ప్రయతపాణిశ్శర

అత్తైయిఱే "ప్రయతపాణిః" ఎనిఱతు-"మామ్‌వ్రజ" "శరణం ప్రపద్యే" "ప్రార్థనామతిశ్శరణాగతిః" ఎన్ఱు-ఉపాయప్రార్థనారూప జ్ఞానత్తై "శరణం ప్రపద్యే" ఎన్ఱుశొల్లుకిఱతు.

ఇవ్వాక్యత్తై ఇశ్లోక ముపబృంహిత్తపడి యెన్నె న్నిల్ ; "సకృదేవ" ఎన్గిఱ పదఙ్గళాలే అసకృదావృత్తి సాపేక్షైయాన భక్తియై వ్యావర్తిక్కైయాలే, సర్వధర్మత్యాగపూర్వకమాన, "ప్రయతపాణిః"

---

ణం ప్రపద్యే" అనేశ్రుతియందు "ప్రయతపాణిః" అనేపద మిట్టిశుద్ధినిం దెలియఁజేయుచున్నది. ఇఁక "శరణం ప్రపద్యే" అనేపదములు "మాం వ్రజ" "శరణం ప్రపద్యే" "ప్రార్థనామతిశ్శరణాగతిః" ఇత్యాది స్థలములందుఁ జెప్పఁబడియుండు, ఉపాయప్రార్థనారూపజ్ఞానమునుఁ దెలియఁ జేయుచున్నది.

ఇఁక నీశ్లోకము "ప్రయతపాణిః" ఇత్యాది శ్రుతివాక్యము నుప బృంహణంబు సేయువిధంబెట్లనిన, "ఆవృత్తిరసకృదుపదేశాత్" అను శారీరకమీమాంసా బ్రహ్మసూత్రప్రకారముగా భగవదుపాసన రూప భక్తియోగము అసకృదావృత్తమై (అనఁగా తైలధారావదవిచ్ఛిన్న మగునట్లు పలుమాఱును స్మర్తవ్యవిషయమును మనంబున నెలకొల్ప వలసినదై) యున్నదిగదా? ఈప్రపత్త్యుపాయం బట్లుగాదని "సకృత్ ఏవ" అనేపదములవల్ల నేర్పడుచున్నది కాఁబట్టి యీరెండు పదములు న్ను "ప్రయతపాణిః" అనేపదము నుపబృంహణము సేయుచున్నవి. ప్రయతమనఁగాఁ బరిశుద్ధము; "పవిత్రః ప్రయతఃపూతః" అని యమరము. ప్రకర్షేణయచ్ఛతి స్వవిషయేభ్య ఉపరమతీతిప్రయతః; అని యీప్రయతశబ్దమునకు వ్యుత్పత్తి. అనఁగా స్వరూపవిరుద్ధ విషయములనుండి చాలించుకొనినది యనియర్థము. "జ్ఞానికళుక్కు-పాయమ్" "ఇతుమర్మస్పర్శి" అను శ్రీసూక్తులయందు, ఉపాయాంతరములు భగవదేకపారత

ఎన్గిఱపదత్తైయుమ్, ,,ప్రపన్నాయ" ఎన్గిఱపదత్తాలే, ,,శరణంప్రపద్యే" ఎన్గిఱపదఙ్గళై యుమ్, ,,తవాస్మీతిచయాచతే" ఎన్గిఱపదఙ్గళాలే, ,,స్వ స్త్యస్తు" ఎన్గిఱపదఙ్గళై యుమ్, ,,అభయందదామి" ఎన్గిఱపదఙ్గళాలే, ,,అభయమస్తు" ఎన్గిఱ పదఙ్గళైయుమ్ ఉపబృంహిక్కిఱతు.

---

న్త్రీయరూప స్వరూపనాశకములని సాయించియుండుటవల్ల, భగవదుపాసనవఱకుఁగల యుపాయములన్నియు స్వరూపవిరుద్ధములేగదా? ఇంతకుపైన ,,అథపాతకభీతస్త్వం" అని వీటిని పాతకములుగానే సాయించియున్నారు; కాఁబట్టి వీటినిఁ జేఁబట్టక సవాసనాత్యాగము సేసినవాఁడే ప్రయతపాణియని భావము. ,, పాణిః " అనుటవల్ల కర్మేంద్రియములన్నింటిలో హస్తములు ముఖ్యములని సూచింపఁబడుచున్నది. తిరునామసంకీర్తనమున కుపకరణమైన వాగింద్రియమున్ను, భగవద్దివ్యమందిర ప్రదక్షిణమున కుపకరణమైన పాదేంద్రియమున్ను, పాణియనే యీపదమువల్ల నుపలక్షింపఁబడుచున్నది. ,,సకృత్ ఏవ" అనేపదములు ప్రపత్తినే రెండవతూరి సేయకూడదని నిషేధించుచున్నవి; కాబట్టి, నిరంతరధ్యానరూపమైన యుపాయాంతర మీగోష్ఠినుండి దూరముగఁ ద్రోయఁబడుచున్నది. ,,నణ్ణుమ్ మనముణ్డై యీణ్ణున్ తిరునామమ్" ,,నాడీ ర్ నాడోఱుమ్ వాడామలర్ కొండు పాడీరవన్ నామమ్" ఇత్యాది స్థలములందు నిరంతరాను సంధేయముగానున్న కరణత్రయ వ్యాపారముగానున్ను సాయించినవన్నియు, ,,తేనుమ్ పాలుమ్" ఇత్యాది ప్రకారమైన తిరునామముయొక్క భోగ్యతననుసరించిన్ని ,,వైయత్తువాళ్వీర్ కాళ్" అను శ్రీసూక్తివలె ప్రపన్నునికి సంభావితస్వభావము లిట్టివనిన్ని ప్రసాదించినారేగాని ప్రపత్తి మరల మరల సేయవలయుననే యభిప్రాయముకాదు.

ఇఁక, ,,ప్రపన్నాయ" అనేపదము ,,శరణంప్రపద్యే" అనే పదములనున్ను; ,,తవాస్మీతిచయాచతే" అనేపదములు ,,స్వస్త్యస్తు" అనే పదములనున్ను; ,,అభయందదామి" అనేపదములు ,,అభయమస్తు"

ఆకవిత్తు, "ప్రపద్యే" ఎన్ను ప్రపదనదశైయిల్ ఏకవచనమాయిరానిన్నత్తు; ఫలదశైయిల్, "నః" ఎన్ను- బహువచనమాయిరానిన్నత్తు. ఇతు శెయ్యుమ్బడి యెన్నెన్నిల్; "వైష్ణవోనఃకులేజాతః" ఎన్ను-ఏకవచనమాకచ్చొల్లి, "తేసర్వేముక్తిమాయాన్తి" ఎన్ను-బహువచనమాకవుమ్, "యేచవైష్ణవసంశ్రయాః తేనైవతేప్రయాస్యన్తి" ఎన్ను-ఏకవచనబహువచనజ్ఞళాలుమ్, ఇప్పడిబహుప్రమాణజ్ఞళుణ్టాకైయాలుమ్, లోక

---

అనేపదములనున్ను ; ఉపబృంహణము సేయుచున్నవి. ఇవి సులభము గానుండుటవల్లనున్ను, ప్రతిపాదనము సేయ నుపక్రమించితే గ్రంథవిస్తరమగుననే భయమువల్లనున్ను. ఇచ్చట ప్రతిపాదనము సేయకవిడువవలసెను.

ఈశ్రుతి, ప్రపత్తిసేయుటనుఁ దెలియఁజేయునప్పుడు, "ప్రపద్యే" అని యేకవచనముగానున్ను ; "స్వస్తిసంబాధేష్వభయమస్తు" అని "ఎయ్ప్పైనైష్ణవన్నునలియుమ్యోబతు" అనే సంకటకాలమందు క్షేమమునున్ను అభయమునున్ను, తెలియఁజేయునప్పుడు, "నః" అని బహువచనముగానున్ను ; ఉండుటవల్ల, నెవ్వఁడేని నొక్కఁడు ప్రపన్నుండైనచో నాతని యభిమానంబునఁ జేరినవారందఱును భగవత్ప్రాప్తిరూపమోక్షమునుఁ బొందుచున్నారనే యర్థము సెప్పఁబడినది. దీని కుపబృంహణంబులుగా "వైష్ణవోనఃకులేజాతః" మాకులమున నొక్క-వైష్ణవుఁడు జన్మించినందువల్ల మేమెల్లసద్గతినిఁ బొందుచున్నామనియు; "తేసర్వేముక్తిమాయాంతి" ఎవరి వంశంబునందుగాని యొక్కఁడు ప్రపన్నుండయ్యెనేని యావంశము వారందఱును ముక్తిం జెందుదురనియు; "యేచవైష్ణవసంశ్రయాః । తేనైవతేప్రయాస్యంతి" పశువుగాని మనుష్యుఁడుగాని పక్షిగాని వైష్ణవాభిమానమందుఁ జేరిరేని యాయభిమానమాత్రముచేతనే వారందఱునుఁ బరమపదమునుఁ బొందుచున్నారని

త్తిలుమ్ ఒరువన్ రాజసేవై కృష్యాదికళై ప్పణ్ణి, అవన్ యత్నఫలమాన అన్నధనధాన్యవస్త్రాదిఫలఙ్గళై అవనభిమానత్తిలే భార్యాపుత్రశిష్యదాసాదికళ్ వరుత్తమఱ భుజిక్కక్కాణ్గైయాలుమ్, ఇప్పడి లోక వేదఙ్గళిలే అనుభూతఫలమాగైయాలే, ఒరువన్ ప్రపన్ననాక అవనభిమానత్తిలేయు తుజ్జీనార్క్కెల్లామ్ ఫలమాకక్కడవత్తెన్ఱు.

ఆకిల్ అతు, ప్రపత్తియుపాయమెన్నతు - ఎమ్బెరుమాన్ ఉపాయమెన్నతాకానిన్ఱతు ; ప్రపత్తియానతు - "త్వమేవోపాయ భూతో మే భవేతి ప్రార్థనామతిః। శరణాగతిః" ఎన్ఱు - చేతననుడైయ ప్రార్థనారూపజ్ఞానమాయిరానిన్ఱతు; ఎమ్బెరుమానాకిఱాన్ - ప్రార్థనీయనాయిరుప్పానొరు పరమ

---

యు; నిట్లనేక ప్రమాణంబులుండుటయేగాక, లోకమందున్ను నెవ్వఁడైన నొక్కఁడు, రాజసేవ, కృషి, మొదలగు పనులు సేయఁగా నాతని యత్నమునకు ఫలమైన ధనధాన్యవస్త్రాన్న పానాదులను వానియభిమానమందుఁ జేరిన భార్యాపుత్ర శిష్యదాసాదులు, తాముకష్టపడకనే యనుభవించుచుండుటను మనము ప్రత్యక్షముగాఁ జూచుచున్నాము గదా? కావున నీయర్థము శ్రుతిస్మృత్యాదులయందును లోకమందునుఁ బ్రసిద్ధిగానున్నది.

అది యట్టిదేగాని ; మన సంప్రదాయమందు తటస్థశంక యొకటిగలదు, అది యెట్టిదనిన ; "త్వమేవోపాయభూతో మే భవేతి ప్రార్థనామతిః । శరణాగతిః" అనే ప్రమాణమందు, నీవే నాకుపాయభూతుఁడవగుమనే (చేతన) ప్రార్థనారూపజ్ఞానమే శరణాగతియని సాయించియుండుటవల్ల, నుపాయత్వేన ప్రార్థనీయుఁడు (అనఁగా నుపాయభూతుఁడవుకమ్మని చేతనునిచేఁ బ్రార్థింపఁబడునట్టివాఁడు) సర్వస్వామియగు నొక పరమచేతనుఁడని సిద్ధమగుచుండఁగా నీక చేతనప్రార్థనారూప జ్ఞానమైన ప్రపత్తి యెట్లుపాయమగుచున్నది? అనిన నీశంకకు తర్క

చేతననాయిరానిన్ఱతు ; ఇతు శేరుమ్బడియెన్నెన్నిల్ ; పరామృష్టలిఙ్గ మనుమానమాయిరుక్క, "లిఙ్గపరామర్శోనుమానమ్" ఎన్ఱు-పరామర్శ ప్రాధాన్యత్తైప్పఱ్ఱి, ఔపచారికమాక పరామర్శత్తైచ్చొన్నాఱ్పోలవుమ్, "నీలజ్ఞానమ్ పీతజ్ఞానమ్" ఎన్ఱాల్-జ్ఞానత్తుక్కు-రునైల్య పీతిమాది కళఱ్ఱిరుక్క. విషయగతమాన నైల్యపీతిమాదికళై విషయియాన జ్ఞానత్తిలే ఉపచరిత్తు, నీలజ్ఞానమ్‌పీతజ్ఞానమ్" ఎన్ఱాప్పోలేయుమ్, స్వీకార ప్రాధాన్యత్తైప్పఱ్ఱి స్వీకారవిషయమాన భగవద్గతోపాయవ్యవహారత్తై విషయియాన స్వీకారరూప ప్రపత్తిజ్ఞానత్తిలే ఉపచరిత్తుచ్చొల్లుకిఱతాకైయాలే ఒరువిరోధముమిల్లై.

---

న్యాయమునను సరించి పరిహారము సాయించుచున్నారు. అదియెట్లనిన; పరామృష్టలింగము (అనఁగా మనస్సుచేత నిది యిట్టిదిగానుండునని యూహింపఁబడిన గురుతు) అనుమానశబ్దముచేఁ జెప్పఁదగినదిగా నుండగా "లింగపరామర్శోనుమానం" అని పరామర్శప్రాధాన్యము నుఁబట్టి (అనఁగా మనస్సుచే నూహింపఁబడు విషయము, ఊహించుట చేతనేగదా? తెలియుచున్నదని, ఊహయొక్క ప్రాధాన్యమునుఁబట్టి) యుపచారముగాఁ బరామర్శమునే (ఊహించుటనే) యనుమానశబ్ద వాచ్యముగ సెప్పునట్టుగానున్న; "నీలజ్ఞానంపీతజ్ఞానం" అనునప్పుడు, కంటికగుపడువిషయము, నల్లనిది, పచ్చనిది, అని సెప్పవలసియుండఁగా (నుపచారముగా) నావర్ణముల నెఱుంగునట్టి జ్ఞానమునే, నల్లనిది, పచ్చనిది, అని సెప్పునట్లుగానున్న; ఉపాయముగా స్వీకరింపఁబడునట్టి సర్వేశ్వరునియందు నెలకొనియున్న యుపాయత్వమును, (చేతనునిచేఁ జేయఁబడునట్టి) స్వీకారముయొక్క ప్రాధాన్యమునుఁబట్టి (అనఁగా నితనిచేత స్వీకారమునుఁ జేయించక యీశ్వరుఁడు దానుపాయముగా నిలువకుండుటంబట్టి) స్వీకారరూపమైన ప్రార్థనాజ్ఞాన విశేషమేయగు ప్రపత్తియం

ఆకిఱతు, "సస్వైనై వఫలప్రదః ఫలమపి స్వైనై వనారాయణః" ఎన్ఱుమ్-"మాంవ్రజ...మామేవైష్యసి"ఎన్ఱుమ్-"ఇత్తై వా సీతారాంయ్ పత్తై"ఎన్ఱుమ్- "ఉన్ఱన్నోడుఱ్ఱోమేయావోమునక్కే నామాట్చెయ్వోమ్"ఎన్ఱుమ్- ఎమ్బెరుమానేఉపాయముముపేయముమెన్ఱి శొల్లుకిఱతు; అన్దఉపాయోపేయఙ్గళాకిఱతు కార్యకారణఙ్గళిఱే; "యదనన్తరంయద్దృశ్యతేతత్తస్యకారణమ్" ఎన్ఱుమ్- "నియతపూర్వభావికారణమ్" ఎన్ఱుమ్-పూర్వభావియుమాయ్ పూర్వకాలత్తిలే సత్తుమాయిఱే కారణమి-

---

దును, ఉపచారముగా సాయించియుండుటవల్ల నీశంకవల్ల జనించునట్టి విరోధ మెంతమాత్రమును గలుగనేరదు.

అదియు నట్టిదేగాని; "సస్వైనై వఫలప్రదః ఫలమపిస్వైనై వనారాయణః" అను ప్రమాణమునందు ఫలము నొసంగువాడును ఫలంబును దానేయనియు; "మాంవ్రజ" "మామేవైష్యసి" అను ప్రమాణములందు నన్నాశ్రయించుము నన్నే బొందగలవు, అనియు; "ఇత్తై వా సీతారాయ్పత్తై" "ఉన్ఱన్నోడుఱ్ఱోమేయావోమునక్కే నామాట్చెయ్వోమ్" అను ప్రమాణములందు నిరుపాధికస్వామియైన నీవే యుపాయభూతుడవుగమ్మని ప్రార్థించి, నిరవధికప్రేమయుక్త సంబంధజ్ఞానముతో నీకే కైంకర్యముసేయ వేడెదము, అనియు; సర్వేశ్వరు డొక్కడే యుపాయంబును నుపేయంబును నగుచున్నాడని సాయించియున్నారు. ఈ రెంటిలో నుపాయము కారణముగానున్న, ఉపేయము దానివల్ల నగునట్టి కార్యముగానున్న, ఉన్నదిగదా? "యదనంతరంయద్దృశ్యతే తత్తస్యకారణం" "నియతపూర్వభావికారణం" అని, కారణము, ఏదైన నొకకార్యమునకు పూర్వభావియై (అనగా ముందుకలుగవలసినదై) యుండుట నియతముగాన, దానిసత్త (అనగా కారణముయొక్క ఉనికి) కార్యదర్శనకాలమునకు ముందే నియతముగానుండుననియు;

రుప్పతు; “నియతపశ్చాద్భావిత్వంచ కార్యత్వమ్” ఎన్నుమ్ - “ప్రాగసత్సత్తాయోగిత్వం కార్యత్వమ్” ఎన్నుమ్-పూర్వకాలత్తిలే సత్తుమాయిరాత్తే, అత్తాలే పిఱక్కక్కడవతుమాయ్ పశ్చాద్భావియుమాయిత్తే కార్యమిరుప్పతు; ఇప్పడియిరుక్క, “నిత్యంవిభుమ్” ఎన్నుమ్ - “సత్యంజ్ఞానమ్” ఎన్నుమ్- “ఏకమేవా ద్వితీయమ్” ఎన్నుమ్- నిత్యముమాయ్ ఏకముమా యిరుక్కిఱ భగవద్వస్తువుక్కు పరస్పరవిరుద్ధమాన భావాభావాత్మకత్వఙ్కూడుమ్పడియెన్; పూర్వోత్తరభావిత్వఙ్కూడుమ్పడియెన్నెన్నిల్; “సదేవసోమ్యేదమగ్ర ఆసీత్ ఏకమేవా ద్వితీయమ్” ఎన్నుమ్-“అవికారాయ శుద్ధాయనిత్యాయ” ఎన్నుమ్-అవికారముమా

---

“నియతపశ్చాద్భావిత్వంచకార్యత్వం” “ప్రాగసత్సత్తాయోగిత్వం కార్యత్వం”అని, కార్యముయొక్క సత్త (ఉనికి) కారణమునకుముందు గోచరించదుగాన, నాకారణమువల్ల జనించి తదనంతరకాలమందే కార్యము గోచరపడుననియు; కార్యకారణముల నియతి యీవిధముగానుండఁగా; “నిత్యంవిభుమ్” “సత్యంజ్ఞానం” “ఏకమేవాద్వితీయం”అనునిప్పాటిశ్రుతులవల్ల నిత్యమై యేకరూపమునై యుండు భగవద్వస్తువునకు పరస్పరవిరుద్ధమైన భావాభావాత్మకము (అనఁగా కార్యమైనట్టి యుపేయము, ఇది లభించుటకు కారణమైన యుపాయమునకు పూర్వకాలమందు లేదనే న్యాయంబును; “నిత్యంవిభుం” ఇత్యాదిశ్రుతులయందు, ఉపాయభూతుఁడగు నీశ్వరుఁడు నిత్యుఁడని చెప్పియుండుటవల్ల సర్వకాలమందునున్నాఁడని ప్రతిపాదింపఁబడునట్టి యర్థంబును;) ఎట్లుపొసఁగును? ఇట్లుగాక కార్యమునకు పూర్వకాలమందును అనంతరకాలమందును కారణమున్నదని చెప్పినపక్షమందు, ఫలసాధకమైన కారణమునకు ముందు ఫలమనియెడి కార్యమెట్లు సిద్ధించును? అనియు శంకగలుగఁగా దానికుత్తరము సెలవిచ్చుచున్నారు. అదియెట్లనిన; “సదేవసోమ్యేదమగ్రఆసీత్ ఏకమేవాద్వితీయం” “అవికారాయశుద్ధాయనిత్యాయ”

య్‌నిత్యముమాయ్ ఏకముమాన బ్రహ్మత్తుక్కు, ‘‘బ్రహ్మవనం బ్రహ్మసవృక్ష ఆసీత్’’ ఎన్‌ఱుమ్- ‘‘ సోఽకామయత బహుస్స్యాం ప్రజాయేయేతి’’ ‘‘సఏవసృజ్యస్సచసర్గకర్తా సఏవపాత్యత్తిచపాల్యతేచ’’ ఎన్‌ఱుమ్-త్రివిధ కారణత్వముమ్ స్రష్టృస్సృజ్యత్వముమ్ పరస్పరవిరుద్ధమా యిరుక్క, ‘‘సూక్ష్మచిదచిద్విశిష్ట బ్రహ్మమ్ కారణమ్, స్థూలచిదచిద్విశిష్ట బ్రహ్మమ్ కార్యమ్’’ ఎన్‌ఱు-అవ్విరుద్ధధర్మజ్గళ్ విశేషణజ్గళిలేయాయ్ విశిష్టైక్యత్తాలే నిర్వహిత్తాప్పోలే ఇజ్గుమ్, ‘‘ధాతుః ప్రసాదాన్మహిమానమీశమ్’’ ఎన్‌ఱుమ్ - ‘‘తస్మిన్ ప్రసన్నే క్లేశసజ్క్షయః’’ ఎన్‌ఱుమ్- ‘‘ప్రహర్షయిష్యామి’’ ఎన్‌ఱుమ్- ‘‘ త్వత్ప్రీతయే ’’ ఎన్‌ఱుమ్- ‘‘తిరువుళ్ళమిడర్ కెడున్దోఱుమ్‌వియక్కవిన్బుఱుతుమ్’’ ఎన్‌ఱుమ్ - ప్రసాదవిశిష్టనుపాయమ్,

---

ఇత్యాది ప్రమాణములయందు సాయించిన ప్రకారముగా వికారరహితమున్ను నిత్యమున్ను ఏకరూపమున్ను అయినబ్రహ్మమునకు, ‘‘బ్రహ్మవనంబ్రహ్మసవృక్షఆసీత్ ’’ ‘‘ సఏవసృజ్యస్సచసర్గకర్తాసఏవపాత్యత్తిచపాల్యతేచ’’ ఇత్యాది ప్రమాణములయందు సాయించిన త్రివిధకారణత్వమున్ను స్రష్టృత్వమున్ను సృజ్యత్వమున్ను విరుద్ధములుగానుండినను, ‘‘సూక్ష్మచిదచిద్విశిష్టబ్రహ్మకారణమ్, స్థూలచిదచిద్విశిష్టబ్రహ్మకార్యమ్’’ అని యావిరుద్ధధర్మములు బ్రహ్మవిశేషణములైన స్థూలసూక్ష్మరూపచేతనాచేతనములయందేనిలచి, యట్టి విశేషణములతోఁగూడిన యైక్యమునుఁబట్టి బ్రహ్మమునం దుపచారముగా సెప్పఁబడినదని నిర్వహింపఁబడి యున్నదిగదా? అదేరీతిగా నిచ్చటనున్ను, ‘‘ ధాతుః ప్రసాదాన్మహిమానమీశమ్’’ ‘‘తస్మిన్ప్రసన్నే క్లేశసంక్షయః’’ ‘‘ప్రహర్షయిష్యామి’’ ‘‘త్వత్ప్రీతయే’’ ‘‘తిరువుళ్లమిడర్ కెడున్దోఱుమ్ వియక్కవిన్బుఱుతుమ్’’ ఇత్యాది ప్రమాణంబులంబట్టి, చేతనోజ్జీవమునకుఁ బ్రథమకారణమగు, ప్రసాదముతో (అనుగ్రహముతోఁ) గూడియున్న

ప్రీతివిశిష్టను పేయమ్ ఎన్రువిశేషణభేదజ్కిడక్కచ్చెయ్ తే విశిష్టైక్యత్తాలే ఉపాయోపేయ మెమ్బెరుమా నెన్గిఅతాకైయాలే ఎల్లాజ్కూడుమ్. "ఇరక్కముపాయమ్ ఇనిమైఉపేయమ్" ఎన్రిఅజీయరరుళిచ్చెయ్యుమ్బడియుమ్. "అనన్యసాధ్యేస్వాభీష్టే" ఎన్రుప్రపత్త్యాది సాధ్యమితేమోక్షమ్; సాధ్యమావతు మున్బిన్రియిలే పిన్బుఉత్పన్నమావతు; "ఉత్పన్నస్యవినాశయోగాత్" ఎన్రు ఉత్పన్నమాయ్ నశిక్కుమాకిల్ ఉపేయ

---

వ్వాడు సర్వేశ్వరుండుపాయమనిన్ని; స్వరూపజ్ఞానముదయించి యుజ్జీవించిన చేతనునిఁజూచి సంతోషించినప్పుడతం డుపేయమనిన్ని; ఉపాయత్వమునకుఁ బ్రసాదంబును, ఉపేయత్వమునకుఁ బ్రీతియు హేతువులై, యిట్లు విశేషణభేదము సుస్పష్టముగాఁ గనుపించుచుండినను, ప్రసాదవిశిష్టత్వ ప్రీతివిశిష్టత్వ రూపవిశిష్టైక్యమునుఁబట్టి యుపాయోపేయంబులు రెండును సర్వేశ్వరుఁ డొక్కఁడేయని సిద్ధమగుచున్నది. కాఁబట్టి, ముందుసెప్పిన విరోధముల కెడములేక, ఫలప్రదుండును ఫలంబును నాతండే, అని యిత్యాదిగా సెప్పఁబడినవన్నియుఁ బొసఁగుచున్నవి. "ఇరక్కముపాయమ్, ఇనిమైయుపేయమ్" అనిజీయరు వారు ప్రసాదించియున్నారుగదా? ఇఁక సర్వేశ్వరునియందుగల సాధ్యసాధన భావంబునందు జనియించునట్టి దోషమునకు పరిహారమును. శంకాప్రతిపాదనపూర్వకముగా సాయించుచున్నారు; అదియెట్లులనిన, "అనన్యసాధ్యేస్వాభీష్టే" ఇత్యాదిప్రమాణముల ననుసరించి, మోక్షము ప్రపత్తి మొదలయిన యుపాయంబులచేత సాధ్యముగానున్నది గదా? సాధ్యమనఁగా తొలుత లేకనేయుండి పిమ్మట గలుగునది. ఈ రీతి నొకప్పుడుత్పన్నమైతే దీనికి వినాశమున్ను సిద్ధము; "ఉత్పన్నస్య వినాశయోగాత్" అనునది యీయర్థమునకుఁ బ్రమాణము. ఇట్లయిన

మానభగవత్ప్రాప్తి రూపమోక్షమ్ నశిక్కుమాయిరుక్కతీ ఎన్నిన్నిల్; నశియాతు; ఇతుక్కు ఇరణ్డుప్రకారముణ్డు; అతిలొన్ఱు సాధ్యన్గళ్, ఉత్పాద్యమ్ ఎన్నుమ్, ప్రాప్యమ్ ఎన్నుమ్, వికార్యమ్ ఎన్నుమ్, సంస్కార్యమ్ ఎన్నుమ్, నాలుప్రకారమాయిరుక్కుమ్. అవత్తిలుత్పాద్యమావతు- *ఘటంకరోతి పటంకరోతి ఎన్ను మాప్పోలే మున్బిల్లియిలేపిన్బుణ్డావతు. ప్రాప్యమావతు-"గ్రామంగచ్ఛతి రాజానంగచ్ఛతి" "గాందోగ్ధిపయః", ఎన్ను మున్బే సిద్ధరూపమానవస్తువై అధికారిక్కుడుకై. వికార్యమావతు- "క్షీరమభ్యఞ్జయతి" "త్రపుసీసే ఆవర్త్తయతి" పాలై త్తయిరాక్కుకైయుమ్ ఈయత్తై సిరుక్కుకైయుమ్. సంస్కార్యమావతు, "వ్రీహీన్ప్రోక్షతి" "వ్రీహీనవహన్తి" వస్తుతన్నై క్కార్యాన్తర యోగ్యమాకిప్పణ్ణుకై.

---

పక్షమందు భగవత్ప్రాప్తిరూపమైన మోక్షము నశించునని యేర్పడుచున్నదిగదా? అనిన నదియట్లుగాదు; దానికెన్నఁడును నాశము లేదు. నశించునని గలిగినశంకకు పరిహారము రెండువిధములుగా నున్నవి; అందు మొదటిపరిహారం బెట్లులనిన? సాధ్యము అనునది, ఉత్పాద్యమనియు, ప్రాప్యమనియు, వికార్యమనియు, సంస్కార్యమనియు, నాలుగు విధంబులుగానుండును; వాటిలో నుత్పాద్యమనునది ఘటపటాదులవలె తొలుత లేకనేయుండి పిమ్మట నానాయాపనివారల యత్నముచేత రూపముతో నేర్పడునది. ప్రాప్యమనే రెండవది "గ్రామంగచ్ఛతి, రాజానంగచ్ఛతి, గాందోగ్ధిపయః" అనురీతిగా తొలుత సిద్ధముగానుండు గ్రామమునున్ను రాజునున్ను నడచిపోవుట మొదలగు తనయత్నమువల్లఁ బొందుటయు; అట్లనే సిద్ధముగానుండు క్షీరమును పిండుటయనే తనయత్నమువల్లఁ లభించుటయు. వికార్యమను మూడవది పాలును పెరుగుగాఁజేయుటయు; తగరమును సీసముతోఁ గలియునట్లు కరగించుటయు. సంస్కార్యమనే నాలుగవది ధాన్యములను ప్రోక్షించుట

ఇజ్గుమ్, "బ్రహ్మవిదాప్నోతిపరమ్" ఎన్టుమ్- "పరాత్పరం పురుషము పైతిదివ్యమ్" "పరఞ్జ్యోతిరుపసంపద్య" ఎన్టుమ్ - "ఉన్నై యెయ్తి" ఎన్టుమ్-వన్ధైసిద్ధరూపనాన పరమాత్మావె ఇవర్కట్కు ప్రాప్యమ్ నిత్యమేయాకిఱతు. ఇనిమన్ఱప్రకారమ్- "నిత్యో నిత్యానామ్" ఎన్టు మ్ - "అజో హ్యేకః" ఎన్టుమ్ - "నహివిజ్ఞాతుర్విజ్ఞాతేర్విపరిలోపో విద్యతే" ఎన్టుమ్-"పరనన్మలర్ చ్చోతి" ఎన్టుమ్ - అత్మాక్కళ్ నిత్యరా కైయాలుమ్ ఇవర్కళుక్కు ధర్మమాన జ్ఞానానన్దాదికళ్ నిత్యఙ్గళాకై యాలుమ్, "తమసాగూఢమగ్రేప్రకేతమ్" ఎన్టుమ్ "తయాతిరోహిత త్వాచ్చశక్తిః క్షేత్రజ్ఞసంజ్ఞితా" ఎన్టుమ్-ఆత్మస్వరూప ధర్మఙ్గళుక్కు త్తిరోధాయకమాన ప్రకృతి సంసర్గమ్బోయ్, "స్వేనరూపేణాభి నిష్ప

యు దంచుటయుగావించి పిమ్మట నవి మఱియొకకార్యమునకు యో గ్యమగునట్లుసేయుట. ఇట్లు సాధ్యమనునది నాలుగువిధములుగానున్న వి. ఇట్లనే యిచ్చటనున్ను; "బ్రహ్మవిదాప్నోతిపరం" "పరాత్పరంపురు షముపైతిదివ్యమ్" "పరంజ్యోతిరుపసంపద్య" "ఉన్నై యెయ్తి" ఇ త్యాది ప్రమాణముల ననుసరించి ముందే సిద్ధముగానుండు పరబ్రహ్మ మును, ఈచేతనుఁడు సమీపించుటవల్ల ప్రాప్యశబ్దవాచ్యమైన సాధ్యము నిత్యమే యగుచున్నది. ఇఁకఁ బూర్వోక్తశంకకు రెండవపరిహారం బెట్టులనిన? "నిత్యోనిత్యానామ్" "అజోహ్యేకః" "నహివిజ్ఞాతుర్వి జ్ఞాతేర్విపరిలోపోవిద్యతే" "పరనన్మలర్ చ్చోతి" ఇత్యాదిప్రమాణ ములననుసరించియాత్మలునిత్యులై వీరి స్వరూపనిరూపక ధర్మములైన జ్ఞానానందాది గుణములున్ను నిత్యములై యున్నవిగదా? ఇట్టి స్వరూ పధర్మములైన గుణములు "తమసాగూఢమగ్రేప్రకేతమ్" "తయాతి రోహితత్వాచ్చశక్తిః క్షేత్రజ్ఞసంజ్ఞితా" ఇత్యాది ప్రమాణములనను సరించి ప్రకృతిసంసర్గమువల్ల మఱుఁగుపడియున్నవి. ఆప్రకృతి సంసర్గము

దృతే"ఎన్నుమ్ - „ఆవిర్భూతస్వరూపస్తు" ఎన్నుమ్ - „అవబోధాదయో గుణాః"ఎన్నుమ్-„ప్రకాశ్యన్తే నజన్యన్తే నిత్యాఏవాత్మనోహితే" ఎన్నుమ్-స్వాభావికాకారమ్ విస్తృతమాయ్*ఉత్పాద్యమల్లాక్కే యిరుక్కైయాలుమ్ నిత్యమాకైయాలు ఎన్నుప్రకారమ్.

అద్వైయమప్పడియాకైయాలు : ఇప్పదేశమ్ ప్రపత్త్యుపబృంహణమ్ పణ్ణుకైయాలాకిల్, „అహమస్మ్యపరాధానామాలయోఽకిఞ్చనోఽగతిః । త్వమేవోపాయభూతోమే భవేతిప్రార్థనామతిః ॥ శరణాగతిః"

---

వదలినపిమ్మట „స్వేనరూపేణాభినిష్పద్యతే" „ఆవిర్భూతస్వరూపస్తు" „అవబోధాదయోగుణాః" „ప్రకాశ్యంతేనజన్యంతే నిత్యాఏవాత్మనోహితే" ఇత్యాది ప్రమాణములననుసరించి స్వాభావికములైన యాత్మగుణములు విస్తరించి వెలుఁగుచున్నవి. ఇంతేగాని స్వరూపధర్మములైన జ్ఞానానందాది గుణములు నూతనముగాఁ బుట్టునవిగావు. „ఆహమర్థత్తుక్కు జ్ఞానానందంగళ్ తటస్థమెన్నుంబడీ దాస్యమిఱే అన్తరంగనిరూపకమ్" అనే శ్రీసూక్తిప్రకారముగా నాత్మస్వరూపనిరూపకధర్మములలో జ్ఞానానందాదులకన్న నంతరంగనిరూపకధర్మము దాస్యముగానుండుటవల్లనున్ను; ఇది నూతనముగాఁ బుట్టునదిగాక స్వాభావికమును నిత్యమునై యుండుటవల్లనున్ను; ముందు సాధ్యమనియు ప్రాప్యమనియు సెప్పఁబడిన మోక్షమీదాస్యమునకన్న వేరైనదిగాకుండుటవల్లనున్ను ; ఇదియొకప్పుడు పుట్టునదియుఁగాదు ; మఱియొకప్పుడు నశించునదియునుంగాదని తాత్పర్యము.

అదియునట్టిదేగాని; ఈప్రదేశము ప్రపత్త్యుపబృంహణముసేయు పక్షమున, „అహమస్మ్యపరాధానామాలయోఽకించనోఽగతిః । త్వమేవోపాయభూతోమేభవేతిప్రార్థనామతిః ॥ శరణాగతిరిత్యుక్తాసాదేవేస్మిన్ ప్రయుజ్యతామ్" అను ప్రమాణమునందు చెప్పఁబడిన ప్రపత్తిలక్షణ

ఎన్గిఱ ప్రపత్తిలక్షణ జ్ఞ్కడస్థతో వెన్నిల్; ,,రావణోనామ దుర్వృత్తో రాక్షసోరాక్షసేశ్వరః । తస్యాహ మనుజోభ్రాతా విభీషణఇతిశ్రుతః” ఎన్ఱు-రావణసమ్బన్ధత్తాలుమ్, ,,విశేషేణభీషయతీతివిభీషణః”ఎన్గిఱ నామనిర్వచనత్తాలుమ్, స్వదోషత్తై మున్నిడుకై యాలే, ,,అహమస్మ్యపరాధానామాలయః” ఎన్ఱుమర్థజ్ఞాల్లుకిఱతు;

,,రాజ్యంప్రార్థయమానశ్చ” ఎన్ఱు- తనక్కు-రాజ్యమ్ వేణ్డవన్దవనాయ్ ప్పెరుమాళుక్కు-రు కిఞ్చిత్కారమ్ పణ్ణవన్దవనల్లామైయైమున్నిడుకై యాలే, ,,అకిఞ్చనః” ఎన్నుమర్థజ్ఞాల్లుకిఱతు;

---

ములన్నియు నిచ్చటఁ బొసఁగియున్నవా? అనిన నవియన్నియు నిందు నిండియున్నవని ప్రతిపాదించుచున్నారు. అది యెట్లనిన; ,,రావణోనామ దుర్వృత్తో రాక్షసోరాక్షసేశ్వరః । తస్యాహమనుజోభ్రాతా విభీషణ ఇతిశ్రుతః” అని శ్రీవిభీషణాళ్వానులు రావణసంబంధము దనకుఁగలిగియుండుటను చెప్పి స్వదోషమును మున్నిడుటవల్ల ,, అహమస్మ్యపరాధానామాలయః” (నేను మహాపరాధంబులకెల్ల నునికిపట్టయినవాడ,) అనేయర్థము సెప్పఁబడినది. మఱియు, (లోకాన్ రావయతీతిరావణః) అనే వృత్పత్తిప్రకారముగా జ్యేష్ఠుఁడైనరావణుఁడు దనదౌర్జన్యమువల్ల లోకములనెల్ల రోదనముసేయునట్లు గావించినరీతిగా నాతనికి సహోదరుఁడైన తమ్ముఁడగునేనును (విశేషేణభీషయతీతివిభీషణః) అనే వృత్పత్తిప్రకారముగా లోకములనెల్ల మిక్కిలి భయపడఁజేయుచున్నవాడనని తననామముసెప్పి చూపించినందువల్ల, నిదియును ,,అహమస్మ్యపరాధానామాలయః” అనేయర్థమును చూపించుచున్నది.

,,రాజ్యంప్రార్థయమానశ్చ” అని తనకు లఙ్కారాజ్యము కావలయుననే యపేక్షతోవచ్చుటదక్క పెరుమాళ్లసన్నిధియందొక కించిత్కారము సేయఁబూనివచ్చిన యభిప్రాయమును దోఁపనివ్వక నిలచియుం

„ త్వాంతుధిక్కులపాంసనమ్ ” ఎన్ఱు – తళ్ళివిడుమ్బడి సోదర భ్రాతావుక్కుట్పడ ఆళ్లన్ఱిక్కే పోరుకైయాలే, „అగతిః” ఎన్నుమర్థ జ్ఞోల్లుకిఱతు ;

„భవన్తంశరణఙ్గతః” ఎన్ఱైయాలే, „త్వమేవోపాయభూతో మే భవేతిప్రార్థనామతిశ్శరణాగతిః” ఎన్నుమర్థజ్ఞోల్లుకిఱతు ;

„పాదయోశ్శరణాన్వేషీనిపపాత” ఎన్ఱైయాలే, „సాదేవేఽస్మిన్ప్రయుజ్యతామ్” ఎన్నుమర్థజ్ఞోల్లుకిఱతు ; ఆకైయాల్, ఇతునేరాకక్కిడన్దతు.

---

డుటవల్ల „అకించనః” (నాయందు భగవత్ప్రాప్తికి సాధనంబనఁదగినదొక్కటియు లేదు) అనేయర్థము సెప్పఁబడినది.

„త్వాంతుధిక్కులపాంసనమ్” అని తోలఁగఁద్రోయునట్లు సహోదరభ్రాతకు సైతము పనికిరానివాఁడైనందువల్ల „అగతిః” (నాకు వేరుదిక్కులేదు) అనేయర్థము సెప్పఁబడినది.

„ భవంతంసర్వభూతానాం శరణ్యంశరణంగతః ” అనుటవల్ల „త్వమేవోపాయభూతో మే భవేతిప్రార్థనామతిః । శరణాగతిః” (నీవే నాకుపాయభూతుఁడవుగమ్మని ప్రార్థించుబుద్ధియే శరణాగతి) అనేయర్థము సెప్పఁబడినది.

„పాదయోశ్శరణాన్వేషీనిపపాత” అనుటవల్ల „సాదేవేస్మిన్ప్రయుజ్యతామ్” (పూర్వోక్తరూపమైన శరణాగతిని, రక్షణోపయోగి గుణంబులతో వెలుంగుచుండు నీదేవుని సన్నిధియందుఁగావింపుడు) అనేయర్థము సెప్పఁబడినది.

కాఁబట్టి „అహమస్మ్యపరాధానామాలయః” ఇత్యాదిప్రమాణమందుఁ జెప్పఁబడినట్టి ప్రపత్తిలక్షణములన్నియు నిచ్చోటఁ బ్రత్యక్షముగానున్నవని తాత్పర్యము.

ఆనుకూల్యసఙ్కల్పాదికళఙ్క్కడన్దతోవెన్నిల్; అన్దలక్షణముమ్ ప్రష్కలమ్; ‹‹ఆత్మానం సర్వథా రక్ష పురీంచేమాంసరాక్షసామ్। స్వస్తి

---

ఇదియుండని; శరణాగతికంగములైన యానుకూల్యసంకల్పాదు లిచ్చోటఁ బొసఁగియున్నవా? అనిన నవియు నిచ్చోట సమృద్ధిగానున్న వని సాయించుచున్నారు. ఎట్లనిన; ‹‹ఆత్మానంసర్వథారక్ష పురీంచేమాం

---

[ఆత్మానంసర్వథారక్ష] ఈశ్లోకమునకు ముందున్ను వెనుకనున్ను శ్రీవిభీషణ ప్పెరుమాళ్లు రావణునిమరణమును నిర్ధారణసేసి నిర్దాక్షిణ్యముగాఁ బలికియుండుటవల్లనున్ను, ఇదేశ్లోకమందు ‹‹సుఖీభవమయావినా›› అని నన్నుఁబాసి నీవు సుఖముగానుండుమని యెత్తిపొడిచినట్లుగాఁ బలికియుండుటవల్లనున్ను, ఈశ్లోకము తత్త్వజ్ఞానులయందు సహజముగానుండునట్టి సర్వభూతహితరూపమైన ‹‹ఆనుకూల్యసంకల్ప›› మనే మహాగుణమును చూపుచున్నదని యెట్లుచెప్పవచ్చుననిన; ఇంతకుముందు ‹‹గురుత్వాద్ధితమిచ్ఛతా›› అనేవాక్యమునందు శ్రీవిభీషణప్పెరుమాళ్లు రావణునిఁజూచి జ్యేష్ఠభ్రాతవైన నిన్ను గురువుగా భావించవలసియుండుటవల్ల ‹‹గురోరప్యవలిప్తస్యకార్యాకార్యమజానతః। ఉత్పథంప్రతిపన్నస్యకార్యంభవతిశాసనం›› అనే ప్రమాణమందు గురువైనను స్వరూపవిరుద్ధదురభిమానగ్రస్తుఁడై కార్యాకార్యముల నెఱుంగక లోకకంటకమైన యధర్మమార్గము నవలంబించెనేని యాతని శిక్షించవచ్చునని చెప్పియుండురీతిగా నీకు హితమునుఁగోరి యిట్లుశిక్షించి బుద్ధిచెప్పినానని సాయించియున్నారు కాఁబట్టి, యీవాక్యమున్ను, అదే రీతిగా హితరూపమగుచు ‹‹అనుకూల్యసంకల్ప››మును చూపుచున్నది. అయితే, ఈహితోపదేశము భ్రాతృస్నేహమువల్ల నేర్పడుచున్నదిగదా? అట్లయినపక్షమందున్ను సర్వభూతహితరూపమయిన ‹‹ఆనుకూల్యసంకల్పము›› నిది చూపించుచున్నదనుట యెట్లు సరిపడుననిన; ఈవిభీషణప్పెరుమాళ్లు మొట్టమొదట ‹‹అయశస్యమనాయుష్యం పరదారాభిమర్శనం। అర్థక్షయకరంఘోరం పాపస్యచపునర్భవం›› అని రావణునియందుగల పరస్త్రీగమనమహాదోషము, అపకీర్తికిమూలమై ఆయుస్సును క్షీణముసేసి సమస్తపురుషార్థనిర్మూలనహేతువగుటవల్ల భయంకరమైనదగుచు పాపములకెల్ల జన్మభూమిగా నుండునని మిక్కిలి రోసిపలికినదేగాక, రావణవధానంతరమందున్ను ‹‹నాహమర్హోస్మి సంస్కర్తుం పరదారాభిమర్శినం। భ్రాతృరూపోహిమేశత్రుః›› అని, ఇట్టి పరస్త్రీగమనరూప మహాపాపము సేసినట్టి యీతఁడు నాకుశత్రువనియు, వీనిని సంస్కరింప నేనర్హుఁడుగాడనియు, పలికియుండుటంబట్టి, వీరి కీతనియందు భ్రాతృస్నేహము బహు

తేఽస్తు” ఎన్ఱు-రావణనుక్కుమ్ అవనైప్పట్రినవర్కళుక్కుమ్ నన్మైయైయాశాసిక్కై యాలే *ఆనుకూల్యస్యసఙ్కల్పమ్ శొల్లిఱ్ఱు ;

“ఉత్పపాతగదాపాణిః” ఎన్ఱు కైయిలేతడియిరుక్క, పరిభవిత్త వనైక్కరైయవడిత్తుప్పోరామైయాలే *ప్రాతికూల్యస్యవర్జనమ్ శొల్లిఱ్ఱు;

---

సరాక్షసాం। స్వస్తితేఽస్తు” అని ప్రతికూలుఁడైన రావణునికిన్ని, అతని రాజధానికిన్ని, క్షేమముగలుగుననుగ్రహించుటవల్ల “ఆనుకూల్యస్య సంకల్పః” అనునర్థము సెప్పఁబడినది. “ఆనుకూల్యమిదంప్రోక్తంసర్వ భూతానుకూలతా” అని సర్వభూతంబులకు ననుకూలముగానుండుట యే యానుకూల్యమని ప్రపన్నపారిజాతమందుఁ బ్రసాదించియున్నారు.

“ ఉత్పపాతగదాపాణిః ” అని, చేత గదాదండము ధరియించి యుండియుఁ దన్నవమానము గావించినవారిని యథాశక్తి ప్రహరించి యచ్చోటినుండి వెలువడక (“శీతోభవ” అన్నట్లు “నష్టోభవ” అని రావణుని నశింపఁజేయు శక్తియుండియును “తత్తస్యసదృశంభవేత్” అని పెరుమాళ్లశక్తినే యెదురుచూచి స్వశక్తిని వదలియుండినవీరాట్టి వలె) శ్రీవిభీషణాళ్వానులు స్వశక్తిని వదలియుండినందువల్ల “ప్రాతి కూల్యస్యవర్జనం” అనునర్థము సెప్పఁబడినది. “అవనైయొழியత్తా తనక్కు నన్మైత్తేడుకైయావతు” ఇత్యాదిసూత్రమునందు స్వయత్న మును మిక్కిలి ప్రతికూలమని శ్రీలోకాచార్యగురువులు ప్రసాదించి యున్నారుగదా ?

---

కాలమునుండి వదలిపోయినది. కాఁబట్టి యీయుపదేశము, సర్వభూతములయందున్న సమానముగానుండునట్టి పరదుఃఖాసహిష్ణుత్వము ననుసరించి వచ్చినదే గాని భాగ్యత్వస్నే హామువల్ల వచ్చినదికాదు. ఇవియన్నియుఁ దమతిరువుళ్లములయందు పరిశీలించియేగదా? మనపూర్వాచార్యులందఱు నీశ్లోక మానుకూల్యసంకల్పమునుఁ జూపుచున్నదని ప్రసా దించినారు.

“ఆత్మానంసర్వథారక్ష” ఎన్ని విధములచేతనైనా నీప్రాణములను కాపాడుకొను మని యర్థము.

"హింసాద్యపాయవిరతిః" అనే ప్రపన్నపారిజాతోక్త ప్రమాణమందు, పరహింస మొదలగు అపాయకృత్యములనుమానుట ప్రాతికూల్యవర్జనమని సాయించియుండినను, ఇచట, శ్రీవిభీషణాళ్వానులు రావణుని ప్రహరింపక వచ్చినదానిని, అహింసాగుణముగాఁ జెప్పఁదగదు; బలవంతుఁడును ప్రబలసహాయసంపన్నుఁడును, అయినరావణుని, తానంతటివాఁడుగానట్టి శ్రీవిభీషణప్పెరుమాళ్లు ప్రహరింపఁబూనకుండుట (భయమువల్ల) సహజముగానే యుండునుగదా? కాఁబట్టి, తనరక్షణమందు తాను శక్యమైనంతవఱకైనను పాటుపడక పెరుమాళ్లనే యెదురుచూచుచు రావణగోష్ఠినుండి వెడలిన యిదియే యిచ్చట ప్రాతికూల్యవర్జనముగాఁ బ్రతిపాదింపఁబడినది. "హింసాద్యపాయవిరతిః" అనే పూర్వోక్తప్రమాణమందు పరహింస మొదలయినవి అపాయములని సాయించునప్పుడు, అపాయమనఁగా "జ్ఞానికళుకక్కు-పాయమ్" అనే వచనభూషణ దివ్యశాస్త్రమందు సాయింపఁబడిన ప్రాపకాంతరమే యిచ్చట నపాయశబ్దార్థమని గ్రహించఁదగియున్నది. ఇదియేగదా? పరతంత్రస్వరూపనాశకము. ఇట్లనే తన్నవమానించిన రావణుని నిగ్రహించుటకు తాను యత్నించుటయును ప్రాపకాంతరమగుచున్నది. (అస్మదాదులు ప్రాపకాంతరములని విహితకర్మముల వదలవచ్చునే గాని, మనల నవమానించినవారికి బదులుసేయుటను వదల సమర్థులు గాముగదా?) ఇఁకనిట్లు పరతంత్రస్వరూపనాశకమైన స్వయత్నమును మానుటకంటె నధికమగు ప్రాతికూల్యవర్జనమెద్దియు లేదు; కాఁబట్టి యిదియే యిచ్చోటఁ బ్రతిపాదింపఁబడినది.

అథవా "హింసాద్యపాయవిరతిః" అనునప్పుడు, నిష్కృష్టధర్మనిష్ఠుఁడైన ప్రపన్నునికి మిక్కిలి నిషిద్ధములయిన కామ్యకర్మములయందన్వయముమానుట "హింసావిరతి" యనియును, ప్రపత్త్యుపాయముదక్క నితరోపాయములం దన్వయముమానుట "అపాయవిరతి" యని

"వాలినశ్చవధంశ్రుత్వా సుగ్రీవంచాభిషేచితమ్ । రాజ్యం ప్రార్థయమానశ్చ" ఎన్నుసోదాహరణమాక రాజ్యమ్‌తరవల్ల రెన్దుతి యిట్టువరుకై యాలే*రక్షిష్యతీతివిశ్వాసమ్‌శొల్లిర్ఱు ;

యును, ఈరీతిగా నిర్వహించుటయు నత్యంతసంగతముగానున్నది. "ఇత్థ్రైవవర్తిస్సి త్తతు పరహింసైయైనివర్తిష్షిక్కైక్కాక," అనే శ్రీసూక్తి యందు కామ్యకర్మములను హింసయనియును; "జ్ఞానికళుక్కపాయమ్" అనే శ్రీసూక్తియందు సాధనాంతరములను అపాయమనియును నిర్వహించియుండుటనుఁబట్టి యిచ్చోట నీనిర్వాహము సేయఁబడినది. దీని వల్లనున్ను స్వయత్నత్యాగమే ఫలితార్థమగుటచేత పూర్వనిర్వాహముతో నిది సంగతమగుచున్నది.

"వాలినశ్చవధంశ్రుత్వా సుగ్రీవంచాభిషేచితమ్ । రాజ్యంప్రార్థయమానశ్చ" అని, పెరుమాళ్లు తనకు లంకారాజ్యమునిచ్చు విషయమునందు వాలివధమునున్ను, సుగ్రీవపట్టాభిషేకమునున్ను, ఉదాహరణముగాఁగైకొని, రావణవధంబునుఁ దనరాజ్యప్రాప్తియు నిశ్చయమని నమ్మి వచ్చుటవల్ల "రక్షిష్యతీతివిశ్వాసః" అనునర్థము సెప్పఁబడినది.

"శక్తేస్సూపసదత్వాచ్చ" ఇత్యాది ప్రపన్నపారిజాతోక్త ప్రమాణమునందు సాయించినట్టి యుపపత్తులన్నియు నిచ్చోటఁ బొందు పడుచున్నవి.

అదియెట్టులనిన; "రక్షిష్యతీతివిశ్వాసః" అనఁగా రక్షకుఁడు మనలను రక్షించుటయందు సందేహము లేదనే నమ్మకము. ఇట్టినమ్మకము రక్షకునియందుగల గుణములనుపట్టి కలుగును. ఆగుణములు "శక్తేస్సూపసదత్వాచ్చ కృపాయోగాచ్చశాశ్వతాత్ । ఈశేశితవ్యసంబంధా దనిదంప్రథమాదపి" అని యుదహరించిన ప్రమాణమందు చెప్పఁబడియున్నవి, అందు "శక్తేః" అనుటవల్ల, ఆశ్రితకార్యాపాదకమైన

అఘటితఘటనాసామర్థ్యరూపశక్తియును; ‹‹సూపసదత్వాత్” అనుటవల్ల, ఆశ్రయణ సౌకర్యాపాదకమై ‹‹ స్వామిత్వజ్ఞకలామైక్కసౌశీల్యమ్” అని ప్రసాదింపఁబడిన సౌశీల్యమున్ను; ‹‹కృపాయోగాచ్చశాశ్వతాత్ ”అనుటవల్ల రక్షణమునకు ప్రథమహేతువై యాతనియందు నెలకొనియుండునట్టి పరదుఃఖాసహిష్ణుత్వమున్ను; ‹‹ఈశేశితవ్య...దపి” అనుటవల్ల, ‹‹ కార్యమ్ శెయ్యుమెన్ఱు తుణిక్కై క్కుస్వామిత్వమ్ ” అనే స్వస్వామిసంబంధమున్ను; తెలియఁజేయఁబడియున్నది.

ఇఁకనివి యిచ్చోటఁబొందుపడుట యెట్టులనిన; ‹‹వాలినశ్చవధం” అనునప్పుడు, దుర్ఘటమైన వాలివధమువల్ల, శక్తి, తేటపడుచున్నది. ‹‹సుగ్రీవంచాభిషేచితం” అనునప్పుడు, ఈసుగ్రీవాభిషేకమువల్ల తానుకృతకృత్యుఁడై పరమానందమునుఁ బొందునట్టి పెరుమాళ్ల స్వభావమునుఁబట్టి, సౌశీల్యము, తేటపడుచున్నది. (తనయొక్క మహిమనుఁజూడక, ఆశ్రితు లెంత తక్కువవారైనను వారియోగక్షేమములందు తాను కలసియుండుటయేగదా? సౌశీల్యము.) మఱియు, ‹‹వాలినశ్చ...చితం” అనే రెండువాక్యములందు, సీతావియోగమువల్ల తాను నిరవధికదుఃఖముల ననుభవింపుచుండియు దానినిలక్ష్యపెట్టక, ఆశ్రితదుఃఖమును ముందుగా పరిహరించుటవల్ల పరదుఃఖాసహిష్ణుత్వరూపకృపాయోగము దేటపడుచున్నది. (‹‹పిశాచాన్ దానవాన్ యక్షాన్ పృథివ్యాంచైవరాక్షసాన్ । అంగుళ్యగ్రేణతాన్ హన్యామ్” అని దుష్టగణంబులెల్లఁ దమలో నైకమత్యముగా మాటలాడుకొని యొక్కపెట్టునవచ్చి తన్ను హింసింపఁబూనినను వారినెల్ల నొక్కవ్రేల్మిడినిఁ జక్కడుచునట్టి పెరుమాళ్లు, సుగ్రీవుని సహాయమునుఁగోరి, వాలివధమునున్ను సుగ్రీవాభిషేకమునున్ను చేసినారని నిర్వహించుట యసంగ

సూపసదత్వము అనఁగా దగ్గఱచేరుటకు సులభుఁడై యుండుట.

"భవన్తంశరణంగతః" ఎన్ఱుశొల్లుకైయాలే, *గోప్తృత్వవరణమ్ శొల్లిற்று;

---

తము కాబట్టి, పరదుఃఖాసహిష్ణుత్వరూప కృపాగుణమువల్లనే యీ రెండుకార్యములనున్ను ముందుగాఁజేసినారని నిర్వహింపఁబడినది.)

ఇంతపని సేయుటకు స్వస్వామిసంబంధము ముఖ్యకారణమగుటం బట్టి యదియు నీ రెండుకార్యములవల్లనే (వాలివధ సుగ్రీవాభిషేకము వల్లనే) తేటఁబడుచున్నది.

ఇంతేగాక "రాజ్యంప్రార్థయమానశ్చ" అనువాక్యము సైతము స్వస్వామిసంబంధమునుఁ దెలియఁజేయుచున్నది. సర్వస్వామియైయుండువానియొద్దనేగదా? రాజ్యము ప్రార్థించఁదగును. ఈయర్థము "అణ్డక్కులత్తుక్కు" అనే శ్రీసూక్తియందు స్పష్టముగానున్నది. ఇఁక నీగోష్ఠియందుండువారు "రాజ్యంచాహంచరామస్య" అని (రాజ్యమున్ను, రాజుగాభావింపఁబడిననేనున్ను పెరుమాళ్లకు శేషభూతులనియే తమ మనంబులందు నెలకొల్పుకొని యుండుటవల్ల, స్వస్వామిసంబంధము నుస్పష్టముగా నేర్పడుచున్నదిగదా?

అంతు, "రక్షిష్యతీతివిశ్వాసః" అనువాక్యమందలి యర్థమునకుఁ గావలసిన యుపపత్తులన్నియు నిచ్చోట నిండియున్నవని సిద్ధాంతము గావింపఁబడినది,

"భవంతంసర్వభూతానాం శరణ్యంశరణంగతః" అని సర్వభూతంబులకును శరణ్యుఁడైన నిన్ను నాకు రక్షకుఁడుగా నాశ్రయించినాడననుటవల్ల "గోప్తృత్వవరణం" అనునర్థము చెప్పఁబడినది. గోప్తృత్వవరణమనఁగా నాకు నీవురక్షకుఁడవుగమ్మని ప్రార్థించుట. "ఇవర్ణ్ పాశురమ్ కేట్టవారే తిరువుళ్ళముకక్కుమ్" అనుశ్రీసూక్తి యీప్రార్థననే దెలియఁజేయుచున్నదిగదా?

భవద్గతమ్మే రాజ్యంచ జీవితంచసుఖానిచ" ఎన్ఱు-అఖిలభరసమర్పణమ్పణ్ణుకైయాలే, ఆత్మనిక్షేపమ్శొల్లిత్తు;

"ప్రణాదశ్చమహానేష తతోస్యభయమాగతమ్" ఎన్ఱు-స్వరక్షణత్తిల్ తళర్త్తియాలుమ్, "శీఘ్రంవ్యాదిశనోరాజన్ వధాయైషాందురాత్మనామ్" ఎన్ఱు-పెరుమాళ్ పక్కల్ పోకవొణ్ణాదపడి నడువళియిలే కొల్లనిఱ్కైయాలుమ్, "దైన్యంకార్పణ్యముచ్యతే" ఎన్గిఱ కార్పణ్యమ్శొల్లిత్తు; ఆకైయాల్ ఇన్దలక్షణముమ్ పుష్కలమ్.

ఇప్పడి పుష్కల లక్షణైయాన ప్రపత్తియైప్పణ్ణి ఇతుక్కు ఫలమాక క్కొళ్ళైక్కు పృక్కుకక్కాళమెడుత్తలోపాతి, నామిరుక్క-

---

"భవద్గతంమే రాజ్యంచ జీవితంచసుఖానిచ" అని తన సమస్త భరమునున్ను పెరుమాళ్ల తిరువడిత్తామరలందు సమర్పించుటవల్ల "ఆత్మనిక్షేపః" అనునర్థము చెప్పఁబడినది.

"ప్రణాదశ్చమహానేష తతోస్యభయమాగతమ్" అని బలవంతుఁడైన రావణునివల్ల భయఁపడి యుండుటకును "శీఘ్రంవ్యాదిశనో రాజన్ వధాయైషాందురాత్మనామ్" అని శ్రీవానరవీరులీతని పెరుమాళ్ల సన్నిధియందుఁ జేరనివ్వక మార్గమధ్యమందే చంపుటకు సన్నద్ధులై యుండుటంజూచి దీనుఁడై యుండుటవల్ల " కార్పణ్యం " అనేయర్థము చెప్పఁబడినది. "దైన్యంకార్పణ్యముచ్యతే" అని దైన్యమును కార్పణ్యము నొక్కటిగా చెప్పఁబడియున్నదిగదా? ఇచట కార్పణ్యమనేపదము, నలుదిక్కులందును భయము గ్రమ్ముకొనుటవల్ల నెద్దియుందోఁపక దీనుడై దిక్కులేక నిలచియుండుదశను చూపించుచున్నది.

అంతు, శరణాగతికంగములైన, అనుకూల్యసంకల్పాదులు నైతమిచ్చోఁటఁ బుష్కలముగానున్నవని ప్రతిపాదింపఁబడినది.

ఇక నీశ్లోకమునకు వాక్యార్థమును ప్రసాదింపుచున్నారు; "ఇప్పడి పుష్కలలక్షణైయాన" ఇత్యాదిగా. "పుష్కలలక్షణై" అనుటకు

ఫలాన్తరఙ్గళై యాశైప్పడాతే నమ్మైయే యుకన్దువన్దవనుక్కు సకలభయనివృత్తియుమ్పణ్ణువేన్; ఇతునమక్కు వ్రతమెన్గిఱార్ ఇన్దశ్లోకత్తాల్.

ఇప్పడి అభయప్రదానమ్పణ్ణువతుఆర్ క్కెన్నిల్ ; (సకృదేవ ప్రపన్నాయ) సలక్షణప్రపత్తిపణ్ణినవనుక్కు. అతావతు— సకృదేవప్రపన్నరాయిరుక్కై.

---

«అహామస్మ్యపరాధానాం” ఇత్యాదిగాఁ బ్రతిపాదింపఁబడిన, ఆకించన్యాదులున్ను, «ఆత్మానంసర్వధారతః” ఇత్యాదిగాఁ బ్రతిపాదింపఁబడిన, ఆనుకూల్యసంకల్పాదులున్ను, నిండాయుచున్న అనియర్థము. ఇట్టి సర్వలక్షణములతో నొప్పుచుండు ప్రపత్తికి [విషయనియమ] మొక్కటిమాత్రమే ముఖ్యాపేక్షితముగాని, ఫలనియమము లేదుగదా? ఇట్లుండుటవల్ల, కొల్లకుఁబోయిన్ని, పొల్లునొడిగట్టువానివలె, నీయధికారి యల్పాస్థిర ఫలములనపేక్షింపక యనంతస్థిరఫలమైన మత్ప్రాప్తినే యపేక్షించెనేని యట్టివానికి నేను సకలభయనివృత్తియుఁ జేయుదు ననియును, ఇది నాయొక్కవ్రతమనియు నీశ్లోకమువల్లఁ బ్రసాదింపుచున్నారని వాక్యార్థము.

ఇఁక నీశ్లోకమునకు ప్రతిపదము వ్యాఖ్యానము సేయువారై, అందుఁ బ్రథమంబున మూడుపదములు చేరి యొకవాక్యమగుటచేత నా వాక్యమును గ్రహించుచున్నారు; «సకృదేవప్రపన్నాయ” అని. ఒకతూరిమాత్రమే ప్రపత్తిసేసినవానికని యీవాక్యమున కర్థము కాఁబట్టి యీయర్థమును శంకాపూర్వకముగాఁ బ్రసాదించుచున్నారు; «ఇప్పడి యభయప్రదానమ్పణ్ణువతు ఆర్ క్కెన్నిల్ ? సలక్షణప్రపత్తిపణ్ణినవనుక్కు” అని. ఇట్లభయప్రదానము సేయుట యెవ్వరికనిన? సలక్షణప్రపత్తి

---

[అహామస్మ్యపరాధానాం] ఇది శ్రీవిష్వక్సేనసంహితా ప్రమాణము. దీనియర్థవిశేషములను ముముక్షుపడియందు «ద్వయత్తుక్కధికారి ఆకించన్యముమ్ అనన్యగతిత్వముముడైయవన్” అనే శ్రీసూక్తివ్యాఖ్యానములయందు విశదముగా నెఱుంగవచ్చును.

సకృత్తనక్కుప్పారుళైన్నైన్నాల్ "ఆవృత్తిరసకృదుపదేశాత్" ఎన్నుమ్—"అనేకజన్మసంసిద్ధః" ఎన్నుమ్—భక్తిపోలే స్వరూపనిష్పత్తియు మ్ఫలనిష్పత్తియుమ్ చిరకాలసాధ్యైయన్నిక్కే, "తద్ద్వయంసకృదుచ్చారోభవతి"ఎన్నుమ్—"ఉపాయోయశ్చతుర్థస్తే ప్రోక్తశ్శీఘ్రఫలప్రదః"

---

సేసినవానికి, అని యీవాక్యమునకర్థము. సలక్షణప్రపత్తి యనునప్పుడు, లక్షణశబ్దమునకు, పూర్వోక్తములైన ఆకించన్యాదులున్ను, ఆనుకూల్యసంకల్పాదులున్ను, అర్థముగానుండుటయేగాక, ఇచట ప్రత్యేకముగా నొకయర్థమును చూపించుచున్నారు; "అత్రావతు, సకృదేవ ప్రపన్ననాయిసక్కై"అని. సలక్షణప్రపత్తి సేసినవాడనఁగా నొకతూరి మాత్రమే ప్రపత్తిసేసినవాడని యీవాక్యమునకర్థము. ఇందువల్ల నొకతూరి యనుష్ఠించుటయే ప్రపత్తికి లక్షణమని తాత్పర్యము.

ఇఁక నీయర్థమునుఁబట్టి ప్రపత్త్యుపాయమునకుఁ గలుగునట్టి వైలక్షణ్యవిశేషమును ప్రతిపాదించుచున్నారు "సకృత్తనక్కుప్పారుళైన్నైన్నాల్" ఇత్యాదివాక్యములచే. "ఆవృత్తిరసకృదుపదేశాత్" అనే బ్రహ్మసూత్రమునందు (ఉపాసనము నిరంతరస్మరణరూపముగా నుండునని వేదాంతవాక్యములు ప్రతిపాదించుటంబట్టి) వేదనధ్యానోపాసనశబ్దవాచ్యమైన భక్తియోగము, పలుమాఱు ననుష్ఠించవలసినదని ప్రతిపాదింపఁబడినది. ఇందువల్ల దీర్ఘకాలమనుష్ఠించితేనేగాని దీనికి స్వరూపసిద్ధి గలుగదని యేర్పడుచున్నది. ఇఁక ఫలసిద్ధియెట్టిదనిన; "అనేకజన్మసంసిద్ధః" అనే గీతోపనిషద్వాక్యమునందు, అది యనేకజన్మార్జితపుణ్యసమూహమువల్ల సిద్ధించునని ప్రతిపాదింపఁబడియుండుటవల్ల నదియును దీర్ఘకాలసాధ్యముగానేయున్నది. ఈప్రపత్త్యుపాయ మట్లుగాక, "తద్ద్వయంసకృదుచ్చారోభవతి"[1] "ఉపాయోయంచతుర్థస్తే ప్రోక్తశ్శీ

---

1 [ఉపాయోయమితి] కర్మజ్ఞానభక్తులనే మూడుపాయములకంటే, నాలవదియైన యీప్రపత్త్యుపాయము శీఘ్రముగా ఫలమునిచ్చునని యర్థము.

ఎన్టుమ్ - స్వరూపనిష్పత్తియుమ్ ఫలనిష్పత్తియు మొరుకాలేయాయి రుక్కై.

“సకృదేవ” ఎన్గిఱఅవధారణమ్ - ప్రపన్ననేఎన్టుమ్ - ఒరుకాలే ఇరుకాల్ మట్టిల్లైయెన్టుమ్-అయోగవ్యవచ్ఛేదమో ? అన్యయోగవ్యవచ్ఛేదమోవెన్నిల్ ; ప్రపన్ననేఎన్ట్రపోతు, ప్రపన్ననైయనువదిత్తుఅవనుక్కుఅభయప్రదానమ్పణ్ణువనెన్టు వాక్యత్తుక్కు విధేయ మిత్తనైపోక్కై, ప్రపన్ననో అప్రపన్ననో వెన్టు విమర్శమాయ్ ప్రపన్ననేయెన్టు విధేయమల్లామైయాలుమ్;

---

ఘు ఫలప్రదః” ఇత్యాది ప్రమాణప్రకారముగా నొకతూరి యనుష్ఠించినమాత్రమున స్వరూపసిద్ధివడసి, ఫలసిద్ధియుఁ దత్‌క్షణమునందే కలుగును. కావున భక్త్యుపాయమునకంటె ప్రపత్త్యుపాయము విలక్షణమైనదని “సకృత్తనక్కుప్పొరుళెన్నైన్నాల్” ఇత్యాదివాక్యములకుఁ దాత్పర్యము.

ఇఁక, “సకృదేవ” అనునప్పుడు, అవధారణార్థకమైన “ఏవ” అనేయవ్యయము, (అయోగ్యవ్యవచ్ఛేదమనియు, అన్యయోగవ్యవచ్ఛేదమనియు, పేరుగల) రెండర్థములయం దుపయోగపడుటవల్ల, ఈ స్థలమందది యేయర్థమందుపయోగపడుచున్నదనిన; ఉత్తరమునాయించుచున్నారు; “సకృదేవ” ఎన్గిఱవవధారణమ్” ఇత్యాదివాక్యములచేత. ఇందులో “వైయర్థ్యమ్‌వరుమ్, ఎన్నిల్” అనుగ్రంథమువఱకు, పూర్వపక్షము ప్రతిపాదింపఁబడుచున్నది.

అదియెట్లులనిన: “ఏవ” అనేయవధారణము, ప్రపన్నశబ్దముతోఁజేరి ప్రపన్నునికే యభయమిచ్చెదననే యర్థమునిచ్చుచున్నదా ? లేక సకృత్పదముతోఁజేరి ప్రపత్తి యొకతూరి జేయదగినదేగాని రెండుమూఁడుమాఱులు జేయదగినదిగాదనే యర్థమునిచ్చుచున్నదా? ఇది, అయోగవ్యవచ్ఛేదమా? అన్యయోగవ్యవచ్ఛేదమా? అనిన ప్రపన్న

"సకృదుచ్చారోభవతి" ఎన్రుమ్—"సకృదేవహిశాస్త్రార్థః" ఎన్రుమ్—ప్రపత్తియాకిల్ సకృత్త్వయోజ్యయాయ్ అసకృత్త్వయోజ్యయల్లామైయాలే సకృదావృత్తియా యిరుప్పతొరు ప్రపత్తియిల్ వ్యవచ్ఛేద్య మిల్లామైయాలుమ్ అయోగవ్యవచ్ఛేద మల్లామైయాలుమ్,

"అభయంగతోభవతి" ఎన్రు—అప్రపన్ననాన భక్తినిష్ఠనుక్కుమ్ అభయప్రదానమ్పణ్ణినపడియాలే అన్యయోగవ్యవచ్ఛేద మల్లామైయాలుమ్ వ్యావర్త్యమిల్లై యెన్రిట్టువర్థమ్. ఇని "సకృదేవ" ఎన్రు - ఇఙ్గే కూట్టినపోతు—"సకృదేవకుర్యాత్ నాసకృత్" ఎన్రు - ప్రపత్తిస్వరూ

నికే యనినప్పుడు ప్రపత్తిసేసియుండువానిని, ఎత్తిచూపి, వానికి నే నభయప్రదానంబు సేయుదునని యిచ్చటివాక్యము ప్రతిపాదించు నింతే గాని, వీఁడు ప్రపన్నుఁడో? అప్రపన్నుఁడో? యని విమర్శించి ప్రపన్నుఁడేయని నిర్ణయము సేయనేరదు. కాఁబట్టి యిచ్చట, అయోగవ్యవచ్ఛేదముకాదు. (వీనియందు, ప్రపన్నత్వమున్నదో? లేదో? యను శంకనుఁబోఁగొట్టి యున్నదని నిర్ణయించితేగదా? అయోగవ్యవచ్ఛేదమనవచ్చును.

"అభయంగతోభవతి" అనేశ్రుతి, ప్రపన్నత్వము లేని భక్తినిష్ఠునికిన్ని, అభయప్రదానమును ప్రతిపాదించుచున్నది కాఁబట్టి, అన్యయోగవ్యవచ్ఛేదమున్ను కాదు, (ప్రపన్ను నికే యభయమిచ్చెద, అన్యునికివ్వను, అనేయర్థమునుఁ బ్రతిపాదించెనేని యన్యయోగవ్యవచ్ఛేదమగునని యిచ్చోట నభిప్రాయము.)

---

అయోగవ్యవచ్ఛేదము, అనఁగా విధేయమైన యర్థమందుఁ దోచునట్టి భిన్నాభిప్రాయమునుఁ బోఁగొట్టుట. లేక, విధేయమైన యర్థమున కిచ్చట సంబంధములేదనే అంశమునుఁ బోఁగొట్టు.

అన్యయోగవ్యవచ్ఛేదమనఁగా, విధేయమైన యర్థమునకు భిన్నమైన యభిప్రాయమునుఁ బోఁగొట్టుట.

పాభిధానమ్బణ్ణుకిఱత్తిక్కే ప్రపన్ననమూద్యనాయ్ అభయప్రదాన త్తి
లే తాత్పర్యమాకైయాలే సకృత్తోడే కూట్టినాలుమ్వ్యర్థమ్.

ఇన్ద ఉపపత్తికళాలే సకృత్పదప్రయోగముమ్ వ్యర్థమ్. "సకృ
దేవాభయందదామి" ఎన్గిఱ్ఱేఅన్వయిత్తాలోవెన్నిల్; ఒరుశరీరిక్కు-ప్పిఱ
క్కక్కడవ భయఙ్గళెల్లా మొరుకాలే సహితమాయ్ అవనివినుకైయ

---

ఇఁక నీయవధారణమును సకృత్పదముతోఁ జేర్చినపక్షమందు
"సకృదుచ్చారోభవతి" "సకృదేవహిశాస్త్రార్థః" అనే ప్రమాణములు,
ప్రపత్తి యొకతూరి యనుష్ఠించఁదగినదేగాని రెండుమూడుమాఱు
లనుష్ఠించఁదగినదిగాదని ప్రతిపాదించుటవల్ల నిందును, అయోగవ్యవ
చ్ఛేదముగాదు. సకృత్, పదమునకుఁ బ్రపత్తియందు సంబంధమున్నదో?
లేదో? యనుశంక యుండేగదా? దానిని బోగొట్టి, ఉన్నదని స్థాపించు
నట్టి యయోగవ్యవచ్ఛేదకావధారణమున కిచ్చోటుపనిగలుగును.

అదిలేకున్నను, అన్యయోగవ్యవచ్ఛేదము నిచ్చోటఁ జెప్పవచ్చును
గదా? యనిన నదియు నిచ్చోట నుద్దేశ్యమైనదిగాదు. "సకృదేవప్రపన్నా
యాభయందదామి" అని యొకతూరి ప్రపన్నుఁడైనవానికి నేనభయ
మిచ్చుచున్నానని యీవాక్యము పూర్తియగుచున్నదేగాని, సకృదేవ,
అనే పదమునుఁబట్టి "సకృదేవకుర్యాత్ నాసకృత్" అనే ప్రమాణమునఁ
బ్రతిపాదించినట్లు ప్రపత్తిస్వరూపమును ప్రతిపాదించుటయం దీవాక్య
మున కుద్దేశ్యములేదు.

అట్లయినపక్షమున, సకృత్, ఏవ, అనే రెండుపదములున్ను వ్య
ర్థముగాకుండ "సకృదేవాభయందదామి" (ఒకతూరిగానే యభయ
మిచ్చెద) అనియిట్లు వాక్యము నన్వయించవచ్చునుగదా? యనిన దాని
యందున్ను, అనుపపత్తులుగలవు. ఎట్లనిన; ఎవడైన నొకనికొక శరీర
విషయముగాఁ గలుగునట్టి భయములెల్ల నొక్కకాలమ్మునఁ గూడున్నని

నివృత్తియై యొరుకాలే పణ్ణుకిఱత్ల్లై; భూతకాలత్తిన్ భయజ్ఞళ్ పణ్డే యనుభవిత్తుప్పోయిఱ్ఱన; ఆగామికాలత్తిల్ భయజ్ఞళ్ ఉత్పన్నమ ల్లామైయాలే తన్నివృత్తిఇప్పోతుపణ్ణవొణ్ణాతు. ఇన్నముమ్, ‹‹దదామి" ఎన్ఱు-ప్రారబ్ధమాయ్ పరిసమాప్తమల్లాత శిలభయజళ్ ఉత్పన్నజ్ఞళ ల్లామైయాలే మేల్వరుమవైయక్కైయ వరవరప్పోక్కుకిఱ నెన్గిఱవర్త మానత్తుక్కుమ్ ఒరుకాలేయెన్గిఱ సకృత్పదత్తుక్కుమ్ వ్యాహతియుమ్ వరుమ్, అభయప్రదానమ్పణ్ణుకిఱ ఇన్ఱుతొడజ్గి రావణవధపర్యన్తమాక వుమ్ భయజ్ఞళుక్కుమ్ పరిహారజ్ఞళుక్కుమ్ అవధియిల్లామైయాలే అను ష్ఠాన విరుద్ధము మాకైయాలే,

యు, వాటినొకతూరిగానే పరహారము సేయుచున్నాననియుఁ జెప్పఁ గూడదు. ఎందువల్లననిన; భూతకాలమునందుగలిగిన భయములు ముం దేనివర్తిల్లినవి. భవిష్యత్కాలమునందుఁ గలుగఁబోవు భయముల కిప్ప టికి స్వరూపమే యేర్పడకుండుటవల్ల నవి యిప్పుడు నివర్తింపశక్యములు గావు. వర్తమానకాల భయములుకొన్ని ప్రారబ్ధములై ముగింపుగాక యును, కొన్ని యుత్పత్తిగాకయునున్నవి. ఇట్లుండగా వీటినన్నిఁటి నొకతూరిగానే పరిహారముసేయుచున్నానని సెప్పుట పొసగదు. ఇది యునుంగాక ‹‹దదామి" అనేక్రియ వర్తమానార్థకము కాఁబట్టి, భయ ములు వచ్చుచుండఁగా వాటినప్పుడప్పుడు బోగొట్టుచున్నాననే యర్థ ము నిచ్చుచున్నది; సకృదేవ, అనేపదము భయముల నొకతూరిగానే బోఁగొట్టెదననే యర్థము నిచ్చుచున్నది. ఇందువల్ల నీరెండుపదములు నొకదానికొకటి బాధకములుగా నున్నవి. ఇంతేగాదు, అభయప్రదా నముసేసినదినము మొదలు రావణవధ పర్యంతము శ్రీవిభీషణాళ్వాను లకుఁ గలిగిన భయములకున్ను, తత్పరిహారములకున్ను, కొలదిలేదు గదా? ఇట్లుండగా నొకతూరిగానే యభయమిచ్చెదనని యన్వయము సేయుట యనుష్ఠానమునకున్ను విరోధమగుచున్నది.

"సకృత్" ఎన్నుమ్—"ఏవ" ఎన్నుమ్—ప్రస్తుతపదజ్గళుక్కు—వైయర్థ్యమ్ వరుమ్ ఎన్నిల్; వారాతు; అవ్విరణ్డుపదజ్గళుమ్ "ప్రపన్నాయ" ఎన్గి అపదత్తోడే అన్వితజ్గళాకై, ఇవ్విడత్తుక్కు పరమోద్దేశ్యమాకైయాలే. ఎజ్గనేయెన్నిల్ :—

సకృత్త్వయోజ్యైయాన ప్రపత్తియై "రాఘవంశరణంగతః" ఎన్నుమ్, "పాదయోశ్శరణాన్వేషీనిపపాత" ఎన్నుమ్, "భవంతంశరణాగతః" ఎన్నుమ్, ముక్కాల్ పణ్ణినవిత్తాల్ ప్రపత్తిలక్షణహానియుమ్, ప్రపత్త్రుస్వరూపహానియుమ్, ప్రపత్తవ్యస్వరూపహానియుమ్, ప్రసజ్గిక్కుమెన్ఱోరు శంకైవరుమిత్తే; అన్దశంకైయై "సకృదేవప్రపన్నాయ" ఎన్గిఱ వాక్యాన్వయమ్ పరిహరిక్కక్కడవతు.

అయితే, సకృత్, ఏవ, అనేపదములు రెంటికిన్ని, ఈస్థలమందు ప్రయోజనములేకుండుటవల్ల నవి వ్యర్థములేకదా? యనిన వ్యర్థములు కావని సిద్ధాంతమును ప్రతిపాదింపుచున్నారు; "అవ్విరణ్డుపదజ్గళుమ్" ఇత్యాది వాక్యములచేత. ఈసిద్ధాంతము "సకృదేవ" ఎన్గిఱపదమ్ సప్రయోజనమాకక్కడవతు" అనువాక్యముతో పూర్తియగుచున్నది. తత్ప్రతిపాదనంబెట్లులనిన; ఈస్థలమందు "సకృత్, ఏవ" అనే రెండు పదములనున్ను "ప్రపన్నాయ" అనేపదముతోఁ జేర్చుటవల్ల, ఆవశ్యకములైన మూఁడు నాలుగు శంకలు పరిహరింపఁబడుచున్నవి కాఁబట్టి, అట్లు అన్వయించుట పరమోద్దేశ్యముగానున్నది.

అట్టి శంకలేవి? వాటికి పరిహారంబేది? అనిన; "సకృదుచ్చారో భవతి" "సకృదేవహిశాస్త్రార్థః" ఇత్యాది శ్రుతిస్మృతివాక్యములఁ

[సకృదేవహిశాస్త్రార్థః కృతోయంతారయేన్నరం] "ఇతు సర్వముక్తిప్రసంగపరిహారార్థమ్" ఇత్యాది శ్రీసూక్తిప్రకారముగా నీప్రపత్తి కుపాయత్వమే లేకున్నను, శాస్త్రమర్యాదననుసరించుటకై సకృత్తుగా ననుష్ఠించవలసియున్నది. అంతట నీప్రపత్తియొసకృదనుష్ఠానముచేతనే ప్రపన్నుని తరింపఁజేయునని యర్థము.

బట్టి యీప్రపత్తి యొకతూరిమాత్రమే యనుష్ఠించఁదగినదని ప్రతిపాదింపఁబడియున్నదిగదా ? ఇట్లుండగా నిచ్చోట శ్రీవిభీషణాళ్వాను లనుష్ఠించిన ప్రపత్తి, తొలుత ‘‘రాఘవంశరణంగతః’’ అనియును, తరువాత ‘‘పాదయోశ్శరణాన్వేషీనిపపాత’’ అనియును, ఆవెనుక ‘‘భవంతంశరణాగతః’’ అనియును, ముమ్మాఱుగాఁ జేయఁబడియున్నది. ఇందువల్ల పూర్వోక్తమైన ‘‘సకృదుచ్చారోభవతి’’ ఇత్యాది ప్రపత్తిలక్షణమునకు హానికలుగుచున్నది.

ఇంతకుపైన, అత్యంతపరతంత్రుఁడైన యీయధికారి, తాను సేసిన సకృత్ప్రపత్తినిసైతముపాయమని తలఁచుట స్వరూపవిరుద్ధముగాన అచిద్వ్యావృత్తివేషమయిన (అనఁగా జ్ఞానశూన్యమయిన యచేతనవస్తువునకన్న భిన్నుఁడైన చేతనునియొక్క జ్ఞాతృత్వమునకు చేరినదై వచ్చినట్టి) ‘‘రక్ష్యత్వానుమతి’’ రూప స్వీకారమునుసైతము ‘‘అతువుమవనతిన్నరుళే’’ అని సర్వేశ్వరుని నిర్హేతుక కృపవల్లఁగలిగినదని భావించుట, తన స్వరూపమునకుఁ దగియుండగా, ముమ్మాఱు ప్రపత్తిసేయుటవల్లఁ ప్రపత్తృ (ప్రపత్త్యధికారి) స్వరూపహానియు గలిగినది.

ఇంతకుపై, ముమ్మాఱు ప్రపత్తిసేయునంతవఱకున్ను రక్షకుఁడుపేక్షించియుండుటవల్ల ప్రపత్తవ్య (శరణాగతునిచే నాశ్రయింపఁబడువాని) స్వరూపహానియునుఁ గలిగినది.

ఈమూఁడుదోషము లిట్లుండగా; పూర్వోక్తములైన ప్రపత్తి లక్షణహాని ప్రపత్తృస్వరూపహాని అనే యీ రెంటివల్ల శ్రీవిభీషణాళ్వానులయందు ప్రపన్నత్వమే లేకపోవుచున్నదిగదా? ఇట్లయినపక్షమందు ‘‘ఏవందోషోమహానత్ర ప్రపన్నానామరక్షణే’’ అని (కండూపాఖ్యాన ప్రతిపాదనఘట్టమందు) పెరుమాళ్లు ‘‘ప్రపన్నానాం’’ అనేపదమువల్ల శ్రీవిభీషణాళ్వానులు ప్రపన్నులని సాయించిన శ్రీసూక్తి యేమయినది. ఆశ్రీసూక్తి సముద్రఘోషమువంటిదైతే ‘‘ రామోద్విర్నాభిభాషతే ’’

ఆనాలిరణ్డుమూన్ఱు పణ్ణిప్పణ్ణిత్తాకయెడుత్త ప్రమాణజ్గళ్ శెయ్యుమ్బడి యెన్నెన్నిల్? "రాక్షసో౽భ్యేతిపశ్యధ్వమస్మాన్హంతుంనసంశయః" ఎన్ఱు అభిశాపమ్శొన్న ముతలికళై ప్పార్త్తు "సో౽హంపరుషితస్తేన దాసవచ్చావమానితః। త్యక్త్వాపుత్రాంశ్చదారాంశ్చ రాఘవంశరణంగతః" ఎన్ఱునానప్పడి విరోధియాయ్వన్దవనల్లన్, అవన్దానేపరిభవిత్తు

అనే పెరుమాళ్ల ప్రతిజ్ఞయున్ను, "నతేవాగనృతాకావ్యే కాచిదత్రభవిష్యతి" అని శ్రీవాల్మీకిభగవానులకు బ్రహ్మదేవుఁడిచ్చిన వరమున్ను వ్యర్థములగుచున్నవిగదా? అనియు నొకశంక యుదయించుచున్నది.

ఇట్లని వార్యములైవచ్చునట్టి శంకలను పరిహరించుటకై "ప్రపన్నాయ" అనేపదముతో "సకృదేవ" అనేపదములను చేర్చుట, ఇచ్చోట పరమోద్దేశ్యమయినది. ఇట్లు వాక్యము నన్వయించుటవల్ల శ్రీవిభీషణాళ్వాను లొకతూరిమాత్రమే ప్రపత్తిసేసినారుగాని రెండుమూడుమాఱులు సేయలేదనే యర్థమేర్పడుచున్నది. ఈయర్థము సిద్ధాంతమగుటంబట్టి పూర్వోక్తశంకలొక్కటియు నిర్వ్యోఢఁ దలసూప నెడముగానక నిరస్తములైపోవుచున్నవి.

అయితే శ్రీవిభీషణాళ్వానులు రెండుమూడుమాఱులు ప్రపత్తి సేసినారని యెత్తిచూపింపఁబడిన ప్రమాణములకుఁ దాత్పర్యమేమనిన; "రాక్షసో౽భ్యేతిపశ్యధ్వమస్మాన్హంతుంనసంశయః" అని తనయందపదూఱు మోపిన శ్రీసుగ్రీవమహారాజు మొదలగువారినిఁజూచి, "సో౽హంపరుషితస్తేన దాసవచ్చావమానితః।త్యక్త్వాపుత్రాంశ్చదారాంశ్చ రాఘవంశరణంగతః" అని నేనట్లు విరోధిగావచ్చినవాఁడఁగాను, సోదరభ్రాంతతమై హితముపదేశించిన నన్నా రావణుఁడు, అతినీచంబుగాఁ బరిభవించి తొలఁగఁద్రోయుటవల్ల నేనాతని సంబంధమునువదలి, త్యాజ్యాంశములనెల్ల నవాసనగాఁద్యజియించి, ఆశ్రయణీయులైన పెరుమాళ్లను

ప్పోకచ్చొల్ల అవనోట్టై సంబంధంగళైయుమ్విట్టు పెరుమాళై శరణమ్ పుక వన్దేనెన్ఱు తన్నరుళ్పాడు శొన్నాక్కాముఱ్పడ. “ఆనయ” ఎన్ఱు పెరుమాళరుళిచ్చెయ్య “ అస్మాభిస్తుల్యోభవతు ” “సఖిత్వంచాభ్యుపైతునః” ఎన్ఱు మహారాజరనుమతిపణ్ణినపిన్బు “ ఖాత్పపాతావనిం ” ఎన్ఱు భూమియిలేయిఴిన్దు, “పాదయోశ్శరణాన్వేషీనిపపాత ”ఎన్ఱు శరణ్యర్ తిరువడికళిల్ విఴున్దమైచ్చొల్లుకిఱ తిరణ్ణామ్పణ్. ఇని “భవంతంసర్వభూతానాం శరణ్యంశరణాగతః” ఎన్గిఱవితు, మహారాజర్ వార్త్తైకళాలే పెరుమాళ్ కలఙ్గినారో? ఎన్ఱు శంకిత్తు అవర్రై త్తెళియవిడుకైక్కు-విణ్ణ

---

శరణాగతిఁబొందుటకై వచ్చినానని శ్రీవిభీషణాళ్వానులు తన మొఱ నెఱింగించినమాత్రమునే మొదటిశ్లోకము దెలియఁజేయుచున్నది.

పిమ్మట (“ఆనయ” అని) శ్రీవిభీషణాళ్వానులకు నేనభయమిచ్చినాను, ఇఁక నాతని నాయొద్దకు దోడ్కొనిరమ్మని పెరుమాళ్లు సాయించఁగా, శ్రీసుగ్రీవమహారాజు పెరుమాళ్ల తిరువుళ్లమునను సరించి, తన యతిశంక లెల్లవదలి, “అస్మాభిస్తుల్యోభవతు” “సఖిత్వంచాభ్యుపైతు” అని సమ్మతించినవెనుక “ఖాత్పపాతావనిం” అని యాకాశమునుండి భూమికిదిగి “పాదయోశ్శరణాన్వేషీనిపపాత” అని శరణ్యుని తిరువడిత్తామరలయందు పడినాడనే యీయర్థమునుమాత్రమే రెండవశరణాగతి శ్లోకము దెలియఁజేయుచున్నది.

ఇఁక “ భవంతంసర్వభూతానాం శరణ్యంశరణాగతః ” అనే మూడవ శరణాగతిశ్లోకము,తొలుత శ్రీసుగ్రీవమహారాజు అతిశంకఁజేసి పలికిన వాక్యములవల్ల పెరుమాళ్ల తిరువుళ్లము కలవరపడియుండునేమో? యని శ్రీవిభీషణాళ్వానులు శంకించి యట్టికలవరమునుఁ దీర్చుటకై తన స్థితిని పెరుమాళ్లసన్నిధిలో విన్నవించినారనే యీమాత్రమునే తెలియఁజేయుచున్నది.

ప్పమ్ శెయ్తనిలై యాకక్కడవతు. ఆకై యాలే పూర్వోక్తంగళాన త్రివిధహానికళుక్కుమ్ ప్రసక్తియిల్లైయెన్ఱు, ఉక్తశంకాపరిహారత్తిల్ “సకృదేవ” ఎన్ఱిఅపదమ్ సప్రయోజనమాకక్కడవతు.

---

(ఇచట నీమూడు శరణాగతులకున్ను, ఇట్లు విషయభేదమును చూపించుటవల్ల “బద్ధాంజలిపుటందీనం యాచంతంశరణాగతం” అని కందుగాథయందు ప్రతిపాదింపఁబడినట్టి నాలుగు వృత్తివిశేషములు మాత్రమే శరణ్యహృదయమందు నెలకొనియున్నవిగాని, పూర్ణప్రపత్తిని సైతము వారపేక్షించి యుండలేదనేభావము తేటపడుచున్నది.)

శరణాగతి ప్రతిపాదకములైన యీమూడు వాక్యములలో “రాఘవంశరణంగతః” అనే తొలుతటివాక్యమునందు “త్యక్త్వాపుత్రాంశ్చదారాంశ్చ” అని త్యాజ్యాంశములనున్ను త్యాగప్రకారమునున్ను, “సోహంపరుషితస్తేన దాసవచ్చావమానితః” అని చరమశ్లోకమందలి “పరి” అనే ఉపసర్గార్థ మిచ్చటనున్నదనుటకు హేతువునున్ను, ప్రతిపాదించుటయేగాక, ఇందు ముఖ్యముగా నీయధికారికి ద్వారశేషి పురుషకార పురస్సరణము సుస్పష్టముగాఁ బ్రకాశింపుచుండుటవల్ల నిది యొక్కటియే ప్రధానముగా ప్రపత్తిని ప్రతిపాదించుచున్నది. తక్కినవి రెండున్ను వాక్యములయొక్క వ్యాపారరూపములుగా వచ్చినవే గాని వేరుగావు. సకృత్ప్రపత్తివల్ల స్వరూపసిద్ధిని అనఁగా ప్రపన్నత్వమునుఁ బొందినట్టి యీయధికారికి స్వరూపోచితవృత్తులై వచ్చినట్టి కాయికప్రపత్తియు వాచికప్రపత్తియు నెన్నడును పునఃప్రపత్తిలోఁ జేరవుగదా? కాఁబట్టి “సకృదేవప్రపన్నాయ” అనుచున్నారు. ఇందువల్ల పూర్వోక్తశంకలొక్కటియు నిచ్చట తలసూపవని భావము. ఇట్లు “సకృదేవ” అనేపదము, ఈశంకలను పరిహరించువిషయమై సప్రయోజనమగుచున్నది.

అన్వయిలే, ఇ(సకృదేవప్రపన్నాయ) ఎన్ఱు- "అనేకస్మాద్వ్యావృత్తోధర్మో౽నేకధర్మః'' ఎన్గిఱాపోలే, సకృదేవ నిశ్చిత్య ప్రపన్ననెన్ఱాయ్, మధ్యమపద లోపియాన సమాసమాయ్, "విచార్యచపునః పునః" ఎన్ఱు -దుష్టనో అదుష్టనో, శత్రువో అశత్రువో, మిత్రనో అమిత్రనో, వధ్యనోఅవధ్యనో, స్వీకార్యనోబహిష్కార్యనో ఎన్ఱునాప్పట్టాప్పోలే, లఙ్కామిత్రధనాదికళైవిడువేనోపఱ్ఱువేనో, రావణనై విడువేనోపఱ్ఱువేనో, పోకుకిఱ విడత్తిల్ కైక్కొళ్ళువర్కళో తళ్ళువర్కళో, రాజ్యఙ్కిడైక్కుమో కిడైయాతో, ఎన్గిప్పడైకళిలే బహుముఖమాయ్

---

ఇచట శ్రీసుగ్రీవమహారాజు మొదలగువారు శ్రీవిభీషణప్పెరుమాళ్ల విషయమందు లేనియపదూఱును మోపుటకు కారణము వీరలకు పెరుమాళ్ల విషయమందుగల యతిస్నేహమేగాని వేరుగాదు. "ఇళైయపెరుమాళై శ్రీగుహప్పెరుమా ళతిశంకైపణ్ణ" ఇత్యాది శ్రీజగద్గురు శ్రీసూక్తియందీయర్థము సుస్పష్టముగా నెఱుంగవచ్చును.

అథవా; "సకృదేవప్రపన్నాయ'' అనునప్పుడు, సకృదేవనిశ్చిత్య ప్రపన్నాయ, అని మధ్యమపదము నధ్యాహరించుకొనవచ్చును. దీనివల్ల నొకతూరిగానే నిశ్చయించి శరణుచొచ్చినాడని యర్థమగుచు; అందుపై, మనమాతనిఁ జేకొనుటకుగాను, దుష్టుఁడో? అదుష్టుఁడో? మిత్రుఁడో? అమిత్రుఁడో? వధ్యుఁడో? అవధ్యుఁడో? స్వీకరింప నర్హుఁడో? అనర్హుఁడో? అని యారీతిగాఁ బలుదెఱంగుల నాలోచించిన ట్లతఁడును లంకామిత్రధనాదులఁ బరిత్యజింతునా? పరిగ్రహింతునా? సోదరుఁడైన రావణుని సంబంధమును విడనాడుదునా? పట్టుదునా? నేనుపోవుచోటఁ బరులు నన్నంగీకరింతురో? తొలంగఁద్రోయుదురో? రాజ్యము లభించునో? లభించదో? అని పలుదెఱంగుల నాలోచించి కలవరముఁ జెందక యొకతూరిగానే నిర్ణయించుకొని నమ్మివచ్చినాడని పెరుమాళ్ల తిరువుళ్ల

విచారిత్తు అళప్పతు ముకప్పెత్తాకైయన్నిక్కే * సకృత్సమీాత్యైవసు నిశ్చితంతదా-పోతే ఒరుకాలేయఱుతియిట్టువన్దవనన్నిఱాారాశవృహామ్.

అన్నియిలే, 3సహసాశబ్దస్య సకృదాదేశమాయ్, సహసైవ ప్రపన్నాయ ఎన్రాయ్, అత్తావతు ‘‘అజగామ ముహూర్తేన’’ ఎన్రుమ్- ‘‘ఒల్లైనీపోతాయ్’’ ఎన్నుఙ్గొల్లుకిఱపడియే, *నిన్రవానిల్లా నెఞ్జిప్పిఱన్ద వానుకూల్యమ్ పురివతఱ్కు-మున్నేవన్దాన్నై. అన్నియిలే, ర(సహసా ప్రపన్నాయ) ఎన్ను-

ముగా నొక తాత్పర్య మేర్పడుచున్నది. ఇందువల్ల ప్రపన్నునికావశ్యక మైన మహావిశ్వాసము సూచింపఁబడినది.

అథవా; సహసా, అనే, అవ్యయమునకు, సకృత్, అని యా దేశమునుఁ గైకొనవచ్చును. అప్పుడు, ‘‘సకృదేవ’’ అనుటకు, తత్ క్షణమునందే, అనిగాని, ఒక్కటియు నాలోచించకనే యనిగాని, అర్థ మగుచున్నది.

ఇందు మొదటి యర్థమువల్ల ‘‘నిన్రవానిల్లానెఞ్జు’’ అని జ్ఞానాధికులు సైతమునమ్మకుండునట్టి మన స్తత్త్వమునందు *ఘుణాక్షరన్యాయముగా నేర్పడిన యానుకూల్యము, మాఱుటకుముందే ‘‘ అజగామ ముహూర్తేన’’ అనే ప్రకారముగావచ్చి శరణుచొచ్చినాడని భావమేర్పడుచున్నది.

రెండవ యర్థమువల్ల, అనాదిగా నూర్జితపడియుండు స్వజన గోష్ఠినివదలి, (లంకారాజ్యము నడుగంట నిర్మూలము సేయుదునని వచ్చి సముద్రతీరమునందు విడిసియుండు) పెరుమాళ్లను శరణుచొచ్చితే,

* ఘుణాక్షరన్యాయమనఁగా, నేదైన నొక పురుగు తనంతటసంచరించునప్పుడు, అదిపోయినజాడ యేదైన నొక యక్షరమై యేర్పడువిధంబుగానని యర్థము. ఇఁదువల్ల, ఆనుకూల్యము దైవగతిగా తనంతట గలిగినదని పెరుమాళ్లతిరువుళ్లముఁ దలచియున్నా రని భావమేర్పడుచున్నది.

ఒన్ఱైయుమ్ నిరూపియాతే సాహసికనాయ్ వన్దా౯. అతావతు-రావణ౯ గోష్ఠియిలేనిన్ఱు కడఱ్కరైయిలేయిరుక్కిఱ పెరుమాళై శరణమ్ పుక్కాల్ అవర్ పిడిత్తుక్కొణ్డుపోయ్ విలఙ్గిలేయిడిల్ శెయ్వతెన్నెన్ఱు భయప్పడాతే పట్టతుపడుకిఱతు ఎన్ఱు అవ౯ వన్ద సాహసఙ్గళుమెన్గిఱారాకవుమామ్.

ఇప్పడి శరణాగతరక్షణమ్ పణ్ణుకిఱేరాకిల్ అడియే౯ శరణాగతియిలే సర్పమృతియుణ్డోవెన్న; ౨ (సహసాప్రపన్నాయ) * అన్ఱిన్ఱ

వారు. తన్నుఁబట్టి కాళ్లకు సంకెళ్లు దగిలించివైచిన నేమిసేయవచ్చుననే భయమునుఁ దలంపునకుఁ దెచ్చుకొనకనే, పరులచే నెట్టిపాటైననుఁ గలుగని, యని తెంపుసేసి, దుష్టసహవాసము వదలినదే చాలునను తలంపుతో వచ్చినాడని భావమేర్పడుచున్నది. ఇదియును పెరుమాళ్ల తిరువుళ్లముగానే నిర్ణయించఁదగియున్నది.

ఇట్లు శరణాగతరక్షణము సేయుదురేని (యీవిభీషణునిఁ జేర్చితే మనకందఱికి నపాయముగలుగుననే భయమువల్ల) "సుగ్రీవస్సహలక్ష్మణః। ప్రణతోవాక్యమబ్రవీత్" అని యిళైయపెరుమాళ్లను గూడఁ జేర్చుకొని (రావణగూఢచారుఁడైన యీవిభీషణునిఁ జేర్చఁగూడదని ప్రార్థింపుచు) దేవరవారి తిరువడిత్తామరలయందు దాసుడనుష్ఠించినట్టి శరణాగతియందు ౧సర్పమృతిదోషమేమైన సంభవించియున్నదా? అని శ్రీసుగ్రీవమహారాజు భావింపఁగా, పెరుమాళ్లు దానికుత్తరము సాయించినట్లొక తాత్పర్యమగుభంగి వాక్యార్థముఁ బ్రసాదింపుచున్నారు; "సహసాప్రపన్నాయ" అని. సహసా, అనుటకు శీఘ్రముగానని యిచ్చోట

౧ సర్పమృతిదోషమనఁగా, ఆరోగ్యకరమును నిర్మలమునైన పుణ్యతీర్థోదకమునందు, స్నానపానాదులు సేయుటకు విరోధముగా విషజంతువుపడి మృతిజెందిన, నది యనుపయోగమైపోవును కాఁబట్టి, మాశరణాగతియం దట్టిదోషమేదైననుఁ గలదా? యని శ్రీసుగ్రీవమహారాజుయొక్క అభిప్రాయమని భావము.

కన్ఱుక్కాక్కమున్నీన్ఱకన్ఱై కొమ్బట్టిలు ఇట్టరన్బిలుమ్మకొళ్ళుమ్ తాయై
ప్పోలే పాల్ పాయశరణాగతనాయ్ ఫలముమ్మెత్తాతవివనుక్కేయామ

---

నర్థము. ఇందువల్ల నిప్పుడే శరణాగతిఁ బొందినాడని భావమున గ్రహిం చి తాత్పర్యము ప్రసాదింపుచున్నారు, ‘‘పాల్ పాయశరణాగతనాయ్’’ అని. ఈవాక్యమునకుఁ దాత్పర్యమేమనఁగా; ‘‘ఇళఙ్గన్ఱైయమైక్కుక్కిరఙ్గి నినైత్తుములైవళియేనిన్ఱుపాల్ శోర’’అను శ్రీసూక్తి రీతిగా దూడయందు ప్రేమాతిశయమువల్ల స్తనములనుండి దనంతట పాలుగాఱుచుండియు, పొదుగునఁజేరి స్తనములఁబట్టి పాలుద్రాగుటకు నైతము నేరవని (అపుడు పుట్టిన) దూడవలె, (నేను, రక్షాపేక్షాప్రతీక్షుఁడనై, అనఁగా రక్షణము నపేక్షించువారు చిక్కుదురా? యని సమయము నిరీక్షించువాడనై, దయారసము వెల్లిగొనఁ బైఁబడుచుండియు) నన్ను సమీపించి యస్మ ద్గుణానుభవరసపారవశ్యముతో శరణాగతిఁబొందలేక (‘‘వాయిల్ పల్లు మెయ్యుగ్గిలమయిరుమ్ముడికూడిత్తిల’’ ‘‘ముగైయోముగ్గముగ్గమ్మోబ్బ న్దిల’’ అనురీతిగా) గుణానుభవమువల్లఁ గలిగినప్రీతి జనించుటకుముందే ప్రపన్నుడైనాడని భావము. గుణకృతదాస్యమునకంటె స్వరూపప్రయు క్తమైన దాస్యమేగదా ప్రధానము.

ఇందువల్ల మదీయనిరవధికవాత్సల్యమునకు ప్రథమపాత్రభూతుఁడితఁ డేగాని నీవుగానేరవని పెరుమాళ్లు తిరువుళ్లమని సదృష్టాంతముగాఁ బ్రసా దింపుచున్నారు;‘‘అన్ఱీన్ఱకన్ఱుక్కాక్కమున్నీన్ఱకన్ఱై కొమ్బట్టిలుమ్ కుళమ్బి లుమ్ కొళ్ళుమ్ తాయైప్పోలే’’ అని. ఈవాక్యమునకు ‘‘ఇవనుక్కేయా మత్తనైపోక్కి’’ అనేవాక్యముతో సంబంధము. అప్పుడేపుట్టిన దూడ యందుగల ప్రీతివల్ల దీనికిముందుపుట్టిన దూడను పొడిచియుఁ దన్నియుఁ దొలఁగఁద్రోయునట్టి ధేనువువలె, నేనీతనిపక్షమువాడనేగాని నీపక్షము వాడఁగానని యీవాక్యములకర్థము.

త్తస్యై ప్రోక్త సర్వశరణాగతనాయ్ రాజ్యదారఫలముమ్ పెఱ్ఱువుమ
క్కాకోమ్.

---

ఇతనియందిట్టి యతిమాత్రవాత్సల్యము గలుగుటకు మఱియొక్క కారణమున్ను గలదని ప్రసాదింపుచున్నారు; "ఫలమున్ని జాత" అని. "శ్రీవిభీషణాళ్వానుక్కు ఫలమ్ రామప్రాప్తి" అని ప్రామాణికులు నిర్ణయించి యున్నారుగాన, తాను సేసిన ప్రపత్తికి ఫలమైన మత్ప్రాప్తిని బడయనేరక నిలచియున్నాడని యీవాక్యమునకు భావము. "ఫలముమ్" అనే చకారము, నన్ను శరణుచొచ్చి నాయందుచుకుఁగూడ డాయనేరక నిరాలంబమైన యాకాశమున నిలచియున్నాడే? అక్కటా? యని పెరుమాళ్ల తిరువుళ్లము నొచ్చియున్నదనే యర్థమునిచ్చుచున్నది.

ఇది యిట్టిదిగానేయుండని; ప్రపత్తి, అమోఘోపాయముగా నుండియు, మేముసేసిన ప్రపత్తి, ఇట్లు నిశ్శేషముగా విఫలముకావచ్చునా? అనిన, మీప్రపత్తి, "స్థితోభవంయత్రసయత్రలక్ష్మణః" అని అస్థానేభయశంకవల్లఁ గలిగినదిగాన నది యాదరణీయముగాదు. ఒకవేళ, ఆదరణీయమైనను, అది శ్రీవిభీషణశరణాగతికి సమముగాదని సాయించుచున్నారు, "సర్వశరణాగతనాయ్ రాజ్యదారఫలముమ్ పెఱ్ఱ" అని. సర్వశరణాగతుఁడనగా సర్వప్రకారముల నిరూపించి గుణదోషంబుల నెఱింగి శరణాగతుఁడని యీవాక్యమునకర్థము. ఋశ్యమూకపర్వతమునందుండి తొలుత పెరుమాళ్లను చూచినప్పుడు దృష్టిచిత్తాపహారియైన వారిరూప సంహననముచేతనే శరణాగతవత్సలత్వము నెఱుంగఁదగియుండఁగా నంతకుపైన, ఐంద్రవ్యాకరణ పండితుఁడైన తిరువడినిగొని వారి యావదభిప్రాయమునుఁ గనుఁగొని, పిమ్మట నగ్నిసాక్షికంబుగా సఖ్యంబుసేసి, సప్తసాల విభేదనముచేత వీర్యమును బట్

ఇప్పుడియావతు అవన్దాన్ శరణాగతనాకిలన్జో, "శోఘ్రింవ్యాది

క్షించి యంతకును తరువాత, "సమూర్ధ్నా న్యపతత్" అని, స్వామివారి తిరువడిత్తామరలందు శిరస్సుఁజేర్చి సాంగప్రపత్తి సేయుటవల్ల, సర్వప్రకారంబుల నిరూపించి గుణదోషంబులనెఱింగి ప్రపత్తిసేసినాడనే యర్థము సెప్పఁబడినది. "వాలినశ్చవధం శ్రుత్వా సుగ్రీవంచాభిషేచితం" అని, శ్రీవిభీషణప్పెరుమాళ్లు, వాలివధమునున్ను, సీపట్టాభిషేకమునున్ను చెవుల వినినంతమాత్రమేకాని యిన్నివిధములఁ బరీక్షించి ప్రపత్తి సేయలేదుగదా? ఇట్లు పరిశీలనలేకనే నన్ను నమ్మివచ్చి ప్రపత్తిసేసి తత్ఫలమునున్నుఁ బొందక "ఖస్థఏవవ్యతిష్ఠత" అని, భూమియందును లేక, ఆకాశమందును లేక, నిరాలంబముగా నిలచియుండువానితో సమానముగా (చక్కఁగఁ బరిశీలించి ప్రపత్తిసేసి రాజ్యమునున్ను భార్యాసౌఖ్యమునున్నుఁ బొందియున్న) నిన్నెట్లుఁ బోల్చవచ్చునని తిరువుళ్లమని "సర్వశరణాగతనాయ్" ఇత్యాది వాక్యమునకు తాత్పర్యము.

ఇట్టి శ్రీవిభీషణశరణాగతివల్ల దీనికి విరోధమైన (అనఁగా విభీషణపరిత్యాగమునకై లక్ష్మణసుగ్రీవులచేఁ జేయఁబడిన) శరణాగతి, వ్యర్థమయినదని సిద్ధాంతము. ఇందువల్ల భాగవతవిరోధముగాచేయు ప్రపత్తి శేషితిరువుళ్లమునకసమ్మతముగానే మాసిపోవునని ముఖ్యతాత్పర్య మేర్పడుచున్నది.

ఇఁక నవధారణార్థకమైన "ఏవ" అనే యవ్యయమును "ప్రపన్నాయ" అనే పదములోఁజేర్చి భావాంతరములఁ బ్రసాదించి భోగ్యపరచుచున్నారు. అదియెట్లులనిన; శరణాగతుఁడనని వచ్చినవాఁడు వీర లెన్నివిధములఁ దొలఁగఁద్రోచినను బోవక యనన్యగతికుఁడై నిలచియుండినఁగదా? ఇంతదూరము సాయించవలెను. వాఁడు

శనోరాజన్ వధాయైషాం దురాత్మనామ్” ఎన్ఱుమ్ – “వధ్యతామేష తీవ్రేణదణ్డేన సచివైస్సహ” ఎన్ఱుమ్ – నాఙ్గళ్ శొన్నవార్త్తైయై క్కేట్టు వెరువిప్పోకసిఙ్క్క అవనన్ఱోవెన్న *౧(ప్రపన్నాయైవ) నామిప్పడివిప్రతిపన్నరానవళవిలుమ్ అవన్ ప్రపన్ననే, పోకాన్గాణుమెన్గిఱార్.

ప్రపన్ననేకాణుమెన్ఱపళిచ్చెయ్యానిన్ఱీర్, ఇవన్ భక్తినిష్ఠరైప్పోలే

---

౧ “శీఘ్రంవ్యాదిశనోరాజన్ వధాయైషాందురాత్మనాం” అనియు, ౨ “వధ్యతామేషదండేన తీవ్రేణసచివైస్సహ” అనియు, పలికిన వాక్యములవిని విసిగిపోయెనేని అనన్యగతిః, అను లక్షణముగల ప్రపన్నత్వమీతనియందు లేకపోవునుగదా? యనిన నుత్తరము సాయించుచున్నారు, “ప్రపన్నాయైవ” అని. అతఁడు ప్రపన్నలక్షణములం దొక్కటియు కొదువలేని ప్రపన్నుఁడేయని యీవాక్యాన్వయమున కర్థము. ఇందువల్ల, నతఁడు విసిగిపోవుననునది విప్రతిపత్తియేగాని, వాఁడు పెరుమాళ్లను విడచిపోనేరడని భావమేర్పడుచున్నది.

ఇది యిట్టిదిగానేయుండని; వీఁడు భక్తినిష్ఠునివలె, కొన్నిధర్మముల నంగములుగా ననుష్ఠింపఁబూని, 3 “జ్యేష్ఠాకన్యానలానామవిభీషణసుతాకపేతయామమేదమాఖ్యాతంమాత్రాప్రహితయాస్వయం”

---

౧ [శీఘ్రంవ్యాదిశేతి] మనలనుఁ జంపవలయుననే చెడ్డతలంపుతో వచ్చియుండునట్టి యీరాక్షసులను సంహరించుటకుగాను శీఘ్రముగా మమ్మాజ్ఞాపింపుమని శ్రీవానరవీరులు మహారాజునుఁజూచి విన్నవించిరని తాత్పర్యము.

౨ [వధ్యతామితి] క్రూరుఁడైన రావణునికి తమ్ముఁడైన యీవిభీషణుని నీతని వెంటవచ్చియుండు మంత్రులు నలువురతోడఁబట్టి చిత్రవధముసేసి చంపుదమని, శ్రీవిభీషణాళ్వానులుశరణాగతుఁడై వచ్చినప్పుడు శ్రీసుగ్రీవమహారాజు పెరుమాళ్లసన్నిధిలో విన్నవించినారని తాత్పర్యము.

3 [జ్యేష్ఠాకన్యేతి] ఇది, తిరువడి అశోకవనమందు పిరాట్టినిఁజూచి సంభాషించినప్పుడు పిరాట్టి సాయించినవాక్యము. ఓవానరశ్రేష్ఠుఁడా, రావణుఁడు నన్నపహరించి తెచ్చినందుకు విభీషణుఁడుకోపించి, యాతఁడన్నయగుటచే సామవాక్యంబుల (నన్ను

అజ్ఞమాకచ్చిల ధర్మానుష్ఠానమ్పణ్ణి, తఙ్గమకళ్ అన్నలైయ్యైయిట్టునల్ వార్త్తై శొల్లువతుమ్, దూతవధమాకాతెన్బతుమ్, "ప్రదీయతాం దాశరథాయమైథిలీ" ఎన్ఱు నల్ వార్త్తైశొల్లువతుమాయ్ అనేకమ్ పురశ్చరణమ్ పణ్ణియన్ఱోవన్దతు; ఆనపిన్బు అవఙ్ భక్తినిష్ఠ నెన్ఱార్ మహారాజర్; పెరుమాళ్, * ౨,(ప్రపన్నాయైవ) అవఙ్ నల్ వార్త్తైశొల్లిన్ఱాన్. నమక్కా-

---

అని తన కూతురైన యనలనుఁగొని పిరాట్టిసన్నిధియం దనుకూలవాక్యంబు లుపన్యసించియు, ౧"దూతవధ్యావిగర్హితా" అని తిరువడి విషయమందు హితవృత్తిసేసియు, ౨"ప్రదీయతాందాశరథాయమైథిలీ" అని రావణునికి సైతము క్షేమకరమైన మాటలుసెప్పియు, నీరీతిగా ననేక పురశ్చరణములు (అనఁగా మంత్రజపములు) సేసియున్నాఁడు గదా? ఇందువల్ల వీనియం దాకించన్యము (తనయెడ సాధనమేద్దియు లేమి) కనఁబడలేదు. కాఁబట్టి వీఁడు భక్తినిష్ఠుఁడని సెప్పవచ్చునేగాని ప్రపన్నుఁడుగాఁడని యొకశంక గలుగునుగదా ? యనిన నుత్తరము సాయించుచున్నారు; "ప్రపన్నాయైవ" అని. ఈవాక్యమునకు, ముందు సెప్పినయర్థమే తగియున్నది. అతఁడు సేసిన, అనుకూలభాషణాదులు

---

మరల స్వామిసన్నిధిఁజేర్చుమని బహువిధముల) హితముపదేశించినను మృత్యుపరవశుండైన వాఁడమ్మాటల వినలేదు. ఈవృత్తాంతమును విభీషణపత్ని, తన పెద్దకూఁతురనల యనుదానిచే నాకెఱింగించెనని భావము.

౧ [దూతవధ్యేతి] ఇంద్రజిత్తు బ్రహ్మాస్త్రముచే, తిరువడిని బంధించి తెచ్చినప్పుడు, రావణుఁడు తిరువడిని వధింప నాజ్ఞాపింపగా, దూతగావచ్చినవానిఁ జంపుట రాజనీతిశాస్త్ర నిందితమని, శ్రీవిభీషణాళ్వానులు సాయించిరని భావము.

౨ [ప్రదీయతామితి] ఇది, రావణుఁడు మంత్రాలోచనసేయునప్పుడు శ్రీవిభీషణాళ్వానులు సాయించినవాక్యము. పెరుమాళ్లు శ్రీవానరవీరులతోడవచ్చి లంకనుముట్టడించి నీవారిని నిన్నునుఁ జంపుటకుముందే పిరాట్టిని స్వామిసన్నిధియందు సమర్పింపుమని యీవాక్యమునకు భావము.

కవల్ల, ‟విభీషణస్తుధర్మాత్మా నతురాక్షసచేష్టితః” ఎన్ఱు - ప్రకృత్యా ధార్మికనాకైయాలుమ్, ‟గురుత్వాద్ధితమిచ్ఛతా” ఎన్ఱు-తమయన్ విషయత్తిలే హితపరనాకైయాలుమ్, ‟ఆనుకూల్యస్యసఙ్కల్పః” ఎన్ఱు-ప్రపత్త్యధికారియాయ్ చ్చొన్నానిత్తనై; ఆకైయాలితుఅన్యథాసిద్ధమ్.

---

మమ్ము నుపాసించుబుద్ధితోఁ జేసినదిగాదు. ౧‟ విభీషణస్తుధర్మాత్మా నతురాక్షసచేష్టితః ” అనే యతని స్వభావము చేతనున్ను, ‟గురుత్వాద్ధితమిచ్ఛతా” అని జ్యేష్ఠభ్రాతయందుగల గురుత్వమువల్ల హితము నుపదేశింపఁబూనియుఁ జేసినాఁడు. ఇదియునుంగాక ప్రపత్త్యధికారి స్వభావమైన, ‟ఆనుకూల్యస్యసంకల్పః”అనే సర్వభూతానుకూలవృత్తి నిష్ఠుఁడై సేసినాఁడేగాని వేరుకాదు. కాఁబట్టి వీనియం దాకించన్యమున కెట్టికొదువయు లేదు. ఈతఁడు భక్తినిష్ఠుడని శంకించుటయు నన్యథాజ్ఞానము. (అని యుత్తరము ప్రసాదించిరని యన్వయము.)

ఇట్లు, ఇంతగ్రంథమువఱకు, సకృదనుష్ఠానమే ప్రపత్తికి ముఖ్యలక్షణమను నర్థమున్ను, భక్త్యుపాయమునకంటె ప్రపత్త్యుపాయమునకుఁగల వైలక్షణ్యవిశేషమున్ను, అసకృత్ప్రపత్తియందుఁ గలుగునట్టి దోషములున్ను, ప్రపన్నునియెడఁబూర్ణప్రపత్తిని సైతము శేషి యుపేక్షించడనే యర్థమున్ను, మఱియు నీయధికారి విషయమందు శేషికిఁగల యభిప్రాయవిశేషములున్ను, భాగవతవిరోధముగాఁజేయు ప్రపత్తి శేషితిరువుళ్లమున కసమ్మతముగానే మాసిపోవుననే యర్థమున్ను, ప్రప

---

౧ [విభీషణస్తుధర్మాత్మేతి] ఇది, ఆరణ్యకాండమందు, శూర్పణఖ పెరుమాళ్ల సన్నిధికివచ్చి తనవృత్తాంతము నెఱింగించినప్పుడు సెప్పినవాక్యము. రావణకుంభకర్ణుల స్వభావమును ముందుగానుపన్యసించి వారితమ్ముఁడైనను విభీషణునియం దట్టిస్వభావము లేదు; ఆతనిబుద్ధి ధర్మమునందే నెలకొనియున్నదని సెప్పెనని యీవాక్యమునకుఁ దాత్పర్యము.

"సేనయోరుభయోర్మధ్యే రథంస్థాపయ" ఎన్ను పళ్ళురమ్ పత్రై

న్నుని స్థైర్యమున్ను, అతని యెడసాధనాంతర సంబంధము లేశమాత్ర మైన లేమియున్ను, సవిస్తరముగాఁ బ్రతిపాదింపఁబడినవి.

ఇఁక నీప్రసంగంబున సమస్తకర్మానుష్ఠానములకున్ను యోగ్యతను కలుగఁజేసి యిచ్చునట్టి స్నానసంధ్యావందనాదులైనను ఈప్రపత్తికంగములుగా కావలసియుండునుగదా? అనిన; ఈయధికారియొక్క స్వభావము ననుసరించి, (" ఆకై యాల్ శుద్ధ్యశుద్ధికళిరణ్డుమ్ తేడవేణ్డా; ఇరున్దపడియే యధికారియామిత్తనై " అనే వచనభూషణ దివ్యశాస్త్ర శ్రీసూక్తిప్రకారముగా ప్రపత్త్యనుష్ఠాన దశయందుగాని ప్రపత్తిశ్రవణ దశయందుగాని) అతఁ డెట్టిస్థితిలో అనఁగా శుద్ధుఁడై గాని అశుద్ధుఁడై గాని యెట్టిస్థితిలోనుండునో; అట్టిస్థితియే చాలునుగాని, స్నానసంధ్యాది శుద్ధులవల్ల నీప్రపత్తికొక యోగ్యతకలుగునని తలఁచ పనిలేదనే మహార్థమునున్ను; దీనికి హేతువులనున్ను; "సేనయోరుభయోర్మధ్యే" అనువాక్యము మొదలు "ఒరుపురశ్చరణముమ్ వేణ్డా ప్రపన్ననాకిల్ ఎన్గిఱాన్" అను వాక్యమువఱకుఁగల గ్రంథముచేఁ బ్రతిపాదించుచున్నారు.

(ఇట్టి స్థలములందు, వచనభూషణ దివ్యశాస్త్ర ప్రతిపాదితములైన "ఆఘ్రపొరుళ్" అని పొగడొందిన యంతరంగాభిప్రాయముల నెల్ల నెఱింగి "ఇష్టానిష్టంగళ్" ఇత్యాది సూత్రవ్యాఖ్యలయందు పరమవైదిక శిరోమణులైన యాచార్యులు ప్రసాదించిన ప్రకారముగా, స్వవర్ణస్వాశ్రమోచిత ధర్మముల ననుష్ఠింపుచు భగవత్కృపాపాత్రులై యుజ్జీవించవలయును.)

అందు మొదట నీవిషయమందు, ఆస్తికాగ్రేసరుఁడైన యర్జునుని యనుష్ఠానమును చూపించుచున్నారు, "సేనయోరుభయోర్మధ్యే"

యరుమ్ పార్ప్పారుమ్ †పార్క్కరుమాన విరుపకైక్కునడువే తేరై నిఱుత్తిచరమశ్లోకముపదేశిత్తపోదు, అర్జుననెన్గైకుళిత్తు కుళైకుఱుమియు మ్‡తోతవత్తియుమాయ్‌నిన్ఱాన్;

ఇత్యాదిగా. యుద్ధార్థముగాఁ జేరియుండు భారతవీరులెల్లఁ జక్కఁగా నగుపడునట్లు పాండవకౌరవసేనలు రెండింటికి నడుమ నారథమును నిలుపుమని, కర్ణన్ వారినిఁజూచి యర్జునుఁడు పలికెనని యీశ్లోకమున కర్థము. దీనితాత్పర్యము "పళ్లరుమ్పాప్పైయరుమ్" ఇత్యాదివాక్యము. అధమవర్ణమవారును, కర్మచండాళురును, పాషండబౌద్ధులును, కూడి యుండునట్టి యుభయసేనామధ్యంబున రథమును నిలుపుకొని చరమ శ్లోకము నుపదేశించి నప్పుడు, ఆచారశీలుఁడైన యర్జునుఁ డేచ్ఛోట స్నానము సేసి కురులు సడలముడిచిన కూఁకటియును ధౌతవస్త్రంబునుఁ గలిగి నిలచెనని యీవాక్యమున కర్థము. (అనఁగా స్నానాదిశుద్ధులు లేకనే ప్రపత్త్యుపదేశమును గ్రహించెనని భావము.)

ఇచ్చట, అధమవర్ణమువారు మ్లేచ్ఛకిరాతాది సైనికులనియు, కర్మచండాళురు దుర్యోధనాదులనియు, స్వవర్ణధర్మములను వదలియుండువారు పాషండులనియు, వేదములందు విధింపఁబడిన యజ్ఞపశుహింసను జీవహింసయని స్థాపించి యజ్ఞానుష్ఠానము నడుగంట ఖండించువారు బౌద్ధులనియు, యుద్ధమునందిట్టివారు సైతము చేరుదురనియు, నెఱుఁగవలయును. భగవచ్చరణారవింద శరణాగతయగు ద్రౌపదిని పరిభవించుటవల్లనున్ను, అట్టి పాండవుల విషయమందు నిరంతరము కీడు సేయుచుండుటవల్లనున్ను, దుర్యోధనాదులు కర్మచండాళురని "అర్జునన్ నీశర్ నడువేయితేయివ్వర్థమ్ కేట్టతు" అను జగద్గురు శ్రీసూక్తి వ్యాఖ్యయందు, ఆచార్యులైన వరవరయోగివర్యులు ప్రసాదించి

† పార్కర్ - బౌద్ధులు. ‡ తోతవత్తి - ధౌతవస్త్రము.

"ఇన్నముబజ్గుతి యో" ఎన్న; "నజ్ఞైమీర్ పోతరుక్కిన్షేన్" ఎన్నుమ్- "తూ యోమాయ్వన్దోమ్ తుయిలెళ్లుపాడువార్" ఎన్నుమ్- తిరువాయ్ప్పాడియిల్ పెణ్గళ్ నోన్బుక్కు-ప్పోకిఅపోతు¶ అనన్దలి లేక న్ణైయుమ్ కణ్ణై వాయైయుమ్ తుడైత్తువన్దార్ కళ త్తనై పోక్కి ఎన్దశ్ ఉవర్క్కుట్టియి లేకుళిత్తువన్దార్ కళ్;

యుండుటంబట్టి, యిచ్చట దుర్యోధనాదులు కర్మచండాళురని సెప్పఁబడినది. ఇట్టివారు కూడియుండునట్టి యుభయసేనామధ్యంబున రథమును నిలుపుకొని యుద్ధసన్నద్ధవేషముతోనుండి ప్రపత్తి శ్రవణము సేయుటవల్ల నీయుపాయమునకు స్నానాదిశుద్ధులు సంపాదించుకొనవలయుననే నిర్బంధము లేదని యేర్పడుచున్నది. ఇవి యావశ్యకములై యుండినపక్షమందు, ధర్మసంస్థాపనము సేయ నవతరించిన స్వామిన్ని, ఆచారశీలుఁడైన యర్జునుఁడున్ను, వాటి నుపేక్షింపరుగదా? యని తిరువుళ్ళము. అర్జునుఁ డాచారశీలుఁడనుటకు "జితేంద్రియరిల్ తలైవనాయ్" ఇత్యాదిశ్రీసూక్తి ప్రమాణముగా నున్నది.

ఇఁక "ఇన్నముబజ్గుతియో" అనునది మొదలు "ఎన్దఉవర్క్కుట్టియి లే కుళిత్తువన్దార్ కళ్" అనువఱకు, "మేలైయార్ శెయ్వినైకళ్" అని శిష్టాచారమునే తమకు ప్రమాణముగా నంగీకరించిన ఆండాళ్ వారి యనుష్ఠానమును చూపించుచున్నారు.

వీరుసాయించిన తిరుప్పావై ప్రబంధమునకు తాత్పర్యము; "మార్కళినీరాడ" అన్ని యొకవ్యాజమునుగొని సర్వేశ్వరుని సమీపించి, నీకు శేషభూతమైన యీయాత్మవస్తువును సాంసారిక దుఃఖములచేఁ జిక్కువడకుండఁజేసి స్వరూపానురూప కైంకర్యములఁ బ్రసా

¶ (పా) అన్దనిలైయిలే. $ ఉవర్క్కుట్టి - సముద్రము.

దించి, అది యావదాత్మభావిగా నుండున ట్లనుగ్రహింపుమని ప్రార్థిం చుట, అని పూర్వాచార్యులు నిర్వహించియున్నారు.

తిరువాయ్మొడియందుగల గోపికలు వర్షార్థముగా వ్రతమా చరింపఁబూని, అపరరాత్రియం దొకరినొకరు నిద్ర లేపి పిలుచుకొని యందఱును శ్రీనందగోపుల తిరుమాళిక చేరి తమ నోముకు వలయు నుపకరణములను శ్రీకృష్ణసన్నిధియందు ప్రార్థించి వడసినారనుట, అన్యాపదేశము.

ఇట్లు సర్వోత్కృష్ట ప్రమాణమయిన యీ ప్రబంధరత్నము నందు, "ఇన్నముఱంగుతియో" "నప్పైమీరార్ పోతరుకిన్ఱ" "తూయోమాయ్ వన్దోమ్" అనే శ్రీసూక్తులవల్ల నిద్రించువారిని మఱియొకరు మేలుకొలుపునట్లును, అంతట వారు మేలుకొని యిదిగో వచ్చుచున్నానని యుత్తరము సెప్పినట్లును, తరువాత నందఱునుఁ గలసి శేషిసన్నిధికిం జని మేము పరిశుద్ధులమై వచ్చియున్నామని విన్నవించినట్లును, స్పష్టముగా నేర్పడుచున్నదిగదా? గాఢనిద్రాభరముతో లేచి కన్నులనున్న నోటియిరుగెలంకులనున్న తుడుచుకొని వచ్చినంతమాత్రమే యిచ్చటం దోచుచున్నదిగాని, ఒకపర్వకాలమును వెదకి సముద్రస్నానము సేసి పరిశుద్ధులై వచ్చినారని యేర్పడ లేదు.

"తూయ్మైయావతు - తాన్ శిలవఱ్ఱై యేఱిట్టుక్కొళ్ళాతే నమ్ముడైయరక్షై అవనాలే యెన్నిరుక్కై" అను సూక్తిప్రకారముగా, ఇచ్చట పారతంత్ర్యజ్ఞాన మొక్కటిమాత్రమే ప్రపత్తికి ముఖ్యమైన శుద్ధియనియును, దీని వైభవము నాలోచించునెడ స్నానాదిశుద్ధులన్నియు ముఖ్యములు గావనియును, స్పష్టముగా నేర్పడుచున్నది.

(ఇచట పారతంత్ర్యజ్ఞానమనునది "ఇన్నినైవుపిఱన్దపోతేక్కృతక్కృత్యన్" ఇత్యాదిప్రకారముగా సర్వోత్కృష్టముగా నున్నదిగాన యిది

జనించుట మిక్కిలి దుర్లభము. 1*"కషాయేకర్మభిః పక్వే తతోజ్ఞానం ప్రవర్తతే" అనే ప్రమాణమందు, ఈజ్ఞానము 2 వివేకవిమోకాది నియమ సప్తకముతోఁగూడిన స్వవర్ణస్వాశ్రమోచిత ధర్మముల ననుష్ఠించిన పిమ్మటనే కలుగునని చెప్పియున్నది కాఁబట్టి మొదట అట్టిధర్మముల ననుష్ఠించి పారతంత్ర్యజ్ఞానమును స్థిరపరచుకొనిన పక్షమందు, ఏతజ్జ్ఞానానుగృహీతమైన (ఇట్టి జ్ఞానమువల్లనే స్వరూపలాభమునుఁ బొందినట్టి) ప్రపత్తి ననుష్ఠించునప్పుడు స్నానాదిశుద్ధు లావశ్యకములైనవి

1[కషాయేకర్మభిః పక్వే ఇతి] శ్రీశారీరకమీమాంసా బ్రహ్మసూత్రభాష్యము పుట ౩౮ *ధర్మేణపాపమపనుదతి, అనే శ్రుతిప్రకారముగా, కషాయే-పాపములు, కర్మభిః-వర్ణాశ్రమధర్మాదుల ననుష్ఠించుటచేత, పక్వేసతి-నశించిపోవుచుండగా, తతః - అటుపిమ్మట, జ్ఞానం-భగవత్ప్రాప్తి హేతువైన జ్ఞానము, ప్రవర్తతే-వికసింపుచున్నది. (జ్ఞానము లేకుండినఁ బ్రపన్నత్వము సిద్ధించదుగదా?)

2[వివేకవిమోకాదినియమసప్తకములనఁగా] శ్రీశారీరకమీమాంసా బ్రహ్మసూత్రభాష్యము పుట ౩౬ * తల్లబ్ధిర్వివేకవిమోకాభ్యాసక్రియాకల్యాణానవసాదానుద్ధర్షేభ్యస్సంభవాన్నిర్వచనాచ్చేతి ॥ ఇందుఁజెప్పబడిన వివేకాదుల స్వరూపమిట్టిదని శ్రీభాష్యకారులవారు ప్రసాదించియున్నారు; అట్టి శ్రీభాష్యసూక్తులను శ్రీశ్రుతప్రకాశికాచార్యులవారువివరించియున్నారు. వాటిననుసరించి యిచ్చట తాత్పర్యము వ్రాయఁబడుచున్నది.

వివేకాదులేవియనఁగా; వివేకము, విమోకము, అభ్యాసము, క్రియ, కల్యాణము, అనవసాదము, అనుద్ధర్షము, అని యేడువిధములైన నియమములు.

ఇందు వివేకమనఁగా; సాత్త్వికాహారమువల్ల జ్ఞానము వికసించునని యెఱుంగుట. సాత్త్వికాహారములిట్టివని పూర్వాచార్యుల వచనానుష్ఠానములవల్ల నెఱుఁగవచ్చును.

విమోకమనఁగా; కామక్రోధములం దభినివేశము మానియుండుట.

అభ్యాసమనఁగా; జ్ఞానమునకు మాలిన్యము గలుగకుండుటకై శుభాశ్రయమైన భగవద్దివ్యమంగళ విగ్రహమునున్ను ఆచార్యదివ్యమంగళ విగ్రహమునున్ను పలుమాఱు స్మరించుట.

*ఈపుటయందలి ఈవాక్యములకు సరియయిన మణిప్రవాళవ్యాఖ్యానమును ౧౩౧-వ పుటలో చూడుడు.

కావని యంతరంగాభిప్రాయము. వివేకవిమోకాది నియమయుక్తా(
మ ధర్మానుష్ఠానజనిత1పారతంత్ర్యజ్ఞానమువల్లనే ప్రపత్తికి స్వరూపసి(
కలుగునసే యానిర్బంధము మోక్షార్థమైన ప్రపత్తికేగాని ఫలాంత(
ములకై చేయునట్టి ప్రపత్తికిలేదు. ఈనిర్వాహము ప్రపత్తియొక్క
సహాయాంతర సంసర్గాసహత్వమునకు విరోధమని తలంచకూడదు
1ప్రపత్తి పారతంత్ర్యజ్ఞానకార్యము కాఁబట్టి దానికెట్టి సహాయమును
పనిలేదు. వేయేల; ప్రపన్నుఁడైన పిదపమైనను భగవదాజ్ఞారూ
మయిన వర్ణాశ్రమాదిధర్మముల వదిలెనేని,అతనిని2“ప్రియోపిసప్రియో
సౌమేమదాజ్ఞావ్యతివర్తనాత్” అని, సర్వేశ్వరుఁడు తనకు శత్రువుగా

క్రియయనఁగా; యథాశక్తి పంచమహాయజ్ఞాదుల ననుష్ఠించుట. ఇవి సర్వవర్ణ ములకున్ను సర్వాశ్రమములకున్ను వారివారి యధికారానుగుణమాగా తారతమ్యభేద ములు గలవిగానుండును. వీటినిన్ని పూర్వాచార్య వచనానుష్ఠానములవల్ల నెఱుంగ వచ్చును.

కల్యాణమనఁగా; సత్యము, ఆర్జవము, దయ, దానము, అహింస, అనభిధ్య, అను నవి. వీటిలో, ఆర్జవమనఁగా మనస్సున్ను వాక్యమున్ను భేదములేక ఒకేవిధముగా నుండుట. అభిధ్యయనఁగా పరద్రవ్యమందపేక్ష. తక్కినవి స్పష్టము.

అనవసాదమనఁగా; భయదుఃఖములు లేకయుండుట. ఇదే మనస్స్వాస్థ్యము.

అనుద్ధర్షమనఁగా; అతిసంతోషము లేకుండుట. అతిసంతోషము మనస్సును అన్యవిషయములందు వ్యాపింపఁజేసి జ్ఞానమును చెదరఁగొట్టునని భావము.

వీటిలో ప్రపన్నునికపేక్షించఁదగిన దొక్కటియు లేదనుట సుప్రసిద్ధముగానున్నది.

1[పారతంత్ర్యజ్ఞానమువల్లనే ప్రపత్తికిస్వరూపసిద్ధి] అనఁగా పారతంత్ర్యజ్ఞానము లేనివాడు స్వతంత్రములైన కర్మజ్ఞానాద్యుపాయముల ననుష్ఠించుననియు; పారతంత్ర్య జ్ఞానము కుదిరినవానికే ప్రపత్త్యుపాయము మనస్సున పట్టుబడుననియు తాత్పర్యము.

2[ప్రియోపిసప్రియోసౌవితి] ఇది శ్రీవిష్వక్సేనసంహితయందలి భగవద్వాక్యము. శ్రుతిస్మృతులు నాయొక్క ఆజ్ఞారూపములు కాఁబట్టి అట్టినాయాజ్ఞనుల్లంఘించి వర్ణా శ్రమధర్మముల ననుష్ఠించనివాడు (ప్రపన్నుఁడగుటంబట్టి) నాకు ప్రియుఁడైయుండినను అప్రియుఁడే అనఁగా శత్రువేయగుచున్నాడని యాశ్లోకమునకర్థము.

అప్పడియే ఇవనుమ్, ,,యస్తు నారాయణం ద్వేష్టి తం విద్యాద న్త్య రేతసమ్" ఎన్ఱు - విష్ణుద్వేషియాయ్ కర్మచణ్డాళనాన రావణన్ గోష్ఠియిల్ నిన్ఱుమ్ పోరుకిఱపోతు, ,,ఖస్థ ఏవ వ్యతిష్ఠత" ఎన్ఱు-ఆకాశత్తిలే నిన్ఱా నిత్తనై పోక్కి- ఎన్ఱు కడలాడి ఌ పునలాడి వన్దాన్ ?

భావించియున్నారు. ఇంతకుపైన, పూర్వోక్తములైన వివేకవిమోకాదులకు ముఖ్యఫలము శమదమాదులని సిద్ధాంతపరచఁబడి యుండుటం బట్టి, అవియు ప్రపన్నుఁడైన పిమ్మటకూడ నవర్జనీయములై యున్నవి. ,,ఆత్మగుణజ్గళిల్ ప్రధానమ్ శమముమ్ దమనుమ్" ఇత్యాదిస్థలములం దీయర్థము స్పష్టము, ఇట్టిరహస్యముల నెఱుంగలేక విహితానుష్ఠానముల ననాదరించువారు ,,పష్ఠైయనాస్తికనాకై యేఫలిక్కుమ్" అనే శ్రీసూక్తికి గుఱియగుచున్నారు.)

ఇఁక, ప్రకృతమందు సాయింపుచుండు శ్రీవిభీషణశరణాగతి యందే ప్రపత్తికి స్నానాదిశుద్ధు లంగముగా నేరవనే యర్థమును చూపించుచున్నారు; ,,అప్పడియే ఇవనుమ్" ఇత్యాదిగా. అప్పడియే, అనఁగా, అర్జునుని యనుష్ఠానమున్ను ఆండాళ్ వారి యనుష్ఠానమున్ను యెట్లనో ఆలాగే యనియర్థము. ప్రకృతగ్రంథము శ్రీవిభీషణానుష్ఠానమును చూపించుటవల్ల ,,ఇవనుమ్" అని సాయింపుచున్నారు. అంతు ఆలాగే శ్రీవిభీషణాళ్వానులున్ను 1,,యస్తునారాయణంద్వేష్టితంవిద్యాదంత్యరేతసమ్" అనేప్రకారముగా భగవద్వేషమువల్ల కర్మచండాళత్వమునుఁ బొందియున్న రావణునిగోష్ఠినుండి వచ్చునప్పుడు ఖస్థ...ష్ఠత"

ఌ పునల్ - నది.

[యస్తునారాయణమితి] దీనిపూర్వార్థము ,,యఃపుత్రఃపితరంద్వేష్టి తంవిద్యాదన్యరేతసం" అని. లోకమందు కుమారుడు తండ్రితో ద్వేషించెనేని యాకుమారుని యన్యబీజోత్పన్నుఁడని యెఱుంగఁదగుననియు; ఏనరుఁడు తనతో నవర్జనీయసంబంధములుగలిగి వెలుంగుచుండు నారాయణుతో ద్వేషించుచున్నాడో, ఆనరుఁడు చండాళ

“యదహరేవవిరజేత్ తదహరేవప్రవజేత్” ఎన్నుమ్

అని, ఆకాశమందు నిలచినాడంతేగాని, సముద్రస్నానముగాని నదీ స్నానముగానిచేసి ప్రపత్తి సేయలేదుగదా? అని యనంతరవాక్యము లతోఁ జేర్చియర్థము.

ఇఁక నీయర్థమునకు శ్రుతిసంవాదమును చూపించుచున్నారు “యదహరేవ...ప్రవజేత్” అని. సాంసారికములయిన సుఖాభాసములందు, ఏదినము విరక్తిగలుగుచున్నదో ఆదినమందే గృహస్థాశ్రమమును వదలి సన్యసించవలయునని యీశ్రుతికర్థము, ఇంతమాత్రముననే ఒక దినమునకుపైన తామసించఁగూడదని యీశ్రుతి సెప్పియుండఁగా “బహూనాంజన్మనామంతే జ్ఞానవాన్మాంప్రపద్యతే” అని బహుజన్మ పుణ్యపరిపాకరూప పారతంత్ర్యజ్ఞానకార్యమైన భగవదాశ్రయణ రుచి పుట్టిన వెనుక నొకక్షణమైనను తామసించఁగూడదనే విషయమునుగురించి వేరే చెప్పవలయునా; అని తిరుపుళ్లము. ఇందువల్ల నలభ్యలాభమయిన భగవదాశ్రయణరుచి పుట్టినప్పుడు స్నానాదిశుద్ధులు వెదకుటకు సైతమవకాశము లేదనితాత్పర్యము.

---

బీజోత్పన్నుఁడని యెఱుంగదగుననియు నీశ్లోకమునకర్థము. నారాయణుని ద్వేషించువాడు కర్మచండాళ బీజోత్పన్నుఁడని భావము. “జాతిచండాలునక్కు కాలాంతరత్తిలే భాగవతనాకైక్కు యోగ్యతైయుండు” అని ప్రసాదించియున్నారుగదా? భగవద్ద్వేషియైన సుమాలియొక్క పుత్రికయగు కైకసి ప్రదోషకాలమందు విశ్రవస్సునుఁ బొందినది కాఁబట్టి మాతృదోషమువల్ల రావణుఁడు కర్మచండాళ బీజోత్పన్నుడనియును చెప్పవలసివచ్చును; అంతకుపైన భగవద్భాగవత విషయములైన యసహ్యాపచారములవల్ల నితఁడు కర్మచండాలుడనుట సహజము.

[బహూనాంజన్మనామితి] శ్రీభగవద్గీతా అధ్యా-౭ శ్లో-౧౯. “నాల్పసంఖ్యాసంఖ్యాతానాం పుణ్యజన్మనాంఫలమిదం, యన్మచ్ఛేషతైకరసాత్మయాథాత్మ్యజ్ఞానపూర్వకంమత్ప్రపదనం” ఇత్యాదు లీశ్లోకమునకు భాష్యవాక్యములు. అంతు, అనేక పుణ్యజన్మములు సంభవింపుచుండగాఁ దత్పరిపాకమందు శేషత్వరుచిగల పారతంత్ర్యజ్ఞానము

“నాస్తినక్షత్రసమ్బన్ధో ననిమిత్తపరీక్షణమ్ । శ్రద్ధైవకారణం నిత్య మష్టాక్షరపరిగ్రహే” ఎన్నుమ్-

“పోతువీర్ పోతుమినో” ఎన్నుమ్-రుచిపిఱన్దపోతే వన్దానత్తనై.

---

అది యట్టిదిగానేయుండని; ఈప్రపత్తి కాలంబనమంత్రము, పెరియతిరుమంత్రమని ప్రసిద్ధమైన శ్రీమష్టాక్షరమేకదా? ఆమంత్రము నకును నీయధికారికిని 1మంత్రార్వణమైనను చూడపనిలేదా? అనిన సాయింపుచున్నారు “నాస్తినక్షత్ర...పరిగ్రహే”అని. సదాచార్యోప దేశమూలముగా పెరియతిరుమంత్రమును పరిగ్రహించునప్పుడు, ఈయధి కారి నామాద్యక్షరమునకును మంత్రాద్యక్షరమునకును నక్షత్రాను కూల్యము గాని2సిద్ధారిచక్రోక్త శుభాశుభఫల పరీక్షణముగాని చూడ పనిలేదనియు, శ్రద్ధయొక్కటియే దీనికి ముఖ్యకారణమనియు, ఈశ్లోక మునకర్థము.

ఈయర్థమునకు, ఆండాళ్ వారి శ్రీసూక్తిని ప్రమాణముగా చూపించుచు తాత్పర్యార్థమును సాయింపుచున్నారు. “పోతువీర్ పోతుమినో” ఇత్యాదిగా. ఈశ్రీసూక్తి,ఆశ్రయణమునకు రుచిగలవారలెల్ల అధి కారులేయని నిర్ణయింపుచున్నది. ఇట్లు, శ్రుతిస్మృతిసదాచారములు

---

కలుగునని యీశ్లోకమునకుఁ దాత్పర్యము. “తదాయత్తస్వరూపస్థితిప్రవృత్తిశ్చ” అని భాష్యవాక్యమునందు పారతంత్ర్యజ్ఞానమును కంఠోక్తిగా సాయించియుండుటవల్ల, ఈశ్లోకమందుగల “జ్ఞానవాన్” అనేపదము పారతంత్ర్యజ్ఞానమునే చూపించుచున్నది.

1[మంత్రార్వణము]అనఁగా, ఏదైననొక మంత్రమును పురశ్చరణము సేయునప్పుడు, ఆమంత్రముయొక్క ప్రథమాక్షరమునకును సాధకుని నామాద్యక్షరమునకును-మైత్రి యున్నదా లేదా? అని తెలుసుకొనుట.

2[సిద్ధారిచక్రము] అనఁగా పూర్వోక్తమంత్రార్వణముచూచి శుభాశుభఫలముల నెఱుంగఁదగిన యొకచక్రము. ఇది మంత్రశాస్త్రప్రవణులయెడ ముఖ్యముగా పరిగ్రహింపఁబడియున్నది.

గఙ్గైయాడుపతఱ్కు ఒరుడువర్ క్కుప్పోయి లేకుళిక్క వేణుమో?

"భగవాన్ పవిత్రంవాసుదేవః" "పవిత్రమ్" "పవిత్రాణాంపవిత్రమ్"

---

మూడున్ను ప్రతిపాదించిన ప్రకారముగా నిచట శ్రీవిభీషణాళ్వానులు రుచిపుట్టినమాత్రముననే వచ్చినారుగాని సముద్రస్నానాదులవల్ల శుద్ధి సంపాదించుకొని రాలేదని తాత్పర్యము.

ఇఁక నీయర్థమునకు దృష్టాంతము చూపించుచున్నారు "గఙ్గైయాడుపతఱ్కు" ఇత్యాదిగా. భగవచ్చరణసంబంధమువల్ల సమస్తపాపములనున్ను పోగొట్టఁదగిన శక్తిగల గంగయందు స్నానముసేయఁబోవునప్పుడు గంగాస్నానమునకు యోగ్యతకలుగవలయునని తలఁచి యొక సముద్రస్నానము సేయవలయునా? అని యీవాక్యమునకర్థము.

ఇట్లు గంగ, తనయందు స్నానముసేయువారి కితరాపేక్షలేక, తానే సమస్తపాపములనున్ను పోగొట్టునదిగా నుండుననేయర్థమును, భగవద్వైభవప్రతిపాదనమూలముగా స్థాపించుచున్నారు. "భగవాన్ పవిత్రమ్" ఇత్యాదిగా. ఇచట చెప్పఁబడిన ప్రమాణములు మూడున్ను భగవంతుఁడు పవిత్రుఁడనే యర్థమునుఁ జెప్పుచున్నది. "అపవిత్రః పవిత్రోవా" ఇత్యాదిబుళుక్క, ఈయధికారి, అపవిత్రుఁడుగానుండినను పవిత్రుఁడుగానుండినను, మఱియు నెట్టిదురవస్థలోనుండినను మనస్సును శుభాశ్రయమందుఁ జేర్చెనేని తత్‌క్షణమందే బాహ్యాభ్యంతరశుద్ధిగలవాడగుచున్నాడనే యర్థమునుఁ జెప్పుచున్నది కాఁబట్టి, భగవంతుఁడితరాపేక్షలేని పరమపావనుఁడని భావము. ఇట్లనేభగవచ్చరణ సంబంధముగల గంగయున్ను, ఇతరాపేక్షలేక తానే పరమపావనత్వము గలదిగా నుండునని పూర్వవాక్యముతో సంబంధము.

“పావనస్సర్వలోకానాం త్వమేవరఘునన్దన” ఎన్రుపేశప్పట్ట నమ్బ
క్కల్ వరుకిఱవనుక్కు ఒరుపురశ్చరణమ్ వేణ్డాప్రపన్ననాకిల్ ఎన్గిఱాన్.

ఇట్టి పావనత్వము నీయవతారమందు భగవంతుండైన యగ
స్త్యమహర్షి సాయించియున్నారని ప్రమాణమును చూపించుచున్నా
రు “పావనస్సర్వలోకానాం” ఇత్యాదిగా. ఈప్రమాణము ఉత్తరశ్రీరా
మాయణము ౮౨వ సర్గములోనున్నది. శ్రీచక్రవర్తి త్తిరుమకనార్లు,
తమరాజ్యమందు బ్రాహ్మణబాలమరణము కలుగుటనుఁజూచితద్దోషపరి
హారార్థముగా శూద్రమునిని సంహరించినపిమ్మట నగస్త్యాశ్రమమునకు
వేంచేసి వారిచే సత్కారమువడసి యనేకకథలు వినినతరువాత మరల
నయోధ్యకు వేంచేయుటకు వారియనుజ్ఞఁ బొందునప్పుడగస్త్యభగ
వానులీ వాక్యమునుసాయించినారు.

ఇంతకుముందు పెరుమాళ్లు అగస్త్యమహామునింజూచి, స్వామీ,
మీదర్శనముచేత నేను ధన్యుడనైతిని, నేనిప్పుడయోధ్యానగరమున
కుఁ బోయినను నాజన్మమును పావనముచేయుటకై మరల మీదర్శన
మునకు వచ్చెదను; అని సాయించగా నమ్మాటల నమ్మునివిని పెరుమా
ళ్లనుఁజూచి, స్వామీ, మీవాక్యము మిక్కిలి యాశ్చర్యకరముగానున్నది.
సమస్తప్రాణులనున్ను పావనులుగాఁ జేయువారు మీరేకదా? క్షణకా
లము మీదివ్యమంగళ విగ్రహమును సేవించినవారు పరమపావనులై
సమస్తదేవతలచేతనున్ను పూజింపఁబడుచు పరమపదమునుఁ బొందు
చున్నారు; అని యుత్తరము సాయించియున్నారు.

ఇందువల్ల శ్రీవిభీషణప్పెరుమాళ్ల విషయమందు పెరుమాళ్ల తిరు
వుళ్లము, ఈవిధముగా నుండవచ్చునని సాయింపుచున్నారు, “ఎన్రుపేశ
ప్పట్టనమ్పక్కల్” ఇత్యాదిగా. సమస్తప్రాణులనున్ను పావనులుగాఁ
జేయువారు మీరేకదా? అని విశేషజ్ఞులచేతఁ గొనియాడబడునట్టి

అతిరున్దపడిఎన్?

భక్తిక్కు శాస్త్రవిహితమాన వర్ణాశ్రమధర్మజ్గళ్గణాయిరానిన్ఱతు; ఇతుక్కు, ,,సర్వధర్మాన్ పరిత్యజ్య" ఎన్ఱు - ఉళ్ళధర్మజ్గళైయుమ్ నాయొద్దకు వచ్చువానికి ప్రపన్నత్వపూర్తి యొక్కటే చాలునుగాని యేవిధమైన పురశ్చరణమున్ను పనిలేదని, ఈవాక్యమునకర్థము. స్నానసంధ్యాదిశుద్ధులవల్ల నీప్రపత్తికొక యోగ్యత సంపాదించవలసిన నిర్బంధములేదని నిర్ణయించుటయేగదా? ప్రకృతార్థము. ఇట్లుండగా ,,ఒరు పురశ్చరణముమ్ వేణ్డా" అని సాయించుటకు భావమేమనఁగా; ప్రపత్తి యొక్క సహాయాంతర సంసర్గాసహత్వ వైభవమును చూడగా కరణ కళేబర వ్యాపారరూపమైన స్నానసంధ్యాదులు సైతము చేతనప్రయత్నభరమువల్ల సాధింపఁబడునట్టి మంత్రపురశ్చరణముతో సమానములగునని తిరువుళ్లమున నెలకొల్పి యీవాక్యమును ప్రసాదించియున్నారని భావము.

ఇఁక ,,అతిరున్దపడియోౕ" ఇత్యాది వాక్యములవల్ల ప్రపత్తికంటే భక్తివిలక్షణముగాఁ దోచుచున్నదిగదా? అని శంకించి, ,,ఇప్పడిక్కొత్త అనేకగుణ పౌష్కల్యత్తాలే భక్తియిల్ ప్రపత్తియే అత్యన్తవిలక్షణై" అని ప్రపత్తివైలక్షణ్యమును చాలినంత యుపపత్తులతోఁడ ప్రతిపాదించి స్థాపించుచున్నారు. తత్ప్రతిపాదనక్రమం బెట్టిదనిన.

ఇచ్చట ,,అతిరున్దపడియోౕ" అనువాక్యము ,,భక్తివిలక్షణైయాయ్త్తోత్తాన్నిన్ఱతీ" అనే వాక్యమువఱకునుఁగల తాత్పర్యమును గ్రహించుకొని, దీని నిజస్థితియెట్టిది, అనేయర్థము నిచ్చుచున్నది.

వేదాంతములందు విధింపఁబడిన భక్తియోగానుష్ఠానమునకు సకలశాస్త్రసమ్మతములైన వర్ణాశ్రమధర్మము లావశ్యకములైయున్నవి; ఈప్రపత్త్యుపాయమునకు ,,సర్వధర్మాౕ పరిత్యజ్య" అని స్వవర్ణ

విడచ్చోల్లానిన్ఱతు ; ఆకైయాలే ప్రపత్తియిల్ భక్తివిలక్షణైయాయ్ త్తోఱ్ఱానిన్ఱతీయెన్నిల్; అతుశొల్లవొణ్ణాతు, “శబ్దప్రమాణకేహ్యర్థే యథాశబ్దంవ్యవస్థితిః” ఎన్ఱు-శాస్త్రప్రమాణకరానా లతుశొన్నపడి కొళ్ళక్కడవోమ్; అతావతు-

“బహవోహియథామార్గావిశన్త్యేకంమహాపురమ్। తథాజ్ఞానానిసర్వాణి ప్రవిశన్తి తమీశ్వరమ్” ఎన్ఱు-ఓరూరుక్కుప్పోకవెన్ఱాల్, పలవళియాయిరుక్కుమాప్పోలే, భగవత్ప్రాప్తిక్కు ప్పలఉపాయఙ్గళుణ్డెన్ఱు

---

స్వాశ్రమములకు స్వభావముగానుండు ధర్మములు సైతము త్యాజ్యములైయున్నవి; కాఁబట్టి ప్రపత్త్యుపాయమునకంటె భక్త్యుపాయమే విలక్షణముగాఁ దోఁచుచున్నదిగదా? అనిన అట్లు సెప్పఁదగదు. “శబ్దప్రమాణకేహ్యర్థే యథాశబ్దంవ్యవస్థితిః” అనేప్రకారముగా, శబ్దమాత్రమునే ప్రమాణముగాఁగైకొని ప్రకృతార్థనిర్ణయమందు ప్రవేశించినప్పుడుగదా? ఆశబ్దము ననుసరించవలయును; అట్లుగాక శబ్దముయొక్క తాత్పర్యమును ప్రమాణముగాఁగైకొని యర్థనిర్ణయము సేయఁబూనినప్పుడు శబ్దమునను సరించవలసిన నిర్బంధములేదు. అనఁగా “సర్వధర్మాన్ పరిత్యజ్య” అనునప్పుడు త్యాగముయొక్క తాత్పర్యమును గ్రహించి యర్థనిర్ణయము సేసినపక్షమందు, ఈప్రపత్త్యుపాయము సహాయాన్తర నిరపేక్షమనే యర్థముమాత్రము సిద్ధించుచున్నదేగాని, నాస్తిక్యమూలమైన సర్వవర్ణాశ్రమధర్మ పరిత్యాగరూపమయిన యర్థము సిద్ధించనేరదని భావము. మనము ప్రామాణికులగుటవల్ల శాస్త్రోక్తములయిన యుపాయములను సామాన్యవిశేష పరిజ్ఞానపూర్వకముగా నిర్ణయించి గ్రహించవలయును. అది యెట్టులనిన.

“బహవోహి...తమీశ్వరం” అనే ప్రమాణమందు, ఒకగొప్పట్టణమునకుఁబోవ ననేకమార్గములుండునట్లు భగవత్ప్రాప్తికి బహువిధములైన యుపాయములున్నవని చెప్పఁబడియున్నదిగదా? వాటిలో

శొల్లి, ఒరుఉపాయమ్ స్వయమశక్తమాకైయాలే శిలసహకార్యన్తరఙ్గళై విధిత్తు, ఒరుఉపాయమ్ సర్వశక్తియాకైయాలే సహకార్యన్తరఙ్గళై వేణ్డావెన్ఱతు; ప్రకారభేదత్తాలే యొన్ఱుక్కొన్ఱువైలక్షణ్యమ్ వారాతు. స్వరూపనిరూపకధర్మఙ్గళెన్ఱుమ్ నిరూపితస్వరూపత్తుక్కు విశేషసమర్పకధర్మఙ్గళెన్ఱుముణ్డు; అన్దవిశేషసమర్పకఙ్గళైప్పార్త్తాల్ ప్రపత్తియే విలక్షణై; ఎఙ్గనేయెన్నిల్;

---

ప్రపత్తియొక్కటి తప్పఁ దక్కినయుపాయములు స్వయమశక్తములుగా నుండుటంబట్టి తదనుష్ఠానమందు సహాయాన్తరములు విధింపఁబడినది. ప్రపత్త్యుపాయము సర్వశక్తిగానుండుటంబట్టి దీనికి సహాయాన్తరములు పని లేదని సెప్పఁబడినది. ఇందు చెప్పఁబడిన ప్రకార భేదమాత్రముచేతనే వీటికిఁ బరస్పరవైలక్షణ్యమును నిర్ణయించఁగూడదు; స్వరూపనిరూపక ధర్మములనియు, నిరూపిత స్వరూపమునకు విశేషసమర్పక ధర్మములనియుఁ గలవు; వాటినిఁబట్టి వైలక్షణ్యమును నిర్ణయించవలయును. ఇందు స్వరూపనిరూపక ధర్మములనఁగా శేషత్వభోక్తృత్వములనియును, నిరూపితస్వరూపమునకు విశేషసమర్పక ధర్మములనఁగా పారతంత్ర్యభోగ్యతలనియును, గ్రహించవలయును. "జ్ఞానచతుర్థికళిలే మేలేయిఱ" ఇత్యాది ఆచార్యహృదయసూక్తికి వ్యాఖ్యానముఁ బ్రసాదించునప్పుడు "శేషత్వభోక్తృత్వఙ్గళ్ స్వరూపవిరోధ్యుదయసహఙ్గళాయిరుక్కుమ్; పారతన్త్ర్యభోగ్యతైకళ్ స్వరూపవిరోధ్యుదయసహఙ్గళన్ఱు" అని సాయించియుండుటనల్ల, స్వరూపవిరోధులయిన సాధనాన్తరములననుష్ఠించుటకు శేషత్వభోక్తృత్వములు సమ్మతించియుండుననియును; పారతన్త్ర్యభోగ్యతలు సుతరాం సమ్మతించచాలవనియును; సిద్ధమగుచున్నదిగదా? ఇట్టి విశేషసమర్పక ధర్మములయొక్క స్వభావమును పరిశీలించి చూచునెడ, ప్రపత్త్యుపాయమే విలక్షణమైనదని సిద్ధాంతమగుచున్నది. ఈవిషయమును గురించి పరిశీలించువిధం బెట్టులనిన.

"సోఽన్వేష్టవ్యస్సవిజిజ్ఞాసితవ్యః" ఎన్ఱుమ్- "బ్రహ్మవిదాప్నోతి పరమ్" "జ్ఞాత్వాదేవంముచ్యతే సర్వపాశైః" ఎన్ఱుమ్-"తమేవైకంజానథాత్మానమ్, అన్యావాచోవిముఞ్చథ, అమృతస్యైష సేతుః" ఎన్ఱుమ్- "ముముక్షుర్వై శరణమహంప్రపద్యే" ఎన్ఱుమ్- వేదాన్తవిహితత్వముమ్ మోక్షాదిసాధనత్వముమ్ ఒత్తిరుక్కచ్చెయ్ తేయుమ్,

భక్త్యుపాయస్వరూపమ్మోలే "సాధ్యభక్త్యైకగోచరః" ఎన్ఱు- ఇవనాలే సాధ్యమాకైయన్ఱిక్కే,

ప్రపత్త్యుపాయస్వరూపమ్ "సిద్ధరూపంపరబ్రహ్మ" ఎన్ఱుమ్ - "నిత్యంనిత్యాకృతిధరమ్" ఎన్ఱుమ్-పణ్డే సిద్ధరూపమాయ్,

---

"సోఽన్వేష్టవ్యస్సవిజిజ్ఞాసితవ్యః" ఇత్యాది శ్రుతులు, భక్తిప్రపత్తులు రెండున్ను వేదాంతవిహితములనియు మోక్షసాధనములనియుఁ బ్రతిపాదించుచున్నవి. అయినను, "అతావతు సిద్ధమాయ్ పరమచేతనమాయ్" ఇత్యాది ముముక్షుప్పడి శ్రీసూక్తిప్రకారముగా భక్తికంటె ప్రపత్తికి మిగుల నాధిక్యమున్నది. తద్వివరణంబెట్లనిన.

స్వధర్మజ్ఞానవైరాగ్యసాధ్యభక్త్యైకగోచరః" అని శ్రీఆళవందార్లు ప్రసాదించినరీతిగా భక్త్యుపాయస్వరూపము చేతనప్రవృత్తిరూపములైన స్వధర్మజ్ఞానవైరాగ్యములచేత సాధించఁదగినదిగానుండును. ఈయర్థమును "స్వరూపసిద్ధియిల్ చేతననై యపేక్షిత్తిరుక్కుమ్" అని శ్రీలోకాచార్యులు తామే సాయించియున్నారు.

ప్రపత్త్యుపాయము, స్వీకారప్రాధాన్యమునుఁబట్టి తానుపాయమని యుపచారముగా చెప్పఁబడియుండినను, ఉపాయత్వమీశ్వరునియందే నెలకొనియుండుటవల్లనున్ను; అతఁడు "సిద్ధరూపంపరంబ్రహ్మ" ఇత్యాది ప్రమాణముల ననుసరించి చేతనప్రవృత్తికి ముందే సిద్ధరూపుఁడై యుండుటవల్లనున్ను; సిద్ధోపాయమని చెప్పఁదగియున్నది,

"ధ్యాయతే" "ధ్రువాస్మృతిః" ఎన్రు-స్మృతిసన్తానరూపజ్ఞానము మాయ్ అచేతనమాకైయన్రికే,

"యస్సర్వజ్ఞస్సర్వవిత్" "సత్యంజ్ఞానమ్" సర్వంసర్వత్రసర్వదా జానాతి" ఎన్రు-జ్ఞాతావాయ్ సదాతన జ్ఞానస్వరూపమాయ్,

స్వీకరిక్కుమిడత్తిల్, "ఆవృత్తిరసకృదుపదేశాత్" ఎన్రు, అనేకజన్మసంసిద్ధమాయ్ చిరకాలసాధ్యమాయిరుక్కైయన్రికే,

"తద్ద్వయంసకృదుచ్చారోభవతి" "ఉపాయభూతోమేభవేతి ప్రార్థనామతిశ్శరణాగతిః" ఎన్రు- సకృత్ప్రయోగత్తిలే కైపుకురక్కడవతాయ్,

"తస్యతావదేవచిరంయావన్నవిమోక్ష్యే" ఎన్రు- విళమ్బితఫలప్రదమాకైయన్రికే,

"ఉపాయోయశ్చతుర్థస్తేప్రోక్తశ్శీఘ్రఫలప్రదః" "తావదార్తి

---

భక్త్యుపాయము, "ధ్రువాస్మృతిః" ఇత్యాది శ్రుతివాక్యముల ననుసరించి తైలధారావదవిచ్ఛిన్నస్మృతి సంతానరూపముగానుండుట వల్ల, అచేతనముగానుండును.

ప్రపత్త్యుపాయము, "యస్సర్వజ్ఞస్సర్వవిత్" "సత్యంజ్ఞానమ్" ఇత్యాది శ్రుతులననుసరించి, సర్వజ్ఞమును జ్ఞానస్వరూపమునుగా నుండుటంబట్టి పరమచేతనమైయుండును.

భక్త్యుపాయము, "ఆవృత్తిరసకృదుపదేశాత్" ఇత్యాది ప్రమాణానుసారముగా అనేక జన్మపుణ్యఫలమగుచు చిరకాలసాధ్యముగానుండును.

ప్రపత్త్యుపాయము, "తద్ద్వయంసకృదుచ్చారోభవతి" ఇత్యాది ప్రమాణానుసారముగా, సకృదనుష్ఠానమువల్లనే చేకూడునదిగానుండును.

భక్త్యుపాయము, "తస్యతావదేవచిరం" ఇత్యాది ఛాందోగ్యోప

స్తథావాఞ్ఛా తావన్మోహ స్తథాసుఖమ్।యావన్న యాతిశరణమ్" ఎన్ను శీఘ్రఫలప్రదమాయ్,

„తప సాఽనాశకేన" ఎన్నుమ్—„యజ్ఞోదానంతపశ్చైవ" ఎన్నుమ్—

నిషద్వాక్య ప్రకారముగా, భగవత్ప్రాప్తిరూప ఫలమునిచ్చుటకు ప్రారబ్ధ దేహావసానపర్యంత విళంబముగలదిగానుండును.

ప్రపత్త్యుపాయము „ఉపాయోఽయం చతుర్థస్తే" ఇత్యాదిప్రమాణానుసారముగా శీఘ్రఫలప్రదముగానుండును.

భక్త్యుపాయము *„అవిద్యయామృత్యుంతీర్త్వా విద్యయామృత

[ప్రపత్త్యుపాయము శీఘ్రఫలప్రదముగానుండును] అనునప్పుడు, „మరణమానాల్ వైకున్దమ్ కొడుక్కుమ్" అనే శ్రీసూక్తిప్రకారముగాఁ ప్రపత్త్యుపాయమున్ను భగవత్ప్రాప్తిరూప ఫలమునిచ్చుటకు ప్రారబ్ధదేహావసానపర్యంత విళంబముగలదిగానున్నదిగదా? అనిన; ఆశ్రీసూక్తి వ్యాఖ్యానములందు, ఈవిళంబమునకు హేతువు సర్వేశ్వరుఁడితని సర్వపాపవిమోచనముసేయ నశక్తుఁడనికాదు, ఈయధికారి ఫలప్రాప్తికై యింకయు కొన్ని యనుష్ఠించవలయుననియుఁగాదు; ఇఁకనేమనిన, ప్రపన్నులయిన వీమ్మటఁగూడ నీప్రకృతిసంబంధము అనాదివాసనవల్ల వీరికి సహ్యముగానుండుటంబట్టి యిది తనంతట వదిలిపోవునప్పుడు వీరలకు ఫలమునివ్వవలయునని సర్వేశ్వరుఁడు దలఁచి యుండుటయే యీవిళంబమునకు హేతువని సాయించియున్నారు గాన వారినిర్వాహములే యీవిషయమునకు చాలినంత యుత్తరముగానున్నవి.

ఇది దృప్తప్రపన్నుల విషయమేగాని ఆర్తప్రపన్నుల విషయమైనదికాదు. ఆర్తప్రపన్నుల శరీరస్థితికి హేతువులను, వచనభూషణ దివ్యశాస్త్రమందు „పరమార్తనాన విషన్నుడైయ శరీరస్థితిక్కు హేతు" అనేస్థలమందు విశదముగాఁ బ్రసాదించియున్నారు.

అంతు, ప్రపన్నుని ఫలప్రాప్తివిళంబము వర్తమానశరీరవిశ్లేషపర్యంతమేగాని దేహాంతరమందు ననువర్తించనేరదని సిద్ధముగుచున్నది.

భక్త్యుపాయనిష్ఠునకు ప్రారబ్ధకర్మశేషమువల్ల దేహాంతరపరిగ్రహము కలిగనేని ఫలప్రాప్తికి విళంబము అధికమగుచున్నది. ఈయర్థమును, ఇతరక్షపణాధికరణమందు శారీరకమీమాంసా బ్రహ్మసూత్రకారులే సాయించియున్నారు.

* ఈపుటయందుగల „అవిద్యయామృత్యుం" ఇత్యాది ఆంధ్రవ్యాఖ్యాన వాక్యమునకు సరియయిన మణిప్రవాళవ్యాఖ్యానమును ౧౩౧-వపుటలో చూడుడు.

"పఞ్చాగ్నయో యేచత్రిణాచికేతాః" ఎన్నుమ్-"తపస్సన్తాపలబ్ధస్తే యో యంధర్మపరిగ్రహః" ఎన్నుమ్- "కార్యస్త్రిష్వభిషేకశ్చ కాలేకాలేచనిత్యశః" ఎన్నుమ్-"ఓత్తి నామఙ్కుఱిత్తుచ్చిత న్నాల్ ఒళిమామలర్ ప్పాత నాళుమ్పణివోమ్" ఎన్నుమ్ - మాఱికోణ్డై యిన్ద్రియిలే యప్పునీరిలుమ్

మశ్నుతే" "కషాయపక్తిఃకర్మాణి జ్ఞానంతుపరమాగతిః।కషాయేకర్మభిఃపక్వే తతోజ్ఞానంప్రవర్తతే" ఇత్యాది ప్రమాణముల ననుసరించి, 1స్వోత్పత్తి ప్రతిబంధక నివర్తనార్థముగా, యజ్ఞదానాది సాధనముల నపేక్షించియుండును.

ప్రపత్త్యుపాయము, "తమేవైకంజానథాత్మానం అన్యావాచో విముంచథ" "సర్వధర్మాన్పరిత్యజ్య మామేకంశరణంవ్రజ" ఇత్యాది ప్రకారముగా, సృష్టియందు2త్రివిధకారణమున్ను తానేయయినట్లు 3ఆత్యంతిక ప్రళయమనఁదగిన మోక్షమందున్ను అంగమును అంగియును ఉపాయమును ఉపేయమును తానొక్కడే యగుటంబట్టి యితర నిరపేక్షముగానుండును.

(ఇఁక "అవిద్యయామృత్యుంతీర్త్వా" "కషాయపక్తిఃకర్మాణి"

---

1[స్వోత్పత్తిప్రతిబంధకేత్యాది]భక్తిరూపాపన్న జ్ఞానము పుట్టుటకు విరోధులుగానుండు పాపములు నశించుటకై, అని యీవాక్యమునకర్థము.

2[త్రివిధకారణము]ఉపాదానకారణము, నిమిత్తకారణము, సహకారికారణము, వీటినిగురించిన ప్రతిపాదనమును సంగ్రహముగా శ్రీమత్త్రత్త్వత్రయ రహస్యమందున్ను విస్తరముగా శ్రీశారీరకమీమాంసా బ్రహ్మసూత్రభాష్యమందున్ను సేవించవచ్చును.

3[ఆత్యంతికప్రళయము]అనఁగా ప్రళయమయినపిమ్మట పునస్సృష్టియుగలదు. మోక్షముగలిగినపిమ్మట పునరావృత్తిలేదు కాఁబట్టి మోక్షము ఆత్యంతికప్రళయమనఁదగునని భావము.

ఈపుటయందలి ఆంధ్రవాక్యములకు సరియయిన మణిప్రవాళవ్యాఖ్యానమును ౧౩౧-వ పుటలో చూడుడు,

‡ఉవర్ నీరిలుమ్ శుట్టనీరిలుమ్ శునై నీరిలుమ్‌తోయ్న్గుమ్ నాలుపాకుమ్ ఉచ్చియిలుమ్ § అ్రల్ తూవనిన్ఱు క్లేశిక్కుమ్బడి యాకైయన్ఱిక్కే- "ఆనన్దో బ్రహ్మ" "ఆనన్దం బ్రహ్మ" "కం బ్రహ్మ ఖం బ్రహ్మ" ఎన్గిన్ఱ- "సర్వగన్ధస్సర్వరసః" ఎన్గుమ్-సుఖరూపమాయ్,

"మిథ్యాప్రయుక్తో యజమానం హినస్తి" "జ్ఞానదోష పరిభ్రష్టశ్చణ్డాలీం యోనిమాస్థితః" ఎన్ఱు-అల్పమ్‌తప్పిల్ కర్తానశిక్కైయన్ఱిక్కే,

ఇత్యాది ప్రమాణములందు చెప్పినట్లు భక్త్యుత్పత్తి ప్రతిబంధకపాప నివర్తకములైన యజ్ఞదానతపఃప్రభృతిసాధనములు, *"తపసానాశకేన" "యజ్ఞోదానంతపశ్చైవ" ఇత్యాది ప్రమాణముల ననుసరించి, వర్షాతప హేమంతాది ఋతువులందుగల శీతోష్ణాదులఁజూడక యేసమయమం దెట్టితీర్థములు తటస్థించుచున్నవో, ఆతీర్థములందెల్ల స్నానముసేయుచు, నలుదిక్కులయందును ఊర్ధ్వభాగమందును తీండ్రించునట్టి వేండ్రమునకోర్చి, అతికష్టముతో సాధించఁదగినవిగా నుండును.

ప్రపత్త్యుపాయము, అంగములున్ను తానేయగుచు, "ఆనందో బ్రహ్మ" "ఆనందం బ్రహ్మ" "సుసుఖం కర్తుమ్" ఇత్యాది ప్రమాణానుసారముగా, అనుష్ఠానదశనుండియే సుఖరూపముగానుండును.

మఱియు నాయజ్ఞాదిసాధనములు, I"మిథ్యాప్రయుక్తో యజమానం హినస్తి" "జ్ఞానదోషపరిభ్రష్టశ్చాండాలీం యోనిమాస్థితః" ఇత్యా

‡ ఉవర్ నీర్ - చవ్వనీరు. ఉచ్చి - మధ్యాహ్నము. § అ్రల్ తూవ -నిష్ఠావసర.

I [మిథ్యాప్రయుక్త ఇత్యాది] యజ్ఞదానాదుల ననుష్ఠించునప్పుడు, అలక్ష్యముతోఁగాని వ్యర్థమైనవేడుకతోఁగాని శాస్త్రోక్తక్రమమును వదలిగాని యనుష్ఠించినపక్షమందు యజమానునిఁ జంపుననియును; దేశకాలపాత్రముల నెఱుఁగకయున్న జ్ఞానములేకయున్న అనుష్ఠించినపక్షమందు యజమానుడు చండాలత్వమునుఁ బొందుననియును; ఈప్రమాణములకర్థము.

* "తపసానాశకేన" ఇత్యాది ప్రమాణములు ౧౨౭-౧౨౮ ఈపుటలలో నున్నవి.

"యథాతథావాపి సకృత్కృతోఽఞ్జలిః । తదైవ ముష్ణా త్యశుభాన్యశేషత శ్శుభాని పుష్ణాతి నజాతు హీయతే" ఎన్నుమ్-" దురాచారోపిసర్వాశీ కృతఘ్నోనాస్తికఃపురా । సమాశ్రయేదాదిదేవం శ్రద్ధయాశరణంయది ॥ నిర్దోషంవిద్ధితంజన్తుం ప్రభావాత్పరమాత్మనః" ఎన్ఱుమ్ - "పఴుదునన్ఱాకిలుమ్పొల్లాకిలుమ్ శెయల్నన్ఱాకత్తిరుత్తిప్పణికొళ్వాన్" ఎన్ఱుమ్-అఙ్గైపుకెడ ప్పణ్ణినాలుమ్ దోషఙ్గళై ప్పోక్కి త్తిరుత్తి అనుష్ఠాతావై ఉజ్జీవిప్పిక్కక్కడవతాయ్,

---

ది ప్రమాణములందు చెప్పియుండురీతిగా నేదైన నొకలోపము కలిగిన మాత్రముననే కర్తకు గొప్పకీడు గలుగఁజేయునదిగానుండును.

ప్రపత్త్యుపాయము, "యథాతథావాపి సకృత్కృతోంజలిః" ఇత్యాదిప్రమాణములందుప్రసాదించియుండురీతిగా, 1కాకాసురునివలె క్రమములేని శరణాగతి ననుష్ఠించినను 2తానే యందలిదోషంబుల నెల్ల పోగొట్టి యీయధికారి నుజ్జీవింపఁజేసును.

మఱియు నాయజ్ఞాదిసాధనములు, *"అన్తవదేవాస్యతద్భవతి" "నహ్యధ్రువైః ప్రాప్యతే" ఇత్యాది ప్రమాణానుసారముగా, 3నశ్యద్ద్ర

---

1[కాకాసురునివలె] అనునప్పుడు, శ్రీవచనభూషణవ్యాఖ్యానమందు పెరియజీయర్‌స్వామివారు ప్రసాదించిన శ్రీపాద్మపురాణవచనమునుసరించి, కాకాసురుఁడు పెరుమాళ్లను శరణుచొచ్చినప్పుడు (అంతకుముందు భయభ్రాంతుఁడై మూడులోకములందున్న పరుగులెత్తుటవల్ల) దేహమందు తెలివిదప్పి పెరుమాళ్లయెదురుగా నేదోవొకవిధముగా పడినాఁడేగాని క్రమముగా శరణాగతిచేయలేదనే యర్థము ననుసంధించవలయును. 1875 సం॥రం శ్రీనికేతనముద్రాక్షరశాలాధికారులు ముద్రించినప్రతి పుట-౧౯.

2[తానేయందలిదోషంబులఁబోగొట్టి] అనునప్పుడు, పూర్వోక్తరీతిగా పెరుమాళ్లయెదుట పడియున్న కాకముయొక్క శిరస్సును వారి తిరువడియందు పిరాట్టి తామే చేర్చినారనే పాద్మపురాణవచనార్థము ననుసంధించవలయును.

3[నశ్యద్ద్రవ్యోపకరణము] అనఁగా, యజ్ఞదానాదులకు కావలసినవిగానుండు వస్తువులు నశించునట్టివిగా నుండునని భావము.

* "అంతవదేవాస్య" ఇత్యాది ప్రమాణములు ౧౩౧-వ పుటలోనున్నవి.

"అవిద్యయామృత్యుం తీర్త్వావిద్యయాఽమృతమశ్నుతే" "కషాయపక్తిః కర్మాణి జ్ఞానన్తుపరమాగతిః। కషాయేకర్మభిః పక్వే తతోజ్ఞానం ప్రవర్తతే" ఎన్ఱుమ్– "తర్తుమ్ మృత్యుమవిద్యయా" ఎన్ఱుమ్–స్వోత్పత్తి ప్రతిబన్ధకనివర్తకమాయ్,

"అన్తవదేవాస్యతద్భవతి" "నహ్యధ్రువైః ప్రాప్యతే" "ప్లవాహ్యేతే అదృఢాయజ్ఞరూపాః" ఎన్ఱుమ్ – నశ్వర౧ర్వోపకరణమాయ్ నశ్వరక్రియారూపముమాయ్ స్వయమశక్తదేవతాత్మకముమాయ్ స్వర్గపశుపుత్రాది ఫలసాధారణముమాన కర్మాదికళై అఙ్గమాక అపేక్షిక్కైయన్ఱిక్కే,

"తమేవైకం జానథాత్మానమ్ అన్యావాచోవిముఞ్చథ" "సర్వధర్మాన్ పరిత్యజ్యమామేకం శరణంవ్రజ" ఎన్ఱుమ్ – "తదేకోపాయతాయాన్తు" ఎన్ఱుమ్– "మామేవైష్యసి" ఎన్ఱుమ్–స్ఫష్టియిల్ త్రివిధకారణమున్నానే యాకైయాలే ఆత్యన్తిక ప్రళయమాన మోక్షత్తిలుమ్ అఙ్గముమ్ అఙ్గియుమ్ ఉపాయముమ్ ఉపేయముమ్ ఒన్ఱేయాయ్,

---

ర్వోపకరణంబును 1నశ్వరక్రియారూపంబును 2స్వయమశక్తదేవతాత్మకంబునునగుచు, సకాములకు స్వర్గపశుపుత్రాదులయిన యిహపర భోగ్యభోగోపకరణముల నిచ్చునదిగానుండును.

ప్రపత్త్యుపాయము, ఇట్టియంగముల నపేక్షించక పూర్వోక్త ప్రకారముగా తానే అంగము నంగియు నుపాయము నుపేయంబునగుటంబట్టి దీనికి ప్రతికక్షిగానుండును.

---

1[నశ్వరక్రియారూపము] అనఁగా "క్షీణేపుణ్యే" అనే శ్రీగీతాసూక్తిప్రకారముగా ఫలమునిచ్చినపిమ్మట నశించుననియు, తత్పూర్వమందును మంత్రలోప క్రియాలోప ద్రవ్యలోపాదులవల్ల నశించుననియు భావము.

2[స్వయమశక్తదేవతాత్మకము] అనఁగా, ఈయజ్ఞాదిసాధనములను పైపైగా నాలోచించునప్పుడు ఇవి యింద్రాది దేవతారాధనరూపములుగా నుండునుగదా? అట్టి

సర్వముక్తివైషమ్యనైర్ఘృణ్యాదికళ్ వారామైక్కాక అధికారి

అనఁగా, వాటికి కావలసియుండు వస్తువులు నశించేస్వభావము గలవి కాఁబట్టి అవి నశ్వర్ద్ర్వ్యోపకరణములనియును ;

దీనికి కావలసినది ఒకయంజలిమాత్రమే కాఁబట్టి దీనియుపకరణము నశింపదనియును ;

అవి, పుణ్యఫలముల నిచ్చినపిమ్మటనున్ను, తత్పూర్వమందు మంత్రలోపాదులవల్లనున్ను నశించుననియును ;

ఇది ,,నజాతుహీయతే" అనే పరమాచార్య శ్రీసూక్తిప్రకారముగా, ఎంతకాలమునకున్ను నశించనేరదనియును ;

వాటిచే నారాధ్యులిందాద్రులని తలఁచినప్పుడు వారలు ఫలప్రదానాశక్తులనియును ;

ఇది, ,,సాహిసర్వత్రసర్వేషాం సర్వకామఫలప్రదా" అనే ప్రమాణానుసారముగా సకల ఫలప్రదానసమర్థముగానుండుననియును ;

అవి, సకాములకు స్వర్గాదిఫలముల నిచ్చుననియును ;

ఇది, ,,పలనీకాట్టిప్పడుప్పాయో" ,,అపిప్రార్థయమానానాం పుత్రక్షేత్రాదిసంపదాం । కురువైరాగ్యమేవ" ఇత్యాదిప్రకారముగా (ఫలాంతరముల నపేక్షించువారికి సైతము) వైరాగ్యమునే పుట్టించుననియును ;

ఈప్రకారముగా ననుసంధించవలయునని భావము.)

ఇట్లు, ఈప్రపత్తి యితర నిరపేక్షముగానుండు పక్షమున ఆనుకూల్యసంకల్పాదులు సైతము దీని కనావశ్యకములుగదా? అనిన నుత్తరము సాయించుచున్నారు ; ,,సర్వముక్తివైషమ్యనైర్ఘృణ్యాదికళ్ వారామైక్కాక" ఇత్యాదిగా.

---

యెడ నాదేవతలీయజ్ఞాదులకు ఫలమునిచ్చు విషయమందు తామశక్తులు గానుందురని భావము.

స్వరూపయోగ్యతాపాదకమాన ఆనుకూల్యసఙ్కల్పాది మాత్రసాపేక్షైయాయ్,

---

ఇచట, ఆనుకూల్యసంకల్పమందు 1శమదమాద్యాత్మగుణంబులు గ్రహింపఁబడుచున్నవి. ప్రాతికూల్యవర్జనమందు అతిప్రవృత్తివ్యవసాయనివృత్తి గ్రహింపఁబడుచున్నది. "ప్రాతికూల్యవర్జనమావతు, అతిప్రవృత్తి వ్యవసాయనివృత్తి" అని శ్రీతనిచరమ రహస్యావతారికయందు ప్రసాదించియున్నారుగదా? శాస్త్రతాత్పర్యనిర్ణయమందుగాని సత్సంప్రదాయ పరిశీలనమందుగాని తనయిచ్ఛవచ్చినట్లు ప్రవర్తించుట సైతము, అతిప్రవృత్తి వ్యవసాయమనుటకు సందేహములేదు. ఇట్టి అతిప్రవృత్తి గలవారు ప్రపత్తిననుష్ఠించిరేని వారికిన్ని మోక్షమివ్వవలయునుగదా? అప్పుడు వేదశాస్త్రవిహితమర్యాదలున్ను శిష్టానుష్ఠానములున్ను అప్రయోజకములై 2దురాచారులకు సైతము మోక్షము సిద్ధించవలసి వచ్చుటవల్ల సర్వముక్తి ప్రసంగమువచ్చును.

ఇట్టివారిలో కొందఱికిమాత్రము మోక్షమిచ్చి తక్కినవారిని

---

1[శమదమాద్యాత్మగుణంబులు గ్రహింపఁబడుట] యేట్లనిన. ఆనుకూల్యమనఁగా సర్వభూతములయందును హితపరుఁడైయుండుట కాఁబట్టి, అది శమదమాద్యాత్మగుణములులేక కలుగనేరదని భావము.

అథవా "ఆనుకూల్యస్యసంకల్పః" అనుటకు "అనన్యప్రయోజనతాకై" అని శ్రీతనిచరమ రహస్యమందు ప్రసాదించియున్నారు, కాఁబట్టి యిట్టి యనన్యప్రయోజనత్వము శమదమాద్యాత్మగుణంబులులేక సిద్ధించదుగదా? అని భావము.

2[దురాచారులకు సైతము...సర్వముక్తి ప్రసంగమువచ్చును]అనునప్పుడు ప్రాతికూల్యవర్జనమును సర్వముక్తిప్రసంగమునకు పరిహారముగా నిర్ణయించుటవల్ల ఆనుకూల్యసంకల్పాదులున్ను అందులో నంతర్భూతములై సర్వముక్తిప్రసంగ పరిహారార్థములే యగుచున్నవని గ్రహించవలయును. ముముక్షుపడియందు ఉపాయస్వీకారము సర్వముక్తిప్రసంగ పరిహారార్థమని సాయించుచు దానియందుగల యుపాయత్వశంకను వదలించిరి; ఈగ్రంథమందు వీరు, ఆనుకూల్యసంకల్పాదులయందుగల ఉపాయాంగత్వశంక

సంసారులుగా త్రోయుటవల్ల సర్వేశ్వరునకు వైషమ్యనైర్ఘృణ్యాదోషములు సిద్ధించును. (ఇందులో వైషమ్యమనఁగా పక్షపాతవంచన, నైర్ఘృణ్యమనఁగా సంసారులందు దయాహీనత్వము.) ఇట్టిదోషములు రాకుండుటకై ఆనుకూల్యసంకల్పాదులిచ్చోట నపేక్షింపఁబడుచున్నవి.

ఇంతేకాదు. ఈయధికారి, భక్తియోగాద్యధికారులకంటె అత్యంతవిలక్షణుఁడు కాఁబట్టి యితనిస్వరూపమునకు తగిన యోగ్యత యుండవలయునేగాని విచ్చలవిడిగా నుండఁదగదుగదా? కాఁబట్టి అట్టి యోగ్యతలను కలుగఁజేయునట్టి యానుకూల్యసంకల్పాదులిచ్చోట నవశ్యాపేక్షితములుగానున్నవి.

ఇట్టికారణములవల్ల నీప్రపత్తి యానుకూల్యసంకల్పాదులను మాత్ర మపేక్షించుచున్నదని యీవాక్యమునకు భావము.

(ఇచ్చట తటస్థశంక యొకటిగలదు, అదియెట్టులనిన; మన పూర్వాచార్యులందఱు నచ్చటచ్చట చేసియుండు ప్రతిపాదనములవల్ల ప్రపన్నునికిన్ని 1తదనుష్ఠానప్రతిపాదక శాస్త్రములననుసరించి అనేకానుష్ఠానములున్నవనియును; అవి యీతనిస్వరూపముననుసరించి యేర్పడినవిగాన, అవర్జనీయములై యుండుననియును; ఇతఁడందఱికన్న విలక్షణుఁడైనట్లుగా నితని యనుష్ఠానమున్ను "విహితవిషయనివృత్తి తన్నేశిఖమ్" అని సమస్తానుష్ఠానములకన్న విలక్షణముగానుండుననియును; అంతకుపైన లోకసంగ్రహార్థముగానున్ను శిష్యపుత్రుల యుజ్జీవనార్థముగానున్ను వర్ణాశ్రమాచారములు సైతమీయధికారికి భగవ

ను వదిలించినారు. అంతు "ఇత్తైయొన్ఱియవుమ్ తానేకార్యమ్ శెయ్యుమెన్ఱు నినైక్కక్కడవదు" అనే శ్రీసూక్తిప్రకారముగా నీయధికారికుండఁదగిన ప్రతిపత్తివిశేషము చెప్పఁబడినది.

1 [తదనుష్ఠాన ప్రతిపాదకశాస్త్రములు] శ్రీపాంచరాత్రాదులున్ను ప్రపన్నపారిజాతాది గ్రంథములున్ను.

ఇప్పడి కొ్కాత్తఅనేకగుణ పౌష్కల్యాజ్గళాలేభక్తియిల్ ప్రపత్తి యే అత్యన్తవిలక్షణై.

ఇప్పడికొ్కాత్త ప్రపత్తియెప్పణ్ణినవనుక్కు,

న్ముఖోల్లాసరూప [1]ప్రాప్యకోటిఘటితమై యవశ్యానుష్ఠేయమగునసియు ను; ఏర్పడుచున్నది. అట్లయితే ప్రపత్తియు దుష్కరోపాయమనవచ్చు నుగదా? అనిన, అట్లుగాదు; ఉపాయాంతరములు స్వయత్నసాధ్యము లుగాన వాటిని నిరపాయముగా ననుష్ఠించు విషయమందు చేతనుని యందే సమస్తభారమున్ను నెలకొనియుండును. ఈప్రపత్త్యుపాయమ ట్లుగాక సకలభరమున్ను సర్వేశ్వరునియం దుంచఁబడియుండుటంబట్టి యీయధికారి కెన్నియనుష్ఠానములుండినను వాటిభారము తనకెంత మాత్రంబునుఁడోఁచక ప్రాప్యసమానమై సుఖరూపముగానుండును. కాఁబట్టి యిది యత్యంతసులభోపాయమేగాని దుష్కరోపాయమని తలచఁదగదు.

(ముఖ్యముగా నీప్రపత్తియందు చేతనుఁడు తనస్వరూపమున కపాయముగలుగక జాగరూకుఁడై యుండవలసిన భారమొక్కటిమా త్రమే నెలకొనియుండునుగాని, ఉపాయవిషయముగానున్ను అధికార యోగ్యతాసంపాదన విషయముగానున్ను ఈతనికెంతమాత్రము భార ములేక అతఁడే «శెయల్ నన్ఱాక త్తిరుత్తి" రక్షించునని నిష్కృష్టార్థము)

ఇఁక నిట్టిగుణసమృద్ధివల్ల భక్తియోగమునకన్న ప్రపత్తియే మిక్కిలి విలక్షణమైనదని సిద్ధాంతపరచుచున్నారు, «ఇప్పడికొ్కాత్త అనేకగుణ పౌష్కల్యాజ్గళాలే" ఇత్యాది వాక్యశేషముచే.

ఇఁక నీ[2]నిర్వాహమును పూర్వోక్త (ప్రపన్నా ఏవ అనే) వాక్య

1 [ప్రాప్యకోటిఘటితము] ప్రాప్యములో చేరినది.

2 [నిర్వాహము] శ్రుతిస్మృత్యాది ప్రమాణములఁ బ్రతిపాదించుచు సాధింపఁబడిన యర్థము.

3. (ప్రపన్నాయైవ) «మన్త్రేవ్యూహేనయేచారేయుక్తోభవితుమర్హతి" ఎన్రు- కర్మయోగనిష్ఠరాన ఉమకు-మాకోమ్; «జామ్బవాం

ముతోఁ బొందించుచున్నారు. «ఇప్పడికొ్క-త్త ప్రపత్తియైప్పణ్ణినవనుక్కు-" అని. ఇప్పడికొ్క-త్త; అనుటవల్ల ప్రపత్త్యుపాయమందుగల (పూర్వోక్త) వైలక్షణ్యవిశేషములు సెప్పఁబడుచున్నది. ఇట్టి ప్రపత్తి సేసినవానికి, అని యీవాక్యమునకర్థము. ఈవాక్యము. « అభయం దదామి" అనుచోట నన్వయించుచున్నది.

ఇఁక సుగ్రీవజాంబవంతులయొక్క-యును తిరువడియొక్క-యును అభిప్రాయములయందు1ధ్వన్యర్థములనుగ్రహించి వారి ముగ్గురికన్నను శ్రీవిభీషణాళ్వానులయందు పెరుమాళ్లకుఁగల పక్షపాతమునుఁజూపించువారై మరల వాక్యమును గ్రహించుచున్నారు, (ప్రపన్నాయైవ) అని. ప్రపన్నునికే అభయమిచ్చుచున్నానని యీవాక్యమునకర్థము. ప్రపన్నునికే అనునప్పుడు మఱియెవరికివ్వరని ప్రశ్నవచ్చుచున్నది కాఁబట్టి, అట్టి ప్రశ్నకుత్తరము సాయించుచున్నారు ; « మన్త్రేవ్యూహే" ఇత్యాదిగా. ఈవాక్యములవల్ల స్వరక్షణేస్వాన్వయమును సవాసనగావదలిన ప్రపన్నునికే నేనిట్టియభయప్రదానము సేయుదునుగాని, స్వరక్షణమందు ప్రయత్నించునట్టి కర్మజ్ఞానభక్తినిష్ఠులకిట్టి యభయప్రదానము సేయనని తాత్పర్యమేర్పడుచున్నది. ఇట్టితాత్పర్యము సిద్ధించుటకై «మంత్రేవ్యూహే" ఇత్యాది వాక్యములందు ధ్వన్యర్థములను గ్రహించుచు, శ్రీసుగ్రీవమహారాజును కర్మయోగనిష్ఠునిగానున్న, జాంబవంతులను జ్ఞానయోగనిష్ఠులుగానున్న, తిరువడిని భక్తియోగనిష్ఠునిగానున్న, సాయించినారు.

1[ధ్వన్యర్థములు] ఒకవాక్యమునకు ప్రకృతార్థముగాక, శిష్టజనసమ్మతముగానూహింపఁబడునట్టి యర్థవిశేషము.

స్త్వథసంప్రేక్ష్య శాస్త్రబుద్ధ్యావిచక్షణః" ఎన్గిఱ జ్ఞానయోగనిష్ఠరాన జామ్బవానుక్కు మాకోమ్;

"మన్త్రేవ్యూహేనయేచారే యుక్తోభవితుమర్హసి" అనేవాక్యమునందు, మంత్రమనఁగా కార్యాకార్యవిచారము, వ్యూహమనఁగా సైన్యసమూహమును చేర్చిపెట్టుట, నయమనఁగా చక్కఁగా నాలోచించి నిశ్చయింపఁబడిన కార్యములను ఆయా విషయములయందుపయోగపరచుట, చారపదము శత్రువులమర్మము నెఱుంగుటకై తన చారులను వారియొద్దకుఁ బంపుటను చూపుచున్నది. ఇన్నివిషయములందున్ను జాగరూకుఁడై యుండుట రాజునకు శ్రేయస్కరమని 1శ్రీసుగ్రీవమహారాజు చెప్పియుండుటవల్ల, ఇకార్యములు కర్మయోగము వంటివిగా నున్నవని తిరువుళ్లమునగ్రహించి, ఇట్టి కర్మయోగనిష్ఠుఁడైన సుగ్రీవునిపక్షము నాశ్రయించుమని పెరుమాళ్లతిరువుళ్లముగా నిర్వహించినారు.

ఇఁక " జాంబవాంస్త్వథసంప్రేక్ష్య శాస్త్రబుద్ధ్యావిచక్షణః " అనేవాక్యమునందు, ప్రకృతార్థము, రాజనీతిశాస్త్రము నెఱింగిన జాంబవంతుఁడు అట్టి శాస్త్రముననుసరించి (శ్రీవిభీషణాంగీకారవిషయముగా) చక్కఁగానాలోచించి తనయభిప్రాయమును పెరుమాళ్లసన్నిధియందు విన్నవించినాడనే యింతమాత్రమే యేర్పడినను; "విచక్షణః" అనేపదము విద్వాంసుడనే యర్థమునిచ్చుటవల్లనున్ను; "శాస్త్రబుద్ధ్యాసంప్రేక్ష్య" అనేపదములు ("తస్మాచ్ఛాస్త్రంప్రమాణంతే" అనే శ్రీ

1 [శ్రీసుగ్రీవమహారాజుచెప్పినది] శ్రీవిభీషణాళ్వానులు లంకనుండివచ్చి యాకాశముననిలచి, వానరవీరులతో "నేను శరణాగతుఁడై వచ్చినానని పెరుమాళ్ల సన్నిధియందు విన్నవింపుడని చెప్పినప్పుడు, శ్రీసుగ్రీవమహారాజు శ్రీవిభీషణాళ్వానులందు మిక్కిలి యతిశంకచేసి పెరుమాళ్లసన్నిధికివచ్చి శ్రీవిభీషణాళ్వానులను పరిగ్రహించకూడదని స్థాపించునప్పుడు చెప్పినవాక్యము.

"భక్తిశ్చనియతావీర" ఎన్గిఱ భక్తియోగనిష్ఠరాన హనూమా నుక్కుమాకోమ్;

గీతోపనిషత్తు (అధ్యా-౧౬, శ్లో-౨౪,) వాక్యముననుసరించి) వేదము లనున్ను తదుపబృంహణములైన యితిహాసపురాణాదులనున్ను చక్కగా పరిశీలించినారనేయర్థము నిచ్చుటవల్లనున్ను; 1"నహిజ్ఞానేనసదృశం పవిత్రమిహవిద్యతే" అనే జ్ఞానయోగము నీవాక్యము చూపించుచున్నదని తిరువుళ్లమునగ్రహించి, ఇట్టి జ్ఞానయోగనిష్ఠులైన జాంబవంతుల పక్షమునుసైత మాశ్రయించమని పెరుమాళ్లు తిరువుళ్లముగా నిర్వహించినారు. శాస్త్రపరిశీలనపూర్వకముగా తత్త్వజ్ఞానమువడసినవాడే విద్వాంసుఁడని తిరువుళ్లము.

ఇఁక 2"భక్తిశ్చనియతావీర" అనే తిరువడివాక్యము భక్తియోగమును చూపించుచున్నదనుట స్పష్టముగానున్నది.

ఇట్లు వీరిముగ్గురి పక్షమునున్ను మేమాశ్రయించమని పెరుమాళ్లు తిరువుళ్లముగా నిర్వహించి, ఇఁక శ్రీవిభీషణాళ్వానులయందు, ఇట్టి స్వరక్షణేస్వాన్వయములేదని చూపించుచు, నిర్వాహమును సి

1 [నహిజ్ఞానేనేతి] శ్రీభగవద్గీత, అధ్యా-౪, శ్లో-౩౮. సమస్తపాపములనున్ను నశింపఁజేయుటకు జ్ఞానముతో సమానమైన దేద్దియులేదని యీవాక్యమునకర్థము.

2 ["స్నేహోమేపరమోరాజన్ త్వయినిత్యంప్రతిష్ఠితః । భక్తిశ్చనియతావీర భావోనాన్యత్రగచ్ఛతి"] ఉత్తరశ్రీరామాయణము. సర్గము-౪౦, శ్లో-౧౫. ఈశ్లోకము యొక్క వ్యాఖ్యానమును "వైయత్తువాళ్వార్ కాళ్" అనే శ్రీసూక్తి ఆళాయిరప్పడి వ్యాఖ్యయందుసేవించి కృతార్థులు కావలసియున్నది, "స్నేహోమేపరమః"అనేపదము సత్తాప్రయుక్తమయిన అతిమాత్రస్నేహమును చూపుచున్నది. దీనికిమించిన పురుషార్థము లేదుగదా! ఇట్లుండియు మరల భక్తిశ్చనియతా" అనుటవల్ల తిరువడి "ఇరుకరైయర్" అని తలఁచవచ్చునుగదా! ఇట్లు తిరువడియందు భక్తియోగనిష్ఠ తలచూపుటవల్ల వీరికన్న శ్రీవిభీషణాళ్వానులయందు పెరుమాళ్లకు పక్షపాతమధికమని యీనిర్వాహమునందు తిరువుళ్లము.

“రాఘవంశరణంగతః” ఎన్ఱు – ప్రపన్ననాన విభీషణను క్కే-యాకక్క-డవోమ్.

(ప్రపన్నాయైవ) “అకారార్థాయైవ” ఎన్ఱుమ్–“తనక్కే-యాక

---

ర్థాంతపరచుచున్నారు; “రాఘవంశరణంగతః” ఇత్యాది వాక్య శేషముచే. “రాఘవంశరణంగతః” నాయందు సర్వభరన్యాసపూర్వకముగా ప్రపన్నుఁడై నాడని యీవాక్యమునకు భావము. కాఁబట్టి మేము యిట్టి శ్రీవిభీషణాళ్వానులపక్షము నాశ్రయించువారమేగాని సాధనాంతరనిష్ఠులనఁదగినట్టి సుగ్రీవజాంబవద్ధనుమానులపక్షము నాశ్రయించమని పెరుమాళ్ల తిరువుళ్ళమని పూర్వవాక్యముతో నన్వయము.

శ్రీసుగ్రీవమహారాజు “వధ్యతాం” అని శ్రీవిభీషణ ప్పెరుమాళ్లు వధ్యులనిచెప్పిరి. శ్రీజాంబవంతులు “శంక్యతాం” అని అతనినంగీకరించు విషయమున సందేహించవలసియున్నదని చెప్పిరి. తిరువడి యందఱిపక్షమున్ను ఖండించి “రాక్షసస్యార్జవం” అని అతఁడు నిర్దోషియని సిద్ధాంతపరచిరి. పెరుమాళ్లు తిరువడిపక్షమున్ను అనాదరించి “దోషోయద్యపి” అని యతనియందు దోషమున్నను నేనాతని విడువఁజాలనని సాయించిరి. కాఁబట్టి పెరుమాళ్లు తిరువడివాక్యమును సైతము సుగ్రీవజాంబవంతుల వాక్యమువంటిదిగానే తలఁచి, వారి ముగ్గురిపక్షమున్ను మేమాశ్రయించమని సాయించినారని యీనిర్వాహమునకు తాత్పర్యము.

అథవా (ప్రపన్నాయైవ) అతఁడు 1“అకారార్థాయైవ” అనియు

---

1 [అకారార్థాయైవ] ఇత్యాది. అకారవాచ్యుఁడైన సర్వేశ్వరునికే నేను శేషభూతుఁడని యీవాక్యమునకర్థము. “తిరుమన్త్రత్తిల్ ఆత్మావాలేపే ఔన్నిఅతు” అనే శ్రీసూక్తిననుసరించి యిది యుపాయస్వీకారదశయందలి వాక్యమని సెప్పఁదగియున్నది. “తనక్కే-యాక” అనే శ్రీసూక్తికి “అత్తలై క్కే-రసమామ్బడి వినియోగమ్కొళ్ల వేణుమ్” అని శ్రీ పెరియజీయరుస్వామివారు వ్యాఖ్యానము ప్రసాదించియుండుటంబట్టి యీశ్రీసూక్తి

వైనై క్కొళ్ళుమీతే" ఎన్రుమ్-అవన్ నమక్కేయా యిరుక్క మాప్పో లే, ,,ఎనక్కే తన్నై త్తన్ద కళ్వికమ్" ఎన్రు-అభియుక్తర్ శొన్నపడియే నామ్ ప్రపన్ననుక్కేయాకక్కడవోమ్.

అవన్ ప్రపన్ననావతు క్షుద్రప్రయోజనత్తుక్కాకవన్రో? ,,రాజ్యం ప్రార్థయమానశ్చ బుద్ధిపూర్వమిహాగతః" ఎన్రు-ఉమ్మోడైయ హనూమానన్రో శొన్నానెన్న; (తవాస్మీతిచయాచతే) అనన్యప్రయోజననాయేవన్దాన్ కాణుమెన్గిఱార్.

,,తనక్కేయాక వెనై క్కొళ్ళుమీతే" అనియును ఉపాయస్వీకారదశ మొదలు కైంకర్యదశవఱకును నేనే తప్ప నితఃపరంబెఱుంగక యుండునట్లు, మేమును (,, ఎనక్కే తన్నై త్తన్దకళ్వికమ్ " అనే అభియుక్తోక్తిప్రకారముగా) మత్స్వరూపరూపగుణవిభూతులతోడ నతనికే యగుచున్నామని పెరుమాళ్ల తిరువుళ్లముగా నొకభావ మేర్పడుచున్నది.

ఇఁక ననన్తరవాక్యమునకు (అనఁగా ,, తవాస్మీతిచయాచతే " అను వాక్యమునకు) వ్యాఖ్యానము సేయుచున్నారు. వీరి1భావనాప్రకర్షము2,,రామభూతంజగదభూత్ " అనే ప్రకారముగా తామే చక్రవర్తి త్తిరుమకనార్ల అనేస్థితికి తెచ్చినట్లు వీరివ్యాఖ్యానవాక్యములవల్ల నేర్పడుచున్నది. ,,కడల్ ఞాలమ్ శెయ్ తేనుమ్ యానేయెన్నుమ్"అనే తిరువాయ్

---

కైంకర్యదశను చూపుచున్నది. ఇచ్చట, ఉపాయస్వీకారదశ కైంకర్యదశ అనే యీరెండుమాత్రమే చెప్పియుండినను ,,మున్నైనాలుదశైయుండు" అనే వచనభూషణ దివ్యశాస్త్రోక్తములైనదశలు నాలుగున్ను, ఇచ్చోట ననుసంధేయములు. అంతు జ్ఞానదశ మొదలు కైంకర్యదశవఱకు నీయధికారియొక్క భగవదేకపారతంత్ర్యము సెప్పఁబడినది.

1 [భావనాప్రకర్షము] శ్రీచక్రవర్తి త్తిరుమకనార్ల యభిప్రాయమును నిరంతరము ననుసంధించుటవల్ల నది తమ్ము మఱచునట్లు సేసిన బుద్ధిపరిపాకము.

2 [రామభూతంజగదభూదితి] ,, రామోరామోరామఇతి ప్రజానామభవన్ కథాః" అనునది దీనికి ముందువాక్యము. ,, స్త్రియోవృద్ధాస్తరుణ్యశ్చ" ,,బాలాఅపిక్రీడమానాః" ఇత్యాది ప్రకారముగా పసిబిడ్డలు, స్త్రీలు, మొదలు సమస్తప్రజలున్ను రామ

మొఴి, తిరుప్పావై, మొదలగునవి భావనాప్రకర్షమువల్ల ప్రసాదింపఁబడినవేగదా? వారిననుసరించిన యీయాచార్యశిరోమణులకిట్టి భావనాప్రకర్షము కలుగుట చోద్యముకానేరదు. కాఁబట్టి యిట్టి భావనాప్రకర్షమువల్ల "ఎల్లేయిళఙ్గిళియే" ఇత్యాది శ్రీసూక్తులయందుగల 1 ప్రశ్నోత్తరప్రకారముగా వ్యాఖ్యానము సాయించుచున్నారు; "అవర్ణ ప్రపన్నానావతు క్షుద్రప్రయోజనత్తుకాకవన్ద్రో?" ఇత్యాదిగా. ఇది శ్రీసుగ్రీవమహారాజుయొక్క శంకావాక్యమని తిరువుళ్లము. ఇచ్చట పెరుమాళ్ల వాక్యమునున్ను మహారాజువాక్యమునున్ను వీరొకరే సాయించుటవల్ల వీరి భావనాప్రకర్ష ముభయదశనున్ను యిచ్చినదని గ్రహించవలయును. పెరియాఴ్వార్ తిరుమొఴి "ఎన్నాతన్" ప్రవేశ మునందీవిషయము విశదము.

పెరుమాళ్లయం దతిమాత్రస్నేహముగల మహారాజు "సకృదేవప్రపన్నాయ" అనునప్పుడు పెరుమాళ్లయొక్క శరణాగతపక్షపాతమును తనలో నాలోచించి "హాసీతా లక్ష్మణ" అనినవానివలె "రాఘవంశరణంగతః" అనిన యీరాక్షసుడున్ను ఎట్టియనర్థమునుఁ దెచ్చునో? యనిశంకించి, వీనినెట్లాయినను తోలఁగఁద్రోయవలయుననే తలఁపుతో స్వామీ, వీఁడు ప్రపన్నుడుగాడు, ప్రపన్నుడైతే అనన్యప్రయోజనుఁ

గుణవిద్ధులై యుండిరని శ్రీవాల్మీకిభగవానులు రామరాజ్యవైభవమును సాయించుచు, "రామభూతంజగదభూత్" అని ప్రపంచమంతయు రామస్వరూపమే అయినదని సాయించినారని యర్థము.

I [ప్రశ్నోత్తరప్రకారముగా] అనునప్పుడు, దీనికిముందు సాయించిన (మణిప్రవాళవ్యాఖ్యాన) వాక్యములందున్ను, భావనాప్రకర్షమువల్ల నిట్లు(ప్రశ్నోత్తరముగా) సాయించినారని నిర్వహించవచ్చునుగాని, ఆవాక్యము లిచ్చటివాక్యములవలె "ఉమ్మదైయహనుమాన్" "లక్ష్మణనుమ్ శత్రుఘ్ననుమ్" అనియిట్లు సుస్పష్టముగా భావనాప్రకర్ష ప్రశ్నోత్తరములను చూపించియుండలేదు కాఁబట్టి యచ్చటనే యీనిర్వాహమును చూపించలేదని గ్రహించవలెను.

అత్రావతు-చకార మవధారణార్థమాయ్, దూతవధమాకాతె న్ఱు తనక్కు-ప్పణ్ణిన వుపకారత్తుక్కు- ప్రత్యుపకారమాక రాజ్యజ్గొడుక్క- వేణుమెన్ఱు అభిప్రాయమాక హనూమాన్ శొన్నాన త్తనై పోక్కి- విభీ

డుగా నుండవలయునుగదా? వీఁడట్లుగాక క్షుద్రఫలమైన లంకారాజ్యమునపేక్షించి వచ్చినాడు. ఇది నావాక్యముకాదు; 1“ఏషసర్వస్వభూతస్తుపరిష్వంగః” “ఇత్యుక్త్వాప్రీతిహృష్టాంగో రామస్తంపరిషస్వజే”అని నిరవధికప్రీతిపూర్వక సర్వస్వదానమునకు పాత్రభూతుఁడైన మీహనూమానులే2“రాజ్యంప్రార్థయమానశ్చ” అని చెప్పియున్నారు; కాఁబట్టి యీతనిఁ బరిగ్రహింపఁదగదుః అనిన (తవాస్మీతిచయాచతే) అని యుత్తరము సాయించుచున్నారు.

ఈతఁ డనన్యప్రయోజనుఁడుగానే వచ్చినాడని యీవాక్యమునకు భావము. అదియెట్లులనిన; ఇచ్చట చకార మవధారణార్థకమై నేను నీవాఁడనేయని యర్థమునిచ్చుచున్నది. అయితే తిరువడివాక్యమున కభిప్రాయమేమనిన; అతఁడు 3దూతవధము రాజనీతిశాస్త్రవిరుద

1 [ఏషసర్వస్వభూతః” “ఇత్యుక్త్వాప్రీతిహృష్టాంగః” ఇత్యాది] “స్నేహోమే పరమః” అని దివ్యమంగళవిగ్రహమం దతిమాత్రస్నేహముగల తిరువడికి వేరెద్దియిచ్చినను అమృతపానముసేయువానికి కసవు వేసినట్లుండును కాఁబట్టి, ఆలింగనమే వారికి సర్వస్వదానమని సాయించి, ప్రీతివల్లపుళకీకృతగాత్రులగుచు పెరుమాళ్లుతిరువడిని గాఢాలింగనము చేసికొనిరని యర్థము. భగవద్దివ్యమంగళవిగ్రహము పరమపదమునందు నిత్యసూరులకు భోగ్యముగానుండును; వ్యూహావతారమందు శ్వేతద్వీపవాసులకు భోగ్యముగానుండును; అట్లనే విభవావతారమందు తిరువడికి భోగ్యమైనదని భావము.

2 [రాజ్యంప్రార్థయమాన ఇత్యాది] రావణుఁడయోగ్యుడని వదలి, దేవరవారాశ్రితులకు రాజ్యమునిచ్చుటను విని, బుద్ధిపూర్వకముగా రాజ్యార్థిగానే వచ్చినాడని తిరువడి పెరుమాళ్లసన్నిధియందు విన్నవించిరని యర్థము.

3 [దూతవధము రాజనీతిశాస్త్రవిరుద్ధమని సెప్పినది] సుందరకాండమందు తిరువడి బ్రహ్మాస్త్రబద్ధులై రావణుని సమ్ముఖంబునకు వచ్చినప్పుడాతనికి వారు హితముపదే

షణన్ శొన్నానో; ‟నదేవలోకాక్రమణం నామరత్వ మహంవృణే।
ఐశ్వర్యం వాపిలోకానాం కామయేనత్వయావినా” ఎన్రుమ్— ‟ఉన్నా
లల్లాల్ యావరాలుమొన్రు జ్జుక్రైవేణ్డేన్” ఎన్రుమ్—లక్ష్మణనుమ్ శర

---

మని సెప్పి తనకుచేసిన యుపకారమునకు ప్రత్యుపకారము సేయఁద
లంచి లంకారాజ్యము నాతనికివ్వవలయుననే యభిప్రాయముతో రా
జ్యార్థియై శరణాగతిఁ బొందినాడని చెప్పినాడు. ఇంతకు నిది తిరువడి
సెప్పినదిమాత్రమేగాని శ్రీవిభీషణాళ్వానులు సెప్పలేదుగదా? అతని
వాక్యము,1‟నదేవలోకాక్రమణం...నత్వయావినా” 2‟ఉన్నాలల్లాల్
యావరాలు మొన్రుమ్కుఱైవేణ్డేన్” అని 3లక్ష్మణశరకోపులు పలికినట్లు
శింప నతండు కోపించి తిరువడినివధింప నాజ్ఞాపించినప్పుడు శ్రీవిభీషణాళ్వానులు సెప్పి
నవాక్యము.

1 [నదేవలోకాక్రమణమిత్యాది] ఇది, అయోధ్యాకాండమునందు పెరుమాళ్లు పిరాట్టిని వనవాసమునకుఁ దోడ్కొనిపోవ సమ్మతించినపిమ్మట, ఇళైయపెరుమాళ్లు తానును వారితోడ వనవాసమునకు రావలయునని ప్రార్థింపుచుఁ జెప్పినవాక్యము. స్వామీ! పిరాట్టియును దేవరవారునుగా వేంచేసియుండునప్పుడు కైంకర్యమును నేఁ గోరువాడనేగాని, ఐశ్వర్యకైవల్యంబులును, కైంకర్యరహిత భగవత్ప్రాప్తియు నా కపేక్షితములుగావని ఈశ్లోకమునకర్థము. ఇట్లుగాక, స్వర్గప్రాప్తియు, అమరత్వంబును, త్రిలోకైశ్వర్యంబును సైతము (మిమ్ము విడుచునెడ) నాకపేక్షితములుగావని యర్థము సెప్పుట శుష్కము.

2 [ఉన్నాలల్లాలిత్యాది] ఈశ్రీసూక్తికి ‟ఉన్నాలల్లాల్ ఎన్గిఱవిత్తై ఉపేయ పరమాక్కి, ఉనైయ్యొఴియ మఱ్ఱొన్రాలెనక్కొరుకుఱైయిల్లై” ఎన్రు శొల్లువారు ముణ్డు, అనే, నంబిళ్లైసాయించిన వ్యాఖ్యానసూక్తిప్రకారముగా, కైంకర్యప్రతి సంబంధిత్వేన ప్రాప్యుఁడైన నిన్ను ప్రాపించుటతప్ప వేఱొక యైశ్వర్యాదులయందు దాసునికి లేశమాత్రంబు నపేక్షలేదని భావముగ్రహించవలయును.

3 [లక్ష్మణశరకోపులు] ఈవాక్యమువల్లనే, వీరికి, తామే చక్రవర్తితిరుమకనార్లు, అనువంతటి భావనాప్రకర్షము కలిగినదని గ్రహింపవలసియున్నది. అట్లుగాకుండిన, ఇళైయపెరుమాళ్లును పరమాచార్యులును, అనిగదా యీవాక్యముండును. అయితే తామే

కోపనుమ్ శొన్నార్పోలే, "త్యక్త్వాపుత్రాంశ్చ దారాంశ్చ" ఎన్నుమ్- "పరిత్యక్తా మయాలఙ్కామిత్రాణిచ ధనానిచ । భవద్గతం మే రాజ్యఞ్చ జీవితంచ సుఖానిచ" ఎన్నుమ్-పుఱమ్బుళ్ళవఱ్ఱైయడైయవిట్టు * శేలేయ్కణ్ణియరుమ్పేరుజ్ఞాల్వముమ్ నన్మక్కళుమ్ మేలాయ్త్తాయ్తన్దైయుమ్ తామేయాక వన్దవనెన్నిఱార్.

1"త్యక్త్వాపుత్రాంశ్చ"2" పరిత్యక్తా...సుఖానిచ" అని పలుకఁబడుట వల్ల మత్ప్రాప్తియొకటితప్ప దక్కినవన్నియు విడచి "శేలేయ్కణ్ణియరుమ్" ఇత్యాదిప్రకారముగా, ఐహికభోగ్యభోగోపకరణములైన, విలక్షణస్త్రీలు, నిరవధికసంపద, అనునవియు; సద్గతికి హేతుభూతులైన గుణవంతులగు పుత్రులును; తామెంతకష్టపడినను పుత్రులయొక్క ప్రియహితములేకోరునట్టి తల్లిదండ్రులును; ఇవియన్నియు మేమేయను తలంపుతో నాతఁడువచ్చినాడని మహారాజుయొక్క శంకావాక్యమునను పెరుమాళ్లు ఉత్తరముసాయించినారని యన్వయము.

---

శ్రీచక్రవర్తితిరుమకనార్లుగా భావించియుండుదశలో వారికి యెంతోకాలమునకు పిమ్మట నవతరించిన, ఆళ్వారుల శ్రీసూక్తి నుదహరించవచ్చునా అనిన; ఇట్లు అనంతరకాల వృత్తాంతములను తత్పూర్వదశేయం దనుసంధించుట వీరలకు సహజము. "పుఱమ్ పులువాక్" అనియు "అక్కాక్కాయ్కుళ్ల్ వారవా" అనియు సాయించు భావనా ప్రకర్షమందు "వేన్దర్కళుక్కవిశేయజ్ఞమణిత్తిణ్డేరూర్న్దవక్" అనియు "కిళ్ళిక్కిళ్ కుడిమన్నర్కేడిలాతారైయళ్ళిప్పాక్" అనియుఁగదా వీరి యనుసంధానక్రమము.

1 [త్యక్త్వాపుత్రాంశ్చ ఇత్యాది] ఇది శ్రీవిభీషణప్పెరుమాళ్ల శరణాగతివాక్యము. దారాపుత్రాదులను సైతమువిడచి పెరుమాళ్లను శరణుచొచ్చినానని దీనికర్థము.

2 [పరిత్యక్తామయాలంకా ఇత్యాది] ఇది శ్రీవిభీషణాళ్వానులను పెరుమాళ్లు, అంగీకరించినపిమ్మట నాతఁడు వారిసన్నిధియందు విన్నవించినవాక్యము. దాసుఁడు లంకామిత్రధనాదులనెల్ల సవాసనగాఁ ద్యజియించి, రాజ్యంబును ప్రాణంబులును ధారక పోషక భోగ్యవస్తువులును ఐహికాముష్మికసుఖంబులును, దేవరవారి కైంకర్యమందే అంతర్భూతములుగాఁ దలఁచినానని యీవాక్యమునకర్థము. ఇది భావనాప్రకర్షమువల్ల

(తవాస్మీతిచయాచతే) "తవైవాస్మ్యహమచ్యుత" ఎన్నుమ్- "ఉన్ఱన్నోడుమ్ ఉఱ్ఱోమేయావోమునక్కే నామాళ్చెయ్‌వోమ్" ఎన్నుమ్ - అనన్యప్రయోజననాయేవన్దార్.

(తవాస్మి) "నమమ" "నరావణస్య" స్వాతన్త్ర్యముమిల్లై, పరపారతన్త్ర్యముమిల్లై; మత్పారతన్త్ర్యమేవస్వరూపమెన్ఱువన్దవర్.

(తవైవాస్మి) అవన్నుమ్మైనోక్కి "తవైవాస్మి" ఎన్ఱార్; నా

అథవా, (తవాస్మీతిచయాచతే) అనే యీవాక్యము 1"తవైవాస్మ్యహమచ్యుత" అనే పరమైకాంతి నిష్ఠనుఁజూపుచు "ఉన్ఱన్నోడు...ఆళ్చెయ్‌వోమ్" ఇత్యాది ప్రకారముగా ననుష్ఠింపఁబడినది గాన నీతఁడనన్య ప్రయోజనుఁడుగానే వచ్చినాడని భావము.

ఇందు (తవాస్మి) అనుపదము అన్యశేషత్వమునున్ను స్వస్వాతంత్ర్యమునున్ను వదలించుచున్నది కాఁబట్టి యీతఁడు రావణగూఢచారుఁడనిగాని రాజ్యార్థియనిగాని శంకింపనెడములేదు. మత్పారతంత్ర్యమొక్కటే తనకునిలకడయైన స్వరూపమని తలంచివచ్చినాడని భావమేర్పడుచున్నది.

మఱియు నీవాక్యమందుండునట్టి చకారార్థమైన యవధారణము నిచ్చటచేర్చి భావముసాయించుచున్నారు, (తవైవాస్మి) ఇత్యాదిగా. నేను నీకే శేషభూతుఁడని యీవాక్యమునకర్థము. నీకే అనుటవల్ల నత్యంతపారతంత్ర్యము చెప్పఁబడుచున్నది. ఇట్లతఁడు "తవైవాస్మి"

తామే పెరుమాళ్లుగాఁ దలఁచియుండుదశలో చెప్పినవాక్యము కాఁబట్టి, శ్రీవిభీషణాళ్వానులు పెరుమాళ్లసన్నిధి చేరినపిమ్మట చెప్పఁబడినవాక్యము తత్పూర్వమందే యెత్తి చూపఁబడినది. ఇట్లనంతరకాలవృత్తాంతములను తత్పూర్వవృత్తాంతానుభవదశయందు సాయించుట వీరలకు సహజమని ముందే చెప్పఁబడినది.

1 [తవైవాస్మ్యహమచ్యుత] ఓస్వామీ! నేను నీవాఁడనే యగుచున్నానని యర్థము.

ముమ్, ‘‘ భుక్త్వాచభోగాన్ విపులాన్ తతోన్తే మత్ప్రసాదతః । మమానుస్మరణంప్రాప్య మమలోకం సగచ్ఛతి” ‘‘పోకమ్నీయెయ్తి ప్పిన్నుమ్ నమ్మిడైక్కేపోతువాయ్” ఎన్ఱుమ్-లఙ్కా-రాజ్యముమ్ కైఙ్కర్యసామ్రాజ్యముమ్, ‘‘తవైవాస్తు” ఎన్నక్కడవోమ్.

‘‘శ్రీమతా రాజరాజేన లఙ్కాయామభిషేచితః” ఎన్ఱుమ్- విభీ

---

అని నిర్భరుఁడగుటంబట్టి మేము నాతనికి లంకారాజ్యమునున్న కైంకర్య సామ్రాజ్యమునున్న 1‘‘తవైవాస్తు” అని యివ్వఁగలవారము. ప్రపన్ననికైహిక భోగాన్వయము విరుద్ధమైనను 2 ‘‘భుక్త్వాచభోగాన్ విపులాన్ తతోన్తే మత్ప్రసాదతః । మమానుస్మరణంప్రాప్య మమ లోకం సగచ్ఛతి” అనియును, ‘‘పోకమ్ నీయెయ్తి ప్పిన్నుమ్ నమ్మిడైక్కే పోతువాయ్” అనియును, మేమే నియమించినప్పుడు, ఐహిక భోగములనొల్లననుట, పారతంత్ర్య స్వరూపవిరుద్ధమై తటస్థించును గదా? కాఁబట్టిలంకారాజ్యభోగము సైతమవర్జనీయమని తాత్పర్యము.

3 ‘‘ శ్రీమతా రాజరాజేన లంకాయామభిషేచితః”

---

1 [తవైవాస్తు] నీకే యిష్టవినియోగార్హమైయుండని.

2 [భుక్త్వాచేత్యాది] భోగ్యభోగోపకరణ భోగస్థానసమృద్ధములైన భోగముల ననుభవించి, అంతకాలమందు నాయనుగ్రహమువల్లనే మదీయస్మరణంబునుపొంది నా లోకమును అనఁగా నిత్యవిభూతినిఁ బొందఁగలడని యర్థము.

3 [శ్రీమతారాజరాజేనేత్యాది] ‘‘ఎఱియపిత్తినోడెల్లావులకుకణ్ణన్ పడైప్పు” అనే భావనాప్రకర్షము నడచుచుండగానే ‘‘వీఱ్ఱిరున్దేఴులకుమ్” అనే ఫలప్రాప్తి తిరువుళ్లమునఁ బ్రకాశించినప్రకారముగా, ఇచ్చటనున్న శ్రీవిభీషణాఴ్వానులకుఁగలిగిన ఫలప్రాప్తి తిరువుళ్లమునకు గోచరమై దానిని వివరింపుచున్నారు, ‘‘శ్రీమతా” ఇత్యాదిగా భావనాప్రకర్షమువల్ల తామే పెరుమాళ్లుగా ననుసంధింపుచుండినదశ యిక్కడినుండి మాఱినది. దీనికి కారణము ఆఴ్వారులయొక్క జ్ఞానప్రేమదశలవలె వీరికిన్ని దశాభేదమువల్ల కలిగినదని యనుసంధించవచ్చును. వీరివ్యాఖ్యానశైలినిపట్టి, ఆఴ్వారులవలె వీరి

షణవిధేయం హిలఙ్కైశ్వర్యమిదంకృతమ్" "లబ్ధ్వాకులధనం రాజా లఙ్కాం ప్రాయాద్విభీషణః" ఎన్ఱుమ్ ఇప్పడి ఇరణ్డుమ్ కొడుత్తువిట్టరుళి నానిఱే. కులధనమెన్న కోయిలాళ్వారై క్కాట్టుకిఱపడియెన్నెన్నిల్; "ఇదంవిమానమాశ్చర్య మిక్ష్వాకుకులదైవతమ్" ఎన్ఱుమ్-"మనువంశ ప్రసూతానాం క్షత్రియాణామిదంధనమ్ । కామగంకామదంకాన్తంవిమానంరఙ్గసంజ్ఞితమ్" ఎన్ఱుమ్-ఉపపురాణత్తిలుమ్, బ్రహ్మాణ్డపురాణత్తిలుమ్ స్పష్టమానత్తై ఇఙ్గే అనువదిక్కిఱతాకైయాలేకుఱైయిల్లై.

1"విభీషణవిధేయంహిలంకైశ్వర్యమిదంకృతం"అనేవాక్యములవల్ల శ్రీవిభీషణాళ్వానులకు ఆలంకారాజ్యమిచ్చినది సిద్ధము.ఇఁక, 2"లబ్ధ్వాకులధనంరాజా లంకాంప్రాయాద్విభీషణః"అనేవాక్యము కైంకర్యసామ్రాజ్యప్రాప్తిని చూపుచున్నది. కులధనమనఁగా శ్రీరంగవిమానమనియర్థము.

కిన్ని యీదశలప్పుడప్పుడు మాఱిమాఱి కలుగుచున్నవని స్పష్టమగుచున్నది. "శ్రీమతా రాజరాజేన" అనే యీవాక్యము రావణగూఢచారులైన శుకసారణులలో శుకుఁడను వాఁడు సెప్పినది. నీలంకైశ్వర్యమం దపేక్షలేకుండున ట్లవాప్తసమస్తకాముఁడై రాజాధిరాజైన పెరుమాళ్లచేత శ్రీవిభీషణాళ్వానులు లంకారాజ్యపట్టాభిషేకము చేయించఁబడిరని యర్థము.

1 [విభీషణవిధేయమిత్యాది] ఇది రావణవధానంతరమందు తిరువడి పెరుమాళ్ల యాజ్ఞననుసరించి పిరాట్టికి విజయవార్త నెఱింగింపఁబోయినప్పుడు పెరుమాళ్లవాక్యముగా పిరాట్టినిచూచి విన్నవించినవాక్యము. "సంభ్రమశ్చనగంతవ్యో వర్తంత్యారావణాలయే" అని దీనికిపూర్వార్థము. లంకారాజైశ్వర్యమును శ్రీవిభీషణాళ్వానుల స్వాధీనముచేసియున్నాము కాఁబట్టి, యిఁక నేను రావణగృహమందున్నాననే భయమును నీవు వదలుకొనుమని యీశ్లోకమునకర్థము.

2 [లబ్ధ్వాకులధనమిత్యాది] రాజావిభీషణః-పెరుమాళ్లచేత లంకారాజ్యాధిపత్యమునుఁబొందిన శ్రీవిభీషణాళ్వానులు, కులధనం-ఇక్ష్వాకు కులధనమైన శ్రీరంగవిమానమును, లబ్ధ్వా-పొంది, లంకాంప్రాయాత్-లంకాద్వీపమునుఁబొందెను.

(తవాస్మి) ,,స్థితమాత్మని శేషత్వమ్" ఎన్గుమ్- ,,స్వత్వమాత్మ నిసఞ్జాతమ్" ఎన్గుమ్-,,ఆత్మదాస్యమ్" ఎన్గుమ్- ఆత్మసత్తైయుణ్డాకిఅపో తే శేషమాయన్ఱోఇరుప్పతు.

(తవాస్మి), అహంబ్రహ్మాస్మిపోలేసామానాధికరణ్యత్తాలే శో

---

1,,ఇదంవిమాన...దైవతం" అని యుపపురాణమందును, ,,మనువంశ ప్రసూతానాం...రంగసంజ్ఞితం" అని బ్రహ్మాణ్డపురాణమందును స్పష్ట ముగాఁ జెప్పఁబడినదాని నిచ్చట ,,కులధనం" అని సాయించినారు.

ఇఁక ,,శేషత్వమే అత్మావుక్కు స్వరూపమ్" అనేయర్థమును సాయించుచున్నారు, (తవాస్మి) ఇత్యాదిగా. ,,స్థితమాత్మని శేషత్వమ్" ఇత్యాది మూడు ప్రమాణములున్ను, ఆత్మకు శేషత్వము సత్తాప్ర యుక్తమనే యర్థమునిచ్చుచున్నది, కాఁబట్టి, ఆయర్థమును ,,ఆత్మ సత్తై" ఇత్యాది వాక్యముచే సాయించినారు. ,,అస్తి బ్రహ్మ" ఇత్యాది శ్రుతిప్రకారముగా నీశ్వరుఁడున్నాడనే జ్ఞానముకలిగినప్పు డాత్మసత్త కలుగుచున్నది కాఁబట్టి, అట్టి యాత్మసత్త సిద్ధించుసమయమందే యీయాత్మ భగవచ్ఛేషముగానుండును గదా? అని యీవాక్యమున కర్థము.

ఇఁక నీప్రసంగంబున జీవేశ్వర స్వరూపైక్య భ్రమమును సైతమీవాక్యము నివర్తింపఁజేయుచున్నదని ప్రసాదించుటకై మరల

---

1 [ఇదంవిమానమిత్యాది] [మమవంశప్రసూతానామితిచ] రంగము, అనే తిరు నామముగల యీవిమానము, కామగమనము (అనఁగా తనయిష్టప్రకారముగా సంచరిం చునట్టిశక్తి) గలదిగానున్ను, సేవించువారికి సర్వాభీష్టప్రదముగానున్ను, సర్వజనమనో నేత్రరంజనమయినదిగానున్ను, సర్వలోకములనున్న తన గర్భమందణఁచుకొనియుండు సర్వేశ్వరుఁ డీవిమానమందణఁగుటవల్ల నాశ్చర్యకరమయినదిగానున్ను, వైవస్వతమను వంశమునందుపుట్టిన యిక్ష్వాకుప్రభృతి మాపూర్వరాజులకెల్ల కులదైవము కులధనముఅనిఁ బొగడొందినదిగానున్ను, ఉన్నదని యర్థము.

న్నాలుమ్ శేష శేషి భావమ్ సిద్ధిక్కుమిఱే; అప్పడిశొల్లాతే వ్యధికరణ మాక చ్చొల్లిత్తు, పూర్వాపరజ్గళాలుమ్ ప్రమాణాన్తరజ్గళాలుమ్ ఉప పాదిక్కవేణ్డి ఆపాతత్తిల్ స్వరూపైక్యమ్బ్రాన్తిక్కిటమాకైక్కవేణ్డా తెన్ఱు జీవపరమాత్మభేదముమ్ వ్యక్తమాకైక్కాక.

---

వాక్యమును గ్రహించుచున్నారు, ‚‚తవాస్మి”అని.‚‚అహం బ్రహ్మాస్మి” అనే వేదాంతవాక్యమువలె1సామానాధికరణ్యముగాఁ జెప్పినను (జీవే శ్వరస్వరూపైక్య భ్రమనివర్తకమైన) శేష శేషిభావము సిద్ధించుచున్నది గదా. అయితే ఆవేదాంతవాక్యములకు ముందును వెనుకనునుండు వాక్యములనున్న 2సమానప్రకరణమందుగల యితర ప్రమాణములను న్ను నిరూపించిచెప్పి యా శేష శేషిభావమును ప్రతిపాదించవలయును. అంత పనిచేయక ‚‚అహంబ్రహ్మాస్మి” ఇత్యాది వాక్యములకు పైపై గా, అర్థనిర్ణయముచేసిన పక్షమందు, ఆవాక్యములందు స్వరూపైక్య భ్రమముకలుగును. ‚‚తవాస్మి”అనే యీవాక్యమందు, అట్టిభ్రమము న కవకాశముకలుగక జీవాత్మపరమాత్మభేదము స్పష్టముగాఁ దెలియ వలయుననే యుద్దేశ్యముతో 3వ్యధికరణముగా సాయించియున్నారు.

---

1 [సామానాధికరణ్యమనఁగా] భిన్నార్థబోధకములగు విశేషణపదములు వా టికి విశేష్యమయిన పదమందుగల ప్రధానార్థమందే ప్రవర్తించుట.

ఇచ్చట, ‚‚అహంబ్రహ్మాస్మి” అనే శ్రుతియందు, అహం – నేను, బ్రహ్మాస్మి- బ్రహ్మప్రకారభూతుఁడనగుచున్నాను, అథవా, బ్రహ్మశరీరభూతుఁడనగుచున్నాను, అని యర్థము కాఁబట్టి ‚‚అహం” అనే విశేషణపదమునందుండునట్టి, ప్రకారభూతుఁడు, శరీ రభూతుఁడు, అనేయర్థములు, విశేష్యపదమైన ‚‚బ్రహ్మ” శబ్దమునందుగల బృహత్త్వ బృంహణత్వరూపార్థమందే ప్రవర్తింపుచున్నవని గ్రహించవలయును.

2 [సమానప్రకరణము] ప్రకృతార్థమునే తెలియజేయునట్టి మఱియొక(వేదాంత) భాగము.

3 [వ్యధికరణమనఁగా] పూర్వోక్తసామానాధికరణ్యమందువలె అర్థము దురవ గాహముగానుండక, నీకు శేషభూతుఁడనే యర్థము స్పష్టముగాఁదెలియునట్లు భిన్నవి భక్తులుగానుండుట.

(ఇతి) ఇప్పాశురం రసిత్తపడియాలే "తవాస్మి" ఎన్ఱప్రకారత్తై చ్చొల్లువతేయెన్ఱు అనుభాషిత్తు ప్రీతరాకిఱార్.

(ఇతి) "ఇత్యాహమాల్యోపజీవనః" ఎన్ఱాఱ్పోలే యారాక చ్చొల్లక్కడవ పాశురత్తై యార్ శొల్లుకిఱార్; పులస్త్యపులహాదికళితి

ఇఁక (ఇతి) అనేపదమునకు భావము సాయించుచున్నారు. "ఇతి" అనఁగా, ఈప్రకారముగా ననియర్థము. "తవాస్మి" అనిన వాక్యము "ఇవర్ పాశురమ్ కేట్టవాఱే తిరువుళ్ళముకక్కుమ్" అను రీతిగా భోగ్యమయినందువల్ల, ఈప్రకారము పలుకునంతటి యధికారినిఁ గంటిమిగదా? యని, (ఇతి) అనుచు పెరుమాళ్లు ఆనందింపుచున్నారని భావము.

అథవా, (ఇతి) 1"ఇత్యాహమాల్యోపజీవనః" అని2 పులస్త్యపులహాదులానంద పరవశులై యితిహాసరూపముగా ననుసంధించు

1 [ఇత్యాహమాల్యోపజీవనఇతి] శ్రీవిష్ణుపురాణము పంచమాంశము అధ్యా-౧౯, శ్లో-౨౧. "ప్రసాదపరమౌనాథౌ మమగేహముపాగతౌ। ధన్యోహమర్చయిష్యామీత్యాహమాల్యోపజీవనః" ప్రసాదపరమౌ - నిర్హేతుకముగా నాయందు నిరవధికానుగ్రహము గల, నాథౌ-నాస్వాములు, మమగేహముపాగతౌ-మమకారదూషితమైన నాయింటిని వెదకి కనిపెట్టివచ్చిరి. (కాఁబట్టి) ధన్యోహం-నేను పుణ్యవంతుఁడను, (ఇచట పుణ్యమనునది సాధ్యభక్తియని యెఱుంగవలయును. భగవన్నిర్హేతుక విషయీకారమునకు పిమ్మటఁ జెప్పఁబడినందున దీని నుపాయభక్తి యనఁగూడదు. ప్రపన్నులధనము భక్తి కాఁబట్టి "ధన్యోహం" అనిసాయించినారు.) అర్చయిష్యామి - వీరిని పూజించఁగలను, ఇత్యాహమాల్యోపజీవనః - ఇంతటివాక్యమును పుష్పములువిక్రయించి జీవించువాడు చెప్పెనుగదా? వానిభాగ్యము నేమనిచెప్పవచ్చునని"ఇత్యాహ" అనేపదమునకుభావము.

2 [పులస్త్యపులహాదులు] పురాణరత్నమును సాయించినవారు శ్రీపరాశరభగవానులుగానుండినను, ప్రథమాంశము మొదటియధ్యాయము ౨౯-వ శ్లోకమునందు పులస్త్యవసిష్ఠులయనుగ్రహమువలన వీరికితత్త్వయాథార్థ్యజ్ఞానముకలిగినట్లు సాయించియుండుటంబట్టి "ఇత్యాహమాల్యోపజీవనః" అనేవాక్యముపులస్త్యపులహాదులవాక్యముగానే

హాసమాక చ్ఛ్లోక్కడవహాళుర త్తై యొరురాక్షసర్ శొల్లువతే.

(చ) ఉపాయమాత్రత్తై యపేక్షిత్తువిడాతే ఫలత్తైయుమ్ వేణ్డువతే ఎన్ఱు-సముచ్చయార్థమాకవుమామ్.

(తవాస్మీతిచ) ‚‚చతుర్విధాభజన్తేమాంజనాః” ఎన్ఱు-ఫలచతు

వాక్యమును1(‚‚స్వధర్మోరక్షసాం” అని, అధర్మవర్తనమును తమకుల ధర్మముగా భావించియుండు జాతిలోచేరిన) ఒకరాక్షసుఁడు పలుకఁ గాంచితిమిగదా? యని పరవశులగుచున్నారు.

ఇఁక (చ) అనే, అవ్యయమున కర్థముసాయించుచున్నారు. ఇది సముచ్చయార్థకము. సముచ్చయమనఁగా, ఇదివఱకు చెప్పిన యర్థముగాక మఱియు నొకయర్థమును దానితోచేర్చుట. ఇచ్చట నీయవ్యయము ‚‚తవాస్మీతి” అనే వాక్యముతోచేరుచున్నది. ఇందువల్ల పూర్వోక్తమైన సకృత్ప్రపత్తిరూపోపాయమునమాత్రము చేకొని ఫలాంతరముల దిక్కుపరుగులెత్తక, నీకు శేషభూతుఁడనని కైంకర్యరూపఫలమునుఁగూడ ప్రార్థింపుచున్నాఁడని యర్థమేర్పడుచున్నది.

అథవా, (తవాస్మీతిచ) అనువాక్యమునకు2‚‚చతుర్విధాభజంతే

ప్రసాదించినారు. ఈవాక్యమునకు ‚‚మమనాథ” అనే పదమునందు దృష్టి. ఇందువల్ల శ్రీమాలాకారులు ‚‚మమనాథ” అని సాయించినవాక్యమందు స్పష్టముగాఁ దెలియుచుండు శేషశేషిభావము ననుసంధించి పరావరతత్త్వయాథాత్మ్యవిదులైన పరమర్షులు చొక్కినట్లు ‚‚తవాస్మి” అనేవాక్యము శేషికి సైతము పారవశ్యమును గలుగఁ జేయునుగదా? యని వ్యాఖ్యానకారుల తిరువుళ్లము.

1 [స్వధర్మోరక్షసామితి] ఇది సుందరకాండమునందు రావణుఁడు పిరాట్టిని చూచి పలికినవాక్యము. ‚‚గమనంవాపరస్త్రీణాంహరణంసంప్రమథ్యవా” అనునది యీ వాక్యమునకు శేషము. పరస్త్రీగమనముగాని, వారల బలాత్కారముగా నపహరించి తెచ్చుటగాని, రాక్షసులకు స్వజాతిధర్మమని యీశ్లోకమునకర్థము.

2 [చతుర్విధాభజంతేమామిత్యాది] శ్రీభగవద్గీత అధ్యా-౭, శ్లో-౧౬. నన్ను భజించునట్టి యధికారులు,-ఆర్తః-అర్థార్థీ-జిజ్ఞాసుః-జ్ఞానీ-అని నాలుగువిధములు గాను

ష్టయ సాధారణమాన ఉపాయత్తై యపేక్షిత్తాల్, ఉపేయజ్గళిల్ త్రివర్గత్తై యపేక్షియాతే పరమపురుషార్థమానఅపవర్గత్తై యపేక్షిప్పతే.

(తవాస్మీతిచ) పూర్వార్థత్తిల్ ఉపాయత్తైయపేక్షిత్తు శరణాగతనాయ్ప్పోకాతే ఉత్తరార్థత్తిల్ కైజ్కర్యత్తైయుమ్ అపేక్షిత్తు ద్వయనిష్ఠనావతే.

---

మాంజనాః" అనే శ్రీగీతోపనిషద్వాక్య ప్రకారముగా 1 ఫలచతుష్టయసాధారణమైన యుపాయము నపేక్షించినప్పుడు, ఉపేయములందును 2త్రివర్గము నపేక్షింపక పరమపురుషార్థమైన మోక్షము నపేక్షించఁగంటిమిగదా? అనియు నొకభావమేర్పడుచున్నది.

అథవా,(తవాస్మీతిచ) అనువాక్యమునకు, 3పూర్వార్థమునందలి యుపాయమును మాత్రమపేక్షించి శరణాగతిసేసి ఫలాంతరములందుఁ దగిలిపోవక,4ఉత్తరార్థమునందలి కైంకర్యమును సైతమపేక్షించిద్వయనిష్ఠుఁడగు నంతటి భాగ్యముగంటిమిగదా? అనియు నొకభావమేర్పడుచున్నది.

---

న్నారని యీవాక్యమునకర్థము. ఇందు ఐశ్వర్యభ్రష్టుఁడై మరల దానినిఁగోరువాడు ఆర్తుడనియును, గర్భనిర్భాగ్యుడై యైశ్వర్యమునుఁగోరువాడు అర్థార్థియనియును, ఆత్మప్రాప్తికాముడు జిజ్ఞాసువనియును, భగవత్ప్రాప్తికాముఁడు జ్ఞానియనియును, గ్రహించవలయును.

1 [ఫలచతుష్టయసాధారణమైన] నష్టైశ్వర్యలాభము-అపూర్వైశ్వర్యలాభము-ఆత్మప్రాప్తి-భగవత్ప్రాప్తి-అని ముందుసెప్పిన నాలుగుఫలములకున్ను పొదువైన.

2 [త్రివర్గమును] నష్టైశ్వర్య-అపూర్వైశ్వర్య-ఆత్మప్రాప్తులను. ‹‹నయ్యామిపరమాంగతిం" అనుచోట ధర్మార్థకామమోక్షములను మనగోష్ఠినుండి ప్రత్యేకపరచియుండుటవల్లనున్ను; ఇచ్చట ‹‹చతుర్విధాభజంతేమాం" అనే ప్రమాణము నంగీకరించియుండుటవల్లనున్ను; త్రివర్గము, అనేపదమునకు, ధర్మార్థకామములని యర్థము సేయఁదగదు.

3 [పూర్వార్థము] ద్వయమునందలి పూర్వవాక్యము.

4 [ఉత్తరార్థము] ద్వయమునందలి యుత్తరవాక్యము.

(తవాస్మీతిచ) ‟తవాస్మీత్యపి" ఎన్ఱాయ్, అతావతు—‟పరిపాలయనోరాజన్ వధ్యమానాన్నిశాచరైః" ఎన్ఱ ఋషికళైయుమ్, ‟లోకకామఇమంలోకంసర్వంవైవిచచారహ" ‟త్రీన్లోకాన్సంపరిక్రమ్య తమేవశరణంగతః" ఎన్ఱ జయన్తనైయుమ్బోలేత్తుచ్ఛశరీర రక్షణత్తుక్కాకవన్ఱిక్కే స్వరూపానురూపమాన పురుషార్థమాన నమ్మైయుమెన్గై.

అథవా, (తవాస్మీతిచ) అను వాక్యమునందలి చకారమును, అపి, అనేయర్థమందుఁజేర్చి, 1 ‟పరిపాలయనోరాజన్" అని ఋషులున్ను 2‟లోకకామ ఇమంలోకం...తమేవశరణంగతః" అని జయంతుడున్ను, హీనమైన దేహమునురక్షింపఁగోరి శరణాగతిచేసినట్లుగాక, స్వరూపానురూప పురుషార్థమైన మత్ప్రాప్తిని సైతము గోరునంతటివానినిఁ గంటిమిగదా? అనియొక అర్థముగ్రహించదగునని భావము. ఋషులకున్ను జయంతునకున్ను శరీరరక్షణాపేక్ష యొకటి మాత్రమేగాని, రామప్రాప్తియందపేక్షలేదు; శ్రీవిభీషణాళ్వానులకు, దేహరక్షణము, 3అపేక్షానిరపేక్షముగా 4శేషిస్వభావము ననుసరించికలిగి,

I [పరిపాలయనోరాజన్నితి] ఇది ఆరణ్యకాండమందు దండకారణ్యవాసి ఋషులవాక్యము. రాక్షసులచేత చిత్రహింసగాఁ జంపఁబడుచున్న మమ్మును రక్షించుమని పెరుమాళ్లను శరణాగతిఁబొందిరని యీవాక్యమునకర్థము. ఇందులో వీరు దేహరక్షణమాత్రమేకోరిరని యేర్పడుచున్నది.

2 [లోకకామ ఇత్యాది] ఇది సుందరకాండమందు పిరాట్టి తిరువడినిఁజూచి సాయించిన (కాకాసురవృత్తాంతమునందలి) వాక్యము. సాయందపరాధముసేసిన జయంతుఁడనే ఆకాకము రామబాణమునకు గురియై, మనకిక రక్షకుఁడెవ్వఁడని సమస్తలోకములందును తిరిగి యెందును దిక్కుఁగానక పెరుమాళ్లనే శరణాగతిఁబొందెనని యీ వాక్యమునకర్థము. ఇతఁడున్ను దేహరక్షణమాత్రముసేకోరినాడనుట స్పష్టము.

3 [అపేక్షానిరపేక్షముగా] తానుకోరకయే.

4 [శేషిస్వభావము]యుద్ధకాండమందు శ్రీసుగ్రీవమహారాజు తొలుతొల్త రావణమకుటభంగము సేసివచ్చినప్పుడు పెరుమాళ్లు ఆతనిఁజూచి నీకించుక హానికలిగిన

స్వరూపానురూపమాన పురుషార్థమ్, ,,శ్రీమతేనారాయణాయ" ఎన్నుమ్—,,సహవై దేహ్యారంస్యసే, అహంసర్వంకరిష్యామి" ఎన్నుమ్—ఇరువరుమాన శేర్ త్తియిలేయన్రో, తని త్తిరుక్కి అ ఉమక్కు శేషమానాల్ ప కాయన నాకానో వెన్న; ,,పిత్రాచపరిత్యక్తః" ఎన్గిఅవిడత్తిల్, ,,మాత్రాచపరిత్యక్తః" ఎన్ను- అనుక్తసముచ్చయమానాప్పోలే, ఇఙ్గుమ్ ,,తవాస్మీతిచ" ఎన్గతు, ,,వైదేహ్యాచాస్మి" ఎన్ను- అనుక్తసముచ్చయమాయ్ మిథునవిషయత్తిలేకాణుమ్ అపేక్షిత్తతెన్గై,

---

అంతకుపైన శరణాగతునిచే నపేక్షింపఁబడిన రామప్రాప్తియుఁ గలిగినదని, చకారమును ,,అపి" అనే అర్థమందుచేర్చుటకు భావము. కాకము ఐహికభోగసాధనమని తనదేహమును కోరెను. ఋషులు ధర్మసాధనమని తమదేహములనుకోరిరి. శ్రీవిభీషణప్పెరుమాళ్లు తనకు 1ధర్మము హస్తగతమైనందువల్ల 2సకలధర్మఫలభూతమైన భగవద్దివ్యమంగళ విగ్రహమును కోరెను.

ఇఁకనీ చకారము 3అనుక్తసముచ్చయార్థకమై 4మిథునశేషత్వమును చూపించుచున్నదని నిర్వహింపుచున్నారు; ,,స్వరూపానురూపమాన పురుషార్థమ్" అనువాక్యము మొదలు. ,,శ్రీమతేనారాయ

---

పక్షమందు నాకు సీతాలక్ష్మణభరతశత్రుఘ్నులయందుగాని నాశరీరమందుగాని యిచ్ఛ వదలి పోవునని సాయించిన స్వభావమని భావము. ,,త్వయికించిత్సమాపన్నే" ఇత్యాది శ్లోకములం దీయర్థము స్పష్టము.

1 [ధర్మము హస్తగతమనఁగా] ,,రామోవిగ్రహవాన్ధర్మః" అని సాక్షాద్ధర్మస్వరూపులైన పెరుమాళ్లు తనకు లభించియున్నారని భావము.

2 [సకలధర్మఫలభూతమయిన] అనునప్పుడు సమస్త ధర్మానుష్ఠానమునకున్న భగవత్ప్రాప్తియొక్కటే ప్రధానఫలమనే యభిప్రాయము ననుసరించవలయును.

3 అనుక్తసముచ్చయార్థకము] అవశ్యముగాఁ జెప్పవలసియుండియు విడచిపోయి నట్టి మఱియొక అర్థవిశేషమును తెలియచేయునట్టిది.

4 [మిథునశేషత్వము] పెరుమాళ్లు పిరాట్టి, యిద్దఱికిన్ని శేషముగానుండుట.

ణాయ" అనియును 1 "భవాంస్తు సహ వైదేహ్యా...అహం సర్వం కరిష్యామి" అనియును, పెరుమాళ్లును పిరాట్టియునుచేరి వేంచేసియుండునప్పుడు సేయుకైంకర్యమేగదా? స్వరూపానురూప పురుషార్థమని చెప్పఁబడును; "తవాస్మి" అనువాక్యమందు పిరాట్టి సన్నిధిలేకుండుటవల్ల శ్రీవిభీషణాళ్వానులు 2ఏకాయనులని శంకించవలసి వచ్చును గదా? అని "స్వరూపానురూపమాన" ఇత్యాది వాక్యముల కర్థము.

ఇట్టి శంకను ఈ చకారము పోఁగొట్టుచున్నదని "పిత్రాచపరిత్యక్తః" ఇత్యాది వాక్యములచేఁ బ్రసాదింపుచున్నారు. "పిత్రాచపరిత్యక్తః" అనినప్పుడు, బ్రహ్మాస్త్రముచేత పీడింపఁబడినకాకము తండ్రిచేత పరిత్యజింపఁబడెనని యర్థమగుచుండగా నావాక్యమందుండునట్టి చకారము అనుక్తసముచ్చయార్థకమై తల్లిచేతనున్న పరిత్యజింపఁబడినాడనే యర్థము నిచ్చుచున్నదిగదా? ఆప్రకారమే యిచ్చటనున్న "తవాస్మిచ" అనేవాక్యమందలి చకారమున్ను అనుక్తసముచ్చయార్థకమై పిరాట్టికిన్ని శేషభూతుఁడననే యర్థము నిచ్చుచున్నది. కాఁబట్టి శ్రీవిభీషణాళ్వానులు మిథున శేషభూతులేగాని యేకాయనులుగానేరరని భావము.

అథవా, ఈ చకారము శ్రీవిభీషణాళ్వానులు మిథున శేషత్వమే తనకు స్వరూపమని యోజించియున్నారనే యర్థమునిచ్చుచున్నదని సాయించుచున్నారు. అందు, సుగ్రీవాది వానరవీరులకును శ్రీవిభీష

1 [భవాంస్తుసహవైదేహ్యా ఇత్యాది] ఇది అయోధ్యాకాండమునందు ఇళైయ పెరుమాళ్లు సాయించినవాక్యము. పెరుమాళ్లును పిరాట్టియు రసోత్తరదశయందు వేంచేసియుండగా తాను సర్వదేశ సర్వకాల సర్వావస్థలయందును సర్వవిధకైంకర్యములున్ను చేయవలయునని యిళైయపెరుమాళ్లు ప్రార్థించిరని యీశ్లోకమునకు తాత్పర్యము.

2 [ఏకాయనులు] పిరాట్టిసాన్నిధ్యము ననాదరించి పెరుమాళ్లనుమాత్రమే ఆశ్రయించు మతమువారు.

అన్నియిలే, ఉజ్జ్వలైప్పోలే శాఖామృగమాయ్ శాఖైక్కుమేలే సఞ్చరిక్కైయన్రిక్కే, "అగ్ని హోత్రాశ్చ వేదాశ్చ రాక్షసానాంగృహే గృహే। శుశ్రావ బ్రహ్మఘోషాంశ్చ విరాత్రే బ్రహ్మరక్షసామ్" ఎన్నుమకత్తుక్కళ్ళై శాఖాసఞ్చారియానవనుక్కు త్తైరియజ్ఞానుమ్. అతావతు-"శ్రద్ధయా దేవో దేవత్వమశ్నుతే" ఎన్నుమ్ - "నిత్యైవైషా...నపాయినీ"ఎన్నుమ్-"అనన్యా రాఘవేణాహం భాస్కరేణ ప్రభాయథా"ఎన్నుమ్-అపృథక్ సిద్ధ నిత్యధర్మమాయ్ చప్పుక్కళ్ళై ఉజ్జ్వలజీన్దు శొన్నానగ్నానుమెన్గిఱారాక వుమామ్,

---

జ్ఞానులకును తారతమ్యమున్నదని పెరుమాళ్ల వాక్యముగా [1]రసోక్తిచేఁ బ్రసాదింపుచున్నారు.

ఓవానర వీరులారా ఈవిభీషణుఁడు శాఖామృగములైన మీవలె వృక్షశాఖాగ్రములందు సంచరించక [2]"అగ్నిహోత్రాశ్చ వేదాశ్చ...బ్రహ్మరక్షసాం" ఇత్యాది ప్రకారముగా నిత్యాగ్నిహోత్ర వేదఘోషములు నిండారునట్టి గృహములందుండి వేదార్థనిర్ణయార్థముగా ననేకములైన [3]వేదశాఖలందు సంచరించి "శ్రద్ధయా దేవో దేవత్వమశ్నుతే" ఇత్యాది ప్రమాణములంబట్టి పిరాట్టినాకు [4]అపృథక్సిద్ధ నిత్యధర్మముగానుండునని యెఱింగియున్నాఁడని పెరుమాళ్లు సాయించి

---

1 [రసోక్తి] పదములందుగాని వాక్యములందుగాని ప్రకృతార్థమొకటియుండఁగా, అప్రకృతమైన యొకయర్థమును వేడుకగాఁజెప్పుట.

2 అగ్నిహోత్రాశ్చ ఇత్యాది] లంకాపట్టణమునందలి ప్రతిరాక్షసగృహమందును నిత్యాగ్నిహోత్రంబును నిత్యవేదాధ్యయనంబును గలదనియును; రాక్షసజాతియందుగల బ్రాహ్మణులు వేకువజామున వేదాధ్యయనము సేతురనియును; ఈశ్లోకములకు తాత్పర్యము.

3 వేదశాఖలందు సంచరించి] అనఁగా వాటినిఁ బరిశీలించియని యర్థము.

4 [అపృథక్సిద్ధనిత్యధర్మమనఁగా] వేరుచేయఁగూడనిదై నెలకొనియుండునట్టి ధర్మము. ఉదాహరణము; పుష్పమునకు పరిమళము అపృథక్సిద్ధనిత్యధర్మము. అట్లనే

ఇప్పడి యెల్లామఱిన్దిరుక్కిఱ ఇవళ్ పరతన్త్రనాయ్ చ్చేయ్త పడికణ్డిరుక్క ప్రాప్తమిత్తనై పోక్కి నిర్బన్ధిక్కప్పెరుమోవెన్నిల్ ; (యాచతే) తనక్కితు అభిమతమెన్నుమిడమ్ తోన్ఱవిరన్దాని త్తనై.

(యాచతే) ‹‹రక్షాపేక్షాం ప్రతీక్షతే” ఎన్నుమ్-‹‹అర్థితో...జజ్ఞే” ఎన్నుమ్-‹‹వేణ్డి త్తేవరిరక్క” ఎన్నుమ్-అత్తలై యిలిరప్పైఎనామ్ పారిత్తి రున్దపడియాలే యిరన్దాళ్.

---

నారని) భావము. ఈ నిర్వాహమున్ను చకారము అనుక్తసముచ్చయ మనే మార్గమునుపట్టియే ప్రసాదించియున్నారు.

ఇట్లు ‹‹సకృదేవ ప్రపన్నాయ తవాస్మీతిచ” అనేవఱకు ప్రతి పాదింపఁబడిన నిర్వాహముచేత ప్రపత్తిస్వరూపమున్ను అధికారి స్వరూపమున్ను చెప్పఁబడినవి. ఇఁక నీయధికారియొక్క పారతన్త్ర్య స్వరూపమును నిరూపించిచూడఁగా 1‹‹తత్తస్యసదృశంభవేత్” అనిన పిరాట్టివలె శేషిహృదయమును నిరీక్షించియుండుటయే స్వరూపాను రూపమై యుండునుగాని స్వరక్షణార్థముగా శేషినినిర్బంధించుట స్వ రూపమునకు తగదనేయర్థమును స్థాపించుచు ‹‹యాచతే” అనేపద మునకు భావమును ప్రసాదింపుచున్నారు.

(యాచతే) సర్వేశ్వరుఁడు 2 ‹‹రక్షాపేక్షాం ప్రతీక్షతే” అనియు

---

సూర్యునికి తేజస్సు అపృథక్సిద్ధనిత్యధర్మము. ఇవి వేఱుచేయగూడనివై నెలకొనియుండు నుగదా? ఇచ్చట, ‹‹ప్రభైయైయుమ్ ప్రభావానై యుమ్ పుష్పత్తైయుమ్ మణత్తైయు మ్పోలే” ఇత్యాది శ్రీసూక్తులను అనుసంధించవలయును.

1 [తత్తస్యసదృశంభవేదితి] స్వతంత్రులైన పెరుమాళ్లు తమబాణములచేత లంకానగరమెల్ల సంకులంబుగావించి, పరతంత్రురాలైన నన్నుఁ దోడ్కొనిపోయిరేని యది వారిస్వామిత్వమునకు తగియుండునని భావము. ఇది సుందరకాండమునందు లంకా దహనమైనపిమ్మట తిరువడి పిరాట్టితో సంభాషించినప్పుడు పిరాట్టిసాయించినవాక్యము.

2 [రక్షాపేక్షాం ప్రతీక్షతే] దీనియర్థమును ౨౭వ పుటలో చూడుడు.

(యాచతే) "కదాహమైకాన్తిక నిత్యకింకరః ప్రహర్షయిష్యామి" ఎన్నుమ్-"వక్త్రవిలావడిమైశైయ్య వేణ్డునామ్" ఎన్నుమ్ - ప్రార్థిక్కిఱార్, అవర్ కణ్ణుక్కుయుమ్ పైయూప్పుజ్ఞ్గాల్ ఆర్క్కుమఱుక్కలామ్.

---

ను; 1"అర్థితో మానుషేలోకే జజ్ఞే" అనియును, "వేణ్డిత్తేవరిరక్క" అనియును; చేతనునియొక్క 2 అర్థిత్వము నపేక్షించియుండుటంబట్టి, శ్రీవిభీషణాళ్వానులు తనయర్థిత్వమును బయలు పరుచునట్టి యొక వాక్యమును మాత్రముచ్చరించి యింతటితో (శేషిహృదయమును నిరీక్షింపుచు) నిలచియున్నారని భావము. 3"కదాహమైకాంతిక నిత్యకింకరః ప్రహర్షయిష్యామి" అనియును; "వక్త్రవిలావడిమై శైయ్య వేణ్డునామ్" అనియునుఁ బ్రసాదింపఁబడిన యర్థిత్వ మీపదమువల్ల సూచింపఁబడుచున్నది.

అథవా (యాచతే) అత్యంతదీనత్వ సూచకములైన యీతని 4స్వరనేత్రాంగ విక్రియలను చూచినంత మాత్రమున నెట్టివారికిని బదులుచెప్పి కాలయాపనముసేయ మనసొప్పదుగదా? అని పెరుమాళ్లు తిరువుళ్లమని భావము.

---

1 [అర్థితో మానుషేలోకే జజ్ఞే] ఇది, అయోధ్యాకాండమున మొదటిసర్గమునందు, ౭వ శ్లోకము. బ్రహ్మవరబలముచేత మిక్కిలిగర్వించి లోకమును హింసింపుచుండు రావణుని వినాశార్థముగా, సకలదేవతలున్ను తన్ను శరణాగతిఁబొంది ప్రార్థించుటవల్ల పురాణపురుషుఁడైన సర్వేశ్వరుఁ డీమనుష్యలోకమున జనించెనని భావము,

2 [అర్థిత్వము] అనఁగా, శేషి తన్ను రక్షించవలయుననే యపేక్ష. ఇది "వ్రజ" అనే పదమందుగల ఉపాయస్వీకారమును చూపుచున్నది.

3 [కదాహమిత్యాది] స్తోత్రరత్నము. శ్లోకము ౮౬ సేవింపుడు.

4 [స్వరనేత్రాంగవిక్రియలనఁగా] యుద్ధకాండము ౧౭వ సర్గము ౧౮వ శ్లోకమున, పెరుమాళ్లు, ఈవిభీషణుఁడు, బలవంతుఁడైన రావణునికి భయపడియుండువట్లు ఈతని కంఠధ్వనివల్ల నేర్పడుచున్నదని సాయించియుండుటవల్ల నీతనిస్వరమును నేత్రములును అవయవములును భయమువల్ల మాఱురూపమునుఁ బొందియున్నవని భావము.

ఇప్పడియిరున్దాల్ అవనుక్కు చ్చెయ్‌తరుళప్పుకిఱ తెన్నెన్నిల్; (అభయందదామి) "అథసోఽభయఙ్గతో భవతి" ఎన్నుమ్బడిపణ్ణువన్.

(అభయమ్) తదన్యతదభావ తద్విరోధికళై యిఱేకాట్టువతు; ఆకైయాలే; తదన్యమాన మఙ్గళఙ్గళైక్కొడుప్పన్.

తదభావమానఅచ్చమిల్లామైయైప్పణ్ణువన్.

---

ఇట్లు నిలచియుండువానికి దేవరవారు చేయునదియేమనిన (అభయందదామి) అని సాయించుచున్నారు. "అథసోఽభయం గతో భవతి" అనే శ్రుతిప్రకారముగా నభయమిచ్చుచున్నానని యీవాక్యమున కర్థము.

అభయశబ్దమునకు నఞ్ తత్పురుష సమాసము సెప్పునప్పుడు, అందలి నకారము, తదన్యార్థము, తదభావార్థము, తద్విరోధార్థము అనే మూడర్థములను చూపుచున్నదని యిచ్చట గ్రహించవలయును. అందు తదన్యార్థమనఁగా భయమునకు వేఱైనది. ఈయర్థమునందు మంగళముల నిచ్చుచున్నానని భావ మేర్పడుచున్నది. [1]"ప్రాప్తస్యరక్షణం క్షేమం" అని యుండుటచేత, తనకులభించియుండు భోగ్యభోగోపకరణాదులు భయములేక సురక్షితముగా నుండుటయే యీయర్థమునకుద్దేశ్యమని తిరువుళ్లము.

రెండవదియగు తదభావార్థమును చూపునప్పుడు భయాభావమును అనఁగా భయములేమిని చేయుచున్నానని యర్థము.

---

I [ప్రాప్తస్యరక్షణం క్షేమమితి] "అప్రాప్తస్యద్రవ్యస్య ప్రాప్తిర్యోగః" అనునది దీనికి ముందువాక్యము. తనకు మున్ను లభించని ద్రవ్యము లభించుట యోగమనఁబడుననియును; అట్లు లభించినద్రవ్యము సురక్షితముగానుండుట క్షేమమనఁబడుననియును; ఈవాక్యములకర్థము. ఇట్లు సురక్షితముగానుండుటయే, అభయశబ్దమునకు ముఖ్యోద్దేశమయిన యర్థమని తిరువుళ్లమున గ్రహించి మంగళముల నిచ్చుచున్నానని భావము సాయించినారు. "కల్యాణం మంగళంశుభం । కుశలం క్షేమం" అని యమరకారుఁడు చెప్పియుండుటంబట్టి యీపదములన్నియు నొకేయర్థమునిచ్చుచున్నవి.

పరకరిష్యమాణమాన అపచ్చిన్నైయిలేభయమ్ ; తద్విరోధియాన (ఇవర్ భుజబలరక్షితరాన పరరాల్ పణ్ణప్పడుకిఱ) ఉపకారసన్తుష్టియుడైయనాప్పడి పణ్ణువర్.

(అభయమ్) „అతీతేశోకః” „వర్తమానేవ్యథా” „ఆగామిని భయమ్” ఎన్నిఱేలక్షణమ్; ఆకైయాల్ మేలొరుఅనర్థమ్ వారాతపడి పణ్ణువర్.

ఆర్ నిమిత్తమాక భయనివృత్తి పణ్ణువతెన్న; (సర్వభూతేభ్యః)

---

ఇఁక మూఁడవదియైన తద్విరోధార్థమనునది, భయమునకు విరోధమైనది, అని. భయమనఁగా పరులుచేయఁబోవునట్టి యాపదలనుఁ దలపోయుట. దానికి విరోధమనునది శత్రువులవలని శంక లేక నెమ్మదిగానుండుట. ఇందువల్ల నీతని, బుద్ధిబల భుజబల 1రంజితులైన శత్రురాజులు నానావిధములయిన యుపకారములఁ జేయుచుండఁగా నీతఁడు పరమసంతుష్టుఁడై యుండునట్లు చేయుచున్నాఁనని భావమేర్పడుచున్నది.

అథవా (అభయం) భూతకాలవిపత్తు శోకమునున్ను; వర్తమానకాల విపత్తు మనోవ్యథనున్ను; భవిష్యత్కాలవిపత్తు భయమునున్ను; కలుగఁజేయుననే న్యాయమునుపట్టి; భవిష్యత్కాల విపత్తు సంభవించకుండునట్లు చేయుచున్నాఁనని భావము. భూతవర్తమాన కాల విపత్తులు 2 మదాశ్రయణ రాజకుల మాహాత్మ్యమువల్ల నతని మనస్సుకు గోచరించకనే మాసిపోవునని తిరువుళ్లము.

ఇఁక భయహేతువులను చూపించి వాటివల్ల భయములేకుండఁ జేయుదునని పూర్వోత్తర పదములతోఁజేర్చి భావము సాయించుచున్నారు ; „ఆర్ నిమిత్తమాక” ఇత్యాదిగా. (సర్వభూతేభ్యః)

---

1 [రంజితులైన] మెచ్చునట్లుగాఁ జేయఁబడిన.

2 [మదాశ్రయణ రాజకులమాహాత్మ్యము] నన్నాశ్రయించుట యనియెడి రాజకులమాహాత్మ్యము. రాజకులమాహాత్మ్యమనఁగా రాజమందిరంబునకు పోవుచు వచ్చుచునుండుటవల్ల కలుగునట్టి యతిశయమని యర్థము.

ఏతేనుమాక భయస్థానమాయుళ్ళవై యెల్లామ్‌నిమిత్తమాక.

(సర్వభూతేభ్యః) భూతఙ్గళాకిఱన అచిత్సంసృష్టఙ్గళిఱే;అత్తావతు-దేవతిర్యఙ్మనుష్యస్థావరాత్మకమాయిఱేయిరుప్పతు. ఇవైయిత్తనైయుమ్ నలియాతపడిపణ్ణువన్.

(సర్వభూతేభ్యః) రావణనాల్ పట్టపరిభవత్తాలే అవన్ తమ్పియెన్ఱు ఇన్ద్రాదికళాల్ వరుమతు, నమ్బక్కలిల్ పరివాలే “వధ్యతామ్” ఎన్ఱు-తిర్యక్కాన ప్రుమ్మాల్ వరుమతు,రావణవిజయత్తిలే పరిభూతరాన మరుత్తన్ తొడక్కమాన మనుష్యరాజాక్కళాల్ వరుమతు, క్షీరత్తోడే

---

భయకారణము లేవియయినను కాని, అని భావము. ఇచ్చట భూత శబ్దము దేవతిర్యఙ్మనుష్య స్థావరములఁ జూపుచున్నవి. వీనిలోనేవియు నీతని బాధింపకుండునట్లు చేయుదునని యర్థము. ఇందు దేవజాతియైన యింద్రాదులు రావణునిచేఁ బరిభవింపఁబడి యుండుటంబట్టి యీతఁడాతని తమ్ముఁడుగదా? అని హింసింపఁ జూతురు. తిర్యగ్జాతిలోఁ చేరిన (సుగ్రీవాది) వానరవీరులు నాయందలి ప్రేమాతిశయమువల్ల [1] “వధ్యతాం” ఇత్యాది ప్రకారముగా హింసింపఁ జూతురు. మనుష్యజాతిలోఁ జేరిన రాజులు మున్ను రావణదిగ్విజయమందు పరిభవింపఁబడి యుండుటంబట్టి యీతఁడాతని తమ్ముఁడేగదా? యని వారును హింసింపఁ జూతురు. ఇఁక స్థావరజాతిలోఁ జేరిన కైలాసమును రావణుఁడడుగంట

---

1 [వధ్యతాం] యుద్ధకాండము ౧౭వ సర్గము ౨౭వ శ్లోకము. ఇది శ్రీసుగ్రీవ మహారాజుయొక్క వాక్యము. ఘాతకుఁడైన రావణుని తమ్ముఁడైన యీవిభీషణుని యీతని మంత్రులతోఁడఁబట్టి తీవ్రదండముగాఁ జంపుదమని యీశ్లోకమునకర్థము. ఇంతకు ముందుండునట్టి ౭వ శ్లోకముఁగూడ నిచ్చోట నుపయోగపడుచున్నది. అది శ్రీవానరవీరులవాక్యము. “శీఘ్రంవ్యాదిశనోరాజన్” ఇత్యాది. ఓసుగ్రీవమహారాజా! చెడ్డతలంపుతో వచ్చియుండునట్టి యీవిభీషణాదులను సంహరించుటకై శీఘ్రముగా మమ్మాజ్ఞాపింపుమని భావము.

పిఱుఙ్గుణ్డ స్థావరమాన కైలాసమడియాకవరుమతు, ఇవ్వాప త్తడ్డైయు ప్పరిహరిప్పన్.

(సర్వభూతేభ్యః) ‚‚పఞ్చభూతాత్మకే దేహే” ఎన్నుమ్ - ‚‚భౌతికానీన్ద్రియాణ్యాహుః” ఎన్నుమ్ - ప్రక్రియైయాలే పృథివ్యాదిభూతకార్యమాన శరీరేన్ద్రియ విషయాదికళ్ నలిఖులుమ్ పరిహరిప్పన్,

(సర్వభూతేభ్యోఽభయన్దదామి) ‚‚నానేనానావితనరకమ్పుకుమ్పావమ్ శెయ్ తేన్” ఎన్గిఱఉన్నాల్వారుమ్ భయముమ్, ‚‚జగత్సశైలం పరివర్తయామి” ఎన్నుమ్-‚‚క్షిపామి” ‚‚నక్షమామి” ఎన్నుమ్, నమ్మాల్

---

పెల్లగించియుండుటంజేసి యాతని తమ్ముఁడని యవియు సీతని హింసింపఁ జూచును. కాఁబట్టి వీనిలో నేవియు నీతనిజోలికి రాకుండునట్లుగా నభయ ప్రదానముగావించి రక్షించెదనని భావము.

అథవా (సర్వభూతేభ్యః) భూతములనఁగా పృథివ్యాది పంచమహాభూతములని యర్థమును గ్రహించి 1తత్కార్యములైన 2శరీరేంద్రియవిషయము లీతని హింసింపకుండునట్లు 3తత్ప్రావశ్యమును పరిహరించిరక్షించెదనని భావము.

అథవా (సర్వభూతేభ్యోఽభయందదామి) ‚‚నానే నానావిత నరకమ్ పుకుమ్ పావమ్ శెయ్ తేన్” అనేసూక్తి ప్రకారముగా నీతఁడు తానే తెచ్చుకొనిన భయమునున్ను; 4 ‚‚జగత్సశైలం పరివర్తయా

---

1 [తత్కార్యములు] పంచమహాభూతములవల్ల నేర్పడినవి.

2 [శరీరేంద్రియ విషయములు] దేహమున్ను, జ్ఞానకర్మేంద్రియములున్ను, శబ్దాదివిషయములున్ను, అనియర్థము.

3 [తత్ప్రావశ్యము] దేహాత్మాభిమానము, ఇంద్రియసుఖేచ్ఛ, శబ్దాదివిషయప్రావణ్యము, అనేవీటిచేత మైమఱచియుండుట.

4[జగత్సశైలమిత్యాది]ఆరణ్యకాండము ౭౮వసర్గము కడపటిశ్లోకము. ‚‚నిస్సం

వరుమ్ భయముమ్, *(హిరణ్యరావణాది పితృభ్రాతృప్రభృతికళానప్పే) రాల్ వరుమ్ భయముమ్పోక్కు-వన్.

(సర్వభూతేభ్యః) “సర్వపాపేభ్యః” ఎన్ఱు-అచేతనమానపాపఙ్గళుమ్, అవ్వోపాపఙ్గళడియాక బాధిక్కు-మ్ జన్తుక్క-ళుమ్, అతడియాక వరుమ్ భయముమ్ అఱవేపోక్కు-వన్. ఇప్పడి, “భీతార్తానాం భయహేతుః” పఞ్చమియాకవుమామ్.

* పా. (అసురరాక్షసాదిసజాతీయ)

---

మ్యహం” ఇత్యాది ప్రకారముగా 1అన్యకృతాపరాధమునకై కలుషించిన నావలనఁగలుగునట్టి భయమునున్ను; “క్షిపామి” ఇత్యాది ప్రకారముగా చేతనుని యహంకారాదులవల్లఁ గలుగునట్టి2యస్మన్నిగ్రహాభయమునున్ను; అసురరాక్షసాది సజాతీయభయమునున్ను; పరిహరించి రక్షించెదనని భావము.

అథవా (సర్వభూతేభ్యః) ఇచట భూతశబ్దమును, అచేతనవాచిగానున్ను, చేతనవాచిగానున్ను, తిరువుళ్ళమునఁగైకొని భావము ప్రసాదించుచున్నారు. “సర్వపాపేభ్యః” ఇత్యాదిగా అచేతనవాచియైనప్పుడు, అసంఖ్యాతములైన పాపములవలని భయమనియర్థము.

---

పాతంకరిష్యామి” “నిర్మర్యాదానిమాంల్లోకాన్కరిష్యామి” ఇత్యాదు లీశ్లోకమునకు ముందున్నవి. ఇవి సీతాపహారదుఃఖసంతప్తులైన పెరుమాళ్లవాక్యములు. పిరాట్టికి ఏవిధమైన కొదువయులేకుండునట్లు క్షేమముగాఁదెచ్చి దేవతలు నాకొప్పించకపోయిరేని, మూడులోకములందును నాబాణములనిండించి సమస్తప్రాణులకున్ను సంచరింప నశక్యమగునట్లున్ను; దేవతిర్యఙ్మనుష్యస్థావరములు తమతమ వ్యవస్థలుమాని చెడునట్లుగానున్ను; చేసి; జగత్తును కులపర్వతములతోడ తలక్రిందుఁ జేయుచున్నానని ఈశ్లోకములకు తాత్పర్యము.

1 [అన్యకృతాపరాధమునకై కలుషించిన] రావణుఁడుసేసిన యపరాధమునకై కోపించినట్టి.

2 [అస్మన్నిగ్రహాభయము] నేను నిగ్రహించుటవల్లఁ గలుగుభయము.

అన్ఱియిలే చతుర్థియాల్, ప్రపన్నాయ, “తవాస్మీతి చయాచతే” ఎన్ఱు-శరణాగతనాయ్; ఫలార్థియాన విభీషణనొరువనుక్కు-మోభయనివృత్తిపణ్ణువతెన్ఱాల్; “ఇతిచ” ఎన్గిఱ-చవ్వై ఇఙ్గేకూట్టి, (సర్వభూతేభ్యశ్చ) అవనుక్కే-యల్ల; “చతుర్భిస్సహ రాక్షసైః” ఎన్ఱు-అవనోడు కూడవన్దవర్ కళుక్కుమ్ అవర్ తజ్ఞైస్పర్శినారుక్కుమ్ అభయప్ర

---

చేతనవాచియైనప్పుడు, అట్టిపాపమూలగా హింసించునట్టి జంతువుల వల్లఁ గలుగుభయమని యర్థము. ఇట్టి యుభయవిధ భయములనున్ను పోఁగొట్టుచున్నానని భావము.

ఇట్లు (సర్వభూతేభ్యః) అనేపదమునకు “భీత్రార్థానాంభయహేతుః” (౧-౪-౨౫) అనే పాణిని సూత్రమునుసరించి పంచమీవిభక్తిగా నర్థనిర్ణయముగావింపఁబడినది.

ఇఁక చతుర్థీవిభక్తిగా నర్థనిర్ణయముగావింపుచున్నారు. “అన్ఱియిలే చతుర్థియాల్” ఇత్యాదిగా. ఇట్లు సలక్షణప్రపత్తిసేసి “తవాస్మీతిచయాచతే” అని, స్వరూపానురూప ఫలమునుఁగోరినట్టి శ్రీవిభీషణాళ్వానుల కొక్కరికిమాత్రమే అభయమిచ్చుచున్నారా? లేక, ఈయభయప్రదానము తత్సంబంధి పర్యంతమగునా? అనిన (సర్వభూతేభ్యశ్చ) అని సాయించుచున్నారు. “తవాస్మీతిచ” అనుచోట నుండు చకారమిచట చేర్పఁబడినది. అతఁడొకనికి మాత్రమే కాదు; అతని వెంటవచ్చిన నలువురు రాక్షసులకును, మఱియునుంగల తత్సంబంధి జనులకును, అభయమిచ్చుచున్నానని యర్థము.

ఇట్లు చతుర్థీవిభక్తిగాఁ గైకొని పంచమీవిభక్తి నుపేక్షించిన పక్షమున పూర్వోక్త వ్యాకరణ సూత్రసంప్రదాయము ననుసరించి చెప్పవలసిన భయహేతువునకు[1] వాచకపదము లేకపోవునుగదా? అనిన

1 [వాచకపదము] అనఁగా నిచట పంచమీవిభక్త్యంతమైన పదము.

దానమ్పణ్ణవ నెన్గాకవ్రమామ్. భయనిమిత్తమ్ శొల్లవేణ్డావో వెన్నిల్; “రాఘవేణాభయేదత్తే” ఎన్గిఅవిడత్తిలుణ్డో? “భయంభయానామపహారిణీ” ఎన్గిఅవిడత్తిలుణ్డో? అతు తన్నడై యేవరుమ్.

అన్గియిలే, ‘ప్రపన్నాయ’ ఎన్ఱు-ప్రపన్నరుక్కే యో పణ్ణువతు? భక్తినిష్ఠరుక్కుమ్ పురుషకారనిష్ఠరుక్కుమిల్లైయో? వెన్నిల్ (సర్వభూతేభ్యః) భక్తినిష్ఠరోడు పురుషకారనిష్ఠరోడువాశియఱ, “అస్తిబ్రహ్మేతి చేద్వేద, సన్తమేనంతతోవిదుః” ఎన్ఱు-భగవద్జ్ఞానత్తాలేసత్తైపెఱ్ఱా రెల్లార్కుమామ్.

ఇప్పడి కైముతలుడైయరాన విలక్షణాధికారికళుక్కు కొడుత్తరుళవత్తాల్; కింబహునా; (సర్వభూతేభ్యః) విలక్షణోపాయనిష్ఠరాక

నుత్తవు సాయించుచున్నారు. “రాఘవేణాభయేదత్తే” ఇత్యాదిగా./ “రాఘవేణాభయేదత్తే” అనుచోటనున్న “భయంభయానామపహారిణీ” అనుచోటనున్న, వాచకపదము లేకుండినను [1]భయహేతువు తనంతటనేతోఁచురీతిగా, ఇచ్చటనున్న తనంతటనే తోఁచుచున్నది కాఁబట్టి వాచకపదములేదనే కొదువలేదని భావము.

అథవా “ప్రపన్నాయ” అని, భగవచ్చరణారవిందశరణాగతుని కొక్కనికేనా అభయప్రదానముసేసినది; భక్తినిష్ఠులకును పురుషకారనిష్ఠులకును లేదా? అనిన, (సర్వభూతేభ్యః) ప్రపన్నులు భక్తినిష్ఠులు పురుషకారనిష్ఠులు అని తారతమ్యము జూడక “అస్తిబ్రహ్మ” అనే భగవద్జ్ఞానమువల్ల “సన్తమేనంతతోవిదుః” అనేస్వరూపలాభము పొందిన వారలకందఱికి నభయమిచ్చుచున్నాననియు నొక భావము.

అట్లైన భగవజ్జ్ఞానమువల్లఁ గలిగిన స్వరూపలాభమనే గుణ

---

1 [భయహేతువు] ఇది, పంచమీవిభక్త్యంతపదమువల్లఁ జెప్పవలసియుండుటంబట్టి యాపంచమీవిభక్తిని చూపుచున్నది.

వేణ్డా; అతిప్రసజ్గమ్వారాతపడి, "భవద్విషయవాసినః" ఎన్ఱు-నమ్మైల్లె క్కు-ళ్ళే కిడక్కైర్కే-యేయుళ్ళతు. "యదివారావణస్స్వయమ్" ఎన్ఱు- శత్రువాన రావణనోడు, "విభీషణోవా" ఎన్ఱు-మిత్రనానవిభీషణనోడు,

---

విశేషముగల విలక్షణాధికారులకేనా అభయప్రదానముసేసినది, అనిన, (సర్వభూతేభ్యః) విలక్షణాధికారులుగా నుండవనిలేదు; 1"భవద్విషయవాసినః" అని శ్రీదండకారణ్యవాసులైన మహర్షులు సెప్పిన రీతిగా, మదాజ్ఞాపరిపాలితమైన యెల్లలోపలనుండుటయే నాకుచాలునని పెరుమాళ్లు తిరువుళ్లముగా నొకభావము. "అతిప్రసంగమ్వారాతపడి" అనఁగా సర్వముక్కి ప్రసంగము రాకుండునట్లు, అనియర్థము. "భవద్విషయవాసినః" అనే తలఁపుగలవారిని రక్షించితే, ఈయతిప్రసంగము రాదని తాత్పర్యము.

పెరుమాళ్లు తిరువుళ్లమిట్టినటకు నుదాహరణములఁ జూపించుచున్నారు; "యదివారావణస్స్వయం" ఇత్యాదిగా. "విభీషణోవా సుగ్రీవ యదివారావణస్స్వయం" ఇది పెరుమాళ్లు శ్రీసుగ్రీవమహారాజునుఁజూచి సాయించిన వాక్యము. "రాఘవం శరణంగతః" అని నన్ను శరణాగతిఁబొంది నిలచియుండువాడు విభీషణుఁడుగానుండినను, లేక ప్రత్యక్షశత్రువైన రావణుఁడుగానే యుండినను, నేనితని కభయమిచ్చినానని యీవాక్యమున కర్థము. ఇచట రావణునకాభిముఖ్యము గలుగక పోవుటచేత నీయభయప్రదానము ఫలించకపోయినది. ఇంతేగాని, మదాజ్ఞాపరిపాలితమైన యెల్లలోపల నుండుటయే చాలుననే

---

1 [భవద్విషయవాసినః] ఆర్తజనరక్షణ దీక్షితుఁడైన నీవు ఆర్తులైన మమ్ము రక్షింపనర్హుఁడవు. దీనికి సాధనము నీదేశమందున్నామనుటదక్క వేఱులేదనిభావము. దేశమందుండు మాత్రముచేత రక్షించుటవల్ల నతని రక్షకత్వము జీవించుచున్నది. అతని దేశమందున్నాననే తలంపువల్ల నితని రక్ష్యత్వము జీవించుచున్నదని గ్రహించవలయును.

"పాదమూలంగమిష్యామి యానహంపర్యచారిషమ్" ఎన్ను- ఉదాసీన యాన శబరియోడు, "ఆవహాత్పరమాంగతిమ్" ఎన్ను- మృగమానవాలి పెరుమాళ్ల తిరువుళ్లమునకు కొదువలేదుగదా? ఇఁక "మిత్రభావేన" అనేప్రకారముగా మంచిమనస్సుతోవచ్చి రామప్రాప్తిరూప ఫలము నపేక్షించిన శ్రీవిభీషణాళ్వానులవిషయమం దీయ భయప్రదానము ఫలింపఁ జెప్పవలసినదిలేదు. ఇంతకుపైన 1"పాదమూలం గమిష్యామి యానహం పర్యచారిషం" అనునట్టి 2యుదాసీనులవిషయమం దీయ భయప్రదానము 3నిరతిశయ ప్రీతిపూర్వకముగా ఫలించినది.

ఇట్లు రాక్షసజాతిలోచేరినవారికిని మనుష్యజాతిలోచేరినవారికిని, ఈయభయప్రదానము ఫలించినదట్లుండని; మృగపక్షిపాషాణ తృణగుల్మలతాదులకుసైత మిదిఫలించినదని సాయించుచున్నారు

1 [పాదమూలమితి] ఇది శ్రీశబరి, పెరుమాళ్లనుచూచి విన్నవించినవాక్యము. ఈ శ్లోకము కొన్ని శ్రీరామాయణప్రతులందు వేఱువిధముగానున్నది. అయినను అర్థము మాత్రము సరిపోవుచున్నది. దీని భావము; ఈసమీపవనము మతంగవనమనఁబడును; ఇచట నమ్మహాత్ములకేను పరిచర్యసేయుచుంటిని; దేవరవారు చిత్రకూటమునకు వేంచేసినప్పుడు వారు స్వర్గమునుబొందిరి; నేను వారినియమనమువల్ల దేవరవారిరాక నెదురు చూచుచుంటిని; ఇఁక భవదనుజ్ఞవడసి నాగురువుల పాదమూలమునుఁ బొందుచున్నాను, అని యీశ్లోకమునకు భావము.

2 [ఉదాసీనులు] శ్రీశబరి, ఆచార్యపాదములఁగోరి, పెరుమాళ్ల సేవయందు తృప్తిఁ బొందుటవల్ల, నామె, యుదాసీన యనఁబడుచున్నది. ఉదాసీనయనఁగా తటస్థురాలని యర్థము. ఆచార్యప్రీతి యతిశయించి పెరుమాళ్లయం దతిప్రీతిగాని పరాఙ్ముఖత్వముగాని లేకయుండువారు తటస్థులనఁబడుదురు.

3 [నిరతిసయప్రీతిపూర్వకముగా] "అర్చితోహంత్వయాభక్త్యా" (అనఁగా నీచేత నేను భక్తిపురస్సరముగాఁ బూజింపఁబడితిని) అని, శ్రీశబరినిచూచి పెరుమాళ్లు సాయించుటవల్లనున్ను; "గచ్ఛకామంయథాసుఖం" (అనఁగా నీయిష్టమైనచోటికి సుఖముగా పొమ్ము) అని సాయించిన వాక్యమం దభయప్రదానార్థముండుటవల్లనున్ను; నిరతిశయ ప్రీతిపూర్వకమని చెప్పఁబడినది.

యోఁడు, „గచ్ఛలోకాననుత్తమాన్” ఎన్ను-పక్షియైనజటాయువోఁడు, „పాషాణగౌతమవధూవపురాప్తిహేతుః” ఎన్ను-స్థావరమైన అహల్యా „ఆవహత్పరమాంగతిం” ఇత్యాదిగా. శ్రీరామధనుస్సునుండి బయలు వెడలిన దివ్యబాణము జగదేకవీరుఁడైన వాలిని పరమగతిఁ బొందించెనని యీవాక్యమునకర్థము. ఇతఁడు పెరుమాళ్లకు శత్రువునుఁగాక మిత్రుఁడునుఁగాక తటస్థుఁడైయుండినను, ఆశ్రితవిరోధియగుటం బట్టి నిగ్రహింపఁబడియె. ఇట్టివానికి సైతము పరమగతి సిద్ధించుటకు, మదాజ్ఞాపరిపాలితమైన యెల్లలోపలనుండుటయే కారణమని పెరుమాళ్ల తిరువుళ్లము. 1„నదోషం రఘువేదఘ్యాధర్మేధిగతనిశ్చయః। ప్రత్యువాచ తతోరామం ప్రాంజలిర్వానరేశ్వరః” అనునవి యీతని యాభిముఖ్యసూచకవృత్తులని తిరువుళ్లము. ఇది మృగజాతి కభయమిచ్చుట కుదాహరణము.

ఇఁక పక్షిజాతి కభయమిచ్చినది యెట్టులనిన సాయించుచున్నారు; „గచ్ఛలోకాననుత్తమాన్” అని. ఇది పెరియవుడైయాన్లకు బ్రహ్మమేధసంస్కారమునుఁ బ్రసాదించినప్పుడు పెరుమాళ్లు సాయించినవాక్యము. నీవు నాచేతననుజ్ఞాతుండవై సర్వోత్తమమైన శ్రీవిష్ణులోకమునుఁ బొందుమని యీవాక్యమునకర్థము. 2„ప్రతిపేదే

1 [నదోషంరాఘవే ఇత్యాది] రామబాణనిహతుఁడైన వాలి తొలుత పెరుమాళ్లను నిందించి, పిమ్మట పెరుమాళ్లుసాయించిన సమాధానవాక్యములనువిని, ఆశ్రితవత్సలుఁడైన స్వామిని నిందించితినేయని మిగుల ననుతాపమునుఁబొంది వారియందసూయమాని, వారు సాక్షాద్ధర్మస్వరూపులను జ్ఞానమును మనంబున నెలకొల్పి, ఇట్టివారిని తాను దూషించినందుకు ప్రాయశ్చిత్తముగా నంజలిబంధము గావించుకొని యిట్లని విన్నవించెనని యీశ్లోకమునకర్థము.

2 [ప్రతిపేదేస్వమాలయమితి] „విసృష్టస్తేనవీరేణ” అని పెరుమాళ్లచే నభయప్రదానపూర్వకముగా వీడుకొలుపఁబడిన కాకాసురుఁడు „తతఃఖ్యాతోభవిష్యసి” అనే

శిత్తైయోడు, "ప్రతిపేదేస్థ్వమాలయమ్" ఎన్ఱు-జఙ్గమమాన జయన్తనోడు, "పుత్త్వాముతలా ప్పుల్లైయుమ్బ్రాతిమొట్టిప్పియే, నత్త్వాలయోత్తియిల్వాత్ర మ్శరాశరమ్ముఱ్ఱవుమ్ నత్త్వాలుక్కుయ్త్తనన్" ఎన్ఱు-తృణగుల్మవీరు

---

స్వమాలయమ్" అనేవాక్యమునుసైతము పక్షిజాతికభయమిచ్చినందు కుదాహరణముగానే గ్రహించవలయును.

ఇచ్చట పెరియవుడైయార్లకు భగవదాజ్ఞాపరిపాలితమైన దేశ మందున్నాననే జ్ఞానము సహజముగానుండినది. కాకాసురునకట్లులేదు కాబట్టి మూడులోకములందును పలుమాఱు పరుగులెత్తి యెందును దిక్కుఁగానక పిమ్మట పెరుమాళ్లసన్నిధియందు వచ్చిపడుటంబట్టి పూర్వోక్తజ్ఞానము అప్పుడు జనించినదని గ్రహించవలయును.

ఇట్లు, ఈయభయప్రదానము ఆభిముఖ్యమాత్రమున ఫలించినదని ప్రసాదించి, ఇఁక నాభిముఖ్యమునకు సైతము యోగ్యతలేని పాషాణాదుల విషయమునందిది ఫలించిన విధమును ప్రసాదించుచున్నారు; "పాషాణ గౌతమవధూవపురాప్తిహేతుః" ఇత్యాదిగా. దేవేంద్రుని కామించుటచేత కుపితులైన గౌతమమహాముని శాపము వలన పాషాణరూపమునుఁ బొందిన యహల్యాదేవికి పాషాణరూపమైన దేహముపోయి తనపూర్వదేహము లభించుటకు పెరుమాళ్లు కారణభూతులని యీవాక్యమునకర్థము. ఇది పాషాణరూపస్థావరజాతి కభయమిచ్చినందు కుదాహరణము.

ఇఁక తృణగుల్మలతాదుల విషయమందీ యభయప్రదానము ఫలించిన విధంబెట్టులనినఁ బ్రసాదించుచున్నారు; "పుత్త్వాముతలా" ఇత్యాదిగా. తిరువయోధ్యయందు పెరుమాళ్లకటాక్షముచే 1మనికిఁ

---

ప్రకారముగా రామాస్త్రశిక్షితుఁడగుటచే పరిశుద్ధుఁడై, అందువల్ల దేవత్వమునుఁబొంది స్వస్థానమైన యింద్రలోకమున కరిగెనని యీశ్లోకమునకు భావము.

1 [మనికి] ఇది, వాళ్వు, అనే ద్రావిడపదమునకు సరియైన ఆంధ్రపదము.

ధాదికళ్లోడు, "పితామహపురోగా స్తే" ఎన్ఱు - అడియిలే నమ్మైప్పెఱ వేణుమెన్ఱు అపేక్షి1త్త బ్రహ్మాదికళోడు వాశియఱ బ్రహ్మాది పిపీలికాన్త మాన సర్వవస్తుక్కళుక్కుమామ్.

ఇవర్కళుక్కు చ్చెయ్తరుళువతెన్నెన్నిల్, (దదామి) త్యాగ

---

గాంచియుండిన తృణ1గుల్మలతాదులకు సైతము పెరుమాళ్లుపరమగతినిఁ బ్రసాదించినారని యీశ్రీసూక్తికర్థము.

ఇందు, ఆభిముఖ్యమునకు సైతము యోగ్యతలేని యచేతనవస్తువులకు పరమగతిని ప్రసాదించినప్పుడు2 "ద్విపరార్ధావసానేమాంప్రాప్తుమర్హసిపద్మజ" అని ముందే స్వప్రాప్తినపేక్షించిన బ్రహ్మదేవునికి చేసియుండిన యభయప్రదానము ననుసరించి 3 "పితామహపురోగా స్తే" అని, బ్రహ్మాదిపిపీలికాంతమైన చైతన్యవిశిష్టవస్తువులతోపాటి (తారతమ్యమెంచక సమస్తవస్తువులకున్ను పరమగతినిఁ బ్రసాదించిరని గ్రహించవలయును.

ఇట్లు చేతనాచేతనరూప సమస్తవస్తువులకునుఁ జేయునట్టి యభయప్రదానముయొక్క స్వరూపమిట్టిదని నిర్ణయించుటకై (దదామి) అనే క్రియాపదమునకు భావమునుఁ బ్రసాదించుచున్నారు; "ఇవర్కళుక్కు చ్చెయ్తరుళువతెన్నెన్నిల్" ఇత్యాదిగా.

"దదామి" అనఁగా దానముచేయుచున్నానని యర్థము కాఁ

1 [గుల్మ] పొద.

2 [ద్విపరార్ధావసానఇతి] ద్విపరార్ధమనఁగా బ్రహ్మయాయుష్యకాలము. (దీని వివరణమును శ్రీవిష్ణుపురాణము ప్రథమాంశమందును, షష్ఠాంశము తృతీయాధ్యాయమందును చూడుడు.) నీయాయుష్యకాలము కడపట నీవు నన్నుఁబొందఁగలవని సర్వేశ్వరుఁడు బ్రహ్మదేవునిఁజూచి సాయించినారని యీవాక్యమునకర్థము.

3 [పితామహపురోగాఇతి] బ్రహ్మదేవుఁడు మొదలుగాఁగల స్థావరజంగమరూప సమస్తవస్తువులున్ను (పరమపదమునుఁ బొందినవి) అని యీవాక్యమునకర్థము.

ముమల్ల, ఔదార్యమున్నల్ల, ఉపకారముమల్ల, దానమాకవేషణ్ణువఱ్ఱ. త్యాగమావతు– ‘‘కీర్తిముద్దిశ్య యోగ్యాయోగ్య సమర్పణమ్’’ ఎన్ఱు– పిఱరపేక్షిత్తత్తై క్కీర్తిఫలమాకనశ్శైయక్కొడుక్కై, ఔదార్యమావతు–‘‘సర్వవిషయవితరణమ్ ఔదార్యమ్’’ ఎన్ఱు– విషయవైషమ్యమ్ పారాతేముఴైక్కడుప్పుక్కు–ఱరక్కుమాప్పోలే తన్ పేఱాకక్కొడుక్కై, ఉపకారమావతు–‘‘ప్రత్యుపకారధియా బన్ధుకృతిరుపకారః’’ ఎన్ఱు ప్రత్యుపకారప్రయోజనమాక ఆసన్నరుక్కుక్కొడుక్కై. ‘‘అదృష్టముద్దిశ్య యోగ్యాయోగ్యసమర్పణం దానమ్’’ ఎన్ఱు– విలక్షణవిషయత్తిల్ విలక్షణపదార్థఙ్గళై అదృష్టఫలమాకక్కొడుక్కై.

బట్టి యీదానశబ్దముతో సమానార్థకములైన త్యాగాదిశబ్దములకన్న దీనికిఁగల వైలక్షణ్యమును చూపించుచున్నారు; ‘‘త్యాగమావతు’’ ఇత్యాదిగా.

న్యాయార్జితములైన యోగ్యవస్తువులను కీర్తినుద్దేశించి సత్పాత్రవినియోగముచేయుట త్యాగమనఁబడును. పాత్రాపాత్రముల నాలోచించక యందఱికి నిచ్చుటయే తనకుఁ బరమోద్దేశ్యముగా నొసంగుట ఔదార్యమని చెప్పఁబడును. ప్రత్యుపకారము నపేక్షించి బంధుజనుల కిచ్చునది యుపకారమనఁబడును. ఇయ్యెడ నీమూఁడునుఁ గాదు. స్వర్గాదిఫలములనుఁగోరి న్యాయార్జితములైన యోగ్యవస్తువులను సత్పాత్రములను వెదకి యొసంగుటయే యీదానశబ్దమునకర్థము. [1]‘‘ధర్మిష్ఠం చ

---

1 [ధర్మిష్ఠంచేతి] పెరుమాళ్లు శ్రీసుగ్రీవమహారాజునుఁజూచి కండూపాఖ్యానమును ప్రసాదించినప్పు డీవాక్యమును సాయించినారు. శరణాగతరక్షణమనునది సమస్తపాపములనున్ను పోగొట్టునట్టి ధర్మముగానున్ను; ఈలోకమందు నిర్మలకీర్తినిచ్చునదిగానున్ను; స్వర్గప్రాప్తికి హేతుభూతమైనదిగానున్ను; ఉండునని యీవాక్యమునకర్థము.

(దదామి) "మోక్షయిష్యామి" పోలే "దాస్యామి" ఎన్ఱు-కాల విళమ్బనమ్బణ్ణోమ్.

(దదామి) "తమేవంవిద్వానమృతఇహభవతి" పోలే "ఉపాసన ప్రారంభే మోక్షప్రారంభః" ఎన్ఱు- అవన్నమ్మైనోక్కి- క్కిళమ్బినపోతే నాముమ్ ఉపక్రమిత్తోమ్, ఇతు యావదాత్మభావియాకక్కడవతు. "ప్రారబ్ధోఽపరిసమాప్తశ్చవర్తమానః" ఇఱే.

యశస్యంచ స్వర్గ్యంస్యాత్తుఫలోదయం" అని తామే సాయించియున్నారుగదా?.

మఱియు నీక్రియవర్తమానార్థకమై యుండుటవల్ల "మోక్షయిష్యామి" అని కణ్ణసాయించిన భవిష్యదర్థక క్రియయందుగల విళంబను సైతమియ్యెడలేదని భావము.

ఇంతేకాదు, ఈవర్తమానక్రియవల్ల, అభయప్రదానముచేయ నుపక్రమించిన కాలమిదియని యేర్పడవలసియున్నది కాఁబట్టి, శ్రీవిభీషణాళ్వానులు పెరుమాళ్లను శరణాగతిఁబొంద నుద్దేశించి రావణగోష్ఠినుండి వెడలినప్పుడే పెరుమాళ్లు అభయమిచ్చుట కుపక్రమించినారని యొకభావమేర్పడుచున్నది. ఇందువల్ల "తమేవం...భవతి" అను శ్రుతియందు భగవదుపాసనప్రారంభమే మోక్షప్రారంభమని చెప్పఁబడిన యర్థ1ముపబృంహణము సేయఁబడినది. ఇట్లు,అభయప్రదానమున2కుపక్రమకాలమేర్పడునేని, అట్లనే,3ఉపసంహారకాలమున్ను, ఏర్పడునుగదా? అనిన ఈయభయదానము4యావదాత్మభావిగానుండు

1 [ఉపబృంహణము] సంగ్రహముగాఁ జెప్పఁబడిన యర్థమును ఉదాహరణపూర్వకముగా విస్తరించి ప్రతిపాదించుట.

2 [ఉపక్రమము] ఆరంభము.

3 [ఉపసంహారము] ముగింపు.

4 [యావదాత్మభావి] ... ఆత్మయుండునంతపఱకు నుండునట్టిది.

(ప్రపన్నాయదదామి) ‘‘న్యాసమేషాం తపసామతిరిక్తమాహుః’’ ఎన్ఱుమ్–‘‘తేషాం తు తపసాం న్యాసమతిరిక్తం తపశ్శ్రుతమ్’’ ఎన్ఱుమ్–ఇతరోపాయఙ్గళిల్ ప్రపత్తివిలక్షణై యానాప్పోలే, ‘‘నార్హన్తి శరణస్థస్య కలాం

---

నుగాని యొకప్పుడును దీని కుపసంహారము లేదు. 1ప్రారబ్ధకర్మానుభవము ముగియునంతవఱకు శరీరమునకు కలుగునట్టి భయములను పోఁగొట్టును; తరువాత, ఆత్మకు, 2అవిద్యాకర్మవాసనారుచి ప్రకృతిసంబంధాది భయములను పోఁగొట్టును; ముక్తులైన పిమ్మటనున్న 3‘‘నమః’’ అని యనుసంధించుట గలదు. కాఁబట్టి యీయభయప్రదానము ఉపసంహారమగుట కెడమే లేదని తాత్పర్యము.

ఇఁక నీక్రియయందుఁ జెప్పఁబడిన దానమునకు ప్రపన్నుఁడే సర్వోత్తమమైన పాత్రమని నిర్వహించుచున్నారు. (ప్రపన్నాయదదామి) ఇత్యాదిగా. ‘‘న్యాసమేషాం...మాహుః’’ అనియును, 4‘‘తేషాం తుతపసాం...శ్రుతం’’ అనియును, ఇతరోపాయములకన్న ప్రపత్త్యుపాయము విలక్షణమైనదనినట్లు, 5‘‘నార్హంతి శరణస్థస్య...మపి’’ అనియిత

---

1 [ప్రారబ్ధకర్మానుభవము ముగియునంతవఱకు] ఇచ్చట ౧౭౭–వ పుటయందు గల ప్రమాణోక్తిరీతిగా నిర్వాహము ననుసంధించవలయును.

2 [అవిద్యాకర్మవాసనేత్యాది] ‘‘పోయనిన్న జ్ఞానముమ్’’ ఇత్యాదిస్థలములందు, వీనియర్థములను సేవింపుడు. ఇచట, ప్రకృతిసంబంధాది, అనునప్పుడు, ఆది, అనేపదము స్వరక్షణేస్వాన్వయాదులను చూపించుచున్నది.

3 [నమః] ఇది స్వభోక్తృత్వరూప విరోధియొక్క నివృత్తినిచూపుచున్నది. ‘‘మగుడ్దేనఙ్గళ్ పోకమకిఴ్చ్చిక్కు’’ ఇత్యాది ముముక్షుప్పడి ద్వయప్రకరణమందలిచరమసూత్ర తద్వ్యాఖ్యానముల నిచ్చోట ననుసంధింపుడు.

4 [తేషాంతుతపసామితి] సత్యము తపస్సు దమము శమము దానము ఇత్యాదిగా శ్రుతిసిద్ధములైన భగవత్ప్రాప్త్యుపాయములు పన్రెండింటిలోపల, న్యాసమనిచెప్పఁబడిన ప్రపత్త్యుపాయము మిక్కిలి శ్రేష్ఠమైనదనియర్థము.

5 నార్హంతీతి] ఇతరోపాయనిష్ఠులందఱున్ను భగవచ్చరణారవింద శరణాగతి నిష్ఠునియొక్క వైలక్షణ్యమందు కోటిభాగములో నొకభాగమునకు సరిపోలరనియర్థము.

కోటిశతమానపి" ఎన్ఱు-అల్లాదధికారికళిల్ ప్రపన్నాధికారి విలక్షణనా యిఱేఇరుప్పతు.

ఇవ్విలక్షణాధికారియై కణ్డాల్ దానమ్పణ్ణాతిరుక్కప్పోమో; అతుతాన్ సాక్షికమో; నియమముణ్డోవెన్నిల్; (ఏతద్వ్రతమ్మమ) ఇతు నమక్కు నియతానుష్ఠేయమ్.

(ఏతత్) ప్రపన్ననుక్కుప్పణ్ణుకిఱ అభయప్రదానమ్. "అనుపాలనీయస్స:" ఎన్ఱు-ఏఱిట్టుక్కొణ్డాల్ ముడియనుళవుమ్ విడాతే నడక్కుమతిఱే వ్రతమాయిరుప్పతు. "నత్యజేయం ప్రతిజ్ఞాం సంశ్రుత్య బ్రాహ్మణేభ్యో విశేషత:" ఎన్ఱు పడియిలే శొన్నోమే.

---

రోపాయాధికారులకన్న ప్రపన్నుఁడు విలక్షణాధికారియని చెప్పఁబడియున్నదిగదా? అట్లనే యితరదానము లన్నింటికన్న నభయదానము విలక్షణమగుచున్నది; కాఁబట్టి యిట్టి విలక్షణదానమునకు పాత్రభూతుఁడు విలక్షణాధికారియయిన ప్రపన్నుఁడేగాని వేరుకాదని భావము. ఇట్టిసత్పాత్రము లభించినప్పుడు దానము సేయకుండుట తగునా? అని తిరువుళ్లము.

అయితే, ఇది1సాక్షికమా; అవశ్యానుష్ఠేయమా; అనిన (ఏతద్వ్రతంమమ) ఇట్లభయప్రదానము సేయుట నాయొక్క వ్రతము. ఇందువల్ల నిది సాక్షికముకాదని భావమేర్పడుచున్నది. (ఏతత్) ప్రపన్నునికి చేయఁగల యభయప్రదానము. (వ్రతం) వ్రతమువలె నెన్నివిఘ్నంబులు తటస్థించినను విడువక యనుష్ఠించఁదగినది. "అనుపాలనీయస్స:" అనే ప్రమాణమందు వ్రతమనునది, పట్టినవెనుక పూర్తియగునంతవఱకు విడువక విఘ్నములు సంభవింపకుండునట్లు రక్షించుచు ననుష్ఠించఁదగి

---

1 [సాక్షికము] అనఁగా, అనుష్ఠించుట శ్లాఘ్యముగానుండినను, అట్లు అనుష్ఠింపక వదలినప్పుడు ప్రత్యవాయము (దోషము) కలుగఁజేయనిదని తాత్పర్యము.

(ఏతద్వ్రతమ్) ‟పరిత్రాణాయ సాధూనాం-సంభవామి” ఎన్గిన్ఱ-నదని చెప్పఁబడియున్నదిగదా? ఇంతకుపైన విలక్షణాధికారి విషయముగా చేయఁబడిన యీయభయప్రదానరూప విలక్షణదానమును గురించి1‟ నహిప్రతిజ్ఞాంసంశ్రుత్య...విశేషతః” అని ముందే చెప్పియున్నాముగదా? అని పెరుమాళ్ల తిరువుళ్లముగా భావము.

భావాంతరము దెలియఁజేయుటకై మరల పదములనుగ్రహించుచున్నారు; (ఏతద్వ్రతంమమ)అని.2‟పరిత్రాణాయసాధూనాం వినాశాయచదుష్కృతాం। ధర్మసంస్థాపనార్థాయసంభవామి”అనియును; 3‟ శరీరగ్రహణంవ్యాపిన్ ధర్మత్రాణాయకేవలం” అనియునుంగల ప్ర

1 [నహిప్రతిజ్ఞామితి] ‟అప్యహంజీవితంజహ్యాం త్వాంవాసీతే సలక్ష్మణాం” అనునది దీనికి పూర్వార్ధముగానున్నది. నాకేప్రాణహానిగలిగినను; నిత్యానపాయినివైన నిన్ను విశ్లేషించియుండవలసివచ్చినను; సర్వదేశ సర్వకాల సర్వావస్థలయందును సర్వవిధకైంకర్య నిరతుఁడైయుండు ఇళైయ పెరుమాళ్లను విడువవలసివచ్చినను; శరణాగతులకిచ్చినయభయప్రదానమును విడువజాలనని యీశ్లోకమునకర్థము. ఇది ఆరణ్యకాండమునందు, పెరుమాళ్లు దండకారణ్యవాసిఋషుల కభయమిచ్చిన పిమ్మట, పిరాట్టి (ఈయభయప్రదానమువల్ల రాక్షసులతో నధిక ద్వేషముగలిగి తద్ద్వారా మనకు పరస్పరవిశ్లేషము సంభవించునని భయపడి) సాయించినవాక్యమున కుత్తరముగా పెరుమాళ్లు సాయించినవాక్యము.

2 [పరిత్రాణాయేతి] శ్రీభగవద్గీత అధ్యా-౪ శ్లో-౮ సత్పురుషులను రక్షించుకొఱకును; పాపులను నశింపఁజేయుకొఱకును; ధర్మములను లెస్సగా స్థాపించుకొఱకును; ప్రతియుగమునందును నేనవతరించుచున్నానని యీశ్లోకమునకు సాధారణమైన యర్థము. ఇంతకుపైన యేర్పడునట్టి విశేషార్థములను శ్రీమద్గీతాభాష్యమందును,శ్రీమత్తత్త్వత్రయరహస్యము ఈశ్వరప్రకరణము ౧౭౪వ సూత్రవ్యాఖ్యయందును తిరువాయ్మొழி ముతల్ పత్తు-3, తిరువాయ్మొழி ఒన్బదామ్పాట్టు ‟వలత్తనన్” అవతారికయందును సేవింపుడు.

3 [శరీరగ్రహణమితి] సర్వాంతర్యామివైన నీవు, అట్టి యంతర్యామిత్వముచేత నే బ్రహ్మరుద్రులఁగొని సృష్టిసంహారకార్యములను నిర్వహించుటంబట్టి యన్నికార్యములు

„శరీరగ్రహణం వ్యాపిన్ ధర్మత్రాణాయ కేవలమ్” ఎన్ఱుమ్ - „పొఱ్ఱు తేఱ్ఱుజ్జాతల్ పూణ్డ” ఎన్ఱుమ్-„కాక్కుమియల్వినన్” ఎన్ఱుమ్-ఇతుసమక్కు సత్త్యప్రయుక్తమ్.

ఇతనుష్ఠేయమాఱుక్కెన్న; (మమ) „అర్థితోమానుషేలోకే” ఎన్ఱుమ్-„వేణ్డిత్తేవరిరక్క” ఎన్ఱుమ్-పరాపేక్షైయాయితుక్కెన్ఱు ఇట్టుప్పిఱన్దనమక్కు.

మాణములననుసరించి యిది నాకు సత్త్యప్రయుక్తమని పెరుమాళ్ల తిరువుళ్లముగా భావము. „పొఱ్ఱుతెఱ్ఱుమ్కాతల్ పూణ్డ” „కాక్కుమియలిన్” అనే శ్రీసూక్తులు, ఈయర్థము ప్రపన్నజనకూటస్థరుచిపరిగృహీతమనునర్థమును చూపించుచున్నవి.

(ఏతత్) ఈయభయప్రదానము, (మమ) నాకు, (వ్రతం) ఎట్టిదశయందును విడువఁగూడనిది; అనిగదా? ప్రతిపదార్థము. ఇచట (మమ) అనేపదము, అభయమిచ్చుటయే పనిగా నవతరించిన నాకు, అనేయర్థము నిచ్చుచున్నది. ఇట్లవతరించుట తనకు సత్త్యప్రయుక్తమై యుండగా నంతకుపైన రక్ష్యభూతులయం 1 దర్థిత్వమును సైతము

---

నిట్లనే నిర్వహించఁదగియున్నవి. ఇట్లుండగా అప్రాకృతదివ్యమంగళవిగ్రహమును ఇతరసజాతీయముగా (అనఁగా, రఘువంశపురాజులు, యాదవులు, మొదలగు మనుష్యజాతితో సమానముగా) కుదుర్చుకొని యవతరించుట ధర్మసంరక్షణార్థమేగాని వేరుగాదు; అని యీశ్లోకమునకర్థము. (సాధుసంరక్షణమున్ను పాపులను నశింపఁజేయుటయున్ను దీనికి అనఁగా ధర్మరక్షణమునకు సాధకములని ఈశ్లోకమునకు భావము.)

ఈరెండుప్రమాణములయందునుఁ జెప్పఁబడిన రక్షణకార్యము నొకరర్థించిన పిమ్మటఁజేయక, సర్వేశ్వరుఁడు తన రక్షణస్వభావమునుఁబట్టి తానేచేసిన కారణమువల్ల, ఇదినాకు సత్త్యప్రయుక్తమని పెరుమాళ్ల తిరువుళ్లముగా భావము ప్రసాదించినారు.

1 [అర్థిత్వము] నీవు నన్ను రక్షించుమని ప్రార్థించుట.

(మమ) స్రష్టావానబ్రహ్మావుక్కు మ్పణియల్ల; సంహారాః రుద్రనుక్కు మ్పణియల్ల; "నహిపాలన సామర్థ్యమృతే సర్వేశ్వరాత్హరేః" ఎన్గుమ్-"రక్షార్థం సర్వలోకానాం విష్ణుత్వముపజగ్మివాన్" ఎన్గుమ్-రక్షణమ్ నమక్కే-పణియెన్గిఱార్.

---

చూపించుచున్నారు; 1 "అర్థితో మానుషేలోకే జజ్ఞేవిష్ణుస్సనాతనః" అని. ఇఁక నీయర్థిత్వమునకు ఆచార్యశ్రీసూక్తిని ప్రమాణముగా చూపించుచున్నారు; "వేణ్డిత్తేవరిరక్క" అని. "ఇవన్ పాశురమ్ కేట్టవాఱే తిరువుళ్లముకక్కుమ్" అనే శ్రీజగద్గురుశ్రీసూక్తివల్ల, ఈయర్థిత్వము చేతనులకు 2ప్రాప్యాంతర్గతమై వరమోద్దేశ్యమగుచున్నదిగదా?.

ఇట్లు, ఈయర్థిత్వము "ఇతు సర్వముక్తిప్రసంగపరిహారార్థమ్" ఇత్యాది శ్రీసూక్తియందు ప్రసాదించియుండు మాత్రముతో నిలుచుచున్నదని సూచింపఁజేసి, ఇఁక, "ఇత్తైయుమ్ అవన్ తానే కార్యమ్ శెయ్యుమెన్ఱు నినైక్క-క్క-డవన్" అనేశ్రీసూక్తికి ప్రమాణమును, ఎత్తిచూపించుచున్నారు; "రక్షార్థం...జగ్మివాన్" అని. బ్రహ్మదేవునిచేత సృష్టింపఁబడిన లోకములను రక్షించుటకై సర్వేశ్వరుఁడు విష్ణురూపముగా నవతరించెనని యీప్రమాణమునకర్థము. ఇందు రక్ష్యభూతులైన చేతనులపేక్షించినట్లు చెప్పఁబడియుండలేదుగదా?. కాఁబట్టి సర్వేశ్వరుని సత్తాప్రయుక్తముగా నుదయించినట్టి రక్షణకార్యము చేతనుని యర్థిత్వవ్యాజముచేత ఫలప్రదమగుచున్నదని భావము.

---

I [అర్థితోమానుషేలోకఇతి] పురాణపురుషుఁడైన సర్వేశ్వరుఁడు, రావణవధార్థముగా దేవతలచేత ప్రార్థింపఁబడి, మనుష్యలోకమం దవతరించెనని యర్థము.

2 [ప్రాప్యాంతర్గతమై] అనాదికాలముగా పరాఙ్ముఖుఁడైయుండిన చేతనునికి తనయందాభిముఖ్యము గలుగునట్లనుగ్రహించి, పిమ్మట, అట్టియాభిముఖ్యము కలిగినందుకు సూచనగా నతఁడు నన్నురక్షించుమని ప్రార్థించుటనుచూచి సర్వేశ్వరుఁడు మిక్కిలి సంతోషించును; ఇట్టి శేషిముఖవికాసమే శేషభూతునకు స్వరూపలాభమున్ను ప్రాప్యమున్ను అగుచున్నది; కాఁబట్టి ప్రాప్యాంతర్గతమని చెప్పఁబడినది.

(మమైతద్వ్రతమ్) నమ్మక్కల్ పరివాలేవిలక్కైయుమ్ ఉమక్కుప్పణియానాల్పోలే ఆశ్రితరక్షణముమ్ నమక్కుత్త్యాజ్యల్ కాణుమ్.

(ఏతద్వ్రతమ్) “సతామేతదగర్హితమ్” పోలేసత్త్వాప్రయుక్తత్తుక్కుప్రయోజనమిల్లై; శెయ్యాతపోతుకపోతవానర విశ్వామిత్రాదికళి

మఱియు (మమ) అనేపదమువల్ల, ఇట్టి రక్షణకార్యము. సృష్టికర్తయయిన బ్రహ్మదేవునికినిఁ దరముకాదు; సంహారకర్తయయిన రుద్రునికినిఁ దరముగాదు; నాకే శక్యమనేయర్థము సూచింపఁబడుచున్నది. 1“నహిపాలన...హరిం”అనే ప్రమాణమువల్ల నీయర్థము సిద్ధించుచున్నది.

(మమైతద్వ్రతం) నాయందతిస్నేహమువల్ల నీతని విషయమందు లేనిశంకనుఁ గైకొని తొలఁగఁద్రోయుట 2నీకపరిహార్యకార్యమైనట్లు, ఆశ్రితరక్షణమున్ను నాకపరిహార్యకార్యమని భావము.

(ఏతద్వ్రతంమమ) అనుటకు, నాకిది సత్త్వాప్రయుక్తమని యొక భావము నిర్వహింపఁబడినదిగదా? కాఁబట్టి యీయభయప్రదానమునకొక ప్రయోజనమున్నదని తలంపులేదు. “ధర్మిష్ఠంచ...ఫలోదయం” అనే వాక్యముననుసరించి (దదామి) అనే క్రియాపదమునకు, ఐహికాముష్మికఫలములనుఁగోరి దానము చేయుచున్నానని యర్థము నిర్వహింపఁబడియుండినను అది శ్రీసుగ్రీవమహారాజు మొదలగువారి బుద్ధిసమాధానార్థమేగాని శరణ్యహృదయానుసారి గాదనిభావము.

---

1 [నహిపాలనసామర్థ్యమితి] ప్రళయాపత్తులో సకలభువనములనున్ను తనగర్భమందుఁ జేర్చుకొని రక్షించినట్టి సర్వస్వామియైన శ్రీహరిదక్క నితరులెవ్వరికిని జగత్పాలన సామర్థ్యములేదని యీశ్లోకమునకుఁ దాత్పర్యము.

2 [అపరిహార్యకార్యము] ఎన్నివిఘ్నంబులు కలిగినను విడువక యనుష్ఠింపఁదగినది. ఇది “వ్రతం” అనేపదముయొక్క తాత్పర్యము.

మన్న “ఎజ్జళ్ కుఱ్ఱవినిల్ పుకుతలాగాట్టోమ్” ఎన్ను కత్తై యఱైప్పార్ కళ్. అతుశైయ్యాతే, శాతుకోట్టియుళ్ కొళ్ళప్పడుకిఱతే ప్రయోజనమాక వితు నమక్కనుష్ఠేయమెన్గిఱార్.

అయితే ప్రయోజనాపేక్ష లేని యీయాభయప్రదాన మొకప్పుడు వదలిపెట్టఁదగునా? అనిన, ప్రపన్నునికి ఫలాభిసంధిలేని స్వవర్ణాశ్రమోచిత నిత్యనైమిత్తికకర్మములవలె నిదియును వదలిపెట్టఁదగినది కాదు. ఒకవేళ, అజ్ఞానమువల్ల వదలిపెట్టిన పక్షమున, కపోత వానర విశ్వామిత్రాది1ఆస్తికాగ్రేసరులెల్లఁగూడి తమగోష్ఠినుండి తొలఁగఁద్రోసి మరల నీతని సంబంధలేశమున్ను తమకుఁ గలుగకుండునట్లు సవాసనత్యాగము సేయుదురు. వేయేల పరదుఃఖాసహిష్ణుత్వమే దేహముఁ ధరించినదను నట్లవతరించిన యాళ్వారులు సైతము దయాహీనులవలె “ఎజ్జళ్ కుఱ్ఱవినిల్ పుకుతలాగాట్టోమ్” అని యిట్టివారిని తమగోష్ఠినుండి బహిష్కరించుచున్నారు. కాఁబట్టి నాస్తికబుద్ధిచేత వర్ణాశ్రమాచారములనువదలి 2 శిశ్నోదరపరాయణులై నశించక “శాతుకోట్టియుళ్ కొళ్ళప్పడువారే” అనురీతిగా, పరమవైదికులైనట్టి యాస్తికాగ్రేసరుల గోష్ఠిచే నంగీకరింపఁబడుటయే పరమప్రయోజనముగా సమస్తలోకాభయప్రదానరూప పరమధర్మమనుష్ఠించఁదగినదని తాత్పర్యము. “ఇప్పడి యనుష్ఠియాతపోతు భగవద్విభూతి భూతరాన చేతనర్క్కు నాశహేతువాకైయాలే” అనే తనిచరమశ్రీసూక్తియందు ప్రపన్నునికి

I [ఆస్తికాగ్రేసరులు] ఆస్తికులనఁగా ధర్మాధర్మపరలోకములందు నమ్మకముగలవారు. అగ్రేసరులనఁగా నందఱికన్న ముందు పనిచేయువారు. అంతు, ఆస్తికాగ్రేసరులనఁగా శ్రుతిసిద్ధములైన వర్ణాశ్రమాచారాది ధర్మములను (నిరతిశయశ్రద్ధతో) అందఱికన్నముందుగా ననుష్ఠించువారని భావము.

2 [శిశ్నోదరపరాయణులు] ఉదరపోషణము, మైథునము, అనే రెండుపనులయందే తగిలియుండువారు.

(ఏతద్వ్రతమ్మమ) ఇతు నమక్కనుష్ఠేయమ్ ఇత్తైత్తలైక్కట్టిత్తారీరెన్ఱు మహారాజరై ఇరక్కిఱార్.

1(విప్రతిపత్తిమూలమైన)వర్ణాశ్రమ ధర్మత్యాగము లోకవినాశహేతువగుచున్నదని సాయించియుండుటంబట్టి యిట్టి లోకభయమును నివర్తింపఁజేయుట సైతము గొప్పయభయప్రదానమే యగుచున్నది. కాఁబట్టి, అనన్యప్రయోజనుఁడైన ప్రపన్నునియొక్క వర్ణాశ్రమధర్మానుష్ఠానమున్ను, ఈయభయప్రదానమునందు సూచింపఁబడుచున్నదని భావము.

అథవా (ఏతద్వ్రతంమమ) ఇది నాకవశ్యానుష్ఠేయముగానున్నది. దీనిని2చరితార్థము జేయించియిమ్మని శ్రీసుగ్రీవమహారాజును వేడుచున్నారని భావము.

ఇచట, సర్వభూతములకు నభయమిచ్చుటకై పెరుమాళ్లు స్వాశ్రితులను వేడుకొనుచున్నారని నిర్వహించుటవల్ల "ఉత్సీదేయురిమే లోకానకుర్యాంకర్మచేదహం। సంకరస్యచకర్తాస్యాముపహన్యామిమాః ప్రజాః" (శ్రీభగవద్గీత-అధ్యాయం-3, శ్లోకం-౨౪) అనే శ్రీగీతోపనిషత్సూక్తి ప్రకారముగా, స్వవర్ణాశ్రమోచితధర్మముల ననుష్ఠించని పక్షమందు వర్ణసాంకర్యముగలిగి ప్రజలెల్ల నశించుదురని పెరుమాళ్ల తిరువుళ్లము మిక్కిలి నొచ్చియున్నదని యేర్పడుచున్నది.

ప్రజలకు కీడుగలుగఁగూడదని (అభయంసర్వభూతేభ్యోదదామ్యేతద్వ్రతంమమ) అని యుద్ఘోషింపుచు, ఈయభిప్రాయము కొనసాగుటకై స్వాశ్రితులను ప్రార్థించునట్టి పెరుమాళ్లతిరువుళ్లమునకు విరుద్ధముగా సకలప్రజావినాశకరమైన వర్ణాశ్రమాచారత్యాగమువల్ల వర్ణసాంకర్యము గలుగఁజేయువారికి వైష్ణవత్వమెట్లు గలుగును.

1 [విప్రతిపత్తిమూలమైన] విరుద్ధజ్ఞానమువల్లఁ బుట్టిన.

2 [చరితార్థము] అనుష్ఠానమువల్ల సాఫల్యమునుఁబొందినది.

ఇప్పడి పెరుమాళ్ మహారాజరై ప్పార్త్తు అభయప్రదానమ్పణ్ణి ఆశ్రితనాన విభీషణనై రక్షణమ్పణ్ణవేణుమెన్ఱు ఇన్దశ్లోకత్తిల్ తాత్పర్యార్థ మరుళిచ్చెయ్తారాయిఱ్ఱు.

సకలద్రావిడామ్నాయ సారవ్యాఖ్యానకారిణమ్
శ్రావణేరోహిణీజాతం కృష్ణసంజ్ఞమహంభజే ॥
శ్రీమత్కృష్ణసమాహ్వాయ నమోయామునసూనవే
యత్కటాక్షైకలక్ష్యాణాం సులభశ్శ్రీధరస్సదా ॥

తణ్మైశింకంరోకిణినాళ్ తన్ధైక్కవందోన్ వాఴియే
తారణియిల్ చెంకనల్లూర్ తానుడైయోన్ వాఴియే
పుణ్మైతవిర్క్కుం తిరువరంగర్ పుకఴుఱైప్పోన్ వాఴియే
పూతూరెతిరాశర్ తాళ్ పుకరుమవన్ వాఴియే
మన్ పుకఴ్ శేర్ శటకోపర్ వళముఱైప్పోన్ వాఴియే
మఱైనాలిన్ పొరుళ్ తన్నై వకుత్తురైత్తాన్ వాఴియే
అన్ బుడనులకారియన్ తంఅడియుఱైయోన్ వాఴియే
అభయప్రదరాజర్ తాళనవరతంవాఴియే.

సవ్యాఖ్యానమ్–శ్రీరామాయణచరమశ్లోకమ్.
ముఱ్ఱిఱ్ఱు.

---

## పెరియవాచ్చాన్పిళ్ళైతిరువడికళేశరణమ్.

---

1 "ప్రియోపినప్రియోసౌమే మదాజ్ఞావ్యతివర్తనాత్" 2 "మద్భక్తోపిన

---

1 [ప్రియోపినప్రియఇతి] "సచమమప్రియః" అనే శ్రీగీతోపనిషద్వాక్య ప్రకారముగా భగవత్ప్రియుఁడైన జ్ఞానిగానుండినను, భగవదాజ్ఞారూపములైన శ్రుతిస్మృతిసిద్ధములైన వర్ణాశ్రమాదిధర్మములను, త్యజియించెనేని యతఁడు సర్వేశ్వరునకప్రియుఁడే యగుచున్నాఁడని భావము. ఇది భగవద్వాక్యము.

2 [మద్భక్తోపీతి] శ్రుతిస్మృతులు భగవదాజ్ఞారూపములు, కాఁబట్టి, అందు

వైష్ణవః" అని వచనభూషణ దివ్యశాస్త్రమం దుదహరింపఁబడియుండు ప్రబలప్రమాణముల నిచ్చట ననుసంధించవలయును.

మఱియు, పెరుమాళ్లు శ్రీవిభీషణాళ్వానులకుఁ బ్రసాదించిన యీయభయప్రదానము శ్రీసుగ్రీవమహారాజునుచూచి చెప్పఁబడుటవల్ల, సర్వేశ్వరునికి స్వారాధనరూపములయిన ధర్మములెల్ల 1భాగవతాంగీకారముచేతనే మిక్కిలి ప్రియములగుచున్నవనే యర్థవిశేషము సైతమీశ్లోకమువల్ల నేర్పడుచున్నది.

ఇట్టిమహార్థములను శ్రీపెరియవాచ్చాన్పిళ్లైస్వాములవారు ప్రసాదించి యస్మదాదులనెల్ల నుజ్జీవింపఁజేసిరి.

పెరియవాచ్చాన్పిళ్లైతిరువడికళేశరణమ్.

పెరియజీయర్ తిరువడికళేశరణమ్.



విధింపఁబడిన వర్ణాశ్రమాచారాది సమస్తధర్మములున్ను భగవదాజ్ఞారూపములుగానే యున్నవి; అట్టియాజ్ఞ నుల్లంఘనము సేయువాఁడు భగవద్భక్తుఁడుగానుండినను వానికి వైష్ణవత్వమే లేదని యర్థము.

1 [భాగవతాంగీకారముచేతనే] అనునప్పుడు, ఇదిస్వరూపమునకు ప్రాప్తము, ఇదియప్రాప్తము, అని చక్కఁగా నెఱింగినట్టి పరిపక్వజ్ఞానముగల పరమవైదికులైన ప్రపన్నులయొక్క యనుష్ఠానములెల్ల సర్వేశ్వరున కత్యంతాభిమతములై యుండుననే యర్థవిశేషమునున్ను గ్రహించవలయును.

శ్రీమతేరమ్యజామాతృమునయేనమః.

శ్రీమదమ్యతశరకోపయతిరాజవరవరపరవస్తునిజగురుభ్యోనమః.

చరమశ్లోకత్రయము.

రెండవభాగము.

# శ్రీగీతోపనిషచ్చరమము.

పరమకారుణికులైన పిళ్లైలోకాచార్యస్వాములు సాయించిన

# ముముక్షుప్పడి.

దీనికి విశదవాక్శిఖామణియు, యతివర పునరావతారమైన మణవాళమామునులు సాయించిన వ్యాఖ్యానానుసారముగ

# ఆంధ్రవ్యాఖ్యయు.

పరన్దప్పడి, తనిచరమము, పరన్దరహస్యము, అష్టశ్లోకివ్యాఖ్యానము మొదలగు అనేకరహస్యగ్రంథములలోని విశేషార్థములతో ఆంధ్రద్రవిడదేశీయులగు అఖిలప్రపన్నజనుల కత్యంతోపయుక్తంబగునట్లు

భాగవతనియమనపూర్వకముగా

భాగవతవిధేయుఁడు

భాష్యం — రామానుజదాసునివల్ల

స్వకీయ

ఎంప్రెస్ ఆఫ్ ఇండియా అచ్చుకూటములో

ముద్రించబడెను.

పరాంకుశ తిరువవతారాది

౫౦౧౯.

MADRAS:

1917

క్రయమ్ రూ. ౧-౦-౦.

శ్రీమతే రామానుజాయ నమః.

## గ్రన్థారమ్భములో అనుసంధించవలసిన తనియనులు.

లోకగురుంగురుభిస్సహపూర్వైః కూరకులోత్తమదాసముదారమ్ ।
శ్రీనగపత్యభిరామవరేశౌ దీప్రశయానగురుంచభజేహమ్ ॥ ౧॥

లోకాచార్యాయగురవే కృష్ణపాదస్యసూనవే ।
సంసారభోగిసందష్ట జీవజీవాతవేనమః ॥ ౨॥

లోకాచార్యకృపాపాత్రం కౌణ్డిన్యకులభూషణమ్ ।
సమస్తాత్మగుణావాసం వన్దేకూరకులోత్తమమ్ ॥ ౩॥

నమశ్శ్రీశైలనాథాయ కున్తీనగరజన్మనే ।
ప్రసాదలబ్ధపరమ ప్రాప్యకైంకర్యశాలినే ॥ ౪॥

లోకాచార్యపదామ్భోజ రాజహంసాయితాన్తరమ్ ।
జ్ఞానవైరాగ్యజలధిం వన్దేసౌమ్యవరంగురుమ్ ॥ ౫॥

శ్రీజిహ్వావదధీశదాస మమలమశేషశాస్త్రవిదమ్ ।
సున్దరవరగురుకరుణాకన్దలిత జ్ఞానమందిరంకలయే ॥ ౬॥

## ముగించుసమయమునలో అనుసంధించవలసిన తనియనులు.

కోతిలులకాశిరియన్ కూరకులోత్తమతాతర్ ।
తీతిల్ తిరుమలైయాழ்వార్ శెழுఙ్గురవై మణవాళర్ ।
ఓతరియపుకழ் తిరునావుడైయపిరాన్ తాతరుడన్ ।
పోతమణవాళమునిపొన్నడికళ్ పోற்றువనే ॥ ౧॥

వాழிయులకాశిరియన్ వాழிయవన్ మన్నుకులమ్ ।
వాழிముడుమ్బైయెన్నుమ్ మానకరమ్ - వాழி ।
మనమ్శూழ்న్ద పేరిన్బమ్మల్గుమిగునల్లార్ ।
ఇనమ్శూழ்న్దిరుక్కుమిరుప్పు ॥ ౨॥

ఓతుముడుమ్బైయులకాశిరియనరుళ్ ।
ఏతుమఱవాతవెమ్బెరుమాన్ నీతివழி ।
వழுవాచ్చిఱునల్లూర్ మామలైయాన్ పాతన్ ।
తొழுవార్కు వారాతుయర్ ॥ ౩॥

జీయర్ తిరువడిగళే శరణమ్.

శ్రీమతేరామానుజాయనమః.

# శుద్ధాశుద్ధపత్రిక.

## విజ్ఞాపనము.

| పుట. | పఙ్క్తి. | అసాధువు. | సాధువు. |
|---|---|---|---|
| 2 | 25 | విడచి | విడిచి |
| 4 | 10 | విపరణ | వివరణ |
| 6 | 15 | గారము | గారవము |

| పుట. | పఙ్క్తి. | అసాధువు. | సాధువు. |
|---|---|---|---|
| 6 | 26 | యువ్విళ్లా | యువ్విళ్లూరు |
| 7 | 11 | కొవి | కొని |
| ,, | 17 | ఫూస | ఫూగస |

## శ్రీగీతోపనిషచ్ఛరమము.

| | | | |
|---|---|---|---|
| 2 | 6 | ఠ్ఖ | ఢ్ఖ |
| 3 | 25 | పాధ్య | పాద్య |
| 5 | 2 | థర్మ | ధర్మ |
| 11 | 24 | విహాయ | విహోయ |
| 14 | 3 | విదిం | విధిం |
| 16 | 11 | ష్ఠా | ష్టా |
| ,, | 18 | య | యె |
| 23 | 15 | ఆధర్మ | ఆఅధర్మ |
| 27 | 4 | కస్మై | కసై |
| 28 | 18 | ష్బి | ష్పి |
| 32 | 19 | అగ్ని | అగ్ని |
| ,, | 25 | తెలిశి | తెలిసి |
| 33 | 9 | వంయ | వయం |
| ,, | 25 | సాదా | సాధా |
| ,, | 29 | పాధ | సాధ |
| 34 | 12 | ర్జ్ఞ | ర్గ |
| ,, | 14 | వె | వి |
| ,, | 21 | ఆంత | అంత |
| ,, | 30 | వే | శే |
| 35 | 20 | స్ర | ప్ర |
| ,, | 22 | త్రై | అసై |
| 36 | 27 | దవ | దన |
| 37 | 16 | శి | సి |

| | | | |
|---|---|---|---|
| 37 | 17 | బ్డ | బ్ద |
| ,, | 19 | మేక | మేకం |
| ,, | 25 | యందు | యందు |
| 38 | 22 | ముఖా | ముఖో |
| 40 | 10 | చేశి | చేసి |
| ,, | 23 | హీమ | హీను |
| 47 | 8 | ఆకృ | అకృ |
| 43 | 27 | నమ | సమ |
| 50 | 6 | వేశి | వేసి |
| ,, | 18 | ప్పట్టు | ప్పట్టు |
| ,, | 21 | వలశి | వలసి |
| 52 | 15 | ఆన్వ | అన్వ |
| ,, | 23 | తీను | తీసు |
| ,, | 25 | అమ | ఆమ |
| 56 | 24 | నర్వే | సర్వే |
| 62 | 15 | అనునం | అనుసం |
| 64 | 22 | ధ్యా | ద్యా |
| 73 | 22 | ఆను | అను |
| 75 | 14 | ఆనిన్ని | అనిన్ని |
| ,, | 26 | స్సన్య | సన్య |
| 89 | 11 | ఆని | ఆన |
| 96 | 10 | డన | డని |
| 97 | 26 | అకై | ఆకై |



శ్రీమతే రామానుజాయనమః.

శ్రీపిళ్లైలోకాచార్యర్ తిరువడికళే శరణమ్.

పెరియజీయర్ తిరువడికళే శరణమ్.

చరమశ్లోకత్రయమునందు మూడవదియగు

# శ్రీగీతోపనిషచ్చరమము.

## విజ్ఞాపనము.

శ్రీగీతోపనిషదాచార్యులు, అర్జునునుద్దేశించి "[illegible]శీలవృపాయవిశేషజ్ఞై" ఇత్యాది శ్రీసూక్తిప్రకారముగా తొలుత కర్మజ్ఞానభక్తిరూపోపాయములను ప్రసాదించి, యవి తనకనుష్ఠింప నశక్యములనియును (ఒకవేళ శక్యములైనను) స్వరూపవిరుద్ధములనియునుఁ దలంచి యిక నుజ్జీవించుమార్గమెట్లని శోకము తలయెత్తి భగవచ్చరణారవింద శరణాగతియం దభిముఖుఁడైన యయ్యర్జునునకు చరమమైన యుపాయమునుఁ బ్రసాదించుటంబట్టి శ్రీగీతోపనిషచ్చరమమునకే చరమశ్లోకమనే తిరునామము దగియున్నది. ఈయర్థమును శ్రీపరందపడి రహస్యమునందును శ్రీతనిచరమ రహస్యావతారికయందును శ్రీపిళ్లైలోకాచార్యస్వాములు తామే ప్రసాదించియున్నారు.

ఇట్లుండినను, [1]జ్ఞానప్పిరాన్ సాయించిన [2]శ్లోకద్వయమును శ్రీవరాహచరమమనిన్ని, శ్రీచక్రవర్తితిరుమకనార్లు ప్రసాదించిన యభయప్రదానశ్లోకమును శ్రీరామాయణచరమమనిన్ని యీగ్రంథమందు

1 [జ్ఞానప్పిరాన్] జ్ఞానము నుపకరించినవారు. శ్రీవరాహమూర్తియని భావము.

2 [శ్లోకద్వయము] దీనికిదియే తిరునామముగా పురాణమందు చెప్పఁబడియున్నది.

వ్రాయుటకు కారణమేమనిన, "ప్రపత్తినిర్భరత్వానుసంధానశిరస్కామ్" అనే శ్రీతనిచరమ శ్రీసూక్తియందుఁ బ్రసాదింపఁబడిన నైర్భర్యము శ్లోకద్వయమునందు స్పష్టముగాఁ బ్రసాదింపఁబడి యుండుటవల్లనున్ను, "ఇతుక్కు ఈశ్వరస్వాతంత్ర్యత్తిలేనోక్కు" అనే ముముక్షుప్పడి శ్రీసూక్తియందుఁ బ్రసాదింపఁబడిన యీశ్వరస్వాతంత్ర్యము శ్రీమదభయప్రదాన శ్లోకమందు 1స్పష్టముగా సాయింపఁబడియుండుటవల్లనున్ను, (శ్రీగీతోపనిషచ్చరమమందుగల ప్రధానార్థములు రెంటినిన్ని వ్యక్తపరచియుండుటంబట్టి) తక్కిన రెంటికిని సైతము, 2ఔపచారికముగా చరమశ్లోకమనే తిరునామము వ్రాయవచ్చును. ఇట్టి, ఔపచారికత్వమునుఁబట్టియేలిగురుపరంపరోపదేశమునం సు శ్రీగీతోపనిషచ్చరమముతోడఁ దక్కిన రెంటినిన్ని యనుసంధించుట సత్సంప్రదాయసిద్ధముగా నున్నది. ఇదిగాక "మిత్రభావేనసంప్రాప్తం" అనేశ్లోకమునకు శ్రీపెరియవాచ్చాన్పిళ్లైస్వాములు చరమశ్లోకసామ్యమును ప్రతిపాదించియుండుటవల్ల, ఈ రెంటికిని సైతము ఔపచారికముగా చరమశ్లోకమనే తిరునామము తగునని యిట్లు వ్రాయఁబడినది.

మఱియు నిచ్చట, అవతారక్రమము ననుసరించి, ప్రథమమందు

---

1[స్పష్టముగా] అనునప్పుడు "ఆనయైనం హరిశ్రేష్ఠ" ఇత్యాది శ్లోకమునున్ను అనుసంధించవలయును. ఇది "సకృదేవప్రపన్నాయ" అనే శ్లోకమున కనంతరశ్లోకముగానున్నది. "రాఘవంశరణంగతః" అనిపలికిన యీతఁడు రావణునితమ్ముఁడైనను, అథవా రావణుఁడేయయినను, వీనికి నే నభయమిచ్చినాను. ఇఁక నీవు మాఱుమాటాడక యీతనిఁదోడ్కొనిరమ్మని పెరుమాళ్లు సాయించినారని యీశ్లోకమున కర్థము.

2 [ఔపచారికముగా] సమ్మానార్థముగా.

3 [గురుపరంపరోపదేశము] పంచసంస్కారము సేయునప్పుడు శిష్యుల కాచార్యులు సేయునట్టి తిరుమంత్రద్వయ చరమశ్లోకోపదేశమని భావము. గురుపరంపరను విడచి మంత్రోపదేశము సేయుట సంప్రదాయవిరుద్ధము కాఁబట్టి గురుపరంపరోపదేశమని యిచ్చట వ్రాయఁబడినది.

శ్రీవరాహచరమమున్ను, అనంతరము శ్రీరామాయణచరమమునున్ను, కడపట శ్రీగీతోపనిషచ్చరమునున్ను, వ్రాసియుంచినను, శ్రీగీతోపనిషచ్చరమమునే తొలుత సేవించి పిమ్మట శ్రీవరాహ శ్రీరామాయణ చరమముల ననుసంధించిన పక్షమందు 1పూర్వోక్తార్థద్వయ సంగ్రహవివరణత్వము సరిపోవుచున్నది. అట్లుగాక, ఈగ్రంథమందు వ్రాసియుండు క్రమముగానే సేవించుపక్షమందు. శ్రీగీతోపనిషచ్చరమమందు సంగ్రహముగా సాయింపఁబడిన, నిర్భరత్వానుసంధానమునున్ను, ఈశ్వర స్వాతంత్ర్యమునున్ను, సర్వేశ్వరుఁడు తత్పూర్వావతారములయందే స్పష్టముగాఁ బ్రసాదించియున్నారనే యభిప్రాయముతోను సేవించ వలయును.

ఇఁక నీచరమశ్లోకమునకు శ్రీమణవాళమహామునులు ప్రసాదించి యుండునట్టి యుపోద్ఘాత మాంధ్రీకరింపఁబడుచున్నది. అది యెట్టులనిన:

ఈ చరమశ్లోకము రహస్యత్రయమునందు చరమరహస్యమని మన పూర్వాచార్యులాదరించియున్నారు. ప్రథమరహస్యమైన తిరుమంత్రమునకు మధ్యమరహస్యమైన ద్వయము వివరణమైనట్లు ద్వయమున కిది వివరణముగానున్నది. ప్రణవార్థమును(నమఃనారాయణాయ అనే) మంత్రశేషము వివరించుచున్నదనియును, ఆమంత్రశేషమునందలి యర్థమును ద్వయము వివరించుచున్నదనియును, మంత్రరత్నమని బొగడొందిన యాద్వయమందలి యర్థమును చరమశ్లోకము వివరించుచున్నదనియును, తిరుమంత్రప్రకరణమందు శ్రీమణవాళమహామునులు తామే ప్రసాదించియున్నారు.

---

1 [పూర్వోక్తార్థద్వయసంగ్రహవివరణత్వము] అనఁగా, మున్ను చెప్పినట్టి, నైర్భర్యము, ఈశ్వరస్వాతంత్ర్యము, అనే రెంటికిన్ని, చరమశ్లోకము సంగ్రహముగానుండుటయును, శ్రీవరాహచరమ, శ్రీరామాయణచరమములు రెండును విస్తరములుగా నుండుటయునని యర్థము.

మంత్రరత్నపూర్వవాక్యమందుఁ జెప్పిన యుపాయవరణము సర్వేశ్వరున కత్యంతాభిమతమగుటంబట్టి చరమశ్లోకపూర్వార్ధమం దట్టివరణమును తానే విధించుచు, దానికంగమైన సాధనాంతర పరిత్యాగమునున్ను, ఉపాయవరణమందు సైతము సాధనత్వబుద్ధి పరిత్యాజ్యమనే యర్థవిశేషమునున్ను శాబ్దముగాఁ బ్రతిపాదించి; మంత్రరత్నోత్తర వాక్యమందు చెప్పఁబడిన ప్రాప్యము నిందలి యుత్తరార్ధము వివరించునప్పుడు, కైంకర్యపూర్వభావియైన భగవత్ప్రాప్తికి ప్రతిబంధకములుగానుండు సమస్తపాపములున్ను ప్రపన్నాధికారిని వదలిపోవునట్లు చేయుచున్నానని శాబ్దముగాఁ బ్రతిపాదించుచున్నారు. ఇందువల్లనిది ద్వయవివరణమైనది.

ఇట్లు చరమరహస్యమనియును చరమశ్లోకమనియునుఁ బొగడొందిన యిది 1పంచమవేదసారభూత శ్రీగీతోపనిషత్తుయొక్క తాత్పర్యార్థప్రకాశముగానున్నది.

పరమవైదికరుచిపరిగృహీతమైన యిట్టి మహార్థమును2జ్ఞానానుష్ఠానపరిపూర్ణులైన సదాచార్యులయొద్ద నాలకించుటయే స్వరూపానురూపమని తిరువుళ్లమున నెలకొల్పి * యెంబెరుమానార్లు తిరుక్కోట్టియూరునంబి సన్నిధికి పదునెనిమిది యావృత్తులు వేంచేసిరి.

1 [పంచమవేదసారభూత] మనునప్పుడు ‘‘భారతః పంచమో వేదః’’ అనే ప్రమాణమునున్ను ‘‘భారతే భగవద్గీతా’’ అనే ప్రమాణమును అనుసంధించవలయును.

2[జ్ఞానానుష్ఠానపరిపూర్ణులైన సదాచార్యులయొద్ద నాలకించుట]అనుటకు‘‘సదాచార్యోపదేశస్యైవాతిశయావహత్వాత్’’ అనే శ్రీగోవిందరాజీయ వాక్యము ప్రమాణము.

*ఉడైయవర్లు పెరియనమ్బి తిరుమాళిగకు వేంచేసి వారి తిరువడిత్తామరలయందు దండసమర్పించి, స్వామీ శ్రీయాళవందార్ల తిరువడిత్తామరలను సేవింపుచుండఁ బ్రాప్తిశోకమైన దుఃఖమెల్లఁ బరిహారమగునట్లు దేవరవారి తిరువడిత్తామరల నాశ్రయింపఁగంటిని, ఇఁక దేవరవారి తిరువుళ్లమునందు నెలకొనియుండునట్టి యర్థవిశేషంబుల దాసునికిఁ బ్రసాదించవలయునని విజ్ఞాపనము సేయుటయును, పెరియనమ్బిస్వామివారు

న్ను వీరివిజ్ఞాపనము నతిప్రీతితో నంగీకరించి, మంత్రరత్నమని బాగడొందిన ద్వయము యొక్క అర్థమునుఁ బరమకృపతోఁ బ్రసాదించి, ఇంకయుఁ గొన్ని యర్థవిశేషంబులు గలవు వాటిని శ్రీయాళవందారుస్వామివారి యభిమానాంతర్భూతులైన (అభిమానాంతర్భూతులనఁగా నీలేఁడు మనవాడనే యభిమానమునకు లోఁబడినవారని యర్థము) తిరుక్కోట్టియూరు నమ్బిస్వామివారి తిరువడిత్తామరల నాశ్రయించి యాలకింపుమని ప్రసాదించిరి.

పిమ్మట, ఉడైయవర్లు తిరుక్కోట్టియూరికి (శ్రీగోష్ఠీపురమునకు) వేంచేసి నమ్బిస్వామివారి తిరువడిత్తామరలయందు దణ్డమును సమర్పించి, స్వామీ, దేవరవారు దాసునికి రహస్యార్థములఁ బ్రసాదించి యనుగ్రహింపుమని ప్రార్థించుటయును, వారు వీరియొక్క ఆస్తిక్యాదరపరీక్షార్థముగా పదునెనిమిదియావృత్తులు త్రిప్పించి పిదప తిరుమంత్రార్థమునుఁ బ్రసాదించినారని శ్రీగురుపరంపరాప్రభావాది గ్రంథములయందు పూర్వాచార్యులు సాయించియున్నారు.

ఇట్లుండఁగా చరమశ్లోకార్థ శ్రవణార్థముగాఁ బదునెనిమిది యావృత్తులు తిరిగినారని యిచ్చటఁ బ్రసాదించుటకు గారణం బేమనిన; ఇంతటి శ్రమతోడ తిరుమంత్రార్థము వడసి యిక నిట్టి యధికారములఁబడలుభించుట మిగులనరుదు గావున రుచిగల శ్రీవైష్ణవులు వ్యర్థులుగానే పోవుచున్నారని వారియందుఁ దమకు జనించినట్టి పరమకృపవల్ల తిరుమంత్రార్థమును శ్రీవైష్ణవగోష్ఠి యందఱికినిఁ బ్రసాదించిరి. ఈవృత్తాంతమును తిరుక్కోట్టియూరునంబి విని యానందపరవశులై, ఎమ్బెరుమానార్లు, అని సాయించుచు వీరిని గాఢాలింగనము గావించుకొని మఱిమఱి నుపూంగుమన్న ప్రీతివల్ల, స్వామీ, మఱియు నొక చరమరహస్యార్థముగలదు. మీరీతూరిపోయి యేకాంతముగా మరల నొకప్రయాణముఁగొని మాయొద్దకు వచ్చునదియని సాయించి వీడ్కొలుపుటయు వారుకుంజని తానొకరుమాత్రమే మరల వేంచేసి నమ్బి తిరువడిత్తామరలను సేవింపగా నంబిస్వామివారు వీరివల్ల మరల ప్రమాణముజేయించుకొని చరమశ్లోకార్థమును ప్రసాదించిరి.

రహస్యార్థములఁ బ్రసాదింపుమని తొలుత ఎమ్బెరుమానార్లుచేసిన ప్రార్థన చరమశ్లోకార్థమునుఁ బ్రసాదించుపర్యంతము పూర్తిగా సఫలముగాక యిప్పటికి సఫలమైన కారణమునుఁబట్టి చరమశ్లోకార్థ శ్రవణార్థముగానే పదునెనిమిదియావృత్తులు తిరిగినారని ప్రసాదించినారు. శ్రీతిరుక్కోట్టియూరునమ్బిస్వామివారు వీరిని పదునెనిమిదియావృత్తులు త్రిప్పించుటకు హేతువు పదునెనిమిది యధ్యాయములుగల శ్రీగీతోపనిషత్తుయొక్క తాత్పర్యార్థమునుఁ బ్రసాదించవలయుననే యుద్దేశ్యమేగాని వేరుకాదని తిరువుళ్లము (అభిప్రాయము.)

ఈ తిరుక్కోట్టియూరు నమ్బిస్వామివారు,1 ఆనృశంస్యప్రధానులైన యాచార్యశ్రేష్ఠులుగా నుండుటవల్లనున్ను, అంతకుపైన చరమశ్లోకార్థమును ఎమ్బెరుమానార్లకు సాయింపుఁడని శ్రీయాళవందార్లచేత నియమింపఁబడినవారుగా నుండుటవల్లనున్ను, వీరపేక్షించిన కాలముందే యుపదేశింపఁదగినవారుగా నుండియును; ఈ2 చరమశ్లోకార్థ గౌరవమునున్ను 3 దీనికధికారి లేకుండుటయునున్ను తిరుపుళ్లమునఁ బరిశీలించి యెమ్బెరుమానార్లయొక్క 4 ఆస్తిక్యాదరపరీక్షార్థముగాఁ బలుమారుఁ దిరిగితిరిగి బడలునట్లుగావించి యావెనుక నంతరంగశిష్యునిగా నంగీకరించి రీమాసోపవాసమువల్ల శ్రమపరచి యిన్నిపరీక్షలవల్ల వారియాస్తిక్యాదరస్థైర్యము నెఱింగిన పిమ్మట "సర్వగుహ్యతమం" అని శేషిచేతనే పొగడఁబడినట్టి యిమ్మహార్థమును బ్రసాదించిరి.

1 [ఆనృశంస్యప్రధానులు] సదాచార్యలక్షణములైన గుణములనేకములుండఁగా నన్నిటికన్న పరదుఃఖమునుచూచి యోర్వలేమి, యనే మహాగుణమొక్కటే యతిశయించియుండువారు,

2 [చరమశ్లోకార్థగౌరవమును] "ఉయ్యక్కొండార్ విషయమాక" ఇత్యాదిసూత్రవ్యాఖ్యానసమయమందు తామే ప్రతిపాదించుచున్నారు. అచ్చట సేవింపుడు.

3 [దీనికధికారిలేకుండుటను] వెంటనే "నిష్కృష్టసత్త్వనిష్ఠనాయ్" ఇత్యాది వాక్యమునందు తామే ప్రతిపాదించుచున్నారు.

4 [ఆస్తిక్యాదరములు] ఆస్తిక్యమనఁగా "సర్వధర్మాంగళై యుమ్విట్టు" ఇ[redacted]త్యాదివ్యాఖ్యానములయందుఁ బ్రతిపాదింపఁబడునట్టి సర్వధర్మపరిత్యాగ తాత్ప[redacted]ది భగవదాజ్ఞారూపములైన శాస్త్రములకు కట్టుబడియుండుట. ఇంతే [redacted] యాయధికారికి ధర్మలోపభయమున్ను పాపభీతిన్ని కలిగియుండవల [redacted] సైతమీపదము చూపించుచున్నది. శ్రీగీతోపనిషత్ప్రథమద్వితీ[redacted] సాయించియుండు యర్జునస్వభావమువల్ల [illegible] [redacted] ఆదరమనఁగా ఇమ్మహార్థము [illegible] సాయని [redacted] పరచి] [illegible]

కబళము [redacted] [illegible] కబళముగా

ఇఁక నీచరమశ్లోకార్థ శ్రవణమున కధికారి యెట్టివాఁడన; 1నిష్కృష్టసత్త్వనిష్ఠుఁడును, పరమాత్మయగు సర్వేశ్వరునియందు (అనేక జన్మానుష్ఠిత పుణ్యఫలమై యీజన్మమునందు స్వాభావికముగా నుండు నట్టి) ప్రీతిగలవాఁడును, తదితరవిషయవైరాగ్యముగలవాఁడును, శాస్త్ర పరతంత్రుఁడును, భగవద్వైభవమును వినిన నది సర్వేశ్వరుని సర్వ శక్తిత్వమునకుఁ దగునని దృఢముగా నమ్మునట్టివాఁడును, ఆస్తికాగ్రేస రుఁడునుగా నుండువాఁడే దీనికధికారి యగుచున్నాఁడు.

ఇట్లు దీనికధికారి లేకుండుటంబట్టియు, 2అర్థగౌరవమునుఁబట్టియు, ఎమ్బెరుమానారకు ముందుండిన యాచార్యులెల్ల దీని నెవ్వరికి నుప [redacted]మనుగా సంరక్షించుకొనుచుండిరి. 3"వ్యూహాగ్రాహం రూ[illegible]వ్యాగమిష్యామి" అని సర్వేశ్వరుఁడు తానే సంకల్పించుకొని యవతరించిన యవతారవిశేషమగుటంబట్టి యెంబెరుమానార్ల సంసారుల దుర్గతినిఁజూచి సహింపఁజాలని పరమకృపవల్ల, అర్థగౌరవమునుఁ జూడక యిట్టి పరమరహస్యార్థమును శ్రీవైష్ణవసమూహామునందు బహి

పదునెనుదినము లన్నకబళముల నెచ్చించుచు, పిమ్మట పదునాఱవదినము మొదలు ప్రతి దినము నొక్కొక్క కబళముగా పదునేనుదినము లన్నకబళముల తగ్గించుట. ఎమ్బెరు మానార్లను మాసోపవాసము చేయించకుండినను వారినిఁగొని శ్రీకూరత్తాళ్వానులను మాసోపవాసము చేయించియుండుటవల్ల, ఇచ్చట, "మాసోపవాసమువల్ల శ్రమపరచి" అని ప్రసాదించినారు.

1 [నిష్కృష్టసత్త్వనిష్ఠుఁడు] అనఁగా శుద్ధసత్త్వనిష్ఠుఁడు. (మిశ్రసత్త్వనిష్ఠుఁడు సాధనాంతరాధికారి. శుద్ధసత్త్వనిష్ఠుఁడు ప్రపత్త్యధికారి అనిభావము.)

2 [అర్థగౌరవము] ఆస్తికాగ్రేసరులైన పరమవైదికులుమాత్రమే యేఱుంగఁదగినట్టి దీనియర్థముయొక్క గౌరవమని భావము.

3 [వ్యూహాగ్రాహమిత్యాది] చరమోపాయతాత్పర్యమ్, ఆరవపుటలో దీనియర్థము సవిస్తరముగానున్నది. నేనే సదాచార్యరూపముతో (అనఁగా, ఎమ్బెరుమానార్లుగా) నవతరించి సమస్తచేతనులనున్ను గుంపులుగుంపులుగా పరమపదమునకుఁ గొనిపోవుచున్నానని యర్థము.

రంగపరచిరి. (ఇంతున్నట్లు పరసుఖాసహిష్ణుత్వరూపమహాగుణమే యిట్టి పరమరహస్యమును బహిరంగపరచుటకు కారణమని తేటపడుచున్నది)

అట్లుపదేశించిన మాత్రమేగాక యేతదధికారులెల్ల నీయర్థములను చక్కగానెఱింగి యుజ్జీవించవలయుననే పరమకృపతో శ్రీపిళ్లై లోకాచార్యులు స్వామివారు వీటిని సంగ్రహముగానున్న విస్తరముగానున్న అనేక ప్రబంధములయందు ప్రసాదించినారు. అందు ముముక్షుప్పడి, అనే యీ ప్రబంధము స్త్రీ బాలురకు సైతము సులభముగానుండునట్లు తేటమాటలతోఁ బ్రసాదించినారు. (ఎమ్బెరుమానార్ల కాలము మొదలు వెనుకటి యాచార్యులెల్ల నీపరమరహస్యార్థములను తమతమ శిష్యులకుపదేశించినదేగాక యనేక ప్రబంధములందున్న ప్రకాశపరచియున్నారు. 1పరసమృద్ధ్యేక ప్రయోజనులైన వీరి యుదార్యము నందఱు వహింపఁ దరముకాదు.)

ఉపోద్ఘాతము సంపూర్ణము.

1 [పరసమృద్ధ్యేక ప్రయోజనులు] చేతనులుజ్జీవించుట, వారు సర్వేశ్వరునికి మంగళాశాసనము చేయుట, ఈ రెండే ప్రయోజనముగానుండువారని భావము.

శ్రీమతే రామానుజాయ నమః.

శ్రీపిళ్లైలోకాచార్యర్ తిరువడికళే శరణమ్.

పెరియజీయర్ తిరువడికళే శరణమ్.



# శ్రీగీతోపనిషచ్చరమమ్.

శ్రీపిళ్లైలోకాచార్యర్ యరుళిచ్చెయ్త ముముక్షుప్పడి వ్యాఖ్యానసహితమ్.

శ్లో॥ సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ।
అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః ॥

ప్రతిపదార్థము॥ సర్వధర్మాన్ — మోక్షఫలసాధనము[illegible]
సకల[illegible]లను, పరిత్యజ్య — [illegible]వరల వాటి[illegible]

కుండునట్లు త్యజియించి, మాం - సర్వసులభుఁడైన నన్ను, ఏకం - ఒక్కనినే, శరణం - ఉపాయముగా, వ్రజ - ఆశ్రయించుము. అహం - నేను, త్వా - ఇట్లునడుచుచున్న నిన్ను, సర్వపాపేభ్యః - మోక్షప్రతిబంధకములైన పాపములన్నిఁటినుండి, మోక్షయిష్యామి - విడిపించుచున్నాను, మాశుచః - నీవు శోకింపకుము.

౧. కీఴ్ప్పిరిశలఉపాయవిశేషఙ్గళై యుపదేశిక్క అవై దుశ్శకఙ్గళెన్ఱుమ్ స్వరూపవిరోధికళెన్ఱుమ్ నినైత్తు శోకావిష్టనానవర్జుననై క్కుఱిత్తు అవనుడైయ శోకనివృత్త్యర్థమాక ఇని ఇతుక్కు వ్వారుకిల్లై యెన్నలామ్బడియాన చరమోపాయత్తై యరుళిచ్చెయ్‌కైయాలే చరమశ్లోకమెన్ఱు ఇతుక్కు ప్పేరాయిరుక్కిఱతు.

౨. ఇతిల్ పూర్వార్ధత్తాలే అధికారికృత్యత్తై అరుళిచ్చెయ్‌కిఱాన్;

౧. అవతారిక॥ ఈ చరమశ్లోకమునకుముందు కర్మజ్ఞానాదులైన కొన్ని 1యుపాయవిశేషముల నుపదేశింపనవి 2దుశ్శకములనియును 3స్వరూపవిరోధములనియును నెఱింగి యివియిట్లయిన వెనుక నిక భగవత్ప్రాప్తి లభించునదియేగాదని శోకాక్రాంతుఁడైన యర్జునునుద్దేశించి యాతనిశోకమునుఁబోగొట్టుటకై యిఁక దీనికి మించినది లేదనఁదగిన చరమోపాయము నుపదేశించుటవలన చరమశ్లోకమని దీనికి తిరునామము గలిగినది.

వాక్యార్థము॥ ఈ శ్లోకమునందు 4పూర్వార్థముచేత, అధికారి

---

[illegible]శేషములు] అనఁగా నెక్కువైన యుపాయములని యర్థము. [illegible]దనములగుటవల్ల నివి యెక్కువయగుచున్నవని భావము.

[illegible]] కాయక్లేశరూపములుగా నుండుటవల్లనున్ను, ఇంద్రియనిగ్రహా[illegible]వల్లనున్ను, సాధనముగాఁ బెద్దకాలము సాధించవలసియుండుటవల్లనున్ను, [illegible]భావము.

[illegible]] పరతంత్రవస్తువునకు స్వతంత్రకర్తృత్వము స్వరూపవిరుద్ధ[illegible].

[పూర్వార్ధము] శ్లోకమునందు మొదటిసగము.

ఉత్తరార్థత్తాలే ఉపాయకృత్యత్తై యరుళిచ్చెయ్ కిఱార్:

3. అధికారిక్కు కృత్యమావతు ఉపాయపరిగ్రహమ్.

4. అత్తై సాఙ్గమాక విధిక్కిఱార్.

కృత్యమునున్ను, 1ఉత్తరార్ధము చేత, 2ఉపాయకృత్యమునున్ను, (శ్రీకణ్ఠ వారు) ప్రసాదింపుచున్నారు.

3. అధికారికృత్యమనఁగా నధికారి చేయఁదగిన కార్యము, ఇచట నీశ్వరునిఁ దనకుపాయభూతుఁడుగాఁ బరిగ్రహించుటయే యధికారికృత్యమనఁబడును.

4. ఇది సాధనాంతర పరిత్యాగమనే యంగమును వదలియుండదు కాఁబట్టి యీయుపాయపరిగ్రహమును సాంగముగా (అనఁగా నుపాయాంతరపరిత్యాగమనే యంగముతోడ) విధించుచున్నారు. (3ప్రక్షాళ్యపాదావాచామేత్ 4స్నాత్వావిధివదర్చయేత్ । 5స్థిత్వార్ఘ్యంభానవేదద్యాత్ 6ధ్యాత్వాదేవంజపేన్మనుమ్) అని, ఆచమనము, అర్చనము, అర్ఘ్యప్రదానము, మన్త్రజపము, అనే వీటికంగములుగా విధింపఁబడిన, పాదప్రక్షాళనము, స్నానము, నిలఁబడియునికి, ధ్యానము, అనే యీనాలుగింటిని వదలి, అవి (అనఁగా, ఆచమనాదులు) అనుష్ఠించ

1 [ఉత్తరార్థము] శ్లోకమందు రెండవసగము.

2 [ఉపాయకృత్యము] ఉత్తరార్థవ్యాఖ్యానమందు (అహం) అనువప్పుడు వివరింపఁబడుచున్నది.

3 [ప్రక్షాళ్యపాదావాచామేత్] పాదప్రక్షాళనము చేసుకొని యాచమనము చేయవలసినది.

4 [స్నాత్వావిధివదర్చయేత్] అఘమర్షణసూక్తము మొదలగు మంత్రముల పఠించుచు స్నానముచేసి పిమ్మట యథావిధిగా తనయిష్టదైవము నారాధించవలసినది.

5 [స్థిత్వార్ఘ్యంభానవేదద్యాత్] నిలుచుండి సూర్యునికర్ఘ్యముసమర్పించవలసినది.

6 [ధ్యాత్వాదేవంజపేన్మనుం] మంత్రప్రతిపాద్యమైన దేవతను ముందుగా ధ్యానముచేసి పిమ్మట నామంత్రమును జపించవలసినది.

౫. రాగప్రాప్తమాన ఉపాయన్దానే వైధమానాల్ కదుకవరిగ్రహిక్కైక్కడలాయిరుక్కుమితే.

౬. ఇతిల్ పూర్వార్థమ్ ఆఋపదమ్.

---

గూడనిరీతిగా, ఇచ్చటనున్న «పరిత్యజ్య» అనే ల్యబంతపదముచేత, అంగముగాఁ జెప్పఁబడిన యుపాయాంతరత్యాగమును విడచి సిద్ధోపాయస్వీకారము గూడదనునర్థము సిద్ధమగుచున్నది. ఇందువల్ల, ఉపాయాంతరానుష్ఠానము దుష్కరమనితలఁచి వాటిని వదలితివేని నన్నా[illegible]ని, కొందఱుసెప్పునట్టి 1యనువాదపక్ష మయుక్తమని తెలియవలెను.

౫. ఉపాయాంతర పరిత్యాగము స్వీకారమున కంగమగుటంబట్టి విధిప్రాప్తమయితే స్వరూపానురూపమై సుకరమునైన యీస్వీకారమునకు శాస్త్రవిధియెందుకు? అనిన నుత్తరము సాయించుచున్నారు. «రాగప్రాప్తమాన» ఇత్యాదిగా. భోగ్యతవల్ల రాగప్రాప్తమయిన క్షీరమును పిత్తరోగమునకు మందుగానిమ్మని వైద్యశాస్త్రము విధించితే, అట్టివిధి, ఆక్షీరమును శీఘ్రముగా నంగీకరించుటకు హేతువగునట్టుగా, ఉపాయాంతరములకన్న దీనికిఁగల వైలక్షణ్యమునుఁబట్టి [illegible]రాగప్రాప్తమయిన యీప్రపత్త్యుపాయము, దీనిని స్వీకరిం[illegible]శాస్త్రములచే విధింపఁబడినదిన్ని అయితే, అట్టి శాస్త్రవిధి, [redacted] శీఘ్రముగా స్వీకరించుటకు హేతువగుచున్నదిగదా? [redacted]మునకుఁ దాత్పర్యము.

[redacted]రమశ్లోకమునకు వాక్యార్థమునుఁ బసాదించి తత్ప్రి

[redacted]

౭. (సర్వధర్మాన్)

౮. ఎల్లాధర్మజ్గళై యుమ్.

౯. ధర్మమావతు, ఫలసాధనమాయిరుక్కు మతు.

౧౦. ఇజ్గుచ్చొల్లుకిఱ ధర్మశబ్దమ్ దృష్టఫలసాధనజ్గళై చ్చొల్లుకైయ

సంగంబున నధికారి కృత్యమిట్టిదనియును, అది యుపాయాంతర పరిత్యాగరూపాంగమును విడచియుండదనియును, ఉపాయస్వీకారము రాగప్రాప్తమైనను దానికి విధి యావశ్యకమనియును, ప్రసాదించి, ఇఁక నీ శ్లోకమునకుఁ బ్రతిపదార్థముఁ బ్రసాదింపఁబూని యందు పూర్వార్థపద సంఖ్యను సాయించుచున్నారు. "ఇతిల్ పూర్వార్థమ్ ఆఱుపదమ్" అని. ఈశ్లోకపూర్వార్థము, ఆఱుపదములు గలిగియున్నదని యీసూత్రమున కర్థము.

౭, అందు, ప్రథమపదమును గ్రహించి యర్థముఁ బ్రసాదించుచున్నారు, "సర్వధర్మాన్" ఇత్యాదిగా.

౮. "సర్వధర్మాన్" అనఁగా సమస్తధర్మములనున్ను, అనియర్థము.

౯. ఇచ్చట, ధర్మశబ్ద మొకటి, అది బహువచనముగానుండుట యొకటి, సర్వశబ్ద మొకటి, ఇట్లు మూడువిధములుగానుండుటవల్ల నీమూటికిన్ని అర్థముఁ బ్రసాదించువారై, తొలుత, ధర్మమనఁగా నెట్టిది, అని, ధర్మశబ్దార్థమును సాయించుచున్నారు, "ధర్మమావతు" ఇత్యాదిగా. [1]ధర్మమనఁగా, సకలజనులకును తమతమ యపేక్షితములు లభించుటకై శ్రుతిస్మృత్యాదులందు విధింపఁబడియుండు సాధనములని యర్థము.

౧౦. ఈ ధర్మశబ్దము దృష్టఫలసాధనములనున్ను చూపించునదిగా

1 [ధర్మమ్] అనఁగా అదృష్టమైన దేవతద్వారా దృష్టాదృష్ట[illegible] [illegible] ఇంద్రియములవల్ల [illegible] [illegible] ఇది [illegible]

ష్టైక్కే మోక్షఫల సాధనఙ్గళైచ్చొల్లుకిఱతు.

౧౧. అవైతాన్ శ్రుతిస్మృతివిహితఙ్గళాయ్ పలవాయిరుక్కైయాలే బహువచనప్రయోగమ్ పణ్ణుకిఱతు.

---

నుండినను, మోక్షోపాయముల నుపదేశించునెడ నవిచేరవు కావున, మోక్షోపాయోపదేశ ప్రకరణమైన యిచ్చోటఁ జెప్పఁబడిన యీధర్మ శబ్దము, పశుపుత్ర గృహక్షేత్ర ధనధాన్యాది రూపముచేత నైహికముగానున్ను స్వర్గాదిరూపముచేత నాముష్మికముగానున్ను నుండునట్టి దృష్టఫలములకు సాధనములైన ధర్మములనుచూపింపక, భగవత్ప్రాప్తి రూప మోక్షఫలమునకే సాధనములుగా నుండునట్టి ధర్మములను చూపించుచున్నది, అని, “ధర్మమావతు” ఇత్యాది సూత్రమున కర్థము.

(ఇందువల్ల, ఐహికాముష్మికరూప సకలభోగములందునుఁ బరిపూర్ణవైరాగ్యముగలిగి మోక్షార్థముగా విచారపడునట్టి మహానుభావుఁడొక్కఁడే యిచట సాయించునట్టి త్యాగస్వీకారముల కర్హుఁడుగాని యితనికి క్రిందియంతస్తువారల కిచ్చట నధికారము లేదని భావము. ఈ యర్థమును “వ్యవసాయమిల్లాతవనుక్కు” ఇత్యాది సూత్రముచేత ముందు తామే ప్రసాదించబోవుచున్నారు. ఇంతటియోగ్యతచాలక పంచసంస్కారమాత్రముగలవారలు సైతము, ఇతర సంప్రదాయానుష్ఠానమందు దిగఁగూడదనే తిరువుళ్లముచేత శ్రీపాంచరాత్రాదులందు ప్రపన్నానుష్ఠానమును ప్రత్యేకముగా, అనగా నితర సంప్రదాయానుష్ఠానములకన్న నత్యంతవిలక్షణముగా సర్వేశ్వరుఁడు తానే ప్రసాదించియున్నాఁడు.)

ఇట్లు ధర్మశబ్దార్థశబ్దమునుఁ బ్రసాదించి యిఁక బహువచనార్థమును సాయించుచున్నారు, “అవై తాన్” ఇత్యాదిగా. అవియనుశ్రు

౧౨. అద్వైయావన, కర్మజ్ఞాన భక్తియోగజ్ఞళుమ్,

తిస్మృతులయందు అనేకములుగాఁ జెప్పఁబడియుండుటవల్ల "ధర్మాః" అని బహువచనప్రయోగము సేయఁబడినదని సూత్రార్థము.

౧౨. అట్టి ధర్మములలోఁ గొన్నిఁటిని యెత్తి చూపించుచున్నారు, "అద్వైయావన" ఇత్యాదిగా. "అద్వైయావన" అనఁగా, అవియేవియో యనిన, అనియర్థము. వాటిని తెలియఁజేయుచున్నారు. "కర్మజ్ఞాన భక్తియోగంగళుమ్" ఇత్యాదిగా. ఇందు కర్మజ్ఞానభక్తియోగము లనఁగా,1(కర్మణైవహిసంసిద్ధిమాస్థితాజనకాదయః) 2(తస్మాదసక్తస్సతతం కార్యంకర్మసమాచర) అని స్వతంత్రసాధనముగాఁ జెప్పఁబడిన

1 శ్రీ. భ. గీ. అధ్యా-3. శ్లో ౨౦ (కర్మణైవహిసంసిద్ధి మాస్థితాజనకాదయః। లోకసంగ్రహమేవాపి సంపశ్యన్ కర్తుమర్హసి॥) జనకాదయః-జనకచక్రవర్తి మొదలగు వారు, కర్మణా- ఏవ-కర్మముచేతనే, సంసిద్ధిమ్-మోక్షమును, ఆస్థితాః - హి-పొందిరి గదా, (తస్మాత్-కాఁబట్టి), త్వమ్-నీవు, లోకసంగ్రహమ్ - అపి-లోకములకు మంచి మార్గమునుఁ జూపుట యనుప్రయోజనము నైనను, సంపశ్యన్-లెస్సగాఁజూచినవాఁడవై (అనగా ఆలోచించినవాఁడవై) కర్తుమ్-ఏవ-కర్మము జేయుటకొఱకే,అర్హసి-తగుదువు. (కర్మణైవ అనుచోట-ఏవకారము జ్ఞానయోగ భక్తియోగములకు ప్రధానోపాయత్వము లేదని చూపుచున్నది. కర్మయోగమునకు జ్ఞానయోగము భక్తియోగము రెండున్ను ఉత్తరాఙ్గము.) జ్ఞానయోగము ప్రధానసాధనమైనపుడు కర్మయోగము పూర్వాంగమై, భక్తియోగము ఉత్తరాంగముగా నుండును. భక్తియోగము ప్రధానమైనపుడు కర్మ జ్ఞానములు రెండును పూర్వాంగములుగానుండును.

2 శ్రీ. భ. గీ. అధ్యా-3. శ్లో. ౧౯. (తస్మాదసక్తస్సతతం కార్యంకర్మసమాచర। అసక్తోహ్యాచరన్కర్మ పరమాప్నోతిపూరుషః॥) తస్మాత్ - ఆకారణమువలన, అసక్తః - సఙ్గ-ఫలాపేక్షలేనివాఁడవై, సతతమ్-ఎల్లప్పుడును, కార్యమ్-చేయఁదగిన, కర్మ-కర్మమును, సమాచర-చేయుము, హి-ఏలయనఁగా, పూరుషః-పురుషుఁడు, అసక్తః-సఙ్గ-ఫలాపేక్షలేనివాఁడగుచు, కర్మ-కర్మమును, ఆచరన్-చేయుచున్నవాఁడై, పరమ్-మోక్షమును, ఆప్నోతి-పొందుచున్నాఁడు.

కర్మయోగమున్ను; 1(సర్వంకర్మాఖిలంపార్థజ్ఞానేపరిసమాప్యతే)2(నహిజ్ఞానేనసదృశం పవిత్రమిహవిద్యతే) 3(జ్ఞానాగ్నిస్సర్వకర్మాణి భస్మసాత్కురుతేతథా) అని బాగడొందిన4కర్మసాధ్యమైన జ్ఞానయోగమున్ను, 5(భక్త్యాత్వనన్యయాశక్యః)6(మన్మనాభవమద్భక్తః) ఇత్యాదిగాఁ బ్రసాదింపఁబడిన కర్మజ్ఞానసహకృతభక్తియోగమున్ను, అనునవి.

---

1 శ్రీ.భ.గీ. అధ్యా-౪. శ్లో.33. (శ్రేయాన్ద్రవ్యమయాద్యజ్ఞాజ్జ్ఞానయజ్ఞః పరంతప। సర్వంకర్మాఖిలంపార్థ! జ్ఞానేపరిసమాప్యతే) హేపరంతప!-శత్రుభీకరుఁడగు నోయర్జునా! ద్రవ్యమయాత్-ద్రవ్యములచేఁ జేయఁబడు, యజ్ఞాత్ - యజ్ఞముకంటే, జ్ఞానయజ్ఞః-జ్ఞానయజ్ఞము, శ్రేయాన్-శ్రేయస్కరమైనది, హేపార్థ!-ఓయర్జునా! సర్వమ్-కర్మ-సమస్తకర్మము (అనఁగా పైఁజెప్పఁబడిన యజ్ఞకర్మమంతయు) అఖిలమ్-నిశ్శేషముగా, జ్ఞానే-ఆత్మజ్ఞానమునందు, పరిసమాప్యతే-ముగియుచున్నది) అనగా జ్ఞానోత్పత్తితో నంతమొందుచున్నదని భావము).

2 శ్రీ. భ. గీ. అధ్యా-౪. శ్లో. 3౮. (నహిజ్ఞానేనఇతి) ఇహ-ఈలోకమునందు, జ్ఞానేన-జ్ఞానముతోడ, సదృశమ్-సమానమైనదియు, పవిత్రమ్-పవిత్రమైనదియు, న-విద్యతే-హి-లేదుగదా?

3 శ్రీ. భ. గీ. అధ్యా-౪. శ్లో. 3౭. (జ్ఞానాగ్నిఇతి) తథా-ఆప్రకారముగానే, జ్ఞానాగ్నిః-జ్ఞానమనెడునగ్ని, సర్వకర్మాణి-సమస్తకర్మములను, భస్మసాత్కురుతే-భస్మముచేయుచున్నది (అనగా నశింపఁజేయుచున్నదని అర్థము). అగ్నియైనది సమిత్తులను భస్మముచేయురీతిగా జ్ఞానాగ్ని అయినది ప్రాప్తిప్రతిబంధకములగు సర్వసుకృత దుష్కృతములను భస్మముగాఁజేయుచున్నదని భావము.

4 కర్మసాధ్యమైన-కర్మాచరణమువల్లనే సాధింపతగినది.

5 శ్రీ. భ. గీ. అధ్యా-౧౧. శ్లో. ౫౪. (భక్త్యాత్వనన్యయాశక్య అహమేవం విధోర్జున! జ్ఞాతుంద్రష్టుంచతత్త్వేన ప్రవేష్టుంచపరంతప!) హేపరంతప-శత్రువులను తపింపఁజేయు, అర్జున!-అర్జునుఁడా! ఏవమ్-విధః-అహమ్-ఇట్టి విశ్వరూపమును ధరించిన నేను, అనన్యయా-భక్త్యా-తు-అచ్ఛపుభక్తిచేతనే, తత్త్వేన-యథార్థముగా, జ్ఞాతుమ్-ఎఱుఁగుటకును, ద్రష్టుమ్‌చ-దర్శించుటకును, ప్రవేష్టుమ్‌చ-పొందుటకును, శక్యః-శక్యుఁడను.

6 శ్రీ. భ. గీ. అధ్యా-౯. శ్లో. 3౪. (మన్మనాభవమద్భక్తో మద్యాజీమాంనమస్కురు। మామేవైష్యసియుక్త్వైవమాత్మానం మత్పరాయణః॥) మన్మనాః-నాయందు

## అవతారరహస్యజ్ఞానమ్, పురుషోత్తమవిద్యా,

అవతారరహస్య జ్ఞానమనఁగా 1(జన్మకర్మచమేదివ్య మేవంయో వేత్తితత్త్వతః । త్యక్త్వాదేహంపునర్జన్మ నైతిమామేతిసోర్జున) అని, విరోధినివృత్తి పూర్వకముగా భగవత్ప్రాప్తి గలుగఁజేయుటకు సాధనమని ప్రసాదింపఁబడిన భగవదవతారచేష్టిత తాత్పర్యజ్ఞానము.

2పురుషోత్తమవిద్య యనఁగా (ఏతద్బుద్ధ్వాబుద్ధిమాన్‌స్యాత్ కృతకృత్యశ్చభారత) అని, అభిమతఫలప్రదానముచేత (దీనినెఱింగినట్టి యధికారిని) కృతకృత్యునిఁగాఁ జేయునని ప్రసాదింపఁబడిన భగవత్సర్వోత్కర్షజ్ఞానము.

న మనస్సుగలవాఁడవును, మద్భక్తః-నాయందు భక్తిగలవాఁడవును, మద్యాజీ-నన్నారాధించెడు వాఁడవును, భవ-అగుము, మామ్-నన్ను, నమస్కురు-నమస్కరింపుము, ఏవమ్-ఈవిధముగా, ఆత్మానమ్-మనస్సును, యుక్త్వా-నాయందుఁజేర్చి, మత్పరాయణః-సర్వ-నన్నే పరమప్రాప్యముగ నెంచినవాఁడవగుచు, మామ్-ఏవ-నన్నే, ఏష్యసి-పొందఁగలవు.

I శ్రీ. భ. గీ. అధ్యా-౪. శ్లో. ౯. [జన్మకర్మచేతి] హేఅర్జున! ఓయర్జునుడా! యః-ఎవ్వడు, ఏవమ్-ఇట్లు (అనఁగా నింతకుముందు ౭-౮ శ్లోకములలోఁ జెప్పిన ప్రకారముగా), మే-నాయొక్క, దివ్యమ్-అప్రాకృతమైన, జన్మ-అవతారమును, కర్మ-చ-అమానుషచేష్టితములను, తత్త్వతః-యథార్థముగా, వేత్తి-ఎఱుఁగుచున్నాఁడో, సః-వాఁడు, దేహమ్-శరీరమును, త్యక్త్వా-విడిచి, పునః-మరల, జన్మ-పుట్టుకను, న-ఏతి-పొందడు, మామ్-నన్ను, ఏతి-పొందుచున్నాఁడు.

(దీనివల్ల భగవదవతారములు కర్మనిబంధనము కావనిన్ని (అప్రాకృతములనిన్ని) వానికార్యములు అమానుషము లనిన్ని, లోకులకు ధర్మాచరణపద్ధతులను గఱపి తద్వారా ధర్మసంస్థాపనము చేయుటకొఱకు ఇచ్ఛచే అవతరించినవాఁడని యెవ్వఁడు దెలిసికొనఁగలఁడో వాఁడు పునర్జన్మములేని మోక్షమును పొందుచున్నాఁడని భావము.

2 [పురుషోత్తముఁడు] క్షరమ్ అనఁగా ప్రకృతివశ్యుఁడైన సంసారి, అక్షరమ్ అనఁగా ప్రకృతికష్టములను వదలిన ముక్తాత్మ, పురుషశబ్దవాచ్యుఁడు నిత్యుఁడు, వైముగ్ధ్యకి పైఁబడిన ఉత్తమపురుష శబ్దవాచ్యుఁడైనవాఁడు పురుషోత్తముఁడు (ఈశ్వరుడు). (శ్రీ.భ.గీ. అధ్యా-౧౫. శ్లో. ౧౬ భాష్యం.) శ్రీ. భ. గీ. అధ్యా-౧౫. శ్లో. ౨౦ (ఇతి

దేశవాసమ్, తిరునామసంకీర్తనమ్,

---

దేశవాసమనఁగా1(దేశోయంసర్వకామధుక్) అని, సర్వాభీష్టప్రదముగాఁ బొగడొందిన పుణ్యక్షేత్రవాసము.

తిరునామసంకీర్తనమనఁగా2"సర్వపాపవిశుద్ధాత్మా యాతిబ్రహ్మసనాతనమ్" అని, సమస్తపాపవిమోచనపూర్వకమైన భగవత్ప్రాప్తినిఁ గలుగఁజేయునట్టి తన్నామకీర్తనము.

---

గుహ్యతమంశాస్త్రమిదముక్తంమయానఘ। ఏతద్బుద్ధ్వాబుద్ధిమాన్ స్యాత్కృతకృత్యశ్చ భారత) అనఘ-పాపరహితుఁడవగు సోయర్జునా, ఇతి-ఇట్లని, గుహ్యతమమ్-అతిరహస్యమైన, ఇదమ్-శాస్త్రమ్-ఈశాస్త్రము, మయా-ఉక్తమ్-నాచేఁజెప్పఁబడినది, హేభారత-ఓయిఅర్జునా, ఏతత్-దీనిని, బుద్ధ్వా-ఎఱిఁగి, బుద్ధిమాన్-(మనుష్యుఁడు) జ్ఞానవంతుడగును, కృతకృత్యః-చ-మోక్షార్థముగా చేయవలసిన యావత్కార్యములు చేసినవాఁడు, స్యాత్-అగును.

1 గారుడ. శ్రీరంగమా. ౧౦. [దేశోయంసర్వకామధుక్] (ఐశ్వర్యకైవల్య భగవత్ప్రాప్తిరూప) సర్వాభీష్టప్రదమని అర్థము. సర్వాభీష్టప్రదము అనుశబ్దములో మోక్షమున్ను అంతర్గతము, మోక్షసాధనమని తాత్పర్యము.

గారుడేపురాణే (భద్రంభద్రప్రదంపుణ్యం తీర్థానాముత్తమంవిదుః। పవిత్రంపరమంపుణ్యం దేశోయంసర్వకామధుక్) భద్రం-క్షేమముగాను, భద్రప్రదం-క్షేమమును కలుగజేయునదిగాను, పుణ్యం-పవిత్రమైనదిగాను (ఉన్నది గనుక), తీర్థానాం-సకలతీర్థములలో, ఉత్తమం-శ్రేష్ఠమైనదిగా, విదుః-తెలిసికొనుచున్నారు. సర్వకామధుక్-సకలమైన కోరికలను, పిండుచున్నదైన (కలుగజేయుచున్నదియైన) అయం-ఈ, దేశః-దివ్యదేశమును, పవిత్రం-పావనమై, పరమం-అతిశ్రేష్ఠమై, పుణ్యం-క్షేమకరమైనదిగా (ఎఱుగుచున్నారు.)

2 మహాభారతే సహస్రనామాధ్యాయే [స్తువన్నామసహస్రేణ నిత్యంభక్తిసమన్వితః। వాసుదేవాశ్రయోమర్త్యో వాసుదేవపరాయణః। సర్వపాపవిశుద్ధాత్మా యాతిబ్రహ్మసనాతనమ్ ॥] వాసుదేవాశ్రయః-వాసుదేవ-శ్రీకృష్ణుని, ఆశ్రయః-ఆశ్రయించువాడును, వాసుదేవపరాయణః-వాసుదేవ-శ్రీకృష్ణుఁడే, పరాయణః-శ్రేష్ఠమైనగతిఁగాఁగలవాఁడును, నిత్యం-ఎల్లపుడు, భక్తిసమన్వితః-శ్రీకృష్ణునియందు భక్తియుక్తుఁడునగు, యః-

తిరువిళక్కేరిక్కై, తిరుమాలై యెడుక్కై-తుడక్కమాన ఉపాయబుధ్యాచ్ఛేయ్యుమవై యుమ్.

„తిరువిళక్కేరిక్కై” అనఁగా 1(ఘృతేనవాథ తైలేన దీపంయో జ్వాలయేన్నరః। విష్ణవేవిధివద్భక్త్యా తస్యపుణ్యఫలంశృణు। విహాయ సకలంపాపం సహస్రాదిత్యసన్నిభః। జ్యోతిష్మతావిమానేన విష్ణులోకేమహీయతే) అని, పాపనివృత్తిపూర్వక భగవత్ప్రాప్తికి సాధనముగా విధింపఁబడిన శ్రీదీపారోపణకైంకర్యము.

„తిరుమాలై యెడుక్కై” అనఁగా, పూర్వోక్తప్రకారముగా విరోధినివృత్తిపూర్వక భగవత్ప్రాప్తికి సాధనముగా విధింపఁబడిన శ్రీపుష్పమాలాబంధన కైంకర్యము.

అని యిట్లు మోక్షఫలసాధనములైన కొన్నిధర్మములను చూపించి, యివి మొదలగునవి, అని నిగమించి, ఇఁక వీనినిఁ బరిత్యజించుటకు కారణమును బయలుపరచుచున్నారు, „ఉపాయబుద్ధ్యా శెయ్యుమవై యుమ్” అని. ఉపాయబుద్ధితో ననుష్ఠించునవియును, అని యీవాక్యమున కర్థము. ఇచట, అనుష్ఠించు (నవియును,) అని సముచ్చయ

ఏ, మర్త్యః-మనుష్యుఁడు, నామసహస్రేణ-శెయ్యతిరునామములతో, స్తువన్-స్తోత్రముఁ జేయుచున్నాఁడో, సః-అట్టివాఁడు, సర్వపాపవిశుద్ధాత్మా-సమస్తములైన పాపములనుండి పరిశుద్ధమైన మనస్సుగలవాఁడై, సనాతనం-పురాతనమైన, బ్రహ్మ-బ్రహ్మమును, యాతి-పొందుచున్నాఁడు.

1 నారసింహపు. 3-3౨౭. [ఘృతేనవాథేతి] ఘృతేనవా-నేతితోనైనను, అథ-పిమ్మట, తైలేనవా-నూనెతోనైనను, దీపం-దీపమును, యః-ఏ, నరః-మనుజుఁడు, విష్ణవే-విష్ణువుకొఱకు, విధివత్-శాస్త్రప్రకారము, భక్త్యా-భక్తితో, జ్వాలయేత్-వెలిగించునో, తస్య-వానియొక్క, పుణ్యఫలం-మంచిఫలమును, శృణు-వినుము; సకల-సమస్తమైన, పాపం-పాపములను, విహాయ-విడిచి, సహస్రాదిత్యసన్నిభః-వేయిసూర్యులతో సమానుఁడై, జ్యోతిష్మతా-ప్రకాశముగల, విమానేన-విమానముతో, (పోయి), విష్ణులోకే-శ్రీవైకుంఠమునందు, మహీయతే-పూజింపఁబడుచున్నాఁడు.

ముగాఁ బ్రసాదించుటచేత, కర్మజ్ఞానభక్తులవలె నవతారరహస్య జ్ఞానాదులున్ను స్వతంత్రోపాయము లగుచున్నవని యేర్పడుచున్నవి. అవతారరహస్యజ్ఞానాదులు కర్మజ్ఞానభక్తియోగములకు అంగములుగా నుండుటయేగాక స్వయం స్వతంత్రోపాయములుగానున్ను, అగుచున్నవి. అయితే ఇందు కర్మజ్ఞానభక్తియోగము లధికృతాధికారములనియును, అవతారరహస్య జ్ఞానాదులు సర్వాధికారములనియును భేదమును గ్రహించవలయును. పురుషోత్తమవిద్య మాత్రము కర్మజ్ఞానభక్తులవలె నధికృతాధికారమేగాని సర్వాధికారముగాదు. అయినను కర్మజ్ఞాన భక్తియోగముల కిది యంగముగానుండుటంబట్టి యవతారరహస్యజ్ఞానాదులతోడఁ జేర్చియున్నారు.

(శ్రీవిష్ణుధర్మమునందు లలితాచరితములో ఈవిషయము విస్తారముగా సాయించబడియున్నది. ఇచ్చట సంగ్రహముగా చూపింపబడును. విదర్భరాజు కొమార్తెయును కాశిరాజు మహిషియునైనలలిత, సపత్నులైన మున్నూరుస్త్రీలలో, దేహకాంతివలనను, సర్వగుణ సంపత్తివలనను, అభిరూప్యమువలనను భర్తృవశ్యత పొందినదై, అహోరాత్రములున్ను భగవత్సన్నిధిలో అనేక దీపారోపణ కైంకర్యములో నిరంతర ప్రవృత్తిగలదై యుండుటఁజూచి, నీకు ఇట్టి అభిరూప్యాదులకున్ను దీపారోపణకైంకర్యాసక్తికిన్ని కారణమేమని సపత్నులడుగ, ఆమె పూర్వజన్మజ్ఞానముతో జన్మించియుండినందున, తన పూర్వజన్మయాదృచ్ఛిక సుకృతమును వివరింపబూనుకొనెను. సౌవీరరాజపట్టణములో మైత్రేయుఁడను బ్రాహ్మణోత్తముఁడుండెను. అతఁడు గంగాతీరములో నొక పెరుమాళ్లకోవెలను నిర్మించి ప్రతిదినమును సకలవిధ కైంకర్యములను జరిపించుచుండెను. ఆకాలమునందు నేనాసన్నిధిలో ఆడయెలుకగా వర్తించుచుంటిని. ఒక కార్తికమాసములో ఆబ్రాహ్మణుఁడు పెరుమాళ్లసన్నిధిలో వెలిగించియుండిన దీపము ఆరిపోవు సమయముగా నుండినందున, ఆదీపములోనుండిన వత్తిని కవ్వుకొనిపోదలచి యెలుకగా నుండిన నేనువత్తినిసమీపించి కవ్వినసమయమున, ఒకపిల్లికూతవిని మరణభయముఁజెంది ఆభయమువల్ల వణకిన నామూతివల్ల, ఆవత్తియెగదోయఁబడి పూర్వమువలెనే పళపళయని ప్రకాశించెను. అందువల్ల నేను విదర్భరాజునకు పుత్రినై జన్మించి నాయొక్క అజ్ఞాతసుకృతఫలముగా నాకు ఈ ఉత్కృష్టములు కలిగెనని చెప్పెను.)

౧౩. సర్వశబ్దత్తాలే అవ్వోసాధనవిశేషఙ్గళై యనుష్ఠిక్కుమిడత్తిల్ అవఱ్ఱుక్కు యోగ్యతాపాదకఙ్గళాన నిత్యకర్మఙ్గళై చ్చొల్లుకిఱతు.

౧౪. ఆక, శ్రుతిస్మృతి చోదితఙ్గళాయ్ నిత్యనైమిత్తికాదిరూపఙ్గళాన కర్మయోగాద్యుపాయఙ్గళెన్నపడి.

౧౩. ఇట్లు ధర్మశబ్ద బహువచనార్థమును వ్రాయించి యిఁక సర్వశబ్దార్థమునుఁ బ్రసాదించుచున్నారు. ‹‹సర్వశబ్దత్తాలే” ఇత్యాదిగా. అనఁగా ధర్మశబ్దవిశేషణమైన సర్వశబ్దమువల్ల, ‹‹ధర్మాన్” అను పదాంతమందున్న బహువచనముచే చెప్పఁబడిన ఆయా కర్మజ్ఞానభక్తులనే సాధనాంతరములను ఆచరించు సమయమున1‹‹సన్ధ్యాహీనోశుచిర్నిత్యమనర్హస్సర్వకర్మసు” అనునట్లు వర్ణాశ్రమములకు విధించబడిన సంధ్యావందనాది నిత్యకర్మానుష్ఠానములు లేనివాఁడెప్పుడు పరిశుద్ధుఁడుకాఁడు గనుక అన్ని సాధనానుష్ఠానములకు అనర్హుఁడు కాఁబట్టి అట్టి అనర్హత్వము కలుఁగక వానినాచరించుటవల్లకర్మజ్ఞానభక్తులనెడు సాధనాంతరములను చేయుటకు యోగ్యతను కలుఁగఁజేయు సంధ్యావందనము, బ్రహ్మయజ్ఞము మొదలగు 2పంచమహాయజ్ఞములైన నిత్యకర్మములను చెప్పుచున్నదని అర్థము.

౧౪. ‹‹సర్వధర్మాన్” అను పదమునకు లోఁగడ వ్రాయించిన అర్థములను చేర్చి వ్రాయించుచున్నారు, ‹‹ఆక” ఇత్యాదిగా. పై జెప్పిన అన్ని అర్థముల చేతను‹‹చోదనాలక్షణోఽర్థోధర్మః”అని ప్రవృత్తములైన విధి

1 దక్షస్మృతి. [సన్ధ్యాహీనేతి] నిత్యానుష్ఠానరూపములైన సంధ్యావందనాదులు చేయనివారు యావత్కర్మానుష్ఠానములకు అర్హులు కారని భావము. (అనఁగా వాని వాని స్వవర్ణోచిత నిత్యకర్మలు చేయనివాఁడు సాధనానుష్ఠానమునకు అర్హుఁడు కాఁడని తాత్పర్యము).

2 పంచమహాయజ్ఞములనఁగా గృహస్థుఁడు చేయవలసిన ఐదువిధములైన నిత్యకర్మములు:— దేవతర్పణము, ఋషితర్పణము, భూతతర్పణము, పితృతర్పణము, అతిథితర్పణము.

౧౫. ఇవఱ్ఱైధర్మమెన్ఱిఅతు భ్రమిత్తవర్జునన్ కరుత్తాలే.

వాక్యములను ప్రమాణముగాఁగల అర్థము. ధర్మమనుటచేత శ్రుతిస్మృతులనెడు ప్రమాణములచేతను విధింపబడ్డవై నిత్యనైమిత్తికాది కర్మములను అంగముగాఁగల కర్మయోగము మొదలయిన ఉపాయములని అర్థము సాయించుచున్నారు.

(ఇందువల్ల అనిష్టనివారణమునకును, ఇష్ట అపేక్షితములను పొందుటకును సాధనములుగా నుండునవియును, అట్టి సాధనములకు అఙ్గములుగాను, వానిని ఆచారించుటకు యోగ్యతను కలుగఁజేయునవియై, శ్రుతిస్మృతులవల్ల నియమింపబడిన ప్రవృత్తిరూప ధర్మములు "సర్వధర్మాన్" అనుశబ్దమువల్ల ప్రతిపాదితములని అర్థము.)

౧౬. శేషత్వ పారతంత్ర్యస్వరూపమునకు విరోధములయిన ఉపాయాంతరములను ధర్మశబ్దవాచ్యముగా సాయించుటకు హేతువును ఆనతిచ్చుచున్నారు "ఇవఱ్ఱై" ఇత్యాది సూత్రమువల్ల. భగవంతునికి 1అచిత్తువలె అత్యంత పరతంత్రమైన ఆత్మస్వరూపమునకు విరోధియై, అధర్మశబ్దముచేత చెప్పదగినవైయున్న ఈకర్మయోగాదులను (క్షత్రియుఁడైన తనకు ధర్మమైన యుద్ధమును పాపమనిన్ని, కర్మజ్ఞానాదులు మోక్షసాధనములనిన్ని భ్రమించిన) అర్జునుని అభిప్రాయముచేత ధర్మమని సాయించుచున్నారని యీసూత్రార్థము.

---

1 అచిత్తువలె అత్యంతపరతంత్రమనఁగా అచిత్తువలె స్వరూప, ఉపాయపురుషార్థములలో మమకారనివృత్తి కలిగియుండుట. ఐశ్వర్యకైవల్యార్థులు స్వరూప–ఉపాయ–పురుషార్థములలో మమకారముతో కూడియుందురు, భగవత్ప్రాప్తికాములలో ఉపాసకులు–స్వరూపములో నివృత్తమమకారులై ఉపాయ పురుషార్థములలో మమకారముతోకూడియుందురు; శరణాగతినిష్ఠులు–స్వరూప ఉపాయములలో నివృత్తమమకారులై–పురుషార్థములో మమకారముతో కూడియుందురు; సిద్ధసాధననిష్ఠులు స్వరూప, ఉపాయ పురుషార్థములు మూటిలోనున్న మమకారనివృత్తులై యుందురు. ఇట్లుండుట అచిద్వత్పారతంత్ర్య స్వరూపాకారము అని భావము.

౧౬. (పరిత్యజ్య).

౧౭. త్యాగమావతు,ఉక్తోపాయఙ్గళై యనుసంధిత్తు,శుక్తికైయిలే రజతబుద్ధి పణ్ణువారైప్పోలేయుమ్, విపరీతదిశాగమనమ్ పణ్ణువారైప్పోలేయుమ్, అనుపాయఙ్గళిలే ఉపాయబుద్ధిపణ్ణినోమెన్గిఱ బుద్ధివిశేషత్తోడేత్యజిక్కై.

---

౧౬. ఇట్లు ‘‘సర్వధర్మాన్’’ అను ప్రథమపదమువల్ల ధర్మశబ్దప్రయోగమునకు కారణమునున్ను, దానివల్ల కలిగిన (ఇష్టప్రాప్తి, అనిష్టనివారణ)సాధనత్వమున్ను, అట్టి సాధనానుష్ఠానమునకుఁగల అంగములనున్ను, సాధనానుష్ఠానము చేయుటకు యోగ్యత కలుగఁజేయువాటినిన్ని సాయించి ముగించి ద్వితీయపదముయొక్క అర్థమును సాయించుచున్నారు ‘‘పరిత్యజ్య’’ అని. పరిత్యజ్య అనఁగా, పూర్తిగావదలి, అని పదముయొక్క అర్థము.

౧౭. ఈ ‘‘పరిత్యజ్య’’ అనుశబ్దము ‘‘త్యజ్’’ అనే ధాతువువల్ల త్యాగమునున్ను ‘‘య’’ (ల్యప్) అనే ప్రత్యయమున్ను, ‘‘పరి’’ అనే ఉపసర్గయున్ను చేరి మూడువిధములుగా నుండుటచేతను ఆమూడింటిలో త్యాగప్రకారమును ముందుగా ఆనతిచ్చుచున్నారు ‘‘త్యాగమావదు’’ ఇత్యాది వాక్యముచే. ఈశ్లోకమున త్యాగమనఁగా పూర్తిగా అనుష్ఠించక విడుచుటకాదు. ముందు అధ్యాయములయందు చెప్పబడ్డ కర్మయోగాది సాధనములయొక్క స్వభావములను1(చేతనసాధ్యత్వ, అజ్ఞత్వ, అశక్తత్వ, ఈశ్వరసాపేక్షత్వము మొదలైనవాటితో కూడియుండునవి అని) లెస్సఁగా తెలుసుకొని, వాస్తవ్యముగా వెండికాని

---

1 [చేతనసాధ్యత్వేతి] కర్మాద్యుపాయాంతరములు చేతనునివల్ల సాధించబడవలసియుండుటవల్లనున్ను, అవి జ్ఞానములేనివిగానున్ను, వాటికి ఫలప్రదత్వమునందు శక్తిలేకుండుటవల్లనున్ను, ఫలప్రదత్వమునకు ఈశ్వరుని అపేక్షించియుండునని భావము.

౧౮. (పరి)యొన్నిఱ ఉపసర్గత్తాలే పాతకాదికళై విడుమాప్పోలే రుచివాసనైకళోడుమ్ లజ్జైయోడుమ్ కూడ మఱువలిడాతపడి విడవేణు మెన్నిఱతు.

ముత్యపుచిప్పయందు వెండిఅనే ప్రతిపత్తినిచేయువానింబోలెయు,స్వకార్యసిద్ధికి నుపయుక్తముగా నొకదిక్కునుగురించి పోవుటకు యత్నించి, ఆదిక్కుకు విరోధమైన దిక్కును తాను వెళ్లదలంచిన దిక్కుగా భావించి నడిచే వానిరీతిగను, భగవల్లాభమునకు ఉపాయమందు అపేక్షగల మనము అట్టి భగవత్ప్రాప్తికి సాధనముకాని కర్మాద్యుపాయాదుల యందు భగవత్ప్రాప్తికి సాధనములనే ప్రతిపత్తి చేసితిమి అనే బుద్ధి విశేషముతోకూడినవారై, ఉపాయముకాదని విడువవలెనని అర్థము. (ముత్యపుచిప్పయందు వెండిఅనే బుద్ధిని దృష్టాంతముగా చెప్పినందున ఉపాయాంతరములందు అనుపాయత్వమున్ను; తానే వెళ్లదలచినదిక్కుకు విరుద్ధమైన దిక్కును తానుపోవ నుద్దేశించినదిక్కుగా భావించడమనే దృష్టాంతమువల్ల[1]విరుద్ధఫలమున్ను, ఉపాయాంతరములందు ఉపాయత్వ ప్రతిపత్తి భ్రాన్తిని కలుగఁజేయునని సూచింపఁబడుచున్నది.)

౧౯. త్యాగశబ్దార్థమును సాయించిన తరువాత ఉపసర్గార్థమును సాయించుచున్నారు 'పరి' అని ప్రారంభించి. [2]'పరి' అనేఉపసర్గ (సాకల్యే) "అన్ని" అనే అర్థవాచకముగా గ్రహించినయడల ఆయర్థము సర్వశబ్దమువల్ల చెప్పఁబడినదగుటచేత అపేక్షించవలసినదిగా నుండదు. కాఁబట్టి 'అధికము' అనే అర్థమునకు వాచకమైన 'పరి' అను ఉపసర్గచేత "బ్రహ్మహత్యాసురాపానం స్తేయంగుర్వఙ్గనాగమః" (బ్రహ్మహత్య, సురాపానము, దొంగతనము, గురుపత్నీసంగమము) అనే పాతకములు మొదలైనవాటిని విడిచేసమయమున ఆమహాపాతకములను మరల

1 విరుద్ధఫలం - సంసారం.

2 పరి-సాకల్యే, సాకల్యమనఁగా 'అన్ని' అని అర్థము.

౧౯. ల్యప్పాలే, "స్నాత్వాభుఞ్జీత" ఎన్నుమాప్పోలే, ఉపాయా న్తరఙ్గళై విట్టేపణ్ణ వేణుమెన్గిఱతు.

---

చేయుటకు దగియుండెడు రుచివాసనల-నయ్యో వీనిజేసితిమే యనెడు సిగ్గుతోఁగూడ విడిచినట్లు 1(అథపాతకభీత స్త్వమ్)అనిధర్మదేవత ఉపాయాంతరములను పాపములనిన్ని వాటివల్లనీవు భయముఁజెందినవాడవ నిన్ని ధర్మపుత్రునిఁజూచి పాతకములనిచెప్పిన కర్మాద్యుపాయాంతరములను వదలు మార్గమును వివరించి చూపుచున్నారు. బుద్ధిపూర్వకముగ ఆపాపములందుఁ బ్రవర్తించుటకుండెడు రుచితోడను, అబుద్ధిపూర్వకముగ నందుఁద్రోసెడు వాసనతోడనుగూడ భగవదేకసాధన త్రైకవేషమైన స్వస్వరూపమునకు అత్యంతవిరుద్ధమైన దాని చేసితిమనెడు లజ్జాసహితముగ మఱల వానియం దన్వయము లేకుండవిడుచు విడుపును సెప్పుచున్నదని యీసూత్రార్థము. (ఇందువల్ల భగవల్లాభమునకు సాధనముగాని కర్మజ్ఞానాదులను సాధనమని భ్రమించి అనుష్ఠించుట కూడదని భావము.)

౧౯. త్యాగశబ్దార్థమునున్ను, "పరి" అను ఉపసర్గార్థమునున్ను సాయించి ముగించి త్యజ్యయను త్యాగశబ్దాంతమందు ప్రయోగింపబడియుండు (ల్యప్) "య" అను ప్రత్యయమునకు అర్థము సాయించుచున్నారు "ల్యప్పాలే" యిత్యాదిగా. ల్యప్ అను ప్రత్యయముచేత 2(స్నాత్వాభుఞ్జీత) అనిచెప్పినట్లు స్నానముచేసియే భుజించవలయునని

---

1 విష్ణుధ. ౬౬_౭౧. (అథపాతకభీత స్త్వం సర్వభావేనభారత। విముక్తాఽన్య సమారమ్భో నారాయణపరో భవ॥) హేభారత! ఓఅర్జునా! అథ_ఇకను అనఁగా క్రింది అధ్యాయములలో చెప్పబడిన స్వాతంత్ర్యనివృత్తి అయినతరువాత, పాతకభీత స్త్వం_పాపశబ్దవాచ్యములైన సాధనాంతరములకు భయపడిన నీవు, సర్వభావేన_అన్ని ప్రకారముల చేతను, విముక్తాన్యసమారంభః_ఇతరప్రయత్నములను సవాసనగావదలినవాడవై, నారాయణపరః_శ్రీమన్నారాయణుఁడే ఉపాయభూతుడని నమ్మకముగలవాడవై,భవ_అగుము.

2 భార. అ. వైష్ణవధర్మ. ౯౭_౧౪.

౨౦. ‘‘చచాలచాపంచ ముమోచవీరః” ఎన్నిఋపడియే, ఇవైయ
నుపాయజ్ఞళాన మాత్రమన్నిక్కే, కాఱ్కట్టైన్నిఋతు.

యుంతు విధివలె సిద్ధోపాయమును పరిగ్రహించునపుడు త్యాజ్యమయి
న యుపాయాంతరములను సవాసనగా త్యజించియే పరిగ్రహించ
వలయునని యీసూత్రార్థము. (ఇందువలన ఉపాయాంతర పరిత్యాగ
ము సిద్ధోపాయస్వీకారమున కంగమనుట వ్యక్తంబగుచున్నది). ఈ
‘‘ల్యప్” ప్రత్యయముచే (భుక్త్వాచాంద్రాయణంచరేత్) శూద్రాన్న
మును భుజించినట్టయితే చాంద్రాయణమనే ప్రాయశ్చిత్తము చేసు
కోవలసినదని చెప్పినట్లు, సాధనాంతరములను వదలినవాడవైతే నన్ను
పరిగ్రహింపుము అని ఈశ్వరాభిప్రాయమని చెప్పెడి అనువాదపక్షమును
అవలంబించక, ‘‘స్నాత్వాభుఞ్జీత” స్నానముచేసే భుజించవలయునను
నియమమును విధించుచున్నది. అనగా, సిద్ధోపాయమైన ఎంబెరుమాను
ని మోక్షోపాయముగా పరిగ్రహించునపుడు, త్యాజ్యములైన యుపా
యాంతరములను విడిచియే పరిగ్రహించవలయుననే నిర్బంధమును
చెప్పుచున్నదని తాత్పర్యము. అనువాదపక్షములో యీనియమము
కూడదని యభిప్రాయము.

౨౦. ఈప్రకారము యుపాయాంతరములను విడిచియే సిద్ధోపాయ
స్వీకారమును చేయవలయుననే నియమమును ఇతిహాసముఖముగా
స్థిరపరచుచున్నారు ‘‘చచాల” యిత్యాదిగా. అనగా 1(యోవజ్రపా
తాఽశనిసన్నిపాతాన్న చుక్షుభేనాఽపిచచాలరాజా।సరామబాణాఽభి

1 రా.యు. ౫౯-౧౪౧, (యోవజ్రపాతా ఇతి); యః - ఏరావణుండైతే, వజ్ర
పాతాశని సన్నిపాతా, వజ్రపాతా - వజ్రాయుధమువల్ల కొట్టబడుటచేతను, అశని-
పిడుగు, సన్నిపాతాత్-పడుటచేతను, నచుక్షుభే - కలతచెందలేదో, ।అపిచ-ఇంకను,
నచచాల - చలించలేదో, స - ఆ, రాజా - రాజైనవాడును, వీరః - వీరుడైన
వాడునైన రావణుడు, రామబాణాభిహతః - రామ - శ్రీరాములయొక్క, బాణ -

౨౧. చక్రవర్తియైపోవలే ఇత్యాకైకేయిక్కుఉప్పు.

హతోభృశార్తశ్చచాలచాపఞ్చముమోచవీరః॥) అను శ్లోకార్థమందు రావణుఁడు రామబాణములచేత మిక్కిలి శిథిలుఁడై, నిలుకడదప్పి, పోదలచిన సమయమందు, అవశముగా తనచేతనుండి పోయినధనుః ఖండము పారవేయువరకు రామబాణములు విడువకబోయినదేగాక, ఆధనుస్సు తనచేతిలోనున్నపుడు శత్రుజయమునకు సాధనము కాక పోయినప్పటికిన్ని 1(గచ్ఛానుజానామి) ఓరావణా! యింటికివెళ్ళుము అనుజ్ఞనిచ్చితినని ధనుస్సును క్రిందపడవేసిన తరువాత పెరుమాళ్లుచేసిన అనుమతిదానము ధనుస్సు చేతలోనుండువరకు చేయనందున, పోవుటకు వీలులేక ప్రతిబంధకమైనటువలె, యుపాయాంతరములైన కర్మయోగాదులందు 2స్వల్పసంబంధముండినను, భగవల్లాభమనే పురుషార్థమునకు సాధనము కాకపోవడము మాత్రమేగాక, పురుషార్థమునకు ప్రతిబంధకమైయుండునని తాత్పర్యము. (ఇందువల్ల సర్వధర్మములను సవాసనగావిడిచియే శరణాగతి చేయవలయుననుట.)

౨౧. మఱియు ఈసాధనాంతరములయందు అనుష్ఠానరూపసంబంధము భగవంతుని ప్రాప్తించకపోవుటకు, హేతువగునని సదృష్టాంతముగా సాధించుచున్నారు, „చక్రవర్తియైపోవలే” ఇత్యాదిగా. అనఁగా కైకేయికి, పూర్వము తాను యిచ్చియుండిన వరమును అపేక్షించినపుఁడు నిరాకరించకూడదని ఆభాసమైన అనఁగా ధర్మమువలె భ్రమింపఁబడిన సత్యధర్మమును అవలంబించి3„రామోవిగ్రహవాన్ధర్మః” (ధర్మమే విగ్ర

బాణములచేత, అభిహతః - కొట్టబడినవాఁడై, భృశార్తః - మిక్కిలి శ్రమచెందినవాఁడై, చచాల - చలించెను, చాపంచ - వింటినిన్ని, ముమోచ - విడిచిపెట్టెను.

1 రా. యు. ౫౯_౧౪౪

2 (స్వల్పసంబంధము) అనఁగా మోక్షోపాయమని అనుష్ఠించక విహితమని అనుష్ఠించినను అని గ్రహించతగ్గది.

3 రా. అ. 3౭_౧3

౨౨. సర్వధర్మజ్గళై యుమ్ విట్టొన్ఱు శొల్లుకైయాలే శిలర్ అధర్మ జ్గళ్ పుకురుమెన్ఱార్ కళ్.

హాముగాగల) రామునిగూడియుండి సుఖముగా వర్తించుటకు అనుకూలమైన పురుషార్థమును పోగొట్టుకొన్న దశరథచక్రవర్తివలె, ఆభాసములైన యుపాయాంతరములందు సంబంధించడము భగవత్ప్రాప్తికి విరోధములనిన్ని సత్యాదిధర్మములు దృష్టఫలసాధనములైనను భగవల్లాభమునకు సాధనములు కాకపోవుటచేత ఆభాసములనియును1 ‟కృష్ణం ధర్మంసనాతనమ్” అని చెప్పబడిన అనాదిధర్మమైన భగవంతునితోడ కూడివర్తించడమనే పురుషార్థమును వదలుకొనుటకు హేతువగునని ఈసూత్రార్థము.

‟సర్వధర్మాన్ పరిత్యజ్య” అను రెండుపదములవల్ల చేతననివృత్తిరూపములై, శ్రుతిస్మృతులవల్ల విధింపబడినవియునై యున్న సర్వధర్మములనున్ను ఇష్టఫలసాధనములుగానున్ను, అనిష్టములను నివర్తించునవిగానున్ను, అట్టిసాధనములకు అఙ్గముగాగాని, సాధనానుష్ఠానమునకు యోగ్యతను కలుగఁజేయునవిగాగాని అనుష్ఠించఁదగదని భావము.)

౨౨. ఇక యీచరమశ్లోకములో సర్వధర్మపరిత్యాగములోని త్యాగశబ్దార్థభావమును తెలియనివారు చేయుదూషణమునకు పరిహారము సాయించుటకై పూని వారి ఆక్షేపమునుయెత్తి చూపుచున్నారు ‟సర్వధర్మంగళై యుమ్” అని ప్రారంభించి. అనఁగా, విడువవలసిన ధర్మములు ‟ఇదంకురు”(ఇదిచేయుము), ‟ఇదంమాకార్షీః”(ఇదిచేయకుము)అని ప్రవృత్తిరూపములుగాను నివృత్తిరూపములుగానునున్న ధర్మములన్నిటిని విడువమని చెప్పుటవల్ల విధింపఁబడిన ధర్మానుష్ఠానములతో సమముగా నిషేధింపఁబడిన సురాపానాదులైన అధర్మనివృత్తి

1 భార. ఆర. ౮౮_౨౬

౨౩. అతుకూడాతు, అధర్మ్మజ్ఞై చ్చెయ్యెన్ఱు, శొల్లామైయాలే.

౨౪. తన్నడైయే శొల్లిఱ్ఱాకాతో వెన్నిల్ ;

౨౫. ఆకాతు, ధర్మ్మశబ్దమ్ అధర్మ్మనివృత్తియైక్కాట్టామైయాలే.

---

యు త్యజించిన సమయమునమూసిన తలుపును తెఱచినప్పుడు నిహీన పదార్థములు (అనఁగా శునకాదులు) ప్రవేశించునటువలె, ధర్మవిరోధములైన నిషిద్ధవ్యాపారములు చేయవలసివచ్చునని1కొందరు ఆక్షేపించిరని ఈసూత్రార్థము.

౨౩. నిషిద్ధవ్యాపారములు చేయవలసివచ్చునను పూర్వపక్షి ఆక్షేపమును పరిహారము జేయుచున్నారు ‹‹అదుకూడాదు" ఇత్యాది సూత్రమువల్ల. అనఁగా ధర్మములను మాత్రము విడువమని చెప్పినారుగాని అధర్మములను చేయుమని చెప్పకపోవుటచేతను, సర్వధర్మములను విడువమన్నందువలననే అధర్మములు చేయవలసివచ్చుననుట సంభవించదు.

౨౪. అధర్మత్యాగమున్ను ధర్మశబ్దముచేత చెప్పబడినదౌటచేత, ఆయధర్మత్యాగమును విడువవలసినయెడల, అధర్మమును చేయుమని అనఁగా, నివృత్తినివృత్తి ప్రవృత్తి గలవాడవగుమని అర్థబలముచేత సిద్ధించదా ? అను ప్రతివాదివాక్యమును అనువాదించుచున్నారు ‹‹తన్నడైయె" ఇత్యాది వాక్యముచేత.

౨౫. ౨౪-సూత్రములో 2 ప్రతిపక్షి చేసిన ఆక్షేపమునకు సమాధానము సాయించుచున్నారు ‹‹ఆకాదు" ఇత్యాది వాక్యమువల్ల. అనఁగా ధర్మములను విడువమని చెప్పుటచేతనే అధర్మములను చేయుమన

---

1 (కొందరు) క్షపణ, శైవ, శాక్తేయులు అనుట.

2 (ప్రతిపక్షిచేసిన ఆక్షేపము) అధర్మనివృత్తియున్ను ‹‹ఇదంమాకార్షీః" అను వాక్యరీతిగా ధర్మశబ్దముచే ప్రతిపాదింపఁబడుటవలన సర్వధర్మములను విడువమన్నపుడే, అధర్మనివృత్తి రూపధర్మమునకు త్యాగము సిద్ధించుటవలన అధర్మము చేయుమనడము స్వతః సిద్ధించును అను ఆక్షేపము.

౨౬. కాట్టినాలుమ త్తైయొభ్రిన్న వర్ణాశ్రమాచ్చోళ్లిత్తాామి త్తనై.

౨౭. తన్నై యుమ్ ఈశ్వరన్నై యుమ్ ఫల త్తైయుమ్ పార్త్తాల్ అన్వై పుకురవఖ్ఖియిల్లై.

---

డము స్వాయముగా నేర్పడఁజాలదు. ధర్మశబ్దము, అధర్మత్యాగము మొదలైన అంగములతో గూడి ప్రధానమైయున్న విహితానుష్ఠానమును చెప్పును గాని, సామాన్యమైన అధర్మత్యాగమును మాత్రము చెప్ప దు అని సాయించుచున్నారు.

౨౬. ధర్మశబ్దార్థము అధర్మత్యాగమునకు ప్రధానముగా లేకపోయినను, సర్వశబ్దముకూడిక చేత ధర్మశబ్దము విశేషణమైయున్న అధర్మనివృత్తిని చూపదా అను అనువాదమునకు సమాధానము సాయించుచున్నారు. ‹‹కాట్టినాలుమ్" ఇత్యాది సూత్రముచేత. అనఁగా ధర్మశబ్దవిశేషణము అధర్మనివృత్తిని చూపినప్పటికిన్ని అధర్మనివృత్తిత్యాగము (సర్వధర్మపరిత్యాగ పూర్వకముగా ఎంబెరుమానునే ఉపాయముగా ఆశ్రయించుచోట) త్యాజ్యముగా చెప్పఁబడ్డది కాదు.

(ఇందువల్ల, ధర్మాంగమైన అధర్మనివృత్తితప్ప శు[*]త్యాదులచే విధించఁబడి చేతనప్రవృత్తి రూపములైన ధర్మములనే చెప్పినదగునని సాయించుచున్నారు. ఎంబెరుమాణ్ చేతనప్రయత్నములలో ఎట్టిదానిని అపేక్షించనివాఁడు గాన వాని నిరపేక్షోపాయత్వమునకు ధర్మనివృత్తి వలె అధర్మనివృత్తియున్ను మిక్కిలి అంతరంగముగనుక అపేక్షితమని భావము.)

౨౭. ఈప్రకారము సర్వశబ్దమునకు, అధర్మనివృత్తితప్ప చేతనప్రవృత్తిరూప ధర్మములని అర్థసంకోచము చేయుటకు కారణము నాన

---

[*] ఇచ్చట చెప్పిన అధర్మనివృత్తి రూపధర్మమునకు అవశ్యం స్వరూపత్యాగమని అర్థము గ్రహించవలెను.

తిచ్చుచున్నారు. "తన్నైష్ణయుం" ఇత్యాది సూత్రముచేత స్వస్వరూపమును, భగవత్స్వరూపమును, పురుషార్థస్వరూపమును చూచినట్లయితే పైఁజెప్పిన నిషిద్ధానుష్ఠానములు ప్రవేశించుటకు వీలు లేదని ఈ సూత్రార్థము. అనఁగా అధర్మములైన నిషిద్ధానుష్ఠానము శేషియైన సర్వేశ్వరునికి అనిష్టమగుటచేతను, అతనికి ముఖవిలాసము కలుగఁజేయుట వదలి అతనికి అనిష్టము కలుగఁజేయుట స్వస్వరూపమునకు అనగా, (శేషత్వ చేతనరూపమునకు) విరోధము కలుగుటఁజూచినను; సహాయాంతరముల యొక్క సంబంధమును సహించని సిద్ధోపాయము, ఈ చేతనుని స్వప్రయత్ననివృత్తినితప్ప ప్రవృత్త్యంశమందొకటిని సహించనివాఁడు గనుక అట్టి ఈశ్వరస్వరూపమునుఁ జూచినను; ఈచేతనుని యొక్క ప్రవృత్తికి ఫలము ఈశ్వరప్రీతి గనుక అట్టి భగవత్ప్రీతిరూపమైన ఫలమునుఁజూచినను, (పై జెప్పిన స్వరూపోపాయ పురుషార్థత్రయములకున్ను) విరోధములైన అధర్మములు ప్రవేశించుట కవకాశము లేదు. కనుగ, నిషిద్ధానుష్ఠానము స్వరూప, ఉపాయ, పురుషార్థములకు విరోధియైనందున ధర్మశబ్దము అధర్మనివృత్తిని చూపినను, అధర్మనివృత్తికి యితరములైన చేతనప్రవృత్తి ధర్మములను చెప్పినట్టె, అంగీకరించవలయునని యీసూత్ర తాత్పర్యము. ఇట్లు అర్థముచేయక "అధర్మనివృత్తినిన్ని విడుచుట" అని అర్థముచేసినయెడల స్వరూప, ఉపాయ పురుషార్థములలో అన్వయించక నాస్తికుఁడగుట సిద్ధించును.

(ఇందువల్ల "సర్వధర్మాన్, పరిత్యజ్య" అను రెండుపదముల వల్ల, ప్రవృత్తిరూప అంగములతోకూడిన సకల ధర్మములనున్ను శాస్త్రములలో చెప్పఁబడిన ఆయాకారములతో ఈప్రపన్నాధికారి అనుష్ఠించతగ్గవాఁడు కాడనిన్ని, కైంకర్యాకారముతో అనుష్ఠించతగినవాడనిన్ని భావము.)

---

ఇచ్చట నుపదేశించిన సర్వధర్మపరిత్యాగము స్వరూపత్యాగమా! (కర్మమునుఁ జేయకుండుటయా) బుద్ధిత్యాగమా? (సాధనములుగావని తలచుటమాత్రమా) ప్రతిపత్తి

త్యాగమా? (సాధనములు కావని పట్టుదలతో శాస్త్రోక్తక్రమముగా నాచరింపమియా) అనుసంశయమునకు పరిహారము:—

శుద్ధసత్త్వం దొడ్డయాచార్యులవారు సాయించిన అరుంబదములో విశదముఁ గాన వచ్చును. దాని నిచ్చట సంగ్రహముగా జూపఁబడుచున్నది. కర్మయనునది కార్యము. ధర్మశబ్దవాచ్యముగాని కైంకర్యము (అనఁగా శేషికి శేషభూతుఁడు చేయుకార్యము) యొకటిన్ని లేనందున, దీపారోపణాది కైంకర్యములు (స్వరూపత్యాగమని) మొదలంట విడనాడినపుడు, శేషత్వమే స్వరూపముగాగల తానొనరించుకైంకర్య మొక్కింతయు లేకపోవునుగాన స్వరూపత్యాగ మనరాదు. కర్మాదులు సాధనములు కావని తలఁచుటమాత్రమైనపుడు వానినిఁ జేయకదప్పదు. ఇట్లు సాధనములుగావని చేసినప్పటికిని యేవిధమైన చేతనప్రవృత్తిని సహించని భగవంతుని స్వరూపమునకు విరోధమగును. ఎట్లనగా, ఉపాయబుద్ధిమాత్రము వదలి కర్మములన్నియు నాచరింప వలయుననెడి నిర్బంధముండునపుడు, వాని నిరపేక్షోపాయ స్వరూపమునకు తప్పక భంగము కలుగుచున్నది. కాఁబట్టి బుద్ధి త్యాగమనరాదు. ఉపాయాంతరములయొక్క స్వరూపములను యోచించి "స్వప్రయత్నములవల్ల ఫలసిద్ధి" అని యధ్యవసించియుండు చేతనుని యొక్కభ్రమ ననుసరించే ఇతరోపాయములవల్ల సాధించకూడని భగవత్ప్రాప్తికి. యుపాయాన్తరములను సాధనముగా వేదపురుషుడు విధించె నేగాని శాస్త్రోక్తమైన ఆకారములవల్ల వానిని అనుష్ఠించకపోవడమువల్ల ప్రతిపత్తిత్యాగమని యేర్పడినది. ప్రతిపత్తిత్యాగమైనపక్షమున పైఁజెప్పినటుల కర్మలయందు సాధనబుద్ధిలేకపోయినను, కర్మలన్నియు నాచరించి తీరవలయుననిగాని, మొదలంట వదలవలయుననిగాని, యుభయదోషములులేక భగవత్కైంకర్యమునకు విరోధముగాని కర్మలను కైంకర్యబుద్ధిచే నాచరింపవలయుననుట. ప్రతిపత్తి అనఁగా పట్టుదల, త్యాగమనఁగా వదలుట. ఏవిధముచేతనైనను నన్నికర్మలను శాస్త్రోక్తప్రకారముగా నాచరింపవలయునను నిర్బంధములేదని భావము. ప్రపన్నుఁడైన తరువాత వీఁడు అనుష్ఠించు అనుష్ఠానములన్నియు శేషభూతుఁడైన తన స్వరూపమునకు అనుగుణమై, ఈశ్వరుని ముఖోల్లాసహేతువైన కైంకర్యముగునేగాని ప్రపత్తికి అంగముకాచాలదు. ప్రపన్నుఁడగు పర్యంతమే శాస్త్రములందు ప్రవర్తకము, ఆతరువాత శేషత్వప్రకాశకమైన కైంకర్యములోగదా అనువర్తించడము. (ఇందువల్ల శేషత్వస్వరూపప్రకాశకములైన భగవత్కైంకర్యమునకు విరోధముకాని శాస్త్రోక్తమైన అనుష్ఠానములు సాధనబుద్ధిరాహిత్యముతో కర్తవ్యమనిన్ని, తద్విరోధములైనవానిని వదలినయెడల ప్రత్యవాయములేదనిన్ని భావమేర్పడుచున్నది.)

ఈవిషయములో శ్రీమత్పరమహంసేత్యాది శ్రీమాన్ తిరువరయోధ్య రామానుజజీయర్ అను శ్రీరంగనారాయణ జీయర్ స్వాములవారు ప్రసాదించిన "అష్టాదశరహస్యటిప్పణి" అను గ్రంథమందు పైజెప్పినత్యాగము స్వరూపత్యాగమేగాని బుద్ధిత్యాగము కాదని అనేకప్రమాణముల పూర్వకముగా సిద్ధాంతపరచియున్నారు. దానినిన్ని యిచ్చట గ్రంథవిస్తరభీతిచే సంగ్రహముగా చూపఁబడుచున్నది, స్వరూపమనఁగా ఆకారము, కర్మస్వరూపమనఁగా కర్మలయాకృతి, కామ్యకర్మయనఁగా దృష్టఫలసాధనమైన క్రియావిశేషము. ఐశ్వర్యార్థివలన అనుష్ఠింపఁబడుకామ్యకర్మనే అధికారిభేదమువల్లనున్ను, దేవతాభేదమువల్లనున్ను, ఫలభేదమువల్లనున్ను ఉపాసకునికి మోక్షోపాయమై ధర్మశబ్దమునకు దృష్టఫల సాధనస్వరూపము నశించి మోక్షోపాయ స్వరూపము సిద్ధించును. ఆరీతిగానే ఉపాసకునికి మోక్షసాధనమైన ధర్మమే సాధనబుద్ధిరాహిత్యముతో అనుష్ఠించుప్రపన్నునికి కైంకర్యమై దానికి మోక్షసాధనత్వ స్వరూపము నశించి కైంకర్యరూపాకారము సిద్ధించును ఇందువలన, ధర్మశబ్దవాచ్యములైన సాధనధర్మములను ఆయాయాకారములతో వదలినందున స్వరూపత్యాగ మనఁబడుచున్నది.ఒకటేధర్మము అధికారభేదమువలనను, దేవతాభేదమువలనను,ఫలభేదమువలనను ఆకారాంతరములు పొందుటవలన, అధికారాను గుణస్వరూపత్యాగము యేర్పడుచున్నది. ఈలాగే, లోకసంగ్రహార్థముగాచేయు కర్మలయందును అసంగపూర్వకత్వలక్షణ గుణభేదముండుటవలనను, అధికారి భేదముండుటవలనను, ప్రత్యవాయ పరిహారార్థత్వాభావము తోచుటవలన, కేవల వర్ణాశ్రమధర్మాపేక్షతో లోకసంగ్రహముగా అనుష్ఠించబడు ధర్మమునకు భేదము సిద్ధమగుచున్నది. కేవల భగవత్ప్రీత్యర్థముగాచేయునట్టి దీపారోపణాదులయందు ప్రీతికారి తత్వరూపగుణభేదమువల్లనున్ను,అసాధారణ విగ్రహవిశిష్టభగవత్స్వరూపాత్మక దేవతాభేదమువల్లనున్ను, స్వయంప్రయోజన తత్ప్రీతిమాత్రాత్మకఫలభేదమువల్లనున్ను వుపాసనాంతర్గతజ్ఞానాద్యపేక్షయాభేదము సిద్ధము. ఇందువల్ల ప్రపన్నధర్మములు వేదాంతములలో సెప్పఁబడిన దేవతాంతర్యామ్యాది విషయజ్ఞానాదిరూపములవలె లేనందున,అసాధారణ దివ్యమంగళ విగ్రహముతోకూడియుండు భగవదనుభవజనిత ప్రీతికారిత కైంకర్యరూప ధర్మాంతరములని సెప్పినదగును. పైఁజెప్పిన యావదంశములను తిరువుళ్ళములో నుంచుకొని ప్రపన్ననికి వుపాయాంతర స్వరూపత్యాగమే సిద్ధించునని కొందఱాచార్యస్వాములు నిర్వహించియున్నారు.

అట్లుఁగాక లోకాచార్యస్వాములవారి తిరువుళ్ళము కర్మలమొదలంట' విడుచుటయే సర్వకర్మస్వరూపత్యాగమని వారి తనిచరమాదిగ్రంథ శ్రీసూక్తులవలన ఏర్పడుచున్నది. ముముక్షుప్పడియైన యీగ్రంథమున "సన్యాసిముమ్ముళ్ళవ[illegible] విడుమా

పోప్రేలే” ఇత్యాది ౯౩వ సూత్రమువలన స్వరూపత్యాగము సిద్ధము. ఎట్లనఁగా, సన్యాసులకు పూర్వాశ్రమధర్మత్యాగములో బుద్ధిత్యాగము లేదుగదా? స్వరూపత్యాగముకదా కలిగినది. ఆధర్మములను మొదలంటవదలమనికదా శాస్త్రము చెప్పడము. అట్లైతేకదా “సర్వధర్మంగళైయుంవిట్టు ఎన్ను శొల్లుకైయాలే శిలర్ అధర్మఙ్గళ్ పుకురుమెన్నార్ గళ్” అను ౨౨వ సూత్రములోని ప్రశ్నోత్పత్తికి హేతువగును. బుద్ధిత్యాగపక్షమందు అట్టి శంకచేయుటకు కారణములేదు. స్వరూపత్యాగమనినపుడే “పాతకాదిగళై విడుమాపోప్రేలే” అను ౧౮వ సూత్రదృష్టాంతము సంగతమగును. లోకములో పాతకములను రుచివాసనలతోకూడ (స్వరూపముతో) లజ్జాపూర్వకముగా మొదలంట వదలవలసియుండుటవలనబుద్ధిత్యాగాదిపక్షములో యీదృష్టాంతము సంగతముకాదు. ఈలాగే “ఇవై అనుపాయంగళాన మాత్రమన్ఱిక్కే కాఱ్ఱ్కట్టైగళాగిఱదు” అను ౨౦వ సూత్రార్థమందున్న వుపాయాంతరములు మోక్షోపాయములు కాకపోవుటయేగాక మోక్షమునకు ప్రతిబంధకములని యేర్పడుటవల్ల స్వరూపత్యాగము ఆవశ్యకమని యేర్పడుచున్నది. ఇదియునుగాక ౧౭వసూత్రమైన “త్యాగమావదు”అను వాక్యవివరణమందు త్యాగశబ్దార్థమును సాయించుటలో “శుక్తికైయిలేరజితబుద్ధి పణ్ణువార్రైపోప్రేయుం, విపరీతదిశాగమనం పణ్ణువార్రైపోప్రేయుం” ఇత్యాదిదృష్టాంతములవల్లనను స్వరూపత్యాగమే సిద్ధించుచున్నది. ఈయర్థమును అనుష్ఠానరూపదృష్టాంతమువల్ల నిరూపించుచున్నారు. శాస్త్రార్థములను నిస్సంశయముగా గ్రహించినవారును, పరమకారుణికులైన ఇళైయపెరుమాళ్లున్ను నిత్యాగ్నిహోత్రాది ధర్మములనువదలి యుండుటవల్లనను, లంకలోనుండిన పిరాట్టి స్నానాదినిత్యకర్మలను స్వరూపముతో వదలుటవల్లనున్ను, తిరుక్కణ్ణమంగైయాండాన్ అనువారు నిత్యనైమిత్తిక సర్వధర్మములను స్వరూపముతో వదలియుండుటవల్లనున్ను, స్వరూపత్యాగమునే యిచ్చట చెప్పఁబడెనని యభిప్రాయము. ఉపాయబుద్ధి త్యాగవిషయములో చెప్పువచనములనుస్వరూపత్యాగమునకు శేషభూతమైన భ్రాన్తిత్యాగావశ్యకత్వమాత్రవిషయమని నిర్వహించతగ్గది. అనఁగా “నివృత్తరాగస్యగృహంతపోవనం, ప్రవృత్తరాగస్య తపోవనంగృహం”అనునట్లు బుద్ధిత్యాగముతోకూడిన స్వరూపత్యాగముగా గ్రహించవలయు. ఆళ్వార్లున్ను(తిరు.వా.౧-౨-౩) “నీర్ నుమదెన్ఱివైవేర్ ముదల్ మాయ్త్తు” అని భ్రాన్తిత్యాగముయొక్క అవశ్యకత్వము సాయించియున్నారు. ఈదృష్టాంతములచే నిచ్చట సాయించుత్యాగము స్వరూపత్యాగమని యేర్పడుచున్నది.

ఇచ్చట ప్రపన్ననికి ముఖ్యమైన జ్ఞాతవ్యాంశములను తనిచరమము, పరన్దపడి, అష్టశ్లోకి మొదలగు వ్యాఖ్యానగ్రంథములనుండి యెత్తి చూపఁబడుచున్నవి.

సిద్ధోపాయ స్వీకారమునకు నితరోపాయత్యాగ అంగమగుటచేత త్యాగవిషయ

ధర్మములను“సర్వధర్మాన్”అనుపదముచేత చెప్పఁబడినది.(చోదనాలక్షణార్థోధర్మః)అని చెప్పినట్లు శాస్త్రములయందు కామ్యార్థములైన నిత్యనైమిత్తికములకు అనుష్ఠేయతయా విహితమైన ధర్మము. అది వర్ణాశ్రమధర్మమనియు, ప్రవృత్తిధర్మమనియు, నివృత్తిధర్మమనియు, సిద్ధధర్మమనియు నాల్గువిధములుగనుండును; “క్రియమాణంనకస్మైచిద్యదర్థాయప్రకల్ప్యతే । అక్రియావధనర్థాయ తత్తుకర్మసమాచరేత్ । ఏషాసాహైదికీనిష్ఠాహ్యుపాయాపాయమధ్యమా” అని చెప్పఁబడినట్లు వర్ణాశ్రమవిహితధర్మములు. “శ్రుణుధ్వం పరమంకర్మ ద్వివిధంతదిహోచ్యతే । ఏకంప్రవర్తకంప్రోక్తం నివర్తకమతఃపరం । ప్రవర్తకంచస్వర్గాది ఫలసాధనముచ్యతే । నివర్తకాఖ్యందేవర్షే విజ్ఞేయంమోక్షసాధనమ్” అనిచెప్పినట్లు ప్రవృత్తిధర్మమనునది స్వర్గాదిఫలసాధనమైన జ్యోతిష్టోమాదులు. నివృత్తిధర్మమన మోక్షసాధనమైన కర్మయోగాదులు. “ఏచవేదవిదోవిప్రాః ఏచాధ్యాత్మవిదోజనాః । తేవదంతిమహాత్మానం కృష్ణంధర్మంసనాతనమ్” అనుసట్టిది పరమధర్మస్వీకారము. “న్యాసఇతిబ్రహ్మ” “న్యాసఇత్యాహుర్మనీషిణోబ్రహ్మాణమ్” అని పరమధర్మస్వీకారమందుపాయప్రసంగము లేనందున,నది చేతనస్వరూప ధర్మమగుటచేతను స్వీకార్యముగాఁజెప్పఁబడుచున్నది.

ఇచ్చట మోక్షోపాయము నుపదేశించు ప్రకరణముగాన స్వర్గాదిఫలసాధనమైన జ్యోతిష్టోమాదులు కాదనుట సిద్ధము. సిద్ధధర్మము స్వీకరించవలసినదిగా చెప్పుటవల్ల త్యజించవలసినది అదిన్నికాదు. ఇకను యిచ్చట మోక్షోపాయమై, వర్ణాశ్రమధర్మములను కర్తవ్యముగాకలిగి సాధించవలసిన నివృత్తిధర్మములను చెప్పుచున్నది.ఇదియే, ధర్మము-బహువచనము-సర్వశబ్దము అని త్రివిధముగానుండును. ధర్మశబ్దమువల్ల మోక్షమును తప్పకయిచ్చు సాధనమును చెప్పుచున్నది. అదియేది అనఁగా, “భక్త్యాత్వనన్యయాశక్య అహమేవమ్విధోర్జున, మద్భక్తింలభతేపరామ్” అనిచెప్పఁబడు పరమభక్తి. బహువచనమువల్ల దానికి అంగముగానుండు సాధనములు. అవియేవియనఁగా;—కర్మ-జ్ఞాన.అవతారరహస్యజ్ఞానము-పురుషోత్తమవిద్య మొదలగునవి. ఇవియన్నియు భగవత్ప్రీభావమువల్ల స్వతంత్రోపాయములని చెప్పుదురు. వీట్లలో ప్రతియొకటి ఫలసాధనముగా నుండుటవల్ల అంగసాధనముగానుండినను ధర్మశబ్దమువల్ల చెప్పబడుచున్నవి. సర్వశబ్దమువల్ల ఆశ్రమములు భేదించినను వదలరాని సన్ధ్యావందన పంచమహాయజ్ఞము మొదలగు కర్మలు, లోకసంగ్రహార్థముచేయు శ్రేష్ఠసమాచారము, పరార్థముగా పుత్రాదులకుగాను చేయు పుంసవనాది కర్మములను చెప్పుచున్నది. ఇది ధర్మశబ్దమువల్ల చెప్పబడిన సాధనానుష్ఠానము చేయుటకు యోగ్యతాపాదకమైన ధర్మవిశేషములను చెప్పుచున్నది. యోగ్యతాపాదక ధర్మములనువదలి సాధనధర్మములకు ఉదయము లేనందువల్ల, ధర్మ

త్యాగమును ప్రస్తాపించినపుడే యోగ్యతాపాదక ధర్మములు దూరతోనిరస్తముగదా? అట్లుండగా, దీనిత్యాగము (అనగా యోగ్యతాపాదక ధర్మత్యాగము)యిచ్చట చెప్పుటకు కారణ మేమనిన:-సంధ్యాహీనుఁడైన అశుద్ధునకు వైకర్మానుష్ఠానములోను అధికారములేనందున, సిద్ధోపాయమునకు ఇట్టి నిర్భంధముకలదాయనిన; ఈయుపాయము ఇట్టి యోగ్యతను అపేక్షించదు అని చూపుచున్నది. అట్లులేకపోయినను "విహితత్వాచ్చాశ్రమకర్మాపి" అనునట్లు విహితమని యాచరించకూడదా యనిన; యజ్ఞములో దీక్షించినవానికి విహితాంశము త్యాజ్యమైన ప్రకారము, ఇచ్చటనున్ను "సర్వధర్మాన్ పరిత్యజ్య" అనుటవల్ల విహితాంశమున్ను త్యాజ్యము. శాస్త్రసిద్ధమైన ధర్మమును వదలుటకు హేతువు స్వీకార్యమైన సిద్ధోపాయము వేరొకటిని సహించదు గనుకనే. సహించడము నివృత్తియే.

సమస్తవేదశాస్త్రములును ధర్మములనుచేయుమని విధించుచుండగా వానినిచేయకుండుట శాస్త్రవిరోధముగాన "సర్వధర్మాన్ పరిత్యజ్య" అను పదములకు వేరువిధముగా నర్థము చేయవలయునని:—

కొందఱు శాస్త్రవిహిత ధర్మములనువిడిచినవారికిఁ బ్రాయశ్చిత్తముగ శరణాగతిని విధించిరేగాని ధర్మములను విడువుమని చెప్పుటకాదనిరి. ఈశ్లోకము మొదట అర్జునునికటాక్షించి సాయించినదిగా యుండుటవల్లనున్ను ఆయర్జునుఁడు ధర్మములువిడిచిపెట్టినవాఁడు కాఁడు గాన వతనికి బ్రాయశ్చిత్తాపేక్షలేనందున నిది సంగతముకాదు.

కొందఱు ధర్మశబ్దముచేత ఫలమునుచెప్పి ధర్మములననుష్ఠించుచు, తత్ఫలాపేక్షలేకయుండుటయే సరియైన యర్థమనిరి. ధర్మశబ్దము ఫలమును గనుపరుచునదిగాని శరణాగతితో సంబంధించినదిగాని కాకపోవుటచేత ఆయర్థముకూడదు.

మఱికొందరు, ధర్మములయం దధికారములేని స్త్రీశూద్రాదులకు మోక్షోపాయముగ శరణాగతిని, విధించబడినదనిరి. అదిన్ని యుక్తముగాదు. స్త్రీశూద్రులకు ధర్మప్రాప్తిలేనందున త్యాగము విధింపఁబనిలేకుండుటయేకాక, అర్జునుని విషయముగ నిదిచెప్పంబడినది గాన స్త్రీశూద్రులకని యెంచవల్లలేదు. అదియునుగాక ఇది సర్వాధికారమను శ్రుతికి విరోధించును.

వేఱుకొందఱు, ధర్మశబ్దముచేత దేవతాంతరముల నర్థముచేసి వానినివిడుచుట దీనికర్థమనిరి. అదిన్ని సంగతముకాదు. ధర్మశబ్దము దేవతాంతరములకు అర్థముకాకపోవుటచేతనున్ను.

కొందఱు శరణాగతితో విరోధించిన ధర్మములనుమాత్రము విడుచుట చెప్పవలయుననిరి. అన్నిధర్మములనని చెప్పుచుండఁ గొన్నిటినిమాత్రమని అర్థముచేసుకొనఁ

దగిన వేరొకశబ్దము లేకపోవుటయేకాక విరోధించినవానిని విడుచుటకొక విధి అక్కరలేకపోవుటచేత యీఅర్థము సరికాదు.

మరికొందఱు ధర్మములన్ని విడిచినను శరణాగతిచేయుచున్నాఁడేయని శరణాగతిని ప్రశంసించుటేగాని ధర్మత్యాగమందు తాత్పర్యముకాదనిరి. శరణాగతిని ప్రశంసించుట కట్లు చెప్పినపక్షమునకు అట్టియర్థమును చూపుశబ్దము అందు లేకుండుటయే కాక శోకించవలదని చెప్పఁబనిలేదు.

కొందఱు జ్ఞానము మోక్షసాధనము గాన దానికి విరోధములైన కర్మలనువిడిచి ఆత్మజ్ఞానముకొఱకు యత్నించవలయునని చెప్పుచున్నారు. కర్మము మోక్షసాధనంబనుట శాస్త్రము చెప్పుచుండుటయే గాక, 'శరణంవ్రజ' యనుశబ్దము ఆత్మజ్ఞానప్రతిపాద్యము కాకపోవుటయు, దానిచూపుటకు వేరొకశబ్దము లేకుండుటయు, ఆత్మజ్ఞానముచేతనే మోక్షములభించు నని యున్నవానిఁజూచి నేను నిన్ను అన్నిపాపములనుండి ముక్తునిఁగాఁజేసెదననియు నేనేమోక్షమిచ్చెదననియు, ఈశ్వరుఁడు తానే సాయించుచుండుటచేత యీయర్థము యుక్తముగాదు.

కొందఱు ధర్మములనన్నిటిని విడిచి అల్పమైన శరణాగతి చేయుటచేతనే మోక్షముసిద్ధించెనేని అనేక జన్మములుగాఁ జేయంబడవలసిన తపస్సులచేతను, వైరాగ్యముచేతను, ఇంద్రియజయముచేతను, యోగాభ్యాసము చేతఁబుట్టిన బ్రహ్మజ్ఞానముచేతను మోక్షము కలుగునని చెప్పుశాస్త్రము నిరర్థకము కావలసివచ్చుచు గాన మోక్షార్థము బహ్వాయాసధర్మములను విధించు శాస్త్రసన్నిధానమందు అల్పయత్నమైన శరణాగతిమాత్రమే విధించు శాస్త్రము జీవించనేరదనిరి. అల్పయత్నమైన రత్నాది వ్యాపారముచేత కృషి మొదలగు విశేషాయాసకరమైన కార్యముల మూలముగపొందు లాభమునకంటె, అధికఫలము సిద్ధించుచుండుట అనుభవసిద్ధము గాన పై ఆక్షేపము నిరర్థకము.

కాబట్టి పూర్వోక్తాభిప్రాయములు నిజమునకుచేరవు గాన ఈచరమశ్లోకమునకు «శరణమ్ త్వాంప్రపన్నాయే ధ్యానయోగవివర్జితాః। తేపిమృత్యుమతిక్రమ్య యాన్తి తద్వైష్ణవంపదమ్» అనెడు బ్రహ్మాండపురాణవచన ప్రకారము సర్వమైన ధర్మముల యొక్క త్యాజ్యమనియే అర్థము చేయవలెను.

«చచాలచాపంచమమోచవీర॥» అనుచోట రావణుఁడు ధనురాద్యాయుధములు ఖండింపబడి దెబ్బలుతిని విరథుఁడై పారిపోవుచు అవశముగా తనచేతనుండి పోయి ధనుఃఖండము పారవేయువరకు రామబాణములు విడువలేదు గాన ధర్మశేషములు రక్షకమునకు భంగకరులౌటను సర్వధర్మములను సవాసనగా విడిచిరయే శరణాగతి

చేయవలయును. అట్లయినచో త్యజించవలసినదిగా విధించిన ధర్మములు (ఇదంకురు, ఇదంమాకార్షీ) అని విధినిషేధాత్మకమైయుండ, విహితానుష్ఠానముతోఁగూడ నిషిద్ధపరిహారమును త్యాజ్యమని చెప్పినపుడు నిషిద్ధప్రవృత్తికి నెడమియ్యదాయనిన, స్వీకార్యమైన సిద్ధోపాయము సహాయాంతర సంసర్గాసహమగుటచేత శాస్త్రమందు మోక్షోపాయములుగా జెప్పిన ధర్మములను త్యజించవలయునని విధించునపుడు (ధర్మములను విడిచి యధర్మములను పట్టుమనుట కనిపించకపోవుటయేగాక విడువవలసిన ధర్మములన్నియు నధర్మనివృత్తిపూర్వకములై యుండునవి యగుటచేత) వేరొకయనుష్ఠానము తలచూపుట కవకాశము లేదు. సామాన్యముగ కర్మాద్యుపాయములను శాస్త్రము విధించినపుడు అందుకువిరోధములైన కృత్యముల నాచరించగూడదని శాసించుచున్నది. అందు, ఆచరించుమనిచెప్పినకార్యములు ధర్మములుగాను, ఆచరించకూడదనిచెప్పిన కృత్యములు అధర్మములుగాను, సాధారణముగ గ్రహించబడుచున్నవి. అయితే ఉపనిషద్గుహ్యమైన యీచరమశ్లోకమందు ధర్మములను విడిచి ప్రపత్తిచేయవలసినదిగా విధించుటచేత ప్రపన్నునకు మీదజెప్పిన ధర్మాధర్మములు రెండును స్వాతంత్ర్యముతోకూడి స్వరూపవిరోధములౌటచేత అకృత్యాకరణముక్రిందను, స్వరూపానురూపమైన ప్రపదనము కృత్యాకరణముక్రిందను చేరుచున్నది గాన ప్రపన్నునికి సంధ్యావందన పంచమహాయజ్ఞాది కార్యములున్ను, వ్యభిచారము, సురాపానము, పరహింస మొదలగు కృత్యములును సమానముగానుండుటచేత నవియన్నియు త్యాజ్యము కావలసియుండుననుటకు సంశయములేదు.

తిరుమంత్రములో ప్రతిపాదింపబడిన ఆత్మస్వరూపమును-ద్వయములో ప్రతిపాదింపఁబడిన శరణాగతిస్వరూపమును చక్కగా నెఱిగిన అధికారి సర్వధర్మములను స్వరూపతః వదలకమానడు. ఈప్రకారము సర్వధర్మపరిత్యాగము చేసినగాని ఉకారార్థములో సాయించిన అన్యశేషత్వనివృత్తి కలిగినవాఁడు కాఁజాలడు. శరీరముసుపట్టిన వర్ణాశ్రమనిబంధనమై చేయు యావత్తు క్రియలవల్ల వాట్లకు ప్రతిసంబంధులైన అగ్నీంద్రాదులకున్ను-సోమగంధర్వాదులకున్ను పితృదేవతలకున్ను శేషపడవలసివచ్చును. ఇందువల్ల అనన్యార్హ శేషత్వభంగము కలుగును, కాబట్టి, బ్రాహ్మణధర్మములైన యజనాధ్యాపనాదులు వర్ణాంతరులకు, బ్రహ్మచారి ధర్మము గృహస్థునికిని, గృహస్థునిధర్మము వానప్రస్థునికిన్ని, వానప్రస్థునిధర్మము సన్యాసికిని త్యాజ్యమైనటువలె శరీరప్రధానుని క్రియలు ఆత్మప్రధానుడైన జ్ఞానజన్మునికి త్యాజ్యములైయుండును. ఇంతియేగాక, దేవర్షిభూతాత్మనృణాం పితౄణాంనకింకరోనాయమృణీచరాజన్ । సర్వాత్మనాయశ్శరణం శరణ్యంనారాయణం లోకగురుంప్రపన్నః" అని భగవచ్ఛేషత్వోపాయత్వ జ్ఞానము కలిగినవాడు దేవతాంతరములకు కింకరుడుకాఁడు, ఋణపడినవాఁడున్ను కాఁడనిచెప్పఁబ

డెను. మఱిన్ని "యోవై స్వాం దేవతామతియజతే, ప్రస్వాయై దేవతాయై చ్యవతే, నప రాం ప్రాప్నోతి, పాపీయాన్భవతి". అనియెవఁడైతే స్వరూపానురూపమైన దేవతగాని దాన్ని పూజించుచున్నాడో వాడు తనదేవతను పోఁగొట్టుకొన్నవాడై పరగతిలేనివాడై పాపిష్ఠుఁడున్ను అగునని చెప్పఁబడుచున్నది. ఇందుకుపై, "సంసేవ్యఏకో హరిరిన్ద్రియాణాం సేవాఽన్యదేవేష్వ్యభిచారఏవ। అన్యోపిసేవ్యోయదిదేవసామ్యాత్ కో వా హృషీకేశ పదాభిమానః" అని సకలేంద్రియములవల్ల సంసేవ్యుఁడు హరిశబ్దవాచ్యుడైన సర్వేశ్వరుఁ డేయనిన్ని, అట్టి సర్వేశ్వరునికే శేషమైన ఇంద్రియములను కొని తద్వ్యతిరిక్త దేవతలను సేవించినయెడల, భర్తృశేషమైన శరీరమును అన్యపురుషోపయోగముచేసిన స్త్రీకి వ్యభిచారము సిద్ధించి పాతివ్రత్యహాని కలిగినటువలె, హృషీకేశుడైన వాని హృషీకములను (ఇంద్రియములను) అన్యవిషయములలో వుపయోగపరచుటవల్ల యీయింద్రియములకు స్వరూపహానియున్ను వాట్లకు క ణియైన తనస్వరూపహాని కలుగుటవల్ల అన్యదేవతలను ఉద్దేశించి స్వరూపవిరుద్ధముగాచేయు యావత్కర్మముల నివృత్తి-స్వరూపయాథాత్మ్యజ్ఞానముతో కూడినవానికి స్వతఃప్రాప్తమని యేర్పడుచున్నది. వీటిని తిరువుళ్లమందు వుంచుకొనే భగవదవతారమే యని పొగడొందిన శ్రీభాష్యకారులవారున్ను, పిళ్ళైయురంగాపిళ్లి దాసులవిషయముగా మొదలియాండానుకు కృపజేసిన బదివార్తలలో ౧౦దో వార్తలో "పతివ్రతైక్కుమ్ పరనారిక్కుముళ్ల తన్నేఱ్ఱం, ఎంగనేఎన్నిల్; నామ్ అగ్నిన్ద్రాదిదేవతైకళుక్కు శేషమాయిరుప్పతోమ్; అవర్గళ్ అవనుక్కు శేషమెన్ఱు అవనైయొళిన్దవర్కళుక్కు శేషమన్ఱెన్ఱు అఱుతియిట్టిరుప్పర్కళ్" అని దేవతాంతరశేషత్వ నివృత్తివల్లకలిగిన యాధిక్యమును సాయించియున్నారు.

ఇట్లుండగా కొందఱు పైజెప్పిన అన్యశేషపరిహారార్థము, తాముచేయు క్రియలు భగవత్పర్యవసానబుద్ధితో అనుష్ఠించవలయుననిన్ని ఆయాదేవతానామములు భగవన్నామములుగా భావించి అనుష్ఠించవలయుననిన్ని చెప్పుదురు. ఇదిన్ని సంగతముకాదు. అగ్నీంద్రాది దేవతాంగీకారముగాచేయు క్రియనే భగవత్పర్యవసాయమై ఆదేవతానామములే భగవన్నామములైనయెడల సమస్తక్రియలున్ను "విష్ణవే" అని సర్వవ్యాపకత్వమువల్ల సమస్తమునకు విశేష్యభూతుఁడైన సర్వేశ్వరునినే ప్రతిసంబంధిగా విధించబడియుండును. అట్లుగాక, ఆయాదేవతలనున్ను, సర్వేశ్వరునిన్ని ప్రత్యేకించి విధించబడియుండుటవల్ల ఆయావిధులకు ఆయాదేవతలే ప్రతిసంబంధులుగా వుండవలెను. ఆళ్వార్లున్ను (తిరువాయ్మొళ్రి గపత్తు ౨ తిరు. ౫) "నిఱుత్తినుమ్ముళ్ళత్తు" "మేవిత్తొళుతుయ్మినీర్కళ్" అను పాశురములవల్ల దేవతాంతరములులోనగు యావద్విభూతి సర్వేశ్వరుని శరీరభూతులు, సర్వేశ్వరుఁడు అంతరాత్మ, అట్టి అంతరాత్మగానుండు

యాకారమునువదలి వాని అసాధారణ గుణవిగ్రహ చేష్టితములే పూజధ్యానార్హములు నిన్ని అట్టియాకారమును అనన్యప్రయోజనులుగా సేవించి ఉజ్జీవించవలయుననే నియమము యేర్పడుటవల్ల దేవతాంతర్యామ్యాకారము ప్రపన్నునికి స్వరూపానుగుణముకాదు. అగ్నిహోత్రమునకున్ను శ్మశానాఽగ్నికిన్ని అగ్నిత్వసామ్యమువుండినా వైదికతన్త్రముల లో ఒకటి నిషిద్ధమనిన్ని, ఒకటి శుద్ధమనిన్ని చెప్పునట్లు యిచ్చటనున్ను శుద్ధాఽశుద్ధ వివేకము చేయవలెను. యజ్ఞములో దీక్షించినవానికి నిత్యకర్మములు త్యాజ్యమైనట్లు భగవదేకోపాయనిష్ఠులకు యివి త్యాజ్యముగనుక స్వరూపయాథాత్మ్య జ్ఞానులైనవారికి దేవతాంతర్యామిత్వాకారము స్వరూపవిరుద్ధముగా నుండును. కర్మహేతువుగా వుత్పత్తియైన శరీరముగా వుండినప్పటికిన్ని యీ జ్ఞానోదయమునకు పిమ్మట కర్మనశించి కేవల భగవదిచ్ఛచేనుండు శరీరమగుటన అట్టియిచ్ఛకు యాశ్రయమైన భగవద్విషయ శేషత్వమే ప్రాప్తముగానుండును. పూర్వజన్మములోని మాతాపితృశేషత్వము వెనుకటి జన్మములో లేకపోయినరీతి ఈ శరీరమును కలుగజేసిన మాతాపితృవిషయ శేషత్వము వీనికి కలుగనేరదు. కాబట్టి వాటినివృత్తి అవశ్యమనుట నిశ్చయము. « సహివిద్యాత స్తంజనయతి తచ్ఛ్రేష్ఠంజన్మ" అనిన్ని « అన్తునాక్ పిఱన్దిలేఙ్ పిఱన్దపిన్ మఱన్దిలేఙ్ » అనిన్ని యీజ్ఞానోత్పత్తిని జన్మాంతరముగా చెప్పబడియున్నదికదా! అయితే శాస్త్రీయమైన క్రియలన్నియు త్యాజ్యముచేసినయెడల భ్రష్టత్వముకలుగ నేయనిన కలుగనేరదు. « దేవతాంతరసమ్బంధం నిత్యకర్మవిధింవినా » అని ప్రపన్నపారిజాతములో, నిత్యకర్మ విరోధవిషయముగా సాయించియున్నారు. గనుక ఉకారమువల్ల శాస్త్రీయమైన అగ్నీంద్రాది దేవతానువర్తనమునున్ను మాతాపితృల అనువర్తనాదులనున్ను తొలగించుచున్నది. అంతియేగాక అట్టి ఆచరణము అహంకారగర్భితమైన దుస్స్వతంత్రమై అచిద్వత్పారతంత్ర్యమైన ఆత్మస్వరూపమునకు భంజకము కలుగజేయునదిగా యుండును. కర్మహేతువైన దేహమునసనుసరించి చేయు వర్ణాశ్రమాచార విహితధర్మములు చేసినా ప్రయోజకములేదుగాని వర్ణబద్ధులకు యవి యాచరించకున్న ననర్థమునకు హేతువై యుండును, అట్లుగాక భగవదిచ్ఛా హేతుభూతమైన శరీరము ధరించిన శరణాగతనిష్ఠుడు తన ఆత్మ ఈశ్వరునికే అచిద్వత్పరతంత్రమని తెలిసి స్వరక్షణమందు నివృత్తుడై స్వప్రవృత్తిరూప యావద్ధర్మములు స్వరూపవిరోధములని విడువవలెను. విడిచిననేగాని యీశ్లోకములో సాయించబడిన ఈశ్వరనిరపేక్షోపాయ రూపరక్షకమునకు పాత్రుడు కాజాలడు. వర్ణధర్మల ప్రవర్తనలు యాచారములు శ్రీభాష్యకార్లవారు సాయించిన రీతిగా « నాడు పరిగ్రహిక్కైక్కాక చ్చెయ్యుపుత్తోమ్" అని లోకపరిగ్రహమునకై యుండును. దేవతాంతరశేషమైయుండును. తిరుమంత్రములో ప్రతిపాదింపబడిన అన

న్యార్హ శేషత్వ, అనన్యశరణత్వ, అనన్యభోగ్యత్వ స్వరూపాకారముతో కూడినవారై యుందురు ప్రపన్నులు దేహసంబంధమైచేయుయావత్తుక్రియలను సవాసనగావదలి «బ్రహ్మహత్యాసురాపానం స్తేయంగుర్వంగనాగమః॥ అనెడు పాపములు మొదలగువాటితో సమానముగా వుపాయాంతరములనువదలి) «నాట్టారోడియల్వొళ్రిన్దు నాణమై నణ్ణియిరుప్పర్ కళ్» అన్నట్లున్ను «విష్ణుదాసావయం యూయంబ్రాహ్మణావర్ణధర్మిణః। అస్మాకందాసవృత్తీనాం యుష్మాకంనాస్తిసంగతిః। నాస్తిసంగతిరస్మాకం యుష్మాకం చపరస్పరం। వయన్తుకింకరావిష్ణో యూయమింద్రియకింకరా॥। ఆద్యప్రభృతిహేలోకాః యూయంయూయం వయంవయం। అర్థకామపరాయూయం నారాయణపరావయం॥» అను శ్లోకార్థానుష్ఠానపరులై యుందురు. ఇట్టి అధికార్లుదా క్రింద ౯౩ – వ సూత్రములో "ఇవ్వళవుపిఱన్దవఱ్ఱ ఇవర్గళ్ వివిట్టాల్ పన్గళ్ వారాదు" అను లోకాచార్య శ్రీసూక్తికి విషయభూతులై యుందురు. ఇట్టివారు దుస్వతంత్రమై స్వప్రయత్నరూపములైన యావత్తు ప్రవృత్తులను వదలి ఈశ్వరసంకల్పాధీనులై భగవద్భాగవతాచార్య ప్రీతికరమైన కార్యములే తమకు పురుషార్థముగాయెంచి అధ్యవసించియుందురు గాని తద్వ్యతిరిక్తవిషయములలో యన్వయించరు. ఇట్టి పరమవిలక్షణమైయొప్పు ప్రవర్తనము సామాన్యలోకశాస్త్రవిధికి సమ్మతముకాకుండినను «మన్నిమిత్తకృతంపాపమపిధర్మాయకల్ప్యతే ః మామనాదృత్యధర్మోఽపి పాపంస్యాన్మత్ప్రభావతః» అని ఈశ్వరముఖోల్లాస మగుటచేత దురానుష్ఠానముక్రింద నెంతమాత్రము రాచాలదు.

(తనిచరమము) పరిత్యజ్యయను పదమందుఁజెప్పిన సర్వధర్మపరిత్యాగము స్వరూపేణత్యాజ్యమో, ఉపాయబుద్ధ్యా త్యాజ్యమో లేక ఫలబుద్ధ్యా త్యాజ్యమోయనిన, «మాఫలేషుకదాచన» అని ఇదివరకే నివృత్తిధర్మనిష్ఠునకు ఫలత్యాగము చెప్పఁబడినందున సిద్ధోపాయనిష్ఠునకు కేవలఫలత్యాగమాత్రమే త్యాగముకాదు. ధర్మములయందు పాయబుద్ధివిడుచుటే త్యాజ్యమనినపుడు (నిజకర్మాదిభక్త్యన్తమ్) కర్మాదిభక్త్యంతము అనుష్ఠేయమైయుండును. అప్పుడది వాసనారుచులతో విడువవలసిన విడుపుక్రింద జేరదు. అప్పుడు ప్రపత్తిన్ని స్వతంత్రోపాయము కాచాలదు. ప్రపన్నుడు ధర్మముల యందలి ఫలాపేక్షగాని వానియందు సాదారణులవల్లఁ జేయఁబడునట్టి సాధనబుద్ధిని గాని త్యజించుకొన్నమాత్రముచేత నదియొక విడుపుగా నేరదు. గాన పరిత్యజ్యయను పదమునకు స్వరూపత్యాగమే (చేయకవదలుటే) ముఖ్యార్థమనుట పూర్వాచార్య అంతరంగతాత్పర్యమని పూర్ణాధికారులైన శిష్టులుమాత్రమే తెలియుదురు. అయితే పూర్వాచార్యులందఱును ధర్మములందు సాధనబుద్ధియు, ఫలాపేక్షయు మాత్రము త్యజించి కర్మాదులను యథావిధి ననుష్ఠించుచువచ్చిరిగాన వారియాచారమునుబట్టి

చూచునపుడు స్వరూపత్యాగము కారాదనుట స్పష్టమగుచున్నదని వర్ణాభిమానులు కొందఱు చెప్పుదురు. పూర్వాచార్యులలో ముఖ్యులైన నాథయామున ప్రభుతులున్ను, లక్ష్మణయోగి అని ప్రసిద్ధులై దర్శనస్థాపకులైన శ్రీభాష్యకారులున్ను భగవదంశసంభూతులై భగవదాజ్ఞచే, చేతనోజ్జీవనార్థమై యవతరించిరిగాని కేవలకర్మహేతువుగా యవతరించినవారు కారనుట వ్యక్తమైనవిషయము. సమస్త చేతనోజ్జీవనమే ప్రయోజనముగా అవతరించినవారగుటచేత అప్పటి లోకస్థితికి పోలినట్టు చేతనులందరు తమయొక్క హితోపదేశములకు అభిముఖులగునట్లుగాఁ (దొంగలను పట్టవచ్చినవారు దొంగలవేషముచేతనే వారిలోకలిసి పట్టుకొనజూచినట్లు) లోకులకుఁగలిగిన పూర్వసుకృతరుచ్యానుగుణ కర్మవేషమే తాము మీదవేసుకొనిరిగాని కర్మాచరణము కావలయునని చేసినవారుకారనుట వారి యనుష్ఠానములవల్ల సుస్పష్టము. అగ్రజన్ములైన శ్రీమన్నాథమునులు తద్వ్యతిరిక్తజన్ములైన ఆళ్వార్లవద్ద ఆశ్రయించడమున్ను, "మాఱనడిపణిందుయ్ందవన్" అను శ్రీభాష్యకార్లు నమ్మాళ్వార్ల తిరువడిగానుండుట, వీరు తిరుక్కచ్చినంబిగారియెడలచేసిన అనువర్తనాదులు, పెరియనంబిగారు మాఱనేరినంబిగారికి చేసిన పుత్రకృత్యము, శ్రీభాష్యకారులు పిళ్ళై ఉరంగావెల్లిదాసులు మారనేఱినంబిగార్ల విషయమందుఁజేసిన ప్రతిపత్తి, నంబిళ్ళగారు పిళ్ళైయేఱుతిరువుడైయార్ దాసుల కరస్పర్శముచేత చేసిన అన్నశుద్ధి, నడువిల్ తిరువీధిప్పిళ్ళై భట్టర్ వానమామలైదాసుల పాదస్పర్శముచేత చేయించిన స్థలశుద్ధి, యిట్టి అనేక అనుష్ఠానములు, (సామాన్యశాస్త్రధర్మములకు విరుద్ధముగా తోచినా విశేషజ్ఞులకు అవి విహితధర్మములుగానుండినందున వర్ణధర్మాచరణమునందు వారికంతగా పాటింపులేదని చూపుచున్నది.) ఉత్తమ ఆశ్రములైన నంజీయర్ గృహస్థులైన భట్టరుగారి విషయములో నడుచుచున్న అనువర్తనాదుల వల్ల ఆశ్రమప్రవర్తన ముఖ్యము కాదనిన్ని స్వరూపధర్మమే ముఖ్యమనిన్ని ఏర్పడుచున్నది. ఇట్టిఅనుష్ఠానములు యింకా యనేకములు వుండుటయేగాక యివి శాస్త్రవిరోధములు కావని ఇతిహాస పురాణాదులవల్లనున్ను కానవచ్చును. గాన ప్రపన్నదుశిష్టులయొక్క అంతరంగాభిప్రాయానుసారిగా నుండుటయే ముఖ్యము.

అష్టశ్లోకికి శ్రీమగనంతకుల తిలకరాన కున్నత్తూరైయ్యన్ తిరుక్కుమారులైన శ్రీమాన్, అప్పన్ శ్రీనివాసాచార్యులువారు సాయించిన మణిప్రవాళ వ్యాఖ్యానగ్రంథము (పరీధావి సం॥ లో కాంచీపట్టణం శ్రీనివాస ముద్రాక్షరశాలలో ముద్రించబడిన) ౩౭౧-వ పుటలో;—"ఇవన్ఱ్రిలే నమ్మాచార్యర్ కళనుష్ఠిక్కిఱవై శిష్యపుత్రర్ కళుడైయ ఉజ్జీవనార్థమాక ఆనృశంస్యత్తాలే అనుష్ఠిక్కిఱార్ కళ్ త్తనై; ఇప్పడి అనుష్ఠియాతపోదు భగవద్విభూతిభూతరాన చేతనర్కు నాశహేతువా యిరుక్కైయావే

ఈశ్వరనుక్కు అనభిమతరావర్ కళ్. అక్కైయాలే యాతోరళవాలే లోకసఙ్గ్రహమ్ పిఱక్కుమ్ ; యాతోరళవాలే శిష్యపుత్రర్ కళుక్కు ఉజ్జీవనముణ్డామ్ ; అవ్వళవుమ్ అనుష్ఠేయమెన్ఱదాయిఱ్ఱు".—అభిసన్ధిభేదత్తాలే ప్రవృత్తిధర్మమ్ నివృత్తిధర్మమామో పాతి, ఇన్ద ప్రవృత్తిధర్మముమ్ ప్రాప్యమాకక్కడవదెన్ఱు పిళ్ళైలోకాచార్య నిశ్లోకవ్యాఖ్యానత్తిలుమ్, "వర్ణాశ్రమధర్మంగళై స్వప్రయోజనమెన్ఱనుష్ఠిక్కై అనిష్టమ్; ఆనృశంస్యత్తాలే అనుష్ఠిక్కై ఇష్టమ్" ఎన్ఱు శ్రీవచనభూషణ వ్యాఖ్యానత్తిలే ద్రావిడ బ్రహ్మదేశికరుమ్ అరుళిచ్చెయ్తార్. "స్వవర్ణస్వాశ్రమోచిత ధర్మంగళై పరార్థబుద్ధ్యా వనుష్ఠిక్కై ఇష్టమాయ్, స్వార్థబుద్ధ్యావనుష్ఠిక్కై అనిష్టమాయిరుక్కుమెన్ఱు వరవరమునివర్యరు మరుళిచ్చెయ్తార్." 32౭ పుటలో "శరణాగతనుక్కు లోకసంగ్రహాదికళిలపేక్షయిల్లామైయాలే అవనుక్కు ప్రయోజనమన్ఱు. ఇని భగవత్ప్రీతియే పరమప్రయోజనమ్." అనిన్ని 3౫౯ పుటలో "ఇవన్ సిద్ధసాధనస్వీకారం పణ్ణినవనాక్కైయాలే సాధ్యమానజ్ఞానయోగలాభమిల్లైయెన్గిఱ భయమిల్లామైయాలుం, స్వీకృతమాన వుపాయమ్ "నచ్చమామరున్దమ్" ఎన్గిఱపడియే అపథ్యసహౌషధమాక్కైయాలే పాపస్పర్శముండామెన్గిఱ భయమిల్లామైయాలుమ్ "సర్వపాపేభ్యో మోక్షయిష్యామి" ఎన్గిఱ వుపాయమైత్తెప్పఱ్ఱుక్కైయాలే స్వనివర్త్యమాయిరుప్పతోరు పాపమిల్లామైయాలే ఇవనుక్కు (లోకసంగ్రహార్థమాక శెయ్యుంకర్మంగళ్) అనుష్ఠేయమల్ల. ఇని అనుష్ఠిత్తానాకిల్, ఆనృశంస్యప్రేరితనాయనుష్ఠిత్తానామత్తనై. ఉపాయోపకారకత్వ బుద్ధ్యావన్ఱిక్కే ఆనృశంస్యత్తాలే శెయ్కైయాలే పాపవిశేషణమాన సర్వశబ్దత్తిలే అన్తర్భూతమాయ్, మోక్షయిష్యామియిలే అన్తర్భవిత్తు ఈశ్వరైక నివర్త్యమాకిఱదు. ఆకైయాలే లోకసంగ్రహార్థప్రవృత్తి ఇవనుక్కు త్యాజ్యమెన్ఱతాయిఱ్ఱు."

ఇచ్చట, అరుళాళప్పెరుమాళెమ్బెరుమానార్ సాయించిన ప్రమేయసారగ్రంథములో "కరుమత్తాల్ ఞానత్తాల్ కాణుంవగైయుండే" "వఱ్ఱియావదోర్తెన్నాల్ మఱ్ఱవైయుమ్మఱ్ఱక్కు" అను ౪, ౫ పాశురములకు శ్రీమణవాళమామునులు సాయించిన వాఖ్యానమున్ను సేవించతగ్గది,

దీనివల్ల పరోజ్జీవనముద్దేశ్యముగా మనపూర్వాచార్యులు స్వవర్ణస్వాశ్రమోచిత ధర్మములను యనుష్ఠించిరేగని శాస్త్రవిహితమైనందున విధిననుసరించి విహితధర్మమనిచేసిన వారుగాదనే యేర్పడుచున్నది, గాన స్వోజ్జీవనపరులైన శరణాగతినిష్ఠులకు ప్రయోజనములు కావనిన్ని స్వరూపవిరోధములనిన్ని తెలియతగ్గది.

యామునాచార్యులైన ఆళవందార్లు «నధర్మనిష్ఠోస్మినచాత్మవేది» ఇత్యాది శ్లోకముచేత పురుషార్థహేతువైన కర్మజ్ఞాన భక్తియోగాదులందు అన్వయము లేదనిన్ని «అకిఞ్చనః» «అనన్యగతిః» అని వీటికి అధికారమైన శక్తివాఞ్ఛాను తాపాదులు లేవు రక్షకాన్తరము లేవు «శరణ్య» అని ఉపాయభూతుని గుణపూర్తినే యనుసంధించి «త్వత్పాదమూలం శరణం ప్రపద్యే» నీతిరువడిగళును రక్షకముగా యాశ్రయించుచున్నానని సాయించిరి.

భాష్యకార్లున్ను «పితరంమాతరందారాన్» అని ప్రారంభించి «సర్వధర్మాంశ్చసంత్యజ్య» ఇత్యాది శ్లోకముచేత ప్రాప్యాభాసములను, ప్రాపకాభాసములను పరిత్యజించి త్రివిక్రముని తిరువడికళునే ఉపాయముగా స్వీకరించెదనని యితరోపాయత్యాగ పూర్వకముగా శరణవరణముచేసి ఉపాయవిశేషములలో తమకు అన్వయము లేమిని సాయించియున్నారు.

ఆఴ్వాన్ «విట్టుప్పుఱ్ఱు» అని సాయించిరి.

«నడాదూరమ్మాళ్, పిళ్ళైయెంగళాఴ్వార్ శ్రీపాదత్తిలే చరమశ్లోకార్థమ్ కేట్కచ్చెయ్‌తే, పిళ్ళై, «సర్వధర్మాన్పరిత్యజ్య» ఎన్ఱరుళిచ్చెయ్య, అమ్మాళ్, «ఇతోరు ఈశ్వరస్వాతంత్ర్యమిరున్దపడియెన్?» ఎన్న; పిళ్ళైయుమ్, «నీరిప్పడి శొల్వానెన్?, అధికారికృచ్చేర్న్దవఱ్ఱై విడచ్చొల్లిలన్ఱో నీరిప్పడిశొల్లవేండువదు. అధికారిక్కు చ్చేరాతవఱ్ఱైయన్ఱో విడచ్చొల్లిఱ్ఱు. ఆకైయాలే ఈశ్వరస్వాతంత్ర్యమన్ఱుకాణుమ్ ఇతు. అధికారిక్కు స్వరూపహానియాకైయాలే కాణుం విడచ్చొల్లిఱ్ఱు.» ఎన్ఱరుళిచ్చెయ్‌తార్. నమ్మాఴ్వార్లు «నోఱ్ఱనోన్బిలేన్» అను తిరువాయ్ మొఴ్రిలో కర్మజ్ఞానభక్తులలో తమ అనన్వయము ననుసంధించియున్నారు. తిరుమంగై యాఴ్వార్లు «ఏణిలేన్», «మఱ్ఱొరు లొన్ఱిలేన్», «నలన్దానొన్ఱుమిలేన్», «నల్ల తోరఱమ్ శెయ్‌తుమిలేన్», అని యితరోపాయశూన్యతను అధికారముగా సాయించి యున్నారు. అగ్రజన్ములైన శ్రీతొండరడిప్పొడియాఴ్వార్లు «కుళిత్తుమూన్ఱనలైయోమ్బుమ్ కుఱికొళన్దణమైతన్నై యొళిత్తిట్టేన్» అనిన్ని, «ఎన్కణిల్లై» అనిన్ని, «నిన్గణుమ్ పత్తనల్లేన్» అనిన్ని, «నమ్బీ కడల్‌వణ్ణా!» అనిన్ని, «ఎనక్కరుళ్ శెయ్‌కండాయ్» అనిన్ని కర్మయోగసవాసన త్యాగమున్ను, జ్ఞానయోగ భక్తియోగములయం దనన్వయమున్ను సాయించి, శరణ్యుని గుణపూర్తి ననుసంధించి ప్రపత్యుపాయవరణము చేసియున్నారు. «ఎమక్కాకవన్ఱో విజ్ఞానాశవతరిత్తాళ్» అని చేతనోజ్జీవనమే ఉద్దేశ్యముగా యవతరించిన ఆండాళు «కఱవైకళ్ పిన్‌శెన్ఱు కానమ్ శేర్న్దుణ్బోమ్»

అను పాశురములో ధర్మములలో తమకు అన్వయము లేమిసే సాయించియున్నారు. ఈపిళ్ళైలోకాచార్యులు స్వాములువారే శ్రీవచనభూషణ దివ్యశాస్త్రమందు ౧౧౫ మొదలు ౧౪౧ సూత్రమువరలో ఉపాయాంతరములను స్వరూపవిరోధములనియే పరిత్యజించవలయుననిన్ని అవి స్వరూపనాశకముగనుక జ్ఞానులకపాయమనిన్ని సాయించియున్నారు. జ్ఞానులనగా స్వరూపయాథాత్మ్య జ్ఞానముగలవారు, స్వరూపయాథాత్మ్య జ్ఞానముగలిగి యుపాయాన్తరవాసన సహించని యధికారులు ‹‹శరీరేచగతౌచాపి వర్తతే మేమహద్భయమ్›› అని శరీరసంబంధమునకు (ఉపాయాంతరములలో యన్వయింపజేయునని) భయపడుచుండగా అట్టి శరీరసంబంధమైన కర్మలయందు అనువర్తింతురా? అనువర్తించరు. ‹‹ప్రపన్ననుక్కు విహితవిషయనివృత్తి తన్నై ... ›› అనుచోట ప్రపన్ననుక్కు ధర్మబుద్ధ్యా ప్రవర్తికైకయుం, స్వాధికారభఙ్గకమాకైయాలే విహితవిషయత్తిలుమ్ నివృత్తివేణుమెన్ఱతాయ్త్తు, అని పెరియజీయర్ను; నివృత్తస్వరూపవిరోధిత్వేన నిషిద్ధతమమని, ఆయిస్వామిన్ని; వ్యాఖ్యానము సాయించియున్నారు.

ఈగ్రంధమునందే ౭౪ సూత్రమునకు పెరియజీయర్ సాయించిన వ్యాఖ్యయందు సాధనబుద్ధిరహితముగా లోకోపవాద భీత్యాదులవల్ల చేయబడు కర్మములున్ను, త్యజించిన ఉపాయములతో అన్వితమయ్యే తీరుననిన్ని, ఆనృశంసప్రధానులుగా యనుష్ఠించినను యెగరవేశిన రాయి ఆకాశములోనిలువనట్లు అవియును నొకఫలముతో సంబంధపడునుగాన యివియు మోక్షప్రతిబంధక పాపశబ్దవాచ్యముగా తనిచరమ శ్రీసూక్తివల్ల నిర్ణయించియున్నారు. చరమశ్లోకమహిమను సాయించు కల్పకాచార్యులు ప్రకరణము ౭ సూ. ౪ లో ‹‹సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకశరణంవ్రజ›› అను పూర్వార్థశ్లోకమునకు ‹‹యోగ్యతాపాదక యుక్తధర్మములెల్ల రుచివాసనలతోడ రోసివిడచి । యుపదేష్టనైన నన్నొకని నిరపాయసాధనముగనమ్ము›› అని యానతిచ్చియున్నారు.

ప్ర. ౪. సూ-౧౨ లో కర్మజ్ఞానభక్తులకున్ను ప్రపత్తికిన్ని యుండు తారతమ్యతను సాయించియున్నారు. సీ॥ అందలంబునుమోయు నతనందురాజుకుఁ గలకృపకర్మఠుండుఁ గలదుహరికి। మంత్రయోగ్యుండైన మంత్ర్యాందుఁగలకృప జ్ఞాననిష్ఠునియందు శౌరికుండు। పైలయాలియందును వృత్తిఁజేసెడికృప భక్తినిష్ఠునియందుఁ బరునికుండు। నతిసాధ్వియైనయిల్లాలందుఁగలకృప సన్యస్తభరునందు స్వామికుండు। ననివివేకించిమది నిజహితమ్మలరసి । కర్మయోగాదినిష్ఠా ప్రకారమెఱిఁగి ॥ మానియాత్మేశ్వరుండగు మాధవునికి । స్వాత్మనర్పింతురని లక్ష్మణార్యులనిరి॥

ప్ర. ౯. సూ. ౭. «సాధనాంతరమెల్ల శరణాగతవిరోధి ప్రాకృతభోగాశఫలవిరోధి» అనిన్ని యానతిచ్చియున్నారు.

ప్ర. ౬. సూ. ౧౭. సీ॥ ఈశ్వరపరతంత్రుఁడీ యాత్మ తాననియరసి స్వయత్నసాధ్యములుమాని । యాత్మాపహారరూపాపరాధము దీరమంత్రరత్నం బొకమాటను డివి । యనుమతిరప్పించియాత్మేశ్వరుఁడుదానె తనకిష్టముగనన్నుఁదన్నుఁజేర్చు । నని విశ్వసించినయతఁడీశ్వరునిజేరి యానందనిర్భరుండగుచునుండు। నిచటనచటను నెచటను నితనికతఁడు । భర్తయును నంతరాత్మయుఁ బాలకుఁడును । నతనికితఁడును దేహంబు నాలుగనుక । యనుచులక్ష్మణమునివరుండానతిచ్చు॥

ప్ర. ౬. సూ. ౧౮. సీ॥ సర్వేశ్వరునినమ్మఁజాలక తాఁ గొన్నిసాధనాంతరములజరిపెనేని । హనుమంతునింద్రజిత్తస్త్రంబుచేఁగట్టి విశ్వసించఁగనొచ్చు విధమువచ్చు । నపచారములుదన్ను నంటకుండఁగమెలఁగి తప్పించుకొనిపోవఁదలయఁడేని । యభిమన్యుఁడావ్యూహమందుఁ జొచ్చివలవెడలనేరక సమయువిధమువచ్చుఁ । దప్పుదీరెండు విఘ్నముల్ తప్పెనేని । చెప్పనేటికిమోక్షంబు చేతిలోని । దప్పువాఁడింతె లక్ష్మీశుఁడనుచుదయను । దెలియజెప్పెనులక్ష్మణ దేశికుండు॥

ప్ర. ౬. సూ. ౧౯. సీ॥ సత్కర్మనిరతులు సాంఖ్యయోగజ్ఞులు భక్తులుననసెందుఁ బ్రజలునైన । శరణాగతాచ్యుతజనవైభవముఁ జూడనందులోఁ గోటిభాగార్హతయును । లేదిందుదుష్కరత్వాదివైషమ్యంబుగలదది తత్ప్రసంగములుమాని । భరసమర్పణఁజేయుభగవత్ప్రపన్నులనెఱిఁగి వారభిమానమించుకైనఁ । గలుగవర్తించనేర్చిన ఘనులఁజేరి । సేవజేయుచునుండెడు చేతనులకు । మోక్షపరచేతిదైయుండు ముందుగానె । కొదువలేదనె లక్ష్మణగురువరుండు॥

ధర్మాచరణము భగవదిష్టమని శాస్త్రము లుద్ఘోషించుచుండఁగా నవి భగవన్ముఖోల్లాస కైంకర్యముక్రింద నన్వయించి యాచరించుట దోషమెట్లగునని కొందరు ప్రశ్నింతురు. అగ్నియని తెలిసి యీనిప్పు హోమసంబంధమైనదిగాన దీనిచేత చెడుగు కలుగదని స్పృశించువానికి, దానిసహజధర్మప్రకారము కాలుటయే జరిగినట్లు, ధర్మములను ఫలాపేక్షగాని, సాధనబుద్ధిసహితముగాఁ గాని యెట్లాచరించినను తత్ఫలమను భవించవలసినదే యుండును. ఈశ్వరుఁడు దయాళుఁడుగాన రాజస తామస ప్రకృతులైన చేతనులకుఁ గ్రమముగా శాస్త్రవిశ్వాసమును, దేహమునకు ఆత్మవేరను వివేకమును గలిగెనేని కొంతకాలమునకైన ఉజ్జీవనదశకు రాఁగలరని ప్రవృత్తినివృత్త్యాత్మక

మైన ధర్మములను సామాన్యశాస్త్రమందు విధించెను. అట్టిధర్మములు సామాన్యులకు తగునేగాని సిద్ధోపాయస్వీకారముచేసి «తృణీకృతవిరించాది నిరంకుశైశ్వర్యతయః» అని యుండు అధికారులకొఱకు కాదనియు, పూర్ణాధికారులు విశేషశాస్త్రనిష్ఠులై యుండుచే భగవన్ముఖోల్లాస కైంకర్య కరణమనియు తెలియవలయును.

పైజెప్పిన యావదంశములను నిగమించి చూచునపుడు స్వరూపయాథాత్మ్యజ్ఞానోదయమైన శరణాగతినిష్ఠులు యెట్లు తమ్మును తలచియుందురనిన «నాహంబ్రహ్మా నచనరపతిర్నాపివై శ్యోనశూద్రో । నోవావర్ణీనచగృహపతి ర్నోవనస్థోయతిర్వా । కిన్తుశ్రీమద్భువనభవన స్థిత్యపాయైకహేతో । ర్లక్ష్మీభర్తుర్నరహరితనో ర్దాసదాసస్య దాసః॥ నాహందేవోనమర్త్యోవా నతిర్యక్స్థావరోపివా । జ్ఞానానన్దమయస్త్వాత్మా శేషోహిపరమాత్మనః॥ అనిన్ని «కుడియుం కులముమెల్లాం కోకనగైక్కెళ్వర్, అడియార్క్కువనడియేయాగుం» అనిన్ని తమ్మునుభావించి తదనుగుణమై స్వరూపానురూపమైన భగవద్భాగవత ముఖోల్లాసమైన కైంకర్యమే తమకు పురుషార్థమని చేయుచుందురుగాని, ఆత్మస్వరూపమునకు విరోధములై దేవతాంతరములను ప్రతిసంబంధులుగా గలిగి అహంకారగర్భితమైన కార్యములం దన్వయించరు.

ము-కల్పకము ప్ర. ౯. సూ, ౧౨. సీ॥ కర్మభేదమెకాని గానముదేవాది తారతమ్యమునకు దారివేఱె । దేహభేదమెకాని తేజోమయాత్మ సంస్థానంబునకువేఱె జాతిలేదు । భేదబుద్ధియెకాని పృధగవస్థితిలేదు తనకునీశ్వరునకు దాస్యమునకుఁ। దలఁపుభేదమెకాని తథ్యమన్యములేదు స్వగతపరగతవరణ సంధి తెలియ । ననుచునున్నట్టె తెలిసిన యందఱికిని । సిద్ధమైయుండుమోక్షంబు చేతనులకు। బుద్ధిభేదంబుచేనది పొసఁగకుండు । ననుచులక్ష్మణమునివరుం డానతిచ్చు॥

ఇట్టి యనుష్ఠానము అధికృతాధికారమనిన్ని సర్వాధికారముగాదనిన్ని యీయర్థములు సామాన్యులైన అనధికారులకు వెల్లడించిన అనర్థహేతువనిన్ని కొందరు యభిప్రాయపడుచున్నారు. అప్పట్లో యీశ్లోకార్థ శ్రవణమునకే అందరు అర్హులుకారనవలసివచ్చును. దీనికి సర్వాధికారభంగము కలుగును. లేక అంతరంగాభిప్రాయమును మరుగుపరచి అధికారానుగుణమైన అర్థముచెప్పిన వంచకత్వదోషము సిద్ధించునని భయపడెదను.

ఈ యావత్తు విషయములను చక్కగా పరిశీలించి, యుక్తాయుక్త వివేకముతో యదాధికార మనుష్ఠేయము. శరణాగతనిష్ఠుఁడు కానివాడు యీ సర్వధర్మపరిత్యా

గము చేసినయెడల "ఆజ్ఞాచ్ఛేదీమమద్రోహీ" అను శ్రీసూక్తికివిషయమగునని యెఱుఁగ వలయు. (ము-కల్పకము, ప్ర. ౮. సూ. ౧౭ లో) శరణాగతనిష్ఠుఁడు తనయందుపదేశ బలముచేత నెవ్వరుసేయరాని కార్యములు చేసి నిర్వహించునని యానతిచ్చియున్నారు.

సీ॥ మంత్రప్రభావంబు మహినెఱింగినవాఁడు క్రూరసర్పములీలఁ గేలబట్టు। నగ్నిసం స్తంభనమందు నిరూఢుఁడైచిచ్చులో వెఱవకజొచ్చియుండు। నౌషధసామర్థ్యమర సినరోగియే చేయరానియపథ్యశీలుఁడౌను। సిద్ధధర్మమువిశ్వసించిన పురుషుండు ధర్మాం తరంబులఁ దలచకుండు। భారమొడిగినవాఁడె నిర్భరుఁడునగును। ననుచుఁదెలిసినవారు మహాత్ములందుఁ। గొదువవలేదోఁచెన్నేనియు గుణముగానె। తెలియవలెననెలక్ష్మణ దేశికుండు॥ సంసారి, ముముక్షువులలో ఉపాసకుఁడు వీర్లు సామాన్యశాస్త్రమునకు బద్ధులు, శరణాగతిచేశిన ప్రపత్తినిష్ఠునికే ఈ విశేషశాస్త్రానుష్ఠానము కర్తవ్యముగా నుండును. ఇట్టి విశేషశాస్త్రానుష్ఠానపరులగు ప్రపన్నులను నిందించవలదు. అట్లునిందిం చినవారు "మద్భక్తాన్ శ్రోత్రియోనిందన్ సద్యశ్చండాలతాంవ్రజేత్" అను భగవద్వా క్యమునకు పాత్రభూతులగుదురని యెఱుఁగవలయు. ముముక్షుజనకల్పకము అష్టమ ప్రకరణము సూ. ౧౪ లో భాగవతాపచార క్రూరమును సాయించియున్నారు.

సీ॥ అంబరీషునకుఁదానపచారపడితొల్లి దూర్వాసుఁడనుఋషిదూలఁబోయె। సభ్యుఁడ య్యు వసుపరిచరవసువనురాజు పక్షపాతంబాడి భంగపడియె। నటుగాఁగభాగవతాప చారక్రౌర్యమది వైనతేయవృత్తాంతమందె। కానవచ్చును మతికథలందు వినఁబడుదొ డ్డకొంచంబని తోసిపోదు॥ అదియుబహువిధమై వీరియభిజనాదు। లర్థకామాదులను మూలమగుచువచ్చు। సావధానంబుతోదాని జూడబోక। యుండవలెననె లక్ష్మణ యోగివరుఁడు॥

సూ-౨౨. సీ॥ ఏవర్ణమైనను నేయాశ్రయంబైన నేదేహమెత్తిన నెచటనున్న। నెట్టివర్తనులైన హీనావయవులైన వావివయసులనెంత వారలైనఁ। గుత్సితతనులైన గుణహీనులైనను నొకటిచేయకయున్న నొదిగియున్న। హరిదాసులను స్వాములను బుద్ధిసేవించి నమ్రులై తన్నియమనంబుచేసి। యంతరాత్మైన సర్వేశుఁడాదరింప। నుండ నేర్చినవారికి నుర్విలోన। నొకరుసరిలేరు నిత్యులందుండికేని। తెలియవలెనని లక్ష్మణ దేశికుండు॥

మూ. (మామ్)

వ్యా. సర్వరక్షకనాయ్, ఉనక్కు కైకాయాళాయ్,

తా. 1 ఇట్లు ద్వితీయపదార్థమును ముగించి తృతీయ పదము యొక్క అర్థమును సాయించుచున్నారు "మామ్" అని ప్రారంభించి. "మామ్" అనగా నన్ను అని ప్రతిపదము.

వ్యా. 'మామ్' అను శబ్దమునకు అర్థము సాయించుచున్నారు. "సర్వరక్షకనాయ్" ఇత్యాది సూత్రమువల్ల. అనఁగా, మనరక్షణమును వీడుచేయునో చేయఁడో అని సంశయించకుండునట్లు 2 సర్వులయొక్క రక్షణమందు దీక్షితుఁడై; తన పెద్దరికమును మనఁ హీనతను చూచి మనతో కలియక యుండునోయని తలవకుండునట్లు "సేనయోరుభయోర్మధ్యే రథంస్థాపయ" (రెండు సేనల మధ్య రథమునునిలుపుము) అని యాజ్ఞాపించి పనిచేయించుకొనుటకు అర్హమైనట్లు నీకు కింకరుఁడై;

1 (ఇట్లు ద్వితీయపదార్థమును ముగించి) అనఁగా, అనిత్యములై, అనేకములై, అసాధ్యములై, దుర్లభములై, స్వరూపవిరోధములై, సాపేక్షములై, అచేతనములై, సాపాయములై, అవశములై, అధికృతాధికారములై, విలంబ్యఫల ప్రదములై యుండు ఆభాసధర్మములను క్రింది రెండుపదములచేతఁ త్యాజ్యములు-గ జెప్పిముగించి, వీనికంటె స్వీకార్యమైన సిద్ధసాధనము - నిత్యమై, ఏకమై, స్థిరమై, సులభమై, స్వరూపానురూపమై, నిరపేక్షమై, పరమచేతనమై, నిరపాయమై, ప్రబలప్రమాణమై, సర్వశక్తమై, సర్వాధికారమై, అవిలంబ్య ఫలప్రదమై యుండుటంబట్టి విలక్షణమైన ఉపాయమును 'మామ్' అను పదముచేత సాయించుచున్నారు.

(అష్టశ్లోకివ్యాఖ్యానమ్ పుట ౩౭౩.) "త్యాగాంగకమాన స్వీకారత్తై చొల్లక్కడవతాకక్కణ్ణు స్వీకారవిషయత్తై "మామ్" ఎన్గిఱపదత్తాలే శొల్లుగిఱదు. ఇవ్విడత్తిలే "పతర్కూట్టైవిట్టు మణిపర్వతత్తై యండై కొండాప్పోలేయిరే ఇంద విధిద్వయమ్" ఎన్ఱు నంబిళ్ళైయరుళిచ్చెయ్వరెన్ఱు ఆచ్చాన్పిళ్ళైయరుళిచ్చెయ్వర్. సాధనాంతరంగళ్, సాధ్యంగళాయ్, అచేతనంగళాయ్, అనేకంగళాయ్ యిరుక్కైయాలే పతర్కూట్టైవిట్టు. ఇవన్ - సిద్ధస్వరూపనాయ్, పరమచేతననాకైయాలే పర్వతమ్."

2 సర్వులయొక్క రక్షణమందు దీక్షితుఁడు అనుచోట అధికారానుగుణ సర్వరక్షకత్వసూచకము.

ఉన్నిశైవుపార్త్తు, ఉన్దోషత్తైభోగ్యమాకక్కొణ్డు, ఉనక్కప్పాకలా య్, నీరోశుడుమాపోలే శేర్ప్పారే పిరిక్కమ్పోతుమ్ విడమాట్టాతే రక్షిక్కిఅ వెన్నై.

30. ఇత్తాల్ పరవ్యూహజ్ఞళై యుమ్, దేవతాన్తర్యామిత్వత్తైయుమ్

---

నిన్ను రక్షించుటయందుగల యాసచేత "రక్ష్యాపేక్షాం ప్రతీక్షతే" (రక్ష్యభూతుడైన చేతనుని రక్ష్యాపేక్షను యెదురుచూచుచున్నాడు) అనునట్లు రక్ష్యభూతుఁడైన నీ సమ్మతిని చూచుచు; మనదోషమును చూచి విడుచునోయని భయపడవలసినది లేనటుల "అస్థానస్నేహకారుణ్య ధర్మాఽధర్మధియాకులం" (తగనిస్థలమందు స్నేహకారుణ్యము లును, ధర్మమునం దధర్మబుద్ధియుగల) నీదోషములను భోగ్యముగా దలచి; 1 అకించనులై అనన్యగతికులైనవారికి రక్షకుఁడుగనుక రక్ష్య భూతుఁడైన నీవును, నీ మాతా పితృ దేవతాంతరములున్ను నీకు రక్ష కముకాని సమయమందున్ను 2 నీకు రక్షకుఁడై ; శైత్యమే స్వభావ ముగాగల జలము ఉష్ణమైనటువలె, అపరాధములను క్షమింపఁజేసి 3 ఘటకత్వముచేయు పురుషకారభూతులైన పిరాట్టియే దోషమును చూపి వేరుపరచునపుడున్ను, (చేతనులను) విడిచి జీవించచాలనిస్వభా వముతో నాదాసులట్టి యపరాధములు చేయరని యెదిరించి యొకపక్ష ములో నిలచి రక్షించుచున్న, నన్ను యని యీసూత్రార్థము.

30. "మామ్" (నన్ను) అని తనవిభవరూపమును చూపుట

---

1 అకించన, అనన్యగతికులు - ఉపాయాంతర, రక్షకాంతరములను త్యాగ ముచేసినవారు.

2 నీకు రక్షకుడు అనుచోట కృపానుగుణ రక్షకత్వ సూచకముగనుక పునరు క్తిదోషము కాచాలదు.

3 ఘటకత్వము - ఈశ్వరసన్నిధిలో చేర్చడము; యొకపక్షములో నిలిచి - చేతనునిపక్షములో నిలచి.

కవిర్కిఱతు.

౩౧. థర్మసంస్థాపనం పణ్ణప్పిఱన్దవర్క్కు తానే, సర్వధర్మఙ్గళైయుమ్

చేత వేఱుపఱచబడు వానిని సాధించుచున్నారు. "ఇత్తాల్" యిత్యాది సూత్రముచేత. అనఁగా, నన్ను అని సాయించడమువలన, అవతరించి దృష్టికి గోచరుడై, సమీపించి నిలిచియున్న తన్ను వరణీయునిగా సెప్పిన ఈ "మామ్" అనుపదముచేత, దేశదూరమువల్ల సేవించుటకున్ను సమీపించుటకున్ను యోగ్యముకాకయుండు పరవ్యూహముల నున్ను, అసాధారణ తిరుమేని గలవాఁడుగాక ఉపాయాంతరనిష్ఠుల కుద్దేశ్యమైయున్న అగ్నీంద్రాది దేవతాంతర్యామిత్వమును వేరుచేయుచున్నదని యీసూత్రార్థము. ఇందువల్ల ఆశ్రయించుటకు విషయమైన ఈశ్వరుఁడు, అగ్నీంద్రాది దేవతాంతర్యామిగానుండు సామాన్య విగ్రహుఁడుగాక అసాధారణ దివ్యమంగళ విగ్రహవిశిష్టమైన వ్యక్తినే యిచ్చట నుద్దేశ్యముగా చూపఁబడుచున్నదని భావము.

(ఇచ్చట అర్చావతారమును నివర్తించకపోవడము ఆ యర్చావతారము వెనుకటివారున్ను యాశ్రయించవలసిన విషయమై, ఆళ్వార్ల ప్రపత్తికివిషయమై, విభవము ననుసరించి నుండునదై నందున ఆయర్చావతార వ్యావృత్తిని సాదించరైరి.)

౩౧. అన్నిధర్మములను వదలి తన్ను ఆశ్రయించమని విధించుటచేత ఫలితమైన యొక అర్థవిశేషమును సాయించుచున్నారు "ధర్మసంస్థాపనమ్" యిత్యాది వాక్యమువల్ల, అనఁగా, 1 "ధర్మసంస్థాపనార్థాయ సంభవామి" (ధర్మములనుస్థాపించుటకు అవతరించుచున్నాను) అనునటుల తన్ను పొందుటకు సాధనధర్మములను స్థాపించుటకు అవత

1 శ్రీభ - గీ. అధ్యా-౪. శ్లో-౮. "పరిత్రాణాయసాధూనాం వినాశాయచదుష్కృతామ్ । ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే" (అహమ్ - నేను);

విట్టు ఎన్నై ప్పఱ్ఱిగ్గైయాలే, సాక్షాద్ధర్మమ్, తానేయెన్గిఱతు.
3౨. ఇత్తాల్ విట్టసాధనఙ్గళై క్కాట్టిల్ ఇజ్ఞ్లొల్లుకిఱతు.

---

రించిన తానే, మోక్షసాధనములుగా శాస్త్రసిద్ధమైన యన్నిధర్మములను వదలి “నన్ను యాశ్రయించు” అని విధించుటవల్ల యవి సాక్షాద్ధర్మములుకావు, స్థాపించదగిన సాక్షాద్ధర్మము “కృష్ణంధర్మం సనాతనం”అనునట్లు అనాదిధర్మంతానే యనువిషయము చెప్పుచున్నదనియీ సూత్రార్థము. ధర్మసంస్థాపనాయ అనిచెప్పక ధర్మసంస్థాపనార్థాయ యని సాయించుటచేత ధర్మసంస్థాపనమువల్ల తనకు (ఈశ్వరునికి)ఒక ప్రయోజనము సిద్ధించడము లేదనిన్ని, యదియే తనకుప్రయోజనముగా చేయుచున్నాడనే యర్థము సూచింపబడుచున్నది.

3౨. 1 సాక్షాద్ధర్మము తానే యనుటవల్ల యేర్పడిన యాధిక్యమును సాయించుచున్నారు, “ఇత్తాల్”యిత్యాదినూక్తివల్ల. అనఁగాయీ రీతిసాక్షాద్ధర్మము తానేయని సాదించుటవల్ల2క్రిందవిడిచిన సాధనాంతరములకన్నను యీసాధనమునకుగల యాధిక్యముచెప్పఁబడుచున్నది.

---

సాధూనామ్ - సాధువులయొక్క, పరిత్రాణాయ - రక్షణము కొఱకును, దుష్కృతామ్ - దుర్మార్గులయొక్క, వినాశాయ - నాశముకొఱకును, ధర్మసంస్థాపనార్థాయ-చ - ధర్మమును లెస్సగా స్థాపించుటకొఱకును, యుగేయుగే - ప్రతియుగమునందును, సంభవామి - జన్మించుచున్నాను. అనిశ్లోకార్థము. ఇచ్చట సాధువులనఁగా ధర్మములదప్పక నడచువారు. దుర్మార్గులు అధర్మవృత్తిలోనుండువారు. క్రియాపదము ‘భవామి’ ‘సంభవామి’ అనివుండుటవల్ల వేదపురుషుఁడు మొదలగువారిద్వారా సాధ్య ధర్మములనున్ను, తానే యవతరించి సిద్ధధర్మమునున్ను ప్రవర్తింపజేయుటను చెప్పుచున్నది.

1 సాక్షాద్ధర్మము అనగా అద్వారకధర్మమనుట. కర్మజ్ఞానాదులు ఈశ్వర ద్వారా ధర్మములగుటచేత అద్వారకములుకావు. అద్వారకమనగా తన్ను యాశ్రయించినవారికి ఫలసిద్ధి తనవల్లనే కలుగజేయునట్లుండుట.

2 క్రిందవిడచిన సాధనాంతరములు - “సర్వధర్మాన్ పరిత్యజ్య” అనుచోట త్యాజ్యముగా విధించబడిన కర్మాద్యుపాయములు.

33. అతావతు, సిద్ధమాయ్, పరమచేతనమాయ్, సర్వశక్తియాయ్, నిరపాయమాయ్, ప్రాప్తమాయ్, సహాయాన్తర నిరపేక్షమాయిరుక్కై.

3౪. మఱ్ఱై యుపాయఙ్గళ్, సాధ్యఙ్గళాకైయాలే, స్వరూపసిద్ధియిల్ చేతననై యపేక్షిత్తిరుక్కుమ్, అచేతనఙ్గళుమా యశక్తఙ్గళుమా

33. ఆయాధిక్యము యిట్టిదని యానతిచ్చుచున్నారు "అతావతు" ఇత్యాదిసూత్రముచేత. అనగా, క్రిందవిడచిన సాధనములకన్నను దీనికిగల యాధిక్యము యేదియన; చేతనప్రవృత్తిచేత తనస్వరూపమును కలుగఁజేసుకొనవలసిన యావశ్యకత్వము లేక అనాదిధర్మమగుటచేత సిద్ధమై; "యస్సర్వజ్ఞస్సర్వవిత్" (ఎవడు సర్వజ్ఞుడో, అన్నిపదార్థములయొక్క విశేషజ్ఞానము కలవాడో) యిత్యాదులందు చెప్పుచున్న సర్వజ్ఞమైన విషయమగుటచేత పరమచేతనమై; "పరాస్యశక్తిర్వివిధైవశ్రూయతే" (సర్వేశ్వరునిశక్తి గొప్పదిగానుయనేకవిధములుగాను శ్రుతులచే చెప్పబడుచున్నది) అన్నట్లు సర్వశక్తియై; చేతనునిచే సాధ్యమై మధ్యలో విఘ్నములు వచ్చుటకు యవకాశము కలుగునట్లుండక సిద్ధమైనవస్తువైనందున విఘ్నములు లేనిదై; పరతంత్రుడైన యీచేతన స్వరూపమునకు యనుకూలమై; పైజెప్పిన కారణములచేత సహాయాంతర నిరపేక్షమైయుండు యాధిక్యమని యీసూత్రార్థము.

3౪. పైజెప్పిన సహాయాంతర నిరపేక్షత్వమును సహేతుకముగా స్థాపించుచున్నారు. "మఱ్ఱైయుపాయంగళ్" యిత్యాది మూడు వాక్యములవల్ల. అనగా, ఇతరోపాయములు చేతనప్రవృత్తివల్ల సాధింపబడునవి యవుటచేత వాటియొక్క స్వరూపము సిద్ధించునపుడు చేతనప్రవృత్తిని యపేక్షించియుండును; వీనికి జేయవలసినవి తెలియుటకున్ను, వానినిచేసి ముగించుటకున్ను యోగ్యత లేని అచేతనములును

యిరుక్కైయాలే, కార్యసిద్ధియిల్ ఈశ్వరనై అపేక్షిత్తిరుక్కుమ్. ఇన్ద ఉపాయమ్ అవఱ్ఱుక్కెతిర్ త్తట్టా యిరుక్కై యాలే, ఇతరనిరపేక్షమాయిరుక్కుమ్ ;

౩౫. ఇతిలే

అశక్తములును యగుటచేత, చేతనుని యిష్టప్రాప్తి యనిష్టపరిహార మగు కార్యసిద్ధిసమయమున 1 "ఫలమత ఉపపత్తేః" (ఇష్టానిష్టప్రాప్తి పరిహారరూపఫలము సర్వేశ్వరునివల్ల సిద్ధించును) అన్నట్లు ఫలప్రద త్వోపయోగియైన సర్వశక్తిత్వాద్యుపకరణము గల సర్వేశ్వరుణ్ణి యపేక్షించియుండును. 2 ఈయుపాయము సిద్ధత్వ, పరమచేతనత్వ సర్వశక్తిత్వములచేతవాటికి ప్రతికోటిగానున్నందున 3 అన్యాపేక్ష లేని వాడుగా నుండునని యీసూత్రార్థము.

౩౬. 4 ఇకను 5 యీపదమందు ఆశ్రయణః సౌకర్యాపాదకము

---

1 "ఫలమత ఉపపత్తేః—ఫలమ్ - ఇష్టప్రాప్తి, అనిష్టనివారణ రూపముగా నుండు ఫలము, అతః - సర్వేశ్వరునివల్ల సిద్ధించును; ఎందువల్లననగా, ఉపపత్తేః - ఇష్టాఽనిష్టప్రాప్తిపరిహారమైన ఫలమును యొసగి యిచ్చుటకుతగిన జ్ఞానశక్తులు రెండున్ను పూర్ణముగా నుండుటవల్ల.

2 ఈ యుపాయము - ఈశ్వరోపాయమైన సిద్ధోపాయము.

3 అన్యాపేక్షలేనివాడు - తానుగాని ఇతరములను అపేక్షించనివాడు.

4 ఇకను యనగా "మామ్" అనుపదమున కర్థమును, దానివల్ల నివర్తింపబడిన వాటిని, దాని తాత్పర్యమును, ఉపాయాంతరముల కన్నను యీ సిద్ధోపాయమునకు గల యాధిక్యమును, అయాధిక్య మిట్టిదనిన్ని, యీయుపాయముయొక్క నిరపేక్షత్వమునకు కారణమును సాయించినతరువాత యనిభావము.

5 ఈపదమనగా యీ "మామ్" అనుపదము ; గుణవిశేషములు - వాత్సల్యాది గుణములు ; ధర్మము నుంచి - స్వధర్మమైన యుద్ధమునుంచి ; దోషము - తనకు విహితమైన యుద్ధమునుచేయమి దోషము ; దీనివల్ల అర్జునునికి అకృత్యకరణ దోషము లేకపోయినను కృత్యాఽకరణ రూపదోషము వున్నదని చెప్పబడుచున్నది. లేక త్యక్త

వాత్సల్య స్వామిత్వ

లైనగుణవిశేషణము లన్నియు ప్రకాశించువిధము నానతిచ్చుచున్నారు "ఇతి తే" ఇత్యాదివాక్యముచేత. అనగా, అధర్మబుద్ధిచేత ధర్మము నుంచి నివృత్తుడైన అర్జునుని దోషమును చూడక యపేక్షితార్థములను కృపజేయుటచేత, 1 వాత్సల్యము ప్రకాశించుచున్నది. తనయొక్క పరత్వమును పలుమాఱులు ఆనతిచ్చినదేకాక అర్జునుఁడు ప్రత్యక్షముగ సేవించునట్లు చేసినందుచేత 2 స్వామిత్వము ప్రకాశించుచున్నది.

---

యునికి యుద్ధసమయములో కలుగు ఆనృశంస్యమున్ను దోషముగాన అకృత్యకరణదోషముగాను చెప్పవచ్చును.

1 వాత్సల్యమనగా దోషభోగ్యత్వము, అప్పుడుయీనిన దూడవిషయములో తల్లియైన గోవుకు కలుగు వ్యామోహము. అదెట్టిదనిన - అడుసు నేలలోపడిన గడ్డిని కాలితో చిమ్మివేయు ధేనువు తనగర్భములోనుండి వెలుపడిన వత్సముయొక్క మాలిన్యమంతయు భోగ్యముగా తనజిహ్వతో నాకి శుద్ధపరచి, తనపాలచేత దానిపెంచి దానిని సమీపించిన విరోధులను కొమ్ములతో పొడిచి కాలితోతన్ని తొలగజేయునట్లు ఈశ్వరుఁడును శ్రీదేవియొక్క సాన్నిధ్యముచేత చేతనదోషములను భోగ్యపఱచుకొని తన కల్యాణగుణములనే పాలుచేత ధరింపఁజేసి విరోధులను దొలఁగజేయునది. ఇది దోషులను దండించుమని శాసించునట్టి శాస్త్రమునకు విరోధము కాదాయనిన, భగవద్విముఖులైన వారియెడల శిక్షలును, భగవత్శరణాగతులయెడల రక్షకమును శాస్త్రము విధించుటచేత తనకృపాదిగుణములకు ప్రయోజనమగునట్లు అనుకూలురు దోషులైనను, వారి నంగీకరించుట యెంతమాత్రము విరోధము కానేరదు.

2 స్వామిత్వమనఁగా, తనకంటె వేఱైనవస్తువులయందు తనదియనుఅభిమానము కలిగి విముఖమైన దశయందును విడువక రక్షణచింతయే చేసి సత్తనుకలిగించి సౌహార్దముచేత నిర్హేతుక యాదృచ్ఛిక సుకృతములంగల్పించి అద్వేషాభిముఖ్యరుచి, సత్సంభాషణ, ఆచార్యసమాశ్రయణాదులం గలిగించి మంచిజ్ఞానమును, సిద్ధసాధననిష్ఠయు, ప్రాప్యరుచియుంబుట్టించి, విరోధుల నివృత్తిచేసి, అర్చిరాదిమార్గముగఁ పరమపదప్రాప్తి గలిగించి స్వరూపప్రకాశమును, పరభక్తి, పరజ్ఞాన, పరమభక్తులను బుట్టించి భగవదనుభవమును తదనుభవజనిత ప్రీతిచే చేయుంబడు నిత్యకైంకర్యప్రాప్తియుం గృపచేయునట్టి పరమశేషిత్వము.

సౌశీల్య సౌలభ్యజ్గళాకియ గుణవిశేషజ్గళ్ నేరాక ప్రకాశిక్కిఉదు.

---

"హేకృష్ణ! హేయాదవ!" అని అర్జునుఁడు తన్నుపిలుచునట్లు వాని తోఁకలిసి వర్తించుటచేత 1 సౌశీల్యము ప్రకాశించుచున్నది. పంచోప నిషణ్మయమైన (అప్రాకృతమైన) తన తిరుమేనును దృష్టికి గోచర మగునట్లు చేయుటచేత 2 సౌలభ్యము ప్రకాశించుచున్నదని యీవా క్యార్థము. "గుణవిశేషంగళ్" అనుటచే ఆశ్రయణమున కపేక్షిత ములైనవి యనిన్ని, "నేరాక ప్రకాశిక్కిఉదు" యనగా సుస్పష్ట ముగా ప్రకాశించుచున్నవి యని యర్థము.

---

తనయొక్క పరత్వమును అర్జునునికి ప్రకాశింపించినమాత్రముచేతనే స్వామిత్వ సూచకమగునాయనిన - అర్జును డపేక్షించినపుడు తనయొక్క పరత్వమును ప్రత్య క్షింప జేయనియెడల వానికి కలుగు సుఖదుఃఖములు రెండున్ను తనదని చెప్పబడునట్టి (హేతుభూతమైన సంబంధము) స్వామిత్వము గనుక పరత్వప్రకాశకము స్వామిత్వ ప్రకాశకమని భావము.

1 సౌశీల్యమనఁగా, నిత్యసూరి నిర్వాహకత్వముచేతను, ఉభయ విభూతియో గముచేతను, శ్రీదేవితో దనకుఁగల శేర్తిచేతను, నిరంకుశ వైభవముకలిగి మహాదతిశ యుఁడైయుండు సర్వేశ్వరుఁడు ఆశ్రయవైముఖ్యము పుట్టకుండునట్లు తన అతిశయ మును ఎదుటి నికృష్టతయును జూడక వ్రేపల్లెయందు గొల్లలతోఁ గూడియుండునట్లు మందులగు చేతనులతోఁగూడ నెడతెగని కూడికగలవాఁడై యుండుట.

2 సౌలభ్యమనఁగా, అతీంద్రియుఁడైన తన్నుఁ జేతనుఁడు కన్నులార సేవించి యాశ్రయించఁ దగినట్టు నయనవిషయతాంగత్వము గలిగియుండుట. అర్జునునకు సారథి గానుండి "మామ్" యని చూపించినవేషము సౌలభ్యముకాదాయనిన, అది ఒక అర్జు నునివిషయములో మాత్రము చూపింపఁబడినదేగాని సార్వకాలికము సకలజన విషయ మైన సౌలభ్యత కానేరదు. గాన అర్చావతారములయందే సౌలభ్యతకు పూర్తియని తెలియవలయు.

మీదవివరించిన గుణచతుష్కము చేతనుఁడు తనదోషములను ఈశ్వరస్వాతం త్ర్యమునుజూచి విముఖుఁడై పోకుండ, ఎట్టివానినైన ఈశ్వరుఁడు రక్షించునని ధైర్య ముతో ఆశ్రయించుటకు అభిముఖ్యము పొందింప సమర్థములైయుండుటచేత వీనినాశ్ర యణ సౌకర్యాపాదక గుణములని చెప్పఁబడును.

౩౬. కై యుముఱ్ఱవుకోలుమ్, ‘పిడి త్త శిఱువాయ్క్క‌యిఱుమ్, సే నాధూళిధూసరితమాన తిరుక్కుఱ్ఱలుమ్, తేరుక్కుక్కీఴే‌ఱ్ఱనాళ్ నినతిరు

---

౩౬. ఇవియన్నిటిలోపల యాశ్రయించుటకు ముఖ్యముగా యవశ్యమైనది సౌలభ్యమైనందున, అవతారప్రయుక్తమైన సౌలభ్యముమాత్రమేగాక సారథ్యమందు 1“అవస్థితనాయ్” (సుస్థిరముగా) నిలచియున్న సౌలభ్యాతిశయమును చూపించిన విషయమును యానతిచ్చుచున్నారు “కై యుముఱ్ఱవుకోలుమ్” ఇత్యాదిసూత్రమువల్ల. అనఁగా, అశ్వములను ప్రేరేపించి నడుపుటకు శ్రీహస్తమందు ధరించిన కొరడాను; అశ్వములను కుడిఎడమగా త్రిప్పుటకుగానున్ను, నిలుపవలసిన స్థలమందు యీడ్చి నిలువుటకుగానున్ను, పట్టిన కళ్లెముతో సంబంధించియుండుచిన్న దారమును; శిరస్సున మరుగు లేక నిలుచుటచేత సేనాధూళి

---

విథ్యనుష్ఠానము లేకార్థముగ నుండవలయును గాన నిక్కడ ‘మామ్’ అను పదమందు, ద్వయమందలి శ్రీమచ్ఛబ్దార్థమును, నారాయణ శబ్దార్థమును, అనుసంధించవలయును. అట్లనుసంధించునపుడు తల్లియగు శ్రీదేవి నిత్యపురుషకారముగా నున్నందుచేతను, నారాయణశబ్దము సర్వజ్ఞత్వ, సర్వశక్తిత్వ, పరమకారుణికత్వ, పరమోదారత్వ, ఆశ్రితవాత్సల్యత్వ, అనన్యశరణత్వ, అనాలోచిత విశేషాశేష లోకశరణ్యత్వ, సర్వస్వామిత్వ, శ్రియఃపతిత్వ, నారాయణత్వ విశిష్టమనుటచేతను, ఆశ్రయించువారికి తమనికృష్టతయు, ఈశ్వరమహాదతిశయత్వమునుజూచి యంగీకరించునాయను శంకలేక రక్షణము కలుగునని ధైర్యపడుటకు హేతువై యుండును. ముఖ్యముగా, “హేకృష్ణ! హేయాదవ!” అని అర్జునుఁడు తన్నుఁ బిలువదగినట్లు అతనితోఁగలసి యుండుటచేత సౌశీల్యమును, అప్రాకృతమైన తనదివ్యతిరుమేను నేత్రములకు కనపరచుటచేత, సౌలభ్యమును గల దివ్యమంగళవిగ్రహామ్ “మామ్” అనుపదమం దనుసంధేయమై యుండును.

1 “స్థితనాయ్” (స్థిరముగానుండువాడై) అనిచెప్పక “అవస్థితనాయ్” అనుటకు కారణము, సారథిగానుండుస్థితి తనతిరువుళ్ళములో ఆరోపించుకొన్నదిగా తలచక తనసహజవృత్తిగా తలచి చేసినాడను భావము సూచించుటకు.

ఈ మామ్ శబ్దమునకు భావాంతరములు:—అష్టశ్లోకీవ్యాఖ్యానమ్ పుట. ౩౭౬.

వడికళుమాయ్ నిఱ్క్కుఱ సారథ్యవేషత్తై (మామ్) ఎన్ఱు కాట్టుకిఱార్.

32. (ఏకమ్).

---

చేత కప్పబడిన శ్రీకేశములును; "తేర్ కడవియపెరుమాన్ కనై కళల్" (రథమును నడిపించిన స్వామియొక్క శబ్దించు వీరకంకణముగల శ్రీపాదములు) అన్నట్లు ధరించిన గజ్జలును తానునై రథమునకు క్రింద వ్రేలాడ వేశిన శ్రీపాదములతో వుండు సారథ్యవేషమును నన్ను (మామ్) అని చూపుచున్నారని యీసూత్రమువల్ల సాయించి తృతీయపదము యొక్క అర్థమును ముగించినవారైరి.

32. 1అనంతరము చతుర్థపదమైన ఏకశబ్దమును యెత్తుకొనుచున్నారు.—"ఏకమ్" అని.

---

ఱా "మామ్" ఎన్ఱు తన్ వ్యామోహత్తై కాట్టుకిఱానెన్ఱు నమ్పిళ్ళై అరుళిచ్చెయ్వర్, "మామ్" ఎన్ఱు "నీ ఉనక్కు భోగ్యమాన శబ్దాదివిషయంగళై భుజిక్కైయాలే ఉన్నుడమ్పిల్ పుకరైప్పారాయ్; ఎనక్కు భోగ్యనానవున్నై అనుభవిక్కప్పెఱామైయాలే ఎన్నుడమ్పిల్ వెళుప్పైప్పార్" ఎన్ఱు కణ్ణైయై అవిழ్త్తుక్కాట్టుకిఱానెన్ఱు, ఎమ్బారరుళిచ్చెయ్వర్.

"మామ్" ఎన్ఱు ఆశ్రయణీయమాన వస్తువైచ్చొల్లుకైయాలే, ఆశ్రయణోపయోగియాక, "నికరిల్ పుకழాయులకమ్ మూన్ఱుడైయాయెన్నై యాళ్వానే! తిరువేంగడత్తానే" ఎన్ఱు ముతల్వారాన వాత్సల్యాదిగుణంగళుమ్ అనుష్ఠిక్కప్పట్టు, అనుష్ఠాన వాక్యత్తిల్ నారాయణపదత్తాలే అనుసంధేయంగళాన వాత్సల్యాది గుణచతుష్టయంగళుమ్ అనుసంధేయంగళ్.

("సర్వధర్మాన్ పరిత్యజ్య మామ్......వ్రజ" అనుపదములవల్ల త్యజించవలశిన విషయములనున్ను, త్యజించినతరువాత పరిగ్రహించవలసిన విషయమును (కృత్యాకృత్య విచారము) విస్తారముగా సాయించినవారైరి. ఇత్స్చోట తిరుప్పావై -పా.౨ "వైయత్తు వాழ్వీర్ కాళ్" పాశురమునకు శ్రీ పెరియవాచ్చాంబిళ్ళైగారు సాయించిన మువ్వాయిరప్పడిఅవతారికను సేవించుడు)

1 అనంతరము - మామ్ అనుపదమునకు అర్థము సాయించినతరువాత,

౩౮. ఇన్ద ఏకశబ్దమ్ స్థానప్రమాణత్తాలే అవధారణార్థ త్తెక్కాట్టుకిఱతు.

౩౯. ‹‹మామేవయే ప్రపద్యన్తే” ౧ ‹‹తమేవచాద్యమ్” ౨‹‹త్వమేవోపాయభూతో మేభవ” ౩ ‹‹ఆఱెనక్కు నిన్పాదమే శరణాక త్తన్దొళి న్దాయ్” ౪ ఎన్ఱుమ్ శొల్లుకిఱపడియే.

౪౦. ఇత్తాల్ (వజ) ఎన్గిఱ స్వీకార త్తి లుపాయభావత్తై త్తవిర్క్కిఱదు

౩౮. దీనికిఅర్థమును సాయించుచున్నారు. ‹‹ఇన్దఏకశబ్దము”ఇత్యాదిగా. అనగా, యీ1యుపాయవిశేషమును చెప్పుచున్న అనేకచోట్ల అవధారణప్రయోగమున్నందున ఉకారమువలెనే యీ ఏకశబ్దమున్ను స్థానప్రమాణముచేత అవధారణార్థమును చూపుచున్నదని యీ సూత్రమునకర్థము.

౩౯. ఈ 2 యుపాయ నిర్దేశానంతరము అవధారణప్రయోగముచేయబడిన యనేక వచనములను దృష్టాంతముగా సాయించుచున్నారు. ‹‹మామేవయే” ఇత్యాదిగా, అవియేవియనిన.—‹‹మామేవయే ప్రపద్యన్తే” (నన్నేయెవరు ప్రపత్తిచేయుచున్నారో)అనిన్ని,తమేవచాద్యం పురుషం ప్రపద్యే” (ఆద్యుడైన ఆపురుషునే ప్రపత్తి చేయుచున్నాను) అనిన్ని, ‹‹ త్వమేవోపాయ భూతో మేభవ ” (నీవేనాకుపాయముకావలెను) అనిన్ని, ‹‹ఆఱెనక్కునిన్పాదమే శరణాగ త్తన్దొళిన్దాయ్” (నాకుపాయమునిచ్చినపుడు నీపాదములనే యుపాయముగానిచ్చితివే)అనిన్ని, చెప్పుస్థళములలో (మామేవ) (తమేవ) (త్వమేవ) (నిన్పాదమే) అని స్వీకరించతగినవస్తువును చెప్పినతరువాత అవధారణమును చెప్పుచున్న ప్రకారము అని యీ సూత్రార్థము.

౪౦. ఈయవధారణముచేత నిషేధింపఁబడుదాన్ని యానతిచ్చుచున్నారు. ‹‹ఇత్తాల్” యిత్యాదిగా. అనఁగా, ఉపాయాంతరములు నిషే

1 ఉపాయవిశేషము - సిద్ధోపాయము.

2 ఈ యుపాయ నిర్దేశానంతరము - ఈ ప్రపత్తివిషయమైన యుపాయమును చెప్పినతరువాత.

౪౧. స్వీకారన్ద్వాను మవనాలేవన్దతు.

ధింపబడు సమయమునందు పునరుక్తం ప్రసంగించుటచేతను దేవతాంతరములు నిషేధింపబడునపుడు 'మాం' అని అసాధారణాకారమును చెప్పుటచేతను, ఆదేవతాంతరనిషేధము 'మాం' అను పదముచేత సిద్ధమవుటచేతను వ్రజ అని పైనచెప్పుచున్న స్వీకారమందుపాయత్వమును నిషేధించుచున్నదనియీసూత్రార్థము. ఈస్వీకారము 1అన్వయవ్యతిరేకములచేత సాధకమని తలచదగినదిగా వుండుటచేత దీనిసాధనత్వము అవశ్యము నిషేధించవలసినదిగానున్నది.

౪౧. స్వీకారము చేయకమునుపు యీ సిద్ధోపాయము కార్యము చేయనందున పురుషార్థమునకు 2 నిదిఅవశ్యము కావలసియుండగా ఇందులో ఉపాయత్వమును నివర్తించుప్రకారమును ఆనతిచ్చుచున్నారు "స్వీకారన్ద్వాను మననాలేవన్టతు" అను వాక్యముచేత. అనఁగా, స్వీకారముసకు వెనుక వీనికి అనిష్టనివృత్తియూ ఇష్టప్రాప్తియు చేయువాడు ఆసర్వేశ్వరుడైనటువలె తత్పూర్వభావియగు స్వీకారముకూడ 3వానిచేతకలి

1 అన్వయవ్యతిరేకము అనఁగా ప్రపత్తిచేసినవానికి మోక్షము అదిచేయనివానికి మోక్షములేక పోవడము.

ఇచ్చట చెప్పు స్వీకారము ఉపాయమా లేక అధికారమా అనుసంశయము జనించునపుడు ఉపాయముగాదు అధికారమనుటను చూపుచున్నది అని యీసూత్రార్థము.

2 నిది - స్వీకారము. 3 వానిచేత - ఈశ్వరునిచేత. స్వీకారము ఉపాయము కాదనుటను దృష్టాంతముఖేన నిరూపించబడుచున్నది. ఒకధనికుఁడు పుత్రహీనుడై దూరబంధువైన ఒకచిన్నవానిని పెంచుకొనుచుండెను. కొంతకాలమైన తరువాత ఆచిన్నవానినిచూచి నాకాలానంతరము నాదాయాదులు నాసొత్తులునీకుచేర్చక ఎత్తుకొనిపోదురుగాన నిన్ను దత్తుతీసుకున్నట్టు అభినయించెద అందుకు నీవు సమ్మతించియుండుమని చెప్పి మేళమువగైరా వాయించి స్వీకారముచేసుకున్నట్లు నటించెను. సొత్తులంతయు వీనికి లభించినతరువాత ఇతరులు వీనినిచూచి "అమహానుభావుఁడు నీకుయెంత వుపకారముచేసెను" అనిచెప్పి ఆశ్చర్యపడగా అందుకు "అతను నాకేమిచేసెను స్వీకారముగద

౮౨. సృష్ట్యవతారాది ముఖత్తాలేపణ్ణినకృషిఫలమ్.
౮౩. ‹‹అతువుమవనతిన్నరుళే”

గినదనుట. ఇందుచేత స్వీకారమునకు ఉపాయకార్యత్వమే గాని ఉపాయత్వము లేదనిభావము.(సిద్ధోపాయముయొక్క నిరపేక్షత్వమును స్థిరపరచుటకుగాను స్వీకారమందలి ఉపాయత్వమునుఖండించుచున్నారు.

౮౨. వానిచేతకలిగినప్రకారమును ఆనతిచ్చుచున్నారు ‹‹సృష్ట్యవతారాదిముఖత్తాలే” ఇత్యాది వాక్యముచేత. అనఁగా, దేహేంద్రియములు లేనివాడై, భోగమోక్షశూన్యుడై, అచిత్సమానుడై, పడియుండినదశలో, కరణకళేబరములతోకూడి, జ్ఞానవికాసముకలవానిగా సృష్టించి, వీనిని యంగీకరించుటకుగాను యనేకావతారములనెత్తి, అట్లు అవతరించిన స్థలములందు, రుచియు, నమ్మకము వీటిని కలుగజేయుతన కల్యాణగుణములు, అతిమానుష చేష్టితములు మొదలగువాటినిప్రకాశింపజేసి, యీమార్గముగా సర్వేశ్వరుఁడు చేసినప్రయత్నముచేత, చేతనుని స్వీకారము ఫలించెనని యీసూత్రార్థము. (ఇందుచేత చేతనుడు చేయు ఉపాయస్వీకారము ఉపాయభూతుడైన సర్వేశ్వరునికి ఫలమని భావము.)

౮౩. ఈస్వీకారము ఉపాయఫలమని చెప్పిన అర్థమునకు ప్రమాణమును సాయించుచున్నారు ‹‹అతువు అవనతిన్నరుళే” ఇత్యాది సూత్రముచేత. అనఁగా, ‹‹ ఉణర్విలుమ్బరోరువనై యవనతరుళా లుఱల్పొరుట్టు, ఎ౯ఉణర్విను ళ్ళేయిరుత్తినే౯” అన్నట్లు, (జ్ఞానాధికులైన నిత్యసూరులకు నిర్వాహకుఁడై, అద్వితీయుఁడైన శ్రియఃపతిని, ఆశ్రియఃపతి

నాకు పొత్తులనుయిప్పించెను” అని అచేతనమైన స్వీకారము తనకు ఉపకారముచేసినట్టు తలచుట ఎట్టిదో అట్టిదే ప్రపత్తిని వుపాయముగా తలచడము. గనుక శరణాగతిన్ని ఎంబెరుమా౯వల్లనే కలిగినదని భావించవలెనని తాత్పర్యము.

౮౪. ఇత్తైయిల్లియవుమ్ తానేకార్యమ్ శెయ్యుమెన్ఱునినై క్కక్కడవన్.

౮౫. అల్లాతపోతు ఉపాయనైరపేక్ష్యమ్ జీవియాతు.

యొక్క కృపచేత పొందుటకై నాజ్ఞానమందు స్థాపించితిని) జ్ఞానాధిక్యముకలవారైన నిత్యసూరులయొక్క సత్తాస్థితిప్రవృత్తులకు నిర్వాహకుడై అద్వితీయుడైనవానిని, ఆసర్వేశ్వరునికృపచేతను లభించుటకుగాను నాయొక్క అపేక్షారూపజ్ఞానమం దుపాయముగానుంచితిని అని తమయొక్క ఉపాయస్వీకారమును ఆనతిచ్చి,ఆస్వీకారమున్ను వానియొక్క నిర్హేతుకకృపచేత కలిగెనని నమ్మాళ్వార్లు సాయించుటచేత ఉపాయస్వీకారము సర్వేశ్వరుఁడుచేసినకృషికి ఫలమనే అంగీకరించవలయునని యీ సూత్రార్థము.

౮౪. ఈ స్వీకారము స్వయం ఉపాయముకాక ఉపాయమైనసర్వేశ్వరునియొక్క కృషిఫలమై కలిగినందున యీ స్వీకారమందు ఉపాయత్వసంబంధము లేనట్లు తలంచగలఁడు అనుచున్నారు "ఇత్తైయిల్లియవుం"ఇత్యాదిసూత్రముచేత. అనఁగా,యీస్వీకారమునకున్ను 1సర్వేశ్వరుఁడు స్వయముగాకృషిచేయువాడవుటచేత, ఆసర్వేశ్వరుఁడు మనకార్యముచేయుట యీస్వీకారము కారణముగాకాదు. ఈస్వీకారము లేకపోయినను యీచేతనుల నుజ్జీవింపచేయువాడైన సర్వేశ్వరుఁడు స్వయముగానే మనయొక్క ఇష్టములను యిచ్చి అనిష్టములను నివర్తింపచేయునని నమ్మియుండవలయునని యీసూత్రార్థము.

౮౫. తాను స్వీకరించకపోయినను సర్వేశ్వరుఁడు చేతనునికి ఫలమునిచ్చును అనుటకు కారణము నానతిచ్చుచున్నారు. "అల్లాదపోదు" యిత్యాది సూత్రముచేత. అనఁగా, స్వీకారము లేకపోయినను సర్వే

1 సర్వేశ్వరుఁడు స్వయముగానే - అర్థిత్వనిరపేక్షుఁడైన సర్వేశ్వరుడే.

౪౬. ఇతుసర్వముక్తి ప్రసఙ్గపరిహారార్థమ్, బుద్ధిసమాధానార్థమ్, చైతన్యకార్యమ్.

---

శ్వరుడు ఫలమునిచ్చునని తలచక, ఫలమునిచ్చుటకు స్వీకారమున్ను కావలయునని తలచినయెడల, ఉపాయభూతుడైన సర్వేశ్వరునియొక్క 1సహాయాంతర నైరపేక్ష్యము జీవించదు.

౪౬. యీ సిద్ధోపాయస్వీకారము ఉపాయము కాకపోయినందున యీస్వీకారమువల్ల ప్రయోజనమేమి అనుటకు సమాధానమానతిచ్చుచున్నారు "ఇతు సర్వముక్తిప్రసఙ్గపరిహారార్థము" ఇత్యాదిగా, అనగా, చేతనునియందొక ప్రయత్నము లేకవుండగా సర్వేశ్వరుడే ఉజ్జీవింపచేసినయెడల అందరుముక్తులు కావలెనుగదా అను 2సర్వముక్తిప్రసంగమునుపరిహరించుటకు హేతువు; బహుకాలమునుంచి రక్షించని సర్వేశ్వరుఁడు యిప్పుడుయేహేతువునుపట్టి మనలనురక్షించుననిసందేహించు

---

1 సహాయాంతరనైరపేక్ష్యం జీవించదు అనఁగా అట్లు తలచనియెడల ౩౪-వ సూత్రములోచెప్పిన యితరనిరపేక్షత్వము జీవించదని భావము.

2 సర్వముక్తిప్రసంగపరిహారము, అనఁగా, స్వీకారముపాయముకాక ఈశ్వరుఁడే వుపాయుడైనయెడల, వాఁడు సాధ్యుఁడుగాక సిద్ధస్వరూపుఁడై, సర్వశక్తుడై, సర్వేశ్వరుఁడైయుండుటవలన సర్వులున్ను ఏకకాలములోనే ముక్తులుకావలెనే అనుశంకకు పరిహారము; సర్వోపాయములున్ను ఆయాయధికారివిషయములో ఫలించునవిగాన, ముముక్షుత్వ మధికారముగానుండినా అది ఉపాయాంతరనిష్ఠులకున్ను సమానముగా నుండుటవలన ప్రపత్త్యుపాయాధికారికి (ఈసిద్ధోపాయస్వీకారాధికారికి) అకించనత్వా నన్యగతిత్వములు రెండున్ను సర్వధర్మపరిత్యాగ రూపముగానున్ను, తదేకోపాయాధ్యవసాయ రూపముగానున్ను వుండుటచేత, యీరెండధికారములుఁ గలవారికే సర్వేశ్వరుఁ డుపాయముకాఁగలడు. తదితరులకు వాఁడుపాయము కాకపోవుటచే సర్వేశ్వరుడుపాయమగుటకు అధికారమైన సాంగప్రపత్తి ఎవరికికలదో వారికి ముక్తికలదని, సర్వులున్ను ముక్తులుకావలెననే ప్రసంగమును పరిహరించుట.

రాగప్రాప్తమ్,స్వరూపనిష్ఠమ్,అప్రతిషేధద్యోతకమ్.

చేతనుడు 1 బుద్ధి సమాధానము కలిగియుండుటకు హేతువు; యీచేతనుఁడు అచేతనముగాక జ్ఞానముకలవాడవుటచేత, వాడే ఉపాయము అనే అధ్యవసాయము ఈ 2చేతనునికియున్న జ్ఞానముయొక్క కార్యముగానుండును; విధి బలాత్కారముచేతను కాక యీ యుపాయమందు రసజ్ఞుడైనయీచేతనునియొక్క 3అనురాగముచేత ప్రాప్తమైనదిగానుండును; ఈయుపాయము అనన్యోపాయత్వముకంటె వేరుకాక తదేకరక్ష్యత్వరూపమైన4స్వరూపమునకు అనుగుణమైయుండును: అనాదికాలమునుంచి తన్నుతాను రక్షించుకొనడము మొదలైనవాటిచేత 5సర్వేశ్వ

1 బుద్ధిసమాధానార్థము, అనఁగా, ''అనాదికాలమునుంచి మనను రక్షించని ఈశ్వరుఁడు ఇప్పుడు మనను రక్షించుటకు హేతువేమి'' అని శంకించి ''మనదగ్గ వాని రక్షణహేతువైన అధికారము (అనన్యశరణత్వము)యున్నదని నిశ్చయజ్ఞానముతో నిర్భయుడైయుండుట.

2 చేతనునిజ్ఞానకార్యము (చైతన్యకార్యము), అనఁగా చేతనుడు జ్ఞానముకలవాడైనందున స్వస్వరూపజ్ఞానము కలిగి తదనురూపముగా ఈశ్వరుఁడే ఉపాయమని అధ్యవసించియుండుట.

3 అనురాగముచేత ప్రాప్తము (రాగప్రాప్తము), అనఁగా, క్రిందచెప్పిన సాధనాంతరములు దుష్కరత్వాదులగుటచేత వాటినివదలి ''సులభముగా చేయతగిన ఉపాయమును పట్టవలెనని'' అపేక్షించియున్న చేతనునికి ''(మాంవ్రజ) నన్ను పొందుము'' అని యుపదేశించినతరువాత వాఁడే ఉపాయమనే నమ్మకము (అధ్యవసాయము) ప్రేమచేత కలుగుట.

4 స్వరూపమునకు అనుగుణము (స్వరూపనిష్ఠము)అనఁగా సర్వేశ్వరునిచేతనే రక్షింపతగియుండుట.

5 సర్వేశ్వరుఁడు చేయు రక్షణమును నిషేధించకవుండుట (అప్రతిషేధద్యోతకము)ను సూచకము.

ఈ అరువిధములచేత వేరైన యీస్వీకారము (ప్రపత్తి) న్ను ఉపాయముకాదని భావము.

౪౭. కీఴ్తానుమ్పిఱరుమాన నిలైయైక్కులైత్తాన్, ఇఙ్గుత్తానుమివనుమాన నిలైయైక్కులైక్కిఱాన్.

రుఁడు చేయురక్షణమును నిషేధించుతూవున్న యీచేతనుఁడు వాఁడు చేయురక్షణమును నిషేధించకవున్నందుకు సూచకముగానుండును అని యీసూత్రార్థము.

౪౭. ఏకశబ్దార్థమును ఆనతిచ్చినతరువాత 'మామ్'అనుపదమునకు ముందుపదమైన " పరిత్యజ్య " యందున్ను " ఏకం " అను యీపదమందున్ను సర్వేశ్వరునియొక్క వ్యాపారములను యానతిచ్చుచున్నారు. " కీఴ్ " ఇత్యాది వాక్యముచేత. అనఁగా, "సర్వధర్మాన్ పరిత్యజ్య" అనుచోట సాధనాంతరములన్నిన్ని విడువమని చెప్పుటచేత, ఫలప్రదుడైన తానున్ను, రక్షకత్వశక్తిలేని ఉపాయాన్తరములున్ను అంగాంగీభావముగా కలసియుండుస్థితిని నివర్తింపఁజేసెను. "ఏకమ్" అనుచోట ఉపాయస్వీకారమందు ఉపాయబుద్ధిని నివర్తింపఁజేయుటచేత, ఉపాయభూతుఁడైన తానున్ను, ఉపాయస్వీకారమందుపాయత్వబుద్ధిని చేయుచున్న చేతనుడు కూడినిలిచిన స్థితిని నివర్తింపఁ జేయుచున్నాడని యీ సూత్రార్థము.

ఇచ్చట మూలమందచేతనములైన వుపాయాంతరములను "పిఱర్" అని చేతనములుగా చెప్పడము, నమ్మాళ్వార్లు సాయించిన 1"ఉన్నాలల్లాల్ యావరాలుమ్" అని సాధనాంతరములను చేతనము

---

1 ఉన్నాలల్లాల్ యావరాలుమ్ - తి-వా. ౫-౪-3.

ఈసూత్ర తాత్పర్యము. ఉపాయాంతరములలో రక్షకుడుగాచెప్పినతన్నే ఇచ్చట ఉపాయముగా చెప్పుటవల్ల, తన్నుపొందుట కుపాయముతానే, రక్షకుఁడుతానే, తానుపాయమైనపుఁడు నితరోపాయములవశ్యతలేదు, అవి ఉపాయములగునపుడు తన్నపేక్షించియుండునని చెప్పుటవల్ల ఈశ్వరునిపట్టి అవి ఉపాయమైనవనిన్ని, తాను (ఈశ్వరుఁడు) స్వతః నిరపేక్షోపాయమనిన్ని తోచుటవల్ల ఉపాయాంతరద్వారా ఆరాధించ

౪౮. అవన్నై యివఱ్ఱు పఱ్ఱుమ్ పఱ్ఱు అహంకారగర్భమ్, అవద్యకరమ్.

---

లుగా యానతిచ్చిన పాశురాధారమును బట్టి అని యెఱుఁగఁదగ్గది.

౪౮. ప్రపత్తి(స్వీకారము) ఉపాయముకాదని సాయించినతరువాత సాధనమనే బుద్ధిచేత యీ చేతనుఁడు చేయు స్వీకారమునకు కలుగు దోషములను సాయించుచున్నారు. "అవన్నై యివఱ్ఱుపఱ్ఱుమ్" ఇత్యాది వాక్యముచేత. అనఁగా నిర్హేతుకముగా రక్షించేవాఁడైన సర్వేశ్వరుని, వానిచేత రక్షింపబడతగిన చేతనుఁడు, తన్ను రక్షించుకొనుటకు కారణముగా, 1 స్వీకరించే స్వీకారము (స్వరక్షణార్థము తాను సర్వేశ్వరుని ప్రపత్తిచేయుచున్నాననేస్వీకారము) అహంకారగర్భితమై, 2 తండ్రివద్ద పుత్రుఁడు తన్నురక్షించుటకుగాను వ్రాసితీసుకున్నటువలె దోషావహముగానుండునని యీసూత్రార్థము.

---

బడినవాఁడై తాను ఫలప్రదుడవుటను ఖండించుచున్నది. అనఁగా, కర్మజ్ఞానాది సాధనాంతరము లుపాయములు కానట్టు చేతనుడుచేయు ఉపాయస్వీకారమున్ను ఉపాయముకాదు. ఉపాయభూతుఁడైన సర్వేశ్వరుఁడే చేతనుఁ డపేక్షించని దశలో (సృష్టికి ముందు కరణకళేబరశూన్యుఁడై ప్రకృతిలోపడియుండిన దశ) కరణకళేబరముల నిచ్చి, అజ్ఞాతసుకృతాదులను కల్పించినటువలె తానే ఉపాయమను నమ్మకము కలుఁగజేసి రక్షించుచున్నాడని తలఁపక మనమువానిని ఉపాయముగాపట్టినందువల్లకదా వాడుమనలను రక్షించడమని తనస్వీకారములో ఉపాయబుద్ధిపెట్టుటను నివర్తించుచున్నదని భావము. ఇందువల్ల కర్మజ్ఞానాదు లుపాయము కానటువలె స్వీకారమున్ను ఉపాయము కాదనుట.

మూలములో - కీఴ్ తానుమ్ పిఱరుమానవిలై అనఁగా సాధనాంతరములు - బయటిశత్రువులు. తానుమివనుమానవిలై అనఁగా ప్రపత్తిలో ఉపాయబుద్ధి - లోపలి శత్రువు. (స్వీకారము మానసికముగాన)

1 స్వీకరించే స్వీకారము - మానసస్వీకారము అనఁగా, "వాడేఉపాయము" అను బుద్ధివిశేషము.

2 తండ్రివద్దపుత్రుఁడు......దోషావహము - చూచినవారు విన్నవారు "వాడు తండ్రిగాదు, వీడు పుత్రుఁడుగాదు" అని తలచునట్టి దోషము.

౮౯. అవనుడైయ స్వీకారమే రక్షకమ్.

౯౦. మఱ్ఱై యుపాయంగళుక్కు నివృత్తిదోషమ్, ఇతుక్కు ప్రవృత్తిదోషమ్.

---

౮౯. చేతనుఁడుచేయు స్వీకారము ఉపాయముకాదని సాధించి చేతనుని రక్షించు విషయమును నిష్కర్షించుచున్నారు. ‟అవనుడైయ స్వీకారము” ఇత్యాదిగా. అనఁగా, ఈ ఆత్మను రక్షించుటకు సంబంధముకలవాఁడైన ఈశ్వరుఁడు ‟యీచేతనుని మనము రక్షించగలము” అని అభిమానించు స్వీకారమే యీ చేతనునికి రక్షకమై 1 ముగియునని యీసూత్రార్థము. (ఇది పరగతస్వీకారమును చూపుచున్నది.)

౯౦. ఈచేతనవ్యాపారములలో 2 యేయొక ఉపాయస్వీకారమున్ను యీ సిద్ధోపాయము సహించదనేవిషయమును వ్యక్తపరచుటకుగాను, ఉపాయాంతరములకున్ను యీ సిద్ధోపాయమునకున్ను గల న్యూనాధిక్యమును సాధించుచున్నారు. ‟మఱ్ఱైఉపాయఙ్గళుక్కు” ఇత్యాది వాక్యముచేత. అనఁగా, సిద్ధోపాయమైన యీఉపాయమునకు వేరైన యితరోపాయములకు 3 స్వరూపసిద్ధి, చేతనునియొక్క కరణత్రయవ్యాపారముచేతనేగనుక స్వప్రయత్నమును నివృత్తించుకొనుట దోషమైయుండును, (అనఁగా, యుపాయాంతరములకు రూపమేకలుగకపోవుటచేత దోషము); ఈసిద్ధోపాయమునకు సహాయాంతర సంబంధము అసహ్యమగుటచేత యీచేతనునియొక్క ప్రవృత్తియొకటిమాత్రమే (నిరపేక్షోపాయ భంజకమగుటవల్ల) ప్రతిబంధకమైయుండునని యీసూత్రతాత్పర్యము.

---

1 ముగియునని _ తీర్మానమని.

2 ఏయొక ఉపాయస్వీకారము అనుటవల్ల చేతనుఁడుచేయు శరణాగతిన్ని అంతర్భూతము.

3 స్వరూపసిద్ధి . ఉత్పత్తి.

౫౧. ‹‹శిఱ్ఱ వేండా.››

౫౨. నివృత్తికీఴుళొల్లిన్ఱు.

---

౫౧. ఈ సిద్ధోపాయమునకు చేతనవ్యాపార రూపమైన దొకటిన్ని యనవశ్యము లేదనుటకు ప్రమాణమును చూపుచున్నారు. ‹‹శిఱ్ఱ వేణ్డా›› అను శ్రీసూక్తిచేత. అనఁగా, సిద్ధోపాయ స్వీకారమును సాయించిన (నమ్మాఴ్వార్లు) 1‹‹మఱ్ఱొన్ఱిల్లై›› అనుపాశురమందు ‹‹శిఱ్ఱ వేండా›› (విస్తారముగానొక వ్యాపారముచేయవద్దు) అని యుండుటచేత యీ సిద్ధోపాయములో ప్రవేశించువానికి ఒక వ్యాపారమున్ను చేయవద్దు అనేవిషయము యానతిచ్చియున్నారని యీసూత్రార్థము. ఇందువల్ల సర్వేశ్వరుఁడే ఉపాయమనితలచే స్వల్పమానసిక వ్యాపారముమాత్రము అవశ్యకమని తాత్పర్యము.)

౫౨. చేతనవ్యాపారము నొకటిన్ని చేయవలసిన పనిలేదనే విషయము ప్రస్తుత చరమశ్లోకములోనే చెప్పబడినదని సాయించుచున్నారు. ‹‹నివృత్తికీఴుళొల్లిన్ఱు.›› అను సూత్రముచేత, అనఁగా, ‹‹సర్వధర్మాన్ పరిత్యజ్య››అని తనయొక్క సర్వవ్యాపారనివృత్తియే యీచేతనునికికావలసినదనేవిషయములోఁగడనే చెప్పబడినదని యీసూత్రార్థము.

---

1 తి-వాయ్. ౯-౧-౭. ‹‹మఱ్ఱొన్ఱిల్లై శురుంగచ్చొన్నోమ్ మానిలత్తెవ్వుయిర్క్కుమ్, శిఱ్ఱ వేండా శిన్దిప్పేయమైయుమ్ కండీర్ కళన్దో›› ఇత్యాది. ప్రతిపదము. మఱ్ఱొన్ఱిల్లై - వేఱొకఉపాయములేదు. శురుంగచ్చొన్నోమ్ - సంగ్రహముగాచెప్పితిమి, మానిలత్తు - గొప్పభూమియందలి, ఎవ్వుయిర్క్కుమ్ - సకలప్రాణులకును, (1) శిఱ్ఱ వేండా - ఆయాసపడవలదు. శిన్దిప్పే - తలంపుమాత్రమే (ఈశ్వరుఁడేయుపాయమనుబుద్ధి) అమైయుమ్ - చాలును. కండీర్ కళ్ - చూచితిరికదా (ఇదిప్రసిద్ధముకదా)? అన్దో - (దీనినితెలిసికొనకయుండుట) దుఃఖజనకముగానున్నది. ఇచ్చట ఎవ్వుయిర్క్కుమ్ అనుపదమువల్ల. ఇది అధికృతాధికారము కాదనిన్ని, సర్వాధికారమనిన్ని చూపింపబడుచున్నది, మానిలత్తు అనుపదమువల్ల సంసారులు యీవుపదేశమున కర్హులనిన్ని పరమపదవాసులుగారనిన్ని తెలియత్గ్గది.

౫3. ఉపకారస్మృతియుమ్ చైతన్యత్తాలే వన్దతు, ఉపాయత్తిల న్తర్భవియాతు.

౫3. చేతనుని కొక వ్యాపారము లేకపోయినా ఉపకారస్మృతి అయినా వుండవలెనుగదా? ఆ ఉపకారస్మృతి యుపాయములో అంతర్భూతముకాదాయనిన "కాదు" అని సాయించుచున్నారు. "ఉపకారస్మృతియుమ్" ఇత్యాది సూత్రముచేత. అనఁగా, 1 "ఎన్నైత్తీమనం కెడుత్తాయ్" (నాదుష్టమనసును చెడగొట్టితివి) 2 "మరువిత్తొழுమ్ మనమేతన్దాయ్" (అనన్యప్రయోజనముగా కైంకర్యమునుచేయు మనస్సును యిచ్చితివి) ఇవి మొదలగు ఆళ్వార్ల శ్రీసూక్తులచేత యీ సిద్ధోపాయమందు చేతనుఁడుచేయు ఉపాకారస్మృతియు వీనియొక్క జ్ఞానకార్యమై కలిగినదికాని, ఈ యుపకారస్మృతి యున్నందునగదా సర్వేశ్వరుఁడు కార్యముచేసెను అను యుపాయబుద్ధియంతర్భవించదని యీసూత్రార్థము.

---

1 తి-వాయ్. ౨-౭-౮. "ఎన్నైత్తీమనఙ్గెడుత్తాయునక్కెన్ శెయ్ కేనెన్ శిరీతరనే॥" ఎన్నై-నన్ను, తీమనమ్ - చెడుమనస్సును, కెడుత్తాయ్-చెడగొట్టిన, ఎన్-నాయొక్క, శిరీతరనే - శ్రీధరుఁడా! ఉనక్కు - నీకు, ఎన్-ఏమిఉపకారము, శెయ్ కేన్ - చేయగలను.

2 తి-వాయ్. ౨-౭-౭. "మరువిత్తొழுమ్మనమేతన్దాయ్ వల్లైకాణెన్ వామననే". మరువి - అమరియుండి, తొழுం - ఆశ్రయించెడి, మనమే - మనస్సునే, తన్దాయ్ - ఇచ్చితివి. ఎన్వామననే - నావామనుఁడా! వల్లైకాణ్ - సమర్థుండవు.

౨౮ మొదలు ౫3 వ సూత్రమువరలో సాయించిన అంశములనుచేర్చి యిచ్చట సంగ్రహముగాను సుగ్రహముగాను తెలిపించబడుచున్నది.

సమస్తాత్మలయొక్క స్వరూపస్థితి ప్రవృత్తిసిధ్యర్థముగ ఆశ్రయణీయురాలైన శ్రీ అను ఆమెకుఁ బతియగుటచేత, పరత్వమును - జగత్తులకుఁ దల్లియగు శ్రీదేవికి భర్తయగుటచేత సౌలభ్యమును, జగత్తులకు సర్వవిధ కారణంబగుటచేత పరత్వమును, జగదంతర్యామిత్వముచేత సౌలభ్యమును, ప్రతిపాదించునట్టి శ్రియఃపతి,నారాయణ, అనెడు అసాధారణతిరునామము గల "ఏషనారాయణశ్రీమాన్ క్షీరార్ణవనికేతనః। నాగపర్యం

(ఉపకారస్మృతి భగవదంగీకారరూపకార్యసిద్ధికి తరువాత కలుగవలసినదగుటచేత భగవదంగీకారమునకు కారణముకాచాలదు. కనుక ఈయుపకారస్మృతి యీచేతనుని జ్ఞానసూచకమని గ్రహించవలయు. అచేతన పదార్థములను సర్వేశ్వరుఁడు యథేష్టముగా నుపయోగించుకొనేసమయములో వాటికిఈశ్వరవిషయములో వుపకారస్మృతి లేకపో

కముత్సృజ్య హ్యగతో మధురాంపురిం" అనిచెప్పినట్లు స్వీకార్యమైన సిద్ధోపాయభూతుఁడగు సర్వేశ్వరుఁడు, «నీకంటె నీకార్యముచేయుటకు ప్రాప్తుఁడనై, నీకునాకుఁగూడ ధారకురాలగు సర్వేశ్వరికిఁ ఐను నీకార్యముచేయువాఁడనై, నీటియందు నిప్పుపుట్టినట్లు పిరాట్టి నీయందొకదోషము నిరూపించినను, నిన్ను విడువఁగూడనట్టి నిరుపాధికసంబంధవిశేషముకలవాఁడనై యున్న «నన్ను" అనిన్ని సేనాధూళిధూసరితమైన తనసారథ్యవేషమును, శరణ్యవస్తువు సర్వరక్షకమై, సమస్తకల్యాణగుణాత్మకమై, సవిగ్రహమై, సర్వసులభమైయున్న «నన్ను' అనిన్ని సూచించినట్లు కనపరచుటచేత, నీయుపాయమే స్వరూపానురూపమైనదనియు, ఇతరోపాయములకంటె మిగుల విలక్షణమైనదనియుఁ తెలిసికొనవచ్చును. ఇందువల్ల ద్వయములోని «శ్రీమన్నారాయణ – చరణౌ" అను పదములయర్థమును యీ «మామ్' శబ్దములో అనుసంధేయము. ఎట్లనగా:—«కృష్ణఏవహిలోకానాముత్పత్తిరపిచాప్యయః" «అహంకృత్స్నస్యజగతః ప్రభవఃప్రళయస్తథా", «మయి సర్వమిదంప్రోతం సూత్రేమణిగణాఇవ" ఇత్యాదులవల్ల నారాయణపదములో చెప్పఁబడిన సర్వకారణత్వ, సర్వసంహర్తృత్వములున్ను, సర్వవ్యాపకత్వ సర్వాధారత్వములున్ను కృష్ణావతారములో అనుసంధించబడియున్నదిగదా. గనుక శ్రియఃపతి. నారాయణ అను «నన్ను" అని సూచింపబడుచున్నది. అయితే ఈ «మామ" శబ్దమునందు నారాయణశబ్దములో చెప్పబడిన సమస్తగుణములు యనుసంధేయమా? యనఁగా, «మామ్' అని ఆశ్రయణీయవ్యక్తినిచెప్పుటవల్ల, ఆశ్రయణోపయోగమైన వాత్సల్యాదులను యిచ్చట ననుసంధించి, «అహమ్' అని అనిష్టనివృత్తిపూర్వక ఇష్టప్రాప్తిప్రదుడైన వానియందు అందుకుపయుక్తమైన జ్ఞానశక్త్యాదుల ననుసంధించుట యుక్తమైనందున, సకలగుణములను యిచ్చటనే యనుసంధించవలయునను నిర్బంధములేదు.

1 «మామ్" అని ప్రత్యక్షముగా (దృష్టికిగోచరముగా) చూఁడదగి పైజెప్పిన సౌలభ్యగుణమునకు విషయమై, ఆశ్రయణోపయోగముగా ద్వయములోని «చరణౌ"శబ్దమువల్ల చెప్పబడిన విగ్రహమునుచూపుచున్నది. 3౽వ సూత్రార్థము యిచ్చట అనుసం

వుటచేత వానిభోగమునకు ప్రతిబంధకము కానట్లు చైతన్యముగల వస్తువును యథేష్టముగా వినియోగించుకొనేసమయమున యీచేతనునియొక్క వుపకారస్మృతిన్ని వానిభోగప్రతిబంధకముకాదు. ఉపకారస్మృతి,

---

ధేయము. ఇందువల్ల, ఆశ్రితచేతనుని స్వాపరాధభయనివృత్తి హేతుభూత పురుషకారయోగమునున్ను స్వదోషాది భయనివృత్తిహేతువైన వాత్సల్యాదిగుణయోగమునున్ను, విలక్షణవిగ్రహ యోగమునున్ను, 'మామ్' అని ఆశ్రయణీయవస్తువు విషయములో అనుసంధేయము "ఏక" శబ్దమును "శరణ" శబ్దమానకువిశేషణముగఁ చేసినపు డద్వితీయమైన ఉపాయభూతుఁడగు ఈశ్వరుని సమాభ్యధిక దరిద్రతను జెప్పును. (త్వమేవోపాయభూతోమేభవ) అనియు, (త్వామేవశరణంగచ్ఛ) అనియు, (మామేవయేప్రపద్యంతే)అనియు, (తమేవచాద్యంపురుషంప్రపద్యే) అనియుజెప్పినట్లుఈశబ్దము శాస్త్రప్రమాణసిద్ధమై, ఈశ్వర నైరపేక్ష్యము నగుపరచుటచేత అవధారణార్థకమైయున్నది. ఈయవధారణార్థకము క్రింద నుపాయాంతరములు విడువుమని చెప్పుటచేత, నితరోపాయములుగాని 'మామ్' అని యీశ్వరుఁడు తనయొక్క అసాధారణాకారము గనుపరచుటచేత ఆ ఈశ్వరుడుతప్ప దేవతాంతరములు సిద్ధోపాయము కావనుట తెలియజేయుచున్నది. ఉపాయత్వము నిత్యమైనను, అధికారి స్వీకరించినపిమ్మటగాని ఈశ్వరున కుపాయభావము సిద్ధించదు. ఉపాయభూతుడు మామేకంశరణంవ్రజ యని చెప్పుటచేత నీప్రపత్తి ఉపాయాంతర్భూతముగాని తత్సహకారిగాని కానేరదని తెలుపుచున్నదనిభావము. భక్త్యుపాయము, కర్మజ్ఞానములవలన సాధ్యమగునదిగాన ఉత్పత్తియందుఁ జేతనసాపేక్షమై, అచేతనమగుటవలన ఫలప్రదానమం దీశ్వరసాపేక్షమైయున్నది. అయితే యీసిద్ధోపాయమూ సిద్ధవస్తువై, నిరుపాధిక సర్వసుహృత్తైయుండుటచేత ఉత్పత్తియందును నిరపేక్షమై, సర్వజ్ఞత్వాదిగుణవిశిష్టమౌటచేత ఫలప్రదానమందును నిరపేక్షమైయుండును. అట్లయితే "యత్సాంగమ్ తత్సాధనమ్" అనిచెప్పినట్లు ఉపాయము అంగముతోకూడి గదా వుండవలయుననిన, భక్త్యాదులుసాధ్యమై, అన్యసాపేక్షమైయుండుటచేత సాంగమై యుండవలసివచ్చెనేగాని యీయుపాయము సిద్ధమై అన్యనిరపేక్షమై యుండుటచేత నిరంగముగనున్నదిగాని యుపాయము సాంగముగనే యుండవలయునను నిర్బంధము లేదు. దేవతులకు ప్రసాదజనకమగునట్లు భక్త్యాదులుపాయముగా నాచరించినట్లు ఇక్కడ నీశ్వరవిషయమందుఁ గూడనుపాయములు పెట్టవలదాయనిన, చేతనులు తమవంటి సంసారులగు దేవతలకు అనుగ్రహమువచ్చునట్లు అందుకుఁదగిన కృత్యములాచరిం

. ౫౪. (శరణమ్)

తదభావము యీ రెండున్ను చేతనాచేతన వస్తుస్వభావమునుపట్టి వచ్చి నందున ఉపాయమందంతర్భవించదని తాత్పర్యము.)

పై జెప్పిన యావదంశముల చేతనున్ను నాలుగవపదమైన ఏకశబ్దార్థమును సాయించినవారైరి.

౫౪. ఇకను అయిదవశబ్దమైన శరణశబ్దార్థమును సాయించుచున్నారు. 'శరణమ్' అని.

చవలసినదేగాని ఈశ్వరుఁడు సర్వాత్మలకు స్వరూపావిర్భావము కలుగఁజేయునదిగా పూర్వమే చింతించి యవసరప్రతీక్షుఁడై యుండుటచేత వానికి అనుగ్రహార్థము చేయవలసినదొకటియులేదు. అట్లు చేయవలయునని యెంచినపుడు తనస్వరూప పారతంత్ర్యమును నష్టపరచుకొని వానిరక్షకమును సోపాధికము చేసినట్లుండును. అట్లయిన మోక్షమునకు తన్ను వినా వేరుపాయముల నేల విధించవలయుననినఁ త్రైగుణ్యవిషయా వేదా నిస్త్రైగుణ్యోభవార్జున) అనిచెప్పినట్లు, ఉపాయాంతరములు చేయుటయందలయిక పుట్టినపుడు సిద్ధోపాయమునకుఁ జేతనుఁడు తనంతటదిగునని చేతనరుచ్యానుగుణముగ నితరోపాయములను ప్రథమమందీశ్వరుడు విధించెనేగాని వేరొండుకాదు. ఇట్లుండుటచేత నితరోపాయములకంటె యీయుపాయమందుండు గౌరవమును, స్త్రీలలోఁ బతివ్రతలకువలె ఇతరాధికారులలో నియ్యధికారియందు నతిశయము బయలుపడుచున్నది. పతివ్రతతన పారతంత్ర్య స్వరూపమునకు బాధకలుగకుండ స్వయత్నముచేత నర్థమార్జించి దేహపోషణముచేయక పడియున్నట్లు, ఈ విలక్షణాధికారియు తనస్వరూపానురూపముగ నీశ్వరుఁడే తనకు ప్రాప్యప్రాపకుఁడని పడియుండవలయునుగాని యితరోపాయములయందు క్షుద్రమహిమలనుజూచి భ్రమించి అవియును మేలయినవని తలంచినపుడు భర్తయైన ఈశ్వరుని కపధ్యావహమును, తనపాతివ్రత్యస్వరూపమందు వ్యభిచారమును కలుగఁజేసినట్లగును. అపుడుభయస్వరూపములు నిలువవు. నిరుపాధికరక్షకుఁడును రక్షణఫలకర్తయునగు ఈశ్వరుఁడు చేతనునియొక్క సమ్మతమున పేక్షించియుండుటచేత వానినిర్హేతుకములైన కృపాప్రసాదములె (కృపయా కేవలమాత్మసాత్కురు) అనియు (కేవలం మదీయ యైవ దయయా నిశ్శేష వినష్టసహేతుక కేవలం మదీయయైవ దయయాతిప్రబుద్ధః) అని స్తోత్రగద్యములయందు సాయించినట్టు వీనికినుపాయములని చెప్పబడినవి. గాన అవశ్యకర్తవ్యమైన యీసిద్ధోపాయస్వీకారమునకు అచిద్వ్యావృత్తిలక్షణమై ప్రతిబంధకనివర్తకమై స్వచిత్తసమాధానమైయుండుటే యుక్తమైన వేషము.

౧౧. ఉపాయమాశ.

౧౨. ఇన్ద్రశరణశబ్దమ్, రక్షితాపైయుమ్ గృహత్తైయుమ్ ఉపాయ

---

౧౧. ఆశరణశబ్దమునకు అర్థము ఉపాయముగా అని.

౧౨. ఈశరణశబ్దము అర్థాంతరములనున్ను చూపగలదిగాయుండగా యీచోట యీశరణశబ్ద ముపాయమునే చూపుచున్నదనుటకు హేతువును అనతిచ్చుచున్నారు, ,,ఇన్ద్రశరణశబ్దమ్," ఇత్యాదిగా. అనఁగా శ్రీ-పా. అ బు-సం. అ-౧౭. ,,ఉపాయేగృహరక్షిత్రోశ్శబ్దశ్శరణమిత్యయమ్। వర్తతేసామ్ప్రితంచైష ఉపాయార్థైకవాచకః" అన్నట్టు ఈశరణశబ్దము, రక్షకునిన్ని, గృహమునున్ను, ఉపాయమునున్ను చూపగలదైనను, (ఉపాయాంతర త్యాగపూర్వకమైన) యీస్థలమందు ఉపాయమునే చూపుచున్నది. అదియేలననఁగా, సర్వధర్మములను వదలి తన్ను ఆశ్రయించమని చెప్పుచున్నప్రకరణమవుటచేతను, 'సర్వధర్మాన్పరిత్యజ్య' అనే ముందుపదములతో చేరవలసియుండుటచేతను (అనఁగా, ఉపాయాంతరములయొక్క దుష్కరత్వాదులచేత, శోకార్తుడైన అర్జునునికి యుపాయాంతరములైన అన్నిధర్మములను వదలి నన్ను ఆశ్రయించు అనిచెప్పేప్రకరణ మవుటచేతను) ఈయాశ్రయణము ఉపాయముగా ఆశ్రయించడమే స్వభావముగానున్నదనిభావము. ప్రకరణబలముచేతను శరణశబ్దమునకు, సర్వధర్మాన్పరిత్యజ్య అనేస్థలమందుచెప్పిన సాధనాంతరపరిత్యాగమే స్వీకారమునకు విషయమైన సర్వేశ్వరునియొక్క ఉపాయత్వమును చూపగలదైయుండగా, మరలయుపాయమును చూపు శరణశబ్దప్రయోగమునకు హేతువేమనిన, సర్వేశ్వరుని ఉపాయముగా పట్టుసమయమందువలె ప్రాప్యసమయమందును సాధనాంతరపరిత్యాగము సమానముగా నుండుటవల్ల (అనఁగా ఏఱు దాటినతరువాత తెప్పనువదలినటువలె) ఉపాయాంతరత్యాగము ప్రాప్యముగా ఆశ్రయించుటను నిషేధించదవుటచేత, ఇచ్చట శరణశబ్దప్ర

త్తైయుమ్ కాట్టుక్కిడవదే యాకిలుమ్, ఇవ్విడత్తిల్ ఉపాయత్తైయే కాట్టుకిఱతు, కీழ్గాడే శేర వేణ్డుకైయాలే.

౫౭. (వ్రజ.).

౫౮. బుద్ధిపణ్ణు.

౫౯. గత్యర్థమావతు బుధ్యర్థమాయ్, అధ్యవసి ఎన్గపడి.

---

యోగము చేయబడినదనుట. సాధనాంతరపరిత్యాగవిశిష్టమైన స్వీకారము ప్రాప్యముగా ఆశ్రయించుటను నిషేధించదని ఎట్లుచెప్పవచ్చును? ఈయుపాయాంతరత్యాగము స్వీకారమునకు అంగముగాగదా విధింపబడినది. "యద్యత్సాంగం తత్తత్సాధనం" (ఏదియేదిఅంగముకలదో అదిఅది సాధనమైయుండును) అనేన్యాయముచేత స్వీకారమునకు విషయమైన ఉపాయత్వమునుచూపకలదవుటచేత శరణశబ్దప్రయోగమునకు ప్రయోజనములేదేయనిన ఆరీతి శరణశబ్దమునకు ప్రయోజనము లేదనరాదు. అర్థబలమువల్లవచ్చే అర్థమునకన్నను శబ్దశక్తివల్లఏర్పడు అర్థమే గ్రాహ్యమని భాష్యకార్లు శ్రీభాష్యం. ౧. అ-౧.పా-౧. సూ-౭. "ఆర్థేపతః ప్రాప్తాదాభిదానికస్యైవగ్రాహ్యత్వాత్" అని సాధించిరి.

ఇందువల్ల, ఉపాయవాచకమైన యీశరణశబ్దముచేత, ఈ స్వీకారవిషయమైన సర్వేశ్వరుడు ప్రాప్యముగా స్వీకరించతగినవాడును, ఉపాయముగా స్వీకరించ తగినవాడును అగుటచేత ఆ ప్రాప్య ప్రాపక స్వీకారములలో ప్రాప్యముగా ఆశ్రయించుటను యీస్థలమందు నిషేధించడమైనది.

౫౭. శరణశబ్దార్థమును సాధించినతరువాత ఆరవపదమైన "వ్రజ" అనుశబ్దమునకు అర్థమును ఆనతిచ్చుచున్నారు.

౫౮. వ్రజ అనగా అధ్యవసించుము, అని అర్థము,

౫౯. ఆ అర్థమును విశదపరుచుచున్నారు "గత్యర్థమావదు"

ఇత్యాదిసూత్రముచేత. అనఁగా, ‹‹వ్రజగతౌ” అనునట్లు వ్రజ అనేధాతువు గతివాచకమై, ‹‹ గత్యర్థాః బుద్ధ్యర్థాః ” గతివాచకములు బుద్ధివాచకములవును అనేన్యాయమువల్ల, గతివాచకము బుద్ధివాచకమైనందున అధ్యవసించుము అని యీసూత్రార్థము.

ఈ బుద్ధి అనునది త్యాజ్యములైన ఉపాయాంతరములందు చేరనిదై, ఉపాయకోటియందు ప్రవేశించనిదై, సాధనాంతర పరిత్యాగపూర్వకమై, భగవంతునిరక్షణమును అనుమతించినదై, జ్ఞానకార్యమై, ప్రార్థనను గర్భీకరించినదై, భగవంతుని ముఖవికాసమునకు కారణమై, శేషత్వస్వరూపమునకు అనురూపమై,(1 వ్యభిచార 2 విళమ్బ 3 విధురమాయ్)ఫలప్రాప్తి లేకపోవుటగాని,ఫలప్రదములో ఆలస్యముగాని లేనిదై యున్న ఒక అధ్యవసాయరూప 4 జ్ఞానవిశేషముఅని పరస్థపడిరహస్య

1 వ్యభిచారము - ఫలముకలుగునో కలుగదో అనుసందేహము.

2 విళమ్బము - (తామసము) ఆఫలము దేహావసానములోనో లేక ప్రారబ్ధావసానములోనో అనుసంశయము.

3 విధురము - లేనిది.

4 జ్ఞానవిశేషము - దీనినే శరణాగతియనియు,ప్రపత్తియనియుఁ జెప్పఁబడును. ‹‹వ్రజగతౌ” అధ్యవసించుయనుట. అధ్యవసాయమును - విశ్వాసమును, పర్యాయనామము లౌటచేతను విశ్వాసమును జెప్పును. ప్రపత్తిలక్షణవాక్యమందు మహావిశ్వాసపూర్వకంబనిచెప్పుటచేతను, అనుష్ఠానవాక్యమందనఁగా ద్వయమందును ఉపసర్గవలన నవ్విశ్వాసమునే చెప్పుటచేతను ఇచ్చట నదియె విధింవఁబడుచున్నది. ‹‹మహావిశ్వాసపూర్వకమ్,” ‹‹తదేకోపాయతాయాచ్నా ప్రపత్తిశ్శరణాగతిః,” ‹‹త్వమేవోపాయభూతో మే భవేతిప్రార్థనామతి శ్శరణాగతిః,” ‹‹సకృదేవప్రపన్నస్య కృత్యమ్ నైవాన్యదిష్యతే,” ‹‹ప్రపత్తిర్విశ్వాసః॥” ‹‹సకృత్ప్రార్థనమాత్రేణ పేక్షితన్దాస్యతీతి విశ్వాసపూర్వకప్రార్థనామితియావత్ ” అనిచెప్పినట్లు యీవిధ్యనుష్ఠానమనెడు ఉపాయస్వీకారము ప్రార్థనాగర్భమై, సకృత్తై, స్వీకారవిశేషణమైన మహావిశ్వాసపూర్వకమై, యావత్ప్రాప్తి

౬౦. వాచిక కాయికఙ్గళు మితుక్కు అపేక్షితఙ్గళాయిరుక్కచ్చెయ్

మందు యీ పిళ్ళైలోకాచార్యులుగారే అనతిచ్చియుండు విషయ
మును ఈస్థలమందు అనుసంధించవలయు.

౬౦. సామాన్యముగా గతివాచకమైన యీ 'వ్రజ' అనుపదము మానస వాచిక కాయిక రూపమైన గతిత్రయములనున్ను చూపించగలదై యుండగా మానసికమైన అధ్యవసాయ జ్ఞానమందుమాత్రమే సంకుచితముచేయుటకు కారణమును సాయించుచున్నారు ,, వాచిక కా

వరకు విమర్శదశయందనువర్తించవలసినదై యుండును. ఉపాయఫల్గుత్వ, ఉద్దేశ్యదుర్లభత్వ, స్వకృతదోషదర్శనత్వ, ములను శంకాత్రయరహితమైన అధ్యవసాయమే మహావిశ్వాసమనఁబడును. మామ్ అనెడుపదమందుఁ జెప్పఁబడిన సర్వజ్ఞత్వ, సర్వశక్తిత్వ, పరమకారుణికత్వ, పరమోదారత్వాది గుణముల ననుసంధించునపుడు ఉద్దేశ్యదుర్లభత్వమనెడు ఫలగౌరవముచేత వచ్చెడుశంకయు, ఆశ్రితవాత్సల్యత్వము ననుసంధించునపుడు స్వకృతదోషదర్శనమనుశంకయు, అశరణ్యశరణ్యాత్వ, అనాలోచితవిశేషాశేష లోకశరణ్యత్వముల ననుసంధించుటచేత ఉపాయఫల్గుత్వమను శంకయు పరిహృతములగును. ఇదియే గుణములవలనఁగలిగెడు అధ్యవసాయము. సర్వస్వామియనుటచేత ఉపాయలాఘవమనుశంకయు, శ్రీమాన్ అనుటచేత స్వకృతదోషదర్శనమనుశంకయు, నారాయణుఁడనుటచేత ఫలగౌరవశంకయును, పరిహృతమగును. ఇది స్వరూపానుసంధానమువలనఁ గలిగెడు అధ్యవసాయము. ఇట్లు సంశయములు రహితముకాగానే ఈశ్వరుఁడు తనయొక్క స్వరూపగుణముల సిద్ధికొఱకే శరణాగతరక్షణముచేయునని యొకమహావిశ్వాసముపుట్టును. ఇదియేప్రపత్తి. ప్రపత్తివిశేషమందు ఉపాయబుద్ధి యనువర్తించినపుడు ఉపాయాంతరతుల్యమగును. ఈశ్వరుఁడే యుపాయమనెడు అధ్యవసాయవిశేషమందు సాధనత్వబుద్ధియు, అసకృత్కరణమును గలిగినపుడు తదేకోపాయత్వము లేకపోవును. ఇట్లుచరమశ్లోకపూర్వార్థముచేత అధికారికృత్యమైన త్యాజ్యస్వరూపమును, తద్బాహుళ్యతయును, త్యాగమును, తత్ప్రకారమును, తదంగమును, స్వీకారవస్తు స్వరూపమును, దీనిసైరపేక్షత్వమును, స్వీకారప్రకారమును, స్వీకారమును, చెప్పఁబడినది. త్యాగవిశిష్టము స్వీకారము, స్వీకారవిశిష్టము అధికారమనియు, గుణవిశిష్టముపాయమనియుఁ గెలియఁగలుగును.

తేయుమ్, «జ్ఞానాన్మోక్షమ్» ఆకైయాలే, మానసమాన వనుష్ఠానత్తై చ్చొల్లుకిఱతు.

౬౧. ఆక త్యాజ్యత్తైచ్చొల్లి, త్యాగప్రకారత్తైచ్చొల్లి, పఱ్ఱుమిప్పడుముపాయత్తైచ్చొల్లి, ఉపాయనైరపేక్ష్యఞ్జొల్లి, ఉపాయత్వఞ్జొల్లి, ఉపాయస్వీకారమ్ శొల్లుకిఱతు.

---

యిళంగళుం" ఇత్యాది సూత్రముచేత. అనఁగా, 1(శిన్దైయాలుం శొల్లాలుం శెయ్కైయినాలుం) మనస్సుచేతనున్ను, వాక్కుచేతనున్ను, వ్యాపారముచేతనున్ను అని ఆళ్వార్లు ఆనతిచ్చినట్లు కరణత్రయముచేతనున్నుకలిగిన ఉపాయస్వీకారము అధికారిపూర్తికి హేతువగుటచేతను, స్వీకారమును భగవత్సన్నిధిలో విన్నపించడమనే వాచికమున్ను, అంజలి నమస్కారము మొదలగు కాయికవ్యాపారమున్ను యీ సిద్ధోపాయస్వీకారమునకు అపేక్షితములైనను (జ్ఞానాన్మోక్షం) జ్ఞానముచేతను మోక్షము అని శాస్త్రసిద్ధమగుటచేత వాచికకాయిక గతుల రెంటిని వదిలి మానసికమైన అధ్యవసాయరూపానుష్ఠానమును మాత్రమును చెప్పుచున్నదని యీ సూత్రార్థము.

ఇదివరలో ఈశ్లోకములోని పూర్వార్థమునకు ప్రతిపదమున్ను అర్థమున్ను వ్రాయించినవారైరి.

౬౧. ఇకను పూర్వార్థముచేత చెపబడిన అర్థమును అనువదించి నిగమించుచున్నారు «ఆక త్యాజ్యత్తైచ్చొల్లి» ఇత్యాదిగా. అనఁగా, ఇంతవరలో పూర్వార్థమందు (సర్వధర్మాన్) అని త్యజించవలసిన సాధనాంతరములనుచెప్పి, (పరిత్యజ్య)అని సాధనాంతరములను విడిచే సమయమున,రుచివాసనలతో, లజ్జతో విడువవలసినదని త్యాగప్రకారమునుచెప్పి, (మామ్) అని విడిచినతరువాత పట్టవలసిన ఉపాయమును

---

1 తిరువా - ౬-౫-౧౧.

౬౨. (అహమ్.)

౬౩. స్వకృత్యత్తై యరుళిచ్చెయ్కిరార్.

౬౪. సర్వజ్ఞనాయ్, సర్వశక్తియాయ్, ప్రాప్తనానార్.

---

చెప్పి, (ఏకం) అని సిద్ధోపాయభూతుఁడైన సర్వేశ్వరుఁడు, ఫలప్రదుఁడై నసమయమున సాధనాంతరము మొదలైన ఇతరసహాయములను కోరఁడనే ఉపాయ నైరపేక్ష్యమునుచెప్పి, (శరణం) అని అట్టిసర్వేశ్వరుడే ఉపాయమని ఉపాయత్వముచెప్పి, (వ్రజ) అని ఆసర్వేశ్వరుడే ఉపాయమనే అధ్యవసాయరూపమైన ఉపాయస్వీకారమును చెప్పుచున్నదని యీ సూత్రార్థము.

౬౨. అనన్తరం ఉత్తరార్ధమునకు అర్థమునానతీయపూని, అందులోని మొదటిపదమయిన అహమ్ శబ్దార్థమును యానతిచ్చుచున్నారు, 'అహమ్' అని.

౬౩. ఈ యుత్తరార్థమందు సర్వేశ్వరుఁడు చేతనునికిచేయు 1 అంశమును ఆనతిచ్చుచున్నారు "స్వకృత్యత్తై" ఇత్యాది వాక్యముచేత. అనఁగా, అధికారిచేయవలసిన సిద్ధోపాయ పరిగ్రహమును పూర్వార్ధమందు ఆనతిచ్చి, ఉపాయభూతుఁడైన తానుచేయవలసిన 2 కార్యమును యీయుత్తరార్థమందు సాయించుచున్నారు.

౬౪. 3 ఇకను 'అహమ్'అనుపదమునకు అర్థము ఆనతిచ్చుచున్నారు "సర్వజ్ఞనాయ్" ఇత్యాది వాక్యముచేత. అనఁగా, (యస్సర్వజ్ఞస్సర్వవిత్) ఎవఁడు అన్నిపదార్థములయొక్క స్వరూపస్థితి ప్రవృత్తులను లెస్సగా తెలిసినవాడో అన్నట్టు అన్నిపదార్థములను తెలిసినవా

---

1 అంశము - సర్వపాపవిమోచనపూర్వకమైన దుఃఖనివృత్తి.

2 కార్యము - దుఃఖనివృత్తి.

3 ఇకను - ఉత్తరార్థమునకు వ్యాకారము సాగించినదగువాగ.

౬౫. కీర్ణనిస్త్రనిత్తైయుమ్, మేల్ పోక్కడి యతిశైక్కుమ్, అపేక్షపడి యే శెయ్‌తు తలైక్కట్టుకైక్కు మేకాన్తమాన గుణవిశేషఙ్గళైయుమ్ తక్ పేఱాక చ్చెయ్‌తు తలైక్కట్టుకైక్కీడాన బన్ధవిశేషత్తైయుమ్ కాట్టుకిఱతు.

---

డును, (పరాస్యశక్తిర్వివిధైవశ్రూయతే) సర్వేశ్వరునికిగల శక్తిసర్వోత్కృష్టముగానున్ను, అనేకవిధములుగానున్ను ప్రతిపాదింపబడుచున్నది అన్నట్టు అన్నిసామర్థ్యములుగలవాఁడై స్వామియవుటచేతను తనవస్తువునుతాను బాగుచేసుకొనుటకు తగిన సంబంధముకలవాఁడును అయిన నేను అని యీసూత్రార్థము.

౬౬. సర్వేశ్వరునియందు 1 అనేకకల్యాణగుణములుండగా, సర్వజ్ఞత్వ, సర్వశక్తిత్వ, శేషిత్వగుణములను మాత్రము, ఈ అహంశబ్దము చూపించుటకు ప్రయోజనము నానతిచ్చుచున్నారు ‘‘కీర్ణనిస్త్రనిత్తైయుమ్’’ ఇత్యాదిసూత్రముచేత. అనఁగా; ఈచేతనునికి అనిష్టనివృత్తి, ఇష్టప్రాప్తులను చేయుసమయమున యీ చేతనుఁడు, ఆశ్రయణాత్పూర్వమందుండిన స్థితినిన్ని, ఆశ్రయణాత్పరమందు పోతగ్గ మార్గమునున్ను తెలుసుకొనుటకున్ను, తెలుసుకొన్నప్రకారము ఇష్టానిష్టప్రాప్తిపరిహారములనుచేసి నెరవేర్చుటకున్ను తగినవైయున్న 2 సర్వజ్ఞత్వ, 3 సర్వశక్తిత్వములనే గుణవిశేషములనున్ను, ఈచేతనునికి పురుషార్థమునుయిచ్చే

---

1 అనేకకల్యాణగుణములు–సర్వజ్ఞత్వాది గుణత్రయములకు భిన్నములైనగుణములు.

2 సర్వజ్ఞత్వము – అన్నిటిని యేకకాలమందు తెలుసుకోదగినజ్ఞానము.

3 సర్వశక్తిత్వము – స్వవ్యతిరిక్త సమస్తవస్తువులను తిరుఉదరములోనుంచి రక్షించినశక్తి, అతీంద్రియుఁడైనతన్ను ఇంద్రియగోచరునిగా చేసినశక్తి, అణుస్వరూపమైనవస్తువులలో విభువైనతాను పూర్ణముగావర్తించుశక్తి, నిత్యసంసారియై భగవద్విముఖుఁడైన చేతనుని అభిముఖ్యునిగాచేసి సర్వపాపవిమోచనపూర్వకముగా నిత్యసూరిగోష్ఠిలో అభేదముగా వర్తింపచేయుశక్తి.

౬౬. తనక్కాకక్కొణ్ణ సారథ్యవేషత్తై అవనై యిట్టు ప్పారాతే తన్నైయిట్టుప్పార్త్తజ్ఞీన వచ్చసీర తానానతఙ్మైయై (అహమ్) ఎన్ఱు కాట్టుకిఱాన్.

---

సమయమందు వీనిపురుషార్థముకాక తన పురుషార్థముగాచేసి ముగింపు చేయుటకు హేతువైన శేషిత్వమనే బంధవిశేషమున్ను ప్రకాశింపుచు న్నదని యీ సూత్రార్థము.

(మామ్) అనేస్థలమందు ఆశ్రయణమునకు అవశ్యాపేక్షితము లైన వాత్సల్యాది గుణవిశేషములు ప్రకాశించినటువలెనే, (అహమ్) అనేస్థలమందున్ను, ఇష్టానిష్టప్రాప్తిపరిహార రూపకార్యములను చేయుటకు అవశ్యాపేక్షితములైన సర్వజ్ఞత్వాది గుణవిశేషములు ప్రకాశించుచున్నవి. వాత్సల్యాది గుణములు లేనిసమయమందు స్వాపరాధభీతుఁడైన యీ చేతనుఁడు భగవదాశ్రయణము చేయకూడనటుఁవలె, జ్ఞానశక్త్యాదులు లేనిసమయమందు ఇష్టానిష్టప్రాప్తిపరిహార రూపకార్యముచేయుట ఘటించదు.(ఇందుచేతను వాత్సల్యాదిగుణములు,చేతన ఆశ్రయణమునకున్ను, సర్వజ్ఞత్వాదిగుణములు కార్యకరత్వమునకున్ను అవశ్యాపేక్షితములని భావము) ఈ అహంశబ్దమందు జ్ఞానశక్తులున్ను, బంధవిశేషమున్ను చెప్పినపుడు పూర్తికిన్ని ఉపలక్షణము.

౬౬. ఈ 1 అహమ్పదమందు, మామ్ అనేస్థలమందుసారథియైనిలచిన పారతంత్ర్యమునకు విరోధియైనిలచిన స్వాతంత్ర్యమును ప్రకా

---

1 పూర్వార్థమందు (మామ్) అని తనసౌలభ్యమునుచూపెను. ఇచ్చట (అహం) అని తనపరత్వమును చూపించుచున్నాడు. “తేర్ మన్నర్ క్కాయన్ఱు తేరూర్న్దాన్” “పఞ్జవర్ వీయకోల్ కైయిఱ్కొణ్డు పార్త్తన్ఱన్ తేర్ మున్నాన్” “కోల్లామా కోలానఉళవుకోలుమ్ కైయుమానవిలైయైకాట్టి” అనునట్లు సౌలభ్యమునుచూపెను. “తార్ మన్నర్ గంగళ్ తలై మేలాన్” “వెళ్ళై ళ్ళవిళిశఙ్గు వెఞ్జుడర్ తిరుచ్చక్కర మేన్దుకైయన్” అనునట్లు తనపరత్వమును అహమ్శబ్దమువల్ల ప్రకాశింపించుచున్నాడు.

౬౭. కీఴిల్ పారతన్త్ర్యముమ్ ఇవ్వ స్వాతన్త్ర్యత్తినుడైయ వెళ్లై నిలమిత్తే.

---

శింపచేసినరీతిని ఆనతిచ్చుచున్నారు. "తనక్కాకక్కొండ" ఇత్యాది వాక్యముచేత. అనఁగా, మామ్ అని సారథ్యవేషముతో నిలిచియున్న తన్ను ఆశ్రయించమని చెప్పినసమయమందు, తన(అర్జునుఁడు) రక్షణార్థముగా ఆరోపించుకొన్న సారథ్యవేషమును సర్వాధికుఁడైనవాఁడు యీరీతిగావంగి క్రిందనిలువడము తన(ఈశ్వరుని)ఆశ్రితపారతంత్ర్యాది గుణములచేతనేగదాఅని సర్వేశ్వరుని స్వరూపము ననుసరించిచూడక, మనకు దాస్యవృత్తిచేసి సారథియై నిలచినవాఁడుగదా అనితన్ను స్వామిగాతలచి("సర్వధర్మములనువదలి నన్ను ఆశ్రయించు" అని అంటున్నాఁడు, ఇదియేమికాగలదు అని) భయపడినభయము తీరేటట్టుగా 1 త్రివిధ చేతనాచేతనములయొక్క స్వరూపస్థితి ప్రవృత్తులను స్వాధీనముగా కలవాఁడై, నిరంకుశ స్వతంత్రుఁడైయున్న తనస్వరూప యాథార్థ్యమును "అహం" అని చూపుచున్నాడని యీసూత్రార్థము.

౬౭. ఈరీతి నిరంకుశ స్వతంత్రుఁడైనవాఁడు పరతంత్రుఁడైయుండడమున్ను తనకు స్వరూపమైచేసినదికాదు అనేవిషయమును ఆనతిచ్చుచున్నారు. "కీఴిల్" ఇత్యాది సూత్రముచేత. అనఁగా, క్రింద మామ్

---

"సర్వధర్మాన్పరిత్యజ్య మామ్" అని ధర్మనివర్తకమైన వేషమును చూపెను. "అహం సర్వపాపేభ్యో మోక్షయిష్యామి" అని అధర్మనివర్తకమైన వేషమునుచూపించుచున్నాడు. "(మామ్) ఎన్రు శరణమెన్గిఱ ఉక్తిమాత్రత్తైయుమ్ సహియాదనిరపేక్షమాన నిలైయాకైయాలే ఉక్తిక్కువిపరీతమాన నిలైయైక్కాట్టినాన్. (అహమ్) ఎన్రు పాపవిమోచకత్వత్తాలే అనుష్ఠానత్తుక్కు విపరీతమాననిలైయై క్కాట్టుకిఱాన్. (అహం మోక్షయిష్యామి) ఎన్గైయాలే బన్ధకనాననానే విమోచకనానాల్ వేఱునివారకను ముణ్డో వెన్ను తన్నైయసమాభ్యధిక రాహిత్యత్తై చ్చొల్లుకిఱాన్."

I త్రివిధచేతనాచేతనములు - త్రివిధచేతనములు - బద్ధ, ముక్త, నిత్యులు; త్రివిధ అచేతనములు - శుద్ధసత్వ, మిశ్రసత్వ, సత్వశూన్యములని మూడువిధములైనఅచేతనములు.

అనేపదమందుచెప్పిన సారథిరైయున్న పారతంత్ర్యమున్ను, తలంచినది చేయుసమయమున తన్నునివారించేవా రొకరులేని 1 ఈస్వాతంత్ర్యముయొక్క కడపటిఎల్లఅని యీసూత్రార్థము.

---

1. ఈ స్వాతన్త్ర్యము - ఈఅహాంశబ్దమందు చెప్పినస్వాతంత్ర్యము.

ఈ అహాంశబ్దమునకు పెరియవాచ్చాన్ పిళ్లై స్వాములు పరన్దరహస్యములో సాయించిన అర్థమునున్ను అనుసంధేయార్థము యిచ్చట చూపబడుచున్నది.

“అహాంశబ్దమ్ వ్రజవిల్ అర్థమాకపుకన్ద అధికారియినుడైయ మహావిశ్వాసత్తుక్కు ఊన్ర్ఱాయ్, మేల్ శొల్లప్పుకుకిఱ పాపవిమోచనత్తుక్కు ఉపకరమాన జ్ఞానశక్త్యాదిగుణవిశేషంగళై, కీழ్ “మామ్” ఎన్ఱ ఆశ్రయణీయమాక ఉక్తమానవస్తువుక్కు ప్రకాశిప్పిక్కిఱతు. ఆశ్రయిక్కైక్కు వాత్సల్యాదికళ్ వేణుమ్; కార్యమ్ శెయ్కైక్కు జ్ఞానశక్త్యాదికళ్ వేణుమ్. “నివర్త్యంశమ్ ఇన్నతు, నివర్తనప్రకారమ్ఇన్నతు, నివర్తనాధికారిఇన్నాన్” ఎన్ఱఱికైక్కు సర్వజ్ఞనాక వేణుమ్. జ్ఞానమ్ పిఱన్దాల్ ప్రయోజనమిల్లైయే, పంగుకల్పనాయ్ అశక్తనాయిరుక్కుమాకిల్. ఆకైయాలే జ్ఞానానుగుణమాక క్కార్యమ్ శెయ్కైక్కు సర్వశక్తియాక వేణుమ్; సర్వశక్తియానాలుమ్ ఇవని దుఃఖమ్ పచ్చైకొండు తీర్క్కవేణ్డుమ్పడి అపూర్ణనాయిరుక్కుమాకిల్, అవనుక్కిడాక ఇవనాల్ ఇడలావతొన్ఱిల్లామైయాలే, అవైయిరండుమ్ అకిఞ్చిత్కరమామిత్తే. అజ్ఞనన్ఱియిలే ఒన్ఱియుంబోదు అవాప్తసమస్తకామనాక వేణుమ్, సర్వజ్ఞనానాలుమ్, సర్వశక్తనానాలుమ్, అవాప్తసమస్తకామనానాలుమ్, ఇచ్చేతననోడు ఒరుసమ్బన్ధమిల్లాతవన్ఱు అవైమూన్ఱుమ్ కార్యకరమాకాతే; అతుక్కాక సర్వస్వామియాక వేణుమ్. ఇవైనాలుమ్ విపరీతఫలమాకాతే, ఇవనుడైయరక్షణత్తుక్కు ఉఱుప్పామ్బొత్తైక్కు పరదుఃఖాసహత్వలక్షణమాన పరమదయైయుడైయనాగ వేణుమ్; ఇల్లాతవన్ఱు సర్వజ్ఞత్వమ్ ఇచ్చేతనన్ పణ్ణిన కుఱ్ఱజ్ఞళై తప్పామల్ కణక్కిడుకైక్కు ఉఱుప్పాయిఱుమ్; సర్వశక్తిత్వమ్ అక్కుఱ్ఱంగళుక్కీడాక నరకాదికళిల్ తళ్ళి అఱుత్తఱుత్తు తీర్క్కుకైక్కు ఉఱుప్పాయిఱుమ్; తిరుగ్గనిన్ఱాల్ కణ్ పార్త్తు నెకిழ్ఱామైక్కు ఉఱుప్పాయిఱుమ్, అవాప్తసమస్తకామత్వ నిబన్ధనమాన నైరపేక్ష్యమ్. ఇజ్జక శెయ్యానిన్ఱాల్ కడవతల్లవెన్ఱు నియమిప్పారిల్లామైక్కు శేతువామిత్తనై, సర్వస్వామిత్వ ప్రయుక్తమాన నిరఙ్కుశస్వాతన్త్ర్యమ్. ఆకైయాలే సర్వజ్ఞత్వాత్తైరక్షణవిధయా విషయమాక్కైక్కుమ్, సర్వశక్తిత్వత్తై రక్షణాపార త్తిలే అక్కైక్కుమ్, అవాప్తసమస్తకామత్తైయై

౭౮. (త్వా).

౭౯. అజ్ఞనాయ్, అశక్తనాయ్, అప్రాప్తనాయ్, ఎన్నైయేఉపాయమాక ప్పణిని యిరుక్కిఱవన్నై.

---

౭౮. ఉత్తరార్థమందలి ప్రథమపదమైన అహంశబ్దార్థమును సాయించి రెండవపదమైన 'త్వా' అనుశబ్దమును యెత్తుకొనుచున్నారు, 'త్వా' అని.

౭౯. 1 'త్వా' అనుపదమునకు అర్థమానతిచ్చుచున్నారు. 'అజ్ఞనాయ్' ఇత్యాది వాక్యముచేత. అనఁగా, నీకార్యములను తెలుసుకొను

---

ప్రయోజననిరపేక్షమాక రక్షిక్కైక్కు ఉఱుప్పాక్కైక్కుమ్, సర్వస్వామిత్వత్తైత్తఱపేఱాకక్కార్యమ్ శెయ్కైక్కు ఉఱుప్పాక్కైక్కుమ్ దర్శైవేణుమ్. అక్కైయాలే ఇక్కార్యమ్ శెయ్కైక్కు ఉఱుప్పాన ఇవైవ్వాగుణంగళుమ్ అహమ్‌శబ్దత్తిలే అనుసంధేయమ్; అక, సర్వజ్ఞనుమాయ్, సర్వశక్తియుమాయ్, అవాప్తసమస్తకామనుమాయ్, సర్వస్వామియుమాయ్, పరమదయావానుమాన నాన్ ఎన్గిఱతాయిఱ్ఱు."

1 త్వా అనుపదము త్వామ్ అనిన్ని స్పష్టముగాచెప్పఁబడును. "సర్వధర్మాన్‌పరిత్యజ్య మామేకంశరణంవ్రజ" అని విధించబడిన ప్రకారము దుష్టసాధ్య సాధనములను సవాసనగాత్యజించి, సిద్ధోపాయస్వీకారమొనర్చి, దేహాదుత్తీర్ణమైన ఆత్మవస్తువందు స్వాతంత్ర్యబుద్ధియు, అన్యశేషత్వప్రతిపత్తియు, తచ్ఛేషత్వమాత్రబుద్ధియు, సాధ్యాంతరములయందు సాధ్యతాబుద్ధియు, సాధనాంతరములయందు సాధనత్వబుద్ధియు, సిద్ధోపాయస్వీకారమందుపాయబుద్ధియు సవాసనగా త్యజించుకొన్న అనఁగా త్యాగస్వీకారవిశిష్టుడవై యున్న నిన్ను అని (త్వా) శబ్దమునకర్థము. ముందు 'అహమ్' అనుపదముచేత, సర్వజ్ఞత్వ, సర్వశక్తిత్వ- ప్రాప్తత్వ, నైరపేక్షత్వములు కలవాఁడీశ్వరుఁడని చెప్పియుండుటచేత యీ 'త్వా' పదముచేత చెప్పబడు అధికారి, అజ్ఞానము, అశక్తి, అప్రాప్తము, అకించన్యత్వము అనునీగుణములతోఁగూడియుండుట సూచించఁబడినదిగాఁ తెలియవలయు.

అష్టశ్లోకివ్యాఖ్యానమ్. 'త్వా' ఎన్ఱు నివర్త్యపాపాశ్రయ భూతనాయ్, నివృత్త్యుపాయత్తైప్పఱ్ఱ అవన్నక్కలిలే సర్వభరంగళైయుమ్ స్వన్యసిత్తు, విముఖవ్యావృత్తిసూచకమాన ప్రపత్తియై యుడైయనాయ్, పాపనివృత్త్యవసర ప్రతీక్షనానవధికారియై చొల్లుకిఱతు.

౭౦. (సర్వపాపేభ్యః).

౭౧. మత్ప్రాప్తి ప్రతిబన్ధకఙ్గళెన్ఱుయావైయాఙై శిలపాపఙ్గళైక్కుఱిత్తుక్కిఱాయ్ అవ్వొపాపఙ్గళెల్లావఱ్ఱిల్ నిన్ఱుమ్.

టకుతగిన జ్ఞానము లేనివాడ్వై, తెలిసికొనినను చేసిముగింపు చేసుకొను టకు శక్తిలేనివాడవై, అట్టి జ్ఞానశక్తులు కలిగియుండినను నిన్నురక్షిం చుకొనుటయందు నీకుసంబంధము లేనివాడవై, ఈరీతి అజ్ఞుడవై, అశక్తుడవై, అప్రాప్తుడవై యుండుటచేతను, అన్ని సాధనాంతరములను వదలి, సహాయాంతరాపేక్షలేని నన్నే ఉపాయముగా పరిగ్రహించిన నిన్ను అని యీపదమున కర్థము.

౭౦. రెండవపదమైన 'త్వా' శబ్దార్థమును సాయించిన తరువాత తృతీయపదమును యెత్తుకొనుచున్నారు "సర్వపాపేభ్యః" అని.

౭౧. ఈ సర్వపాపేభ్యః అనుపదము, పాపశబ్దమున్ను, ఏభ్యఃఅను బహువచనమున్ను, సర్వశబ్దమున్నుకూడి ఏకరూపమై యుండుటచేత ఈమూడు శబ్దార్థములను తిరువుళ్లములో నుంచుకొని సర్వపాపేభ్యః అను పదమునకు అర్థమును ఆనతిచ్చుచున్నారు. "మత్ప్రాప్తి" ఇత్యాదివాక్యముచేత. అనఁగా, 1 పాపమనేది ఇష్టమునకువిరోధిగానున్ను, అనిష్టమునకు హేతువుగానున్ను వుండునదవుటచేతను, ఇది మోక్షోపదేశప్రకరణమవుటచేత ఈ ప్రకరణమందు ఇష్టములకు విరోధులనఁగా

౭౨ వ సూత్రములోని "అహమ్" అను విశేష్యశబ్దమునకు "మోక్షయిష్యామి" అను ఉత్తమపురుషక్రియనున్ను, 'త్వా' అనుశబ్దమునకు "మాశుచః" అను మధ్యమపురుషక్రియాశబ్దమునున్ను అన్వయించుకోవలెను.

1 పాపమనునది సాధారణముగ అనిష్టమైనదానినిచ్చునదియు, ఇష్టఫలవిరోధియునై యుండునది. ఇచ్చట మోక్షవిషయమందు చెప్పబడుచున్నదిగాన పాపమనఁగా అనిష్టమైన సాంసారికదుఃఖము నిచ్చునదియు, ఇష్టమైనమోక్షమునకు విరోధిగనుండునదియు అని అర్థము.

౭౨. "పొయ్‌న్నిన్ఱఞానముమ్ పొల్లావొఴుక్కు మఴుక్కుడమ్బుమ్"

---

భగవల్లాభవిరోధులు. ఆభగవత్ప్రాప్తి విరోధులందు, 1 జ్ఞానవిరోధి, 2 రుచివిరోధి, 3 ఉపాయవిరోధి, 4 పూర్వమే నివృత్తింపబడిన దవుట చేత, ఇకను వుండునవి భగవత్ప్రాప్తికి విరోధియొక టేగనుక, (అనన్య సాధనుడైన) నీవు (అనన్యసాధ్యుడైన) నన్ను పొందుటకు ప్రతిబంధకములని యేయేపాపములను వుద్దేశించి భయపడుచున్నావో ఆయా పాపము లన్నిటినుంచిన్ని అని యీసూత్రమున కర్థము.

౭౨. ఆ "సర్వపాపేభ్యః" అను శబ్దమునందు, ఏభ్యః అను బహువచనముచేత చెప్పబడిన అర్థములను సాయించుచున్నారు. "పొయ్‌న్నిన్ఱఞానముమ్" ఇత్యాది వాక్యముచేత. అనఁగా, (దేహాత్మాభిమాన రూపమైన అజ్ఞానమున్ను, అట్టి అజ్ఞానకార్యమైన దుష్కర్మమున్ను, హేయవస్తు సముదాయమైన దేహమున్ను) ఉత్పత్తి వినాశాదులగు భావవికారములయొక్క సంబంధమువల్ల అసత్యశబ్దముచేత చెప్పఁదగిన అచేతన దేహమందు ఆత్మఅనేజ్ఞానమున్ను, ఆదేహాత్మాభిమానము హేతువుగాచేయు సాంసారిక దుష్కర్మప్రవృత్తియును, ఆకర్మమూలముగాకలుగు మాంస రక్తాదులతోఁకూడి హేయమైన దేహసంబంధమున్ను, అనిచెప్పబడునట్లు, అవిద్యాకర్మ వాసనారుచి ప్రకృతిసంబంధములను జెప్పుచున్నదని యీసూత్రార్థము.

వీటిలో అవిద్యయనగా దేహాత్మాభిమాన రూపముగానున్న,

---

1 జ్ఞానవిరోధి - అర్థపంచకజ్ఞానవిరోధి; (2) రుచివిరోధి - ఉపాయోపేయరుచివిరోధి అనఁగా దేవతాంతరరుచి; (3) ఉపాయవిరోధి - ఉపాయాంతరము లేక సాధనాంతరము; (4) పూర్వమే - తిరుమంత్ర ద్వయములలోనున్న, ఈశ్లోకపూర్వార్థములోనున్న (అనఁగా ముముక్షువైనదశలోనున్న, వరణదశలోనున్న అనిభావము గ్రహించేది).

ఎన్గిఱపడియేఅవిద్యాకర్మవాసనారుచిప్రకృతిసమ్బన్ధఙ్గళై చ్చొల్లుకిఱతు.

దేవతాంతరశేషత్వజ్ఞాన రూపముగానున్ను, స్వతంత్రజ్ఞాన రూపముగానున్ను, మూడువిధములైన అజ్ఞానము,

1. కర్మమనగా పుణ్యపాపములకు హేతువగుకార్యములు. మహాఫలమైన మోక్షమునుపొందుటకు పాపమువలెనే పుణ్యమున్ను త్యాజ్యము. 2. "పుణ్యపాపేవిధూయ" (పుణ్యపాపములను నివర్తింపజేసి) అనిగదా ము. ఉ. 3.౧. లో చెప్పబడ్డది.

3. వాసన అనఁగా అజ్ఞానవాసనయు, కర్మవాసనయు, ప్రకృతి సంబంధ వాసనయు.

4. రుచియున్ను విషయభేదములచేత బహువిధములై యుండును.

5. ప్రకృతి సంబంధమనగా స్థూలసూక్ష్మరూపమైయున్న అచిత్సంబంధము.

---

1 కర్మమనునది పుణ్యమని పాపమని ద్వివిధమైయున్నది.

2 "తదావిద్వాన్ పుణ్యపాపేవిధూయ నిరంజనః పరమంసామ్యముపైతి ॥ సఆగచ్ఛతి విరజాంనదీమ్ । తత్సుకృతదుష్కృతేవిధూనతే । యథేషీకాతూలమగ్నౌప్రోతంప్రదూయేత । ఏవంహాస్యసర్వేపాప్మానః ప్రదూయంతే । యథాపుష్కరపలాశ ఆపోనశ్లిష్యంతే ; ఏవమేవంవిదిపాపం కర్మనశ్లిష్యతే" ఇత్యాదిశ్రుతులయందుఁ జెప్పినప్రకారము స్వర్గాద్యైశ్వర్య కారణమైన పుణ్యమును నరకపతనహేతువైన పాపమువలె మోక్షమునకు ప్రతిబంధకమగుటచేత నదియును పాపశబ్దముచేతనే చెప్పఁబడుచున్నది.

3 వాసనయనగా బుద్ధిపూర్వకము కాని ప్రవర్తనకుహేతువైన సంస్కారవిశేషము. అదియే అజ్ఞానవాసన, కర్మవాసన, ప్రకృతిసంబంధవాసన (అనగాతద్విషయరుచివాసన) యని మూడువిధములు.

4 రుచియనగా బుద్ధిపూర్వక ప్రవృత్తిహేతువైన సజాతీయ కర్మారంభమందలి యిచ్ఛ. అదియు విషయభేదమువలన బహువిధమైయుండును.

5 ప్రకృతిసంబంధమనఁగా స్థూలసూక్ష్మరూపమైన అచిత్సంబంధము. అది దేవ

(పై జెప్పినవాటికి వర్ధకమైన రాగద్వేషములను యీ బహువచన పాపశబ్దములో అనుసంధించతగును.)

---

ఇచ్చట ప్రస్తుతమైన పాపశబ్ద బహువచనమునకు అర్థాంతరములు క్రిందవ్రాయబడుచున్నవి. అష్టశ్లోకివ్యాఖ్యానము పుట ౪౦౯ _ ౪౧౦.

ఇతిల్ పాపశబ్దమ్ - పరమాభీష్టమాన భగవత్ప్రాప్తిక్కు ప్రతిబన్ధకమాయిరుక్కుమవైకళై చ్చొల్లుకిఱతెన్ఱు ఎన్నిత్తార్. అతావతు - పుణ్యపాపరూపమాన ఉభయవిధ కర్మంగళైయుమ్ శొల్లుగిఱతు. ఏతేనుమాక అభిమతవిరోధియైత్తే పాపమావతు. ఆకైయాలే ఇన్దపాపశబ్దమ్ ఇరండైయుమ్ కాట్టుకిఱతు. ముక్తనామ్పోతు 'తత్సుకృతదుష్కృతేధూనతే' ఎన్ఱు సుకృతదుష్కృతంగళిరండైయుం ఉతఱుమ్. సుఖహేతువాయిరుక్క చెయ్తేయుమ్ పుణ్యమానతు నివర్త్యమాకైక్కడి - నిరతిశయానన్దరూపమాన మోక్షత్తుక్కు విలక్కాకైయాలే, బ్రహ్మపదప్రాప్తి ముతలానవై ముముక్షువుక్కు అనిష్టమాకైయాలే, అత్తైక్కొడుక్కు మెన్ఱునినైత్తు అప్పడియే "సద్యస్త్యజన్తి వరదత్వయి బద్ధభావాః పైతామహాదిషుపదేష్వపి భావబన్ధమ్ । కస్సైన్మస్వదేతనుఖసఙ్చరణోత్సుకాయ కారేగ్ప్రహేకనకశృఙ్ఖలయాపిబన్ధః" ఎన్ఱు వేదాన్తాచార్యరు మరుళిచ్చెయ్తారిఱే. ఆక అనిష్టమావ ఫలత్తైక్కొడుక్కుమతు పాపమాకైయాలే ఇరణ్డుమ్ పాపశబ్దత్తాలే శొల్లప్పట్టతాయిత్తు. ఇతిల్ బహువచనత్తాలే అవిద్యాకర్మవాసనారుచిప్రకృతి సమ్బన్ధరూపమాన అవాన్తరభేదత్తైచ్చొల్లుకిఱతు.

అతిల్ అవిద్యైయావతు అజ్ఞానమ్. అతు జ్ఞానానుదయ అన్యథాజ్ఞాన విపరీతజ్ఞానరూపేణ త్రివిధమాయిరుక్కుమ్. జ్ఞానానుదయమావతు - ఒరుపదార్థవిషయమాక ఒరుజ్ఞానముమ్ ఉదియామై. అన్యథాజ్ఞానమావతు - పదార్థవిషయమాన స్వభావత్తై అన్యథాగ్రహిక్కై; సమ్ప్రతిపన్నమాక శ్వేతమాన శఙ్ఖత్తై పీతమాక గ్రహిక్కుమాపోలే. విపరీతజ్ఞానమావదు-పదార్థస్వరూపత్తై విపరీతమాకగ్రహిక్కై; రజ్జువిల్ సర్పబుద్ధిపోలే. అతావతు - "ఆత్మావెన్ఱొరువస్తు ఉణ్డు" ఎన్నతియామైయుమ్, ఆత్మావు జ్ఞానత్తిన్దాల్ దేహమే ఆత్మావెన్ఱిరుక్కైయుమ్, దేహాత్పరనాకవఱిన్దాల్ స్వతన్త్రనాక నినైక్కైయుమ్.

కర్మమావతు - అకృత్యకరణ కృత్యాకరణ భగవదపచార భాగవతాపచార అసహ్యాపచార రూపమాయుమ్, పుణ్యపాపరూపమాయుమ్, పాతక అతిపాతక మహాపాతకమ్ తొడక్కమాన విశేషంగళాలే బహువిధమాయ్, పూర్వాఘోత్తరాఘరూపమానవై.

౨౩. తృణచ్ఛేద కణ్డూయనాదికళైప్పోలే ప్రకృతి వాసనైయాలే

౨౩. బహువచనార్థమును సాయించిన తరువాత సర్వశబ్దముచేత చెప్పఁబడిన అర్థమును ఆనతిచ్చుచున్నారు. "తృణచ్ఛేద" ఇత్యాదిగా. అనఁగా తృణమును త్రుంచుట, దురదపట్టినస్థలములో గోకుకొనుట మొదలైనవాటివలె, అబుద్ధిపూర్వకముగా ప్రకృతిసంబంధమువల్ల కలిగిన అజ్ఞానాది వాసనలచేతను 1 అనువర్తించు ఉత్తరాఘములు (ఆశ్రయణకాలానంతరము సందర్భించు పాపములు) న్నూ: 2 మనము యీ సర్వధర్మములను చేయనిసమయమున లోకము మనలను దూషించునే

అకృత్యకరణమావతు - శాస్త్రంగళిల్ నిషిద్ధమానవఱ్ఱై చ్చెయ్కై. కృత్యాఽకరణమావతు - విహితమానవఱ్ఱై చ్చెయ్యాతొழிకై.

భగవదపచారమావతు - భగవదర్హమాన ద్రవ్యంగళైత్తాన్ జీవిక్కై, అర్చావతారత్తిల్ ఉపాదానస్మృతి, సర్వస్మాత్పరనాన సర్వేశ్వరనై దేవతాన్తరంగళోడు సమానమాక నినైక్కై, అవనతాన ఆత్మాత్మీయంగళై త్తన్నతాక వభిమానిత్తిరుక్కై ముతలానవై.

భాగవతాపచారమావతు - అర్థకామాభిమానంగళడియాక శ్రీవైష్ణవర్కళోడే ద్వేషమ్పణ్ణుకై, జ్ఞానాధికరానవర్కళ్ విషయత్తిల్ జ్ఞానద్వారా ఉపాదేయరెన్ఱు కాణ్గైయన్ఱిక్కే, జన్మవృత్తంగళైయిట్టు కురైయాకనినైక్కై, వికలకరణర్పక్కలిలే క్షేపోక్తిపణ్ణుకై, అవర్గళ్ పక్కల్ సజాతీయబుద్ధిపణ్ణుకై ముతలానవై.

అసహ్యాపచారమావతు - భగవద్భాగవత విషయమాన ఉచ్ఛ్రియంగళైక్కణ్డాల్ అసహమాననాయ్కొణ్డు అతిప్రవృత్తిపణ్ణుకై.

ప్రకృతిసమ్బన్ధమావతు - దేవమనుష్య తిర్యక్స్థావరరూపమాన చతుర్విధశరీరసమ్బన్ధమ్, ఇవైయడియాక వరక్కడవతాన రాగద్వేషమ్ ముతలానవై.

రుచివాసనైకళావన - గుణతారతమ్యత్తాలే ఇవ్వజ్ఞానాదికళై ప్పణ్ణి వరక్కడవతాన రుచియుమ్, అవఱ్ఱై ప్పణ్ణి వరుకిఱ అనాదివాసనైయుమ్.

ఆక బహువచనత్తాలే ప్రాప్తివిరోధి సకలపాపంగళైయుమ్ శొల్లుకిఱతు.

1 అనువర్తించు ఉత్తరాఘములు - విషయచాపల్యాదులు;

2 మనము - సర్వధర్మపరిత్యాగ పూర్వకముగా సిద్ధోపాయస్వీకారము చేసిన మనము;

అనువ_ర్తిక్కుమవై యెన్న,లోకాపవాదభీతియాలుమ్,కరుణైయాలుమ్, కలక్కత్తాలుమ్ శెయ్యుమవై యెన్న; ఎల్లావఱ్ఱైయుమ్ నినైక్కిఱతు.

౭౮. ఉన్మత్తప్రవృత్తిక్కు గ్రామప్రాప్తిపోలే త్యజిత్త ఉపాయఙ్గళిలే యివై అన్వితఙ్గళామో వెన్ఱు నినైక్కవేణ్డా.

అనేభయముచేతను, మనలనుచూచి లోకులు యీధర్మములను చేయక విడిచినయెడల 1 వారలునశింతురే, అయ్యో, అని కృపచేతనుచేయుచున్న నిత్యనైమిత్తిక కర్మములున్ను; రజస్తమోగుణములవల్ల సంశయించి (విడవబడిన) సాధనాంతరములయందు ఉపాయప్రతిపత్తిచేయుట; పునః ప్రవృత్తిచేయుట మొదలగువాటిని యీ సర్వశబ్దము చూపించుతున్నదని యీ సూత్రార్థము.

౭౮. భగవత్ప్రాప్తి సాధనముగాలేక లోకాపవాదాది పరిహారార్థముగా చేయునవిన్ని వస్తుస్వభావముచేత సాధనకోటియం దన్వయించకమానదు అనే విషయమును శంకాపూర్వముగా నానతిచ్చుచున్నారు "ఉన్మత్త" ఇత్యాది సూత్రముచేత. అనఁగా చిత్తభ్రమము కలవాడొకడు పలాని గ్రామమునకు పోవుచున్నామని ఉద్దేశ్యము లేక ఒకమార్గమును పట్టిపోయిన ఎడల ఆమార్గము ఒక గ్రామముతోటి సంబంధించియుండుటవల్ల ఆయూరిలో చేరునటువలె, సాధనబుద్ధిరహితముగా లోకాపవాద భీత్యాదులచేత చేయబడు యీ సాధనాంతరములు విడువబడిన ఉపాయములయందు చేరునా అనితలచవద్దు, చేరే తీరును. 2 కృపాపరతంత్రులై అనుష్ఠించినను యెగరవేసిన మట్టిగెడ్డ 3 ఆకాశమందు నిలువనట్లు దయచేతను అనుష్ఠించునవిన్ని ఒకఫల

1 వారలు _ లౌకికులు.

2 కృపాపరతంత్రులై అనుష్ఠించినను _ లోకాపవాదభీతిచే అనుష్ఠించక దయచేత అనుష్ఠించినను;

3 ఆకాశమందు నిలువనట్లు _ ఆకాశములో నిలువక భూమిలోనే పడునట్లు;

ముతోటి చేర్చగలదు. కనుక దయచేత అనుష్ఠించబడు సాధనాంతరములున్ను పాపశబ్దవాచ్యము కాగలదని తన్నిశ్లోకమనే రహస్యమందు ఋాపిళ్ళైలోకాచార్యులవారే ఆనతిచ్చియున్నారు.

౨౫. లోకాపవాదాది పరిహారముగా అనుష్ఠించు ధర్మము పాపశబ్దవాచ్యము అయినప్పటికిన్ని; పునఃప్రపత్తికి దోషమేమి అనుశంకకు సమాధానము నానతిచ్చుచున్నారు. «కలజ్గి" ఇత్యాది వాక్యముచేత. అనఁగా, ఒకతూరి అనుష్ఠానమునువిడిచి మరల అనుష్ఠించడమును సహించని ప్రపత్తిస్వరూపమును తెలునుకొనక సంశయించి,అనిష్టనివృత్తికిగాని ఇష్టప్రాప్తికిగాని ఉపాయబుద్ధిచేత మరలచేయు ప్రపత్తియు, యుపాయాంతరమైన అంగసహిత భక్తివలెనే పాపసమమై ప్రతిబంధకమని యీసూత్రార్థము.

(ఈ ౨౩-౨౪-౨౫ సూత్రముల అభిప్రాయమును ఈ క్రిందిపుటలలో విస్తారముగా వ్రాయబడియున్నది.)

---

ఈ సూత్రమువల్ల లోకాపవాద భీతిచేతగాక ఆనృశంస్యము (కృపాతిశయము) వల్ల చేసినవాటికిన్ని «ప్రాజాపత్యం గృహస్థానామ్" ఇత్యాదులలో ఒకఫలము చెప్పియుండుటవల్ల అవిన్ని పుణ్యమువలెనే ఫలద్వారా ప్రతిబంధకముగనుక ఆమార్గములోనున్ను అనుష్ఠించగూడదనే తాత్పర్యము సిద్ధమగుచున్నది.

సర్వశబ్దము ప్రపన్ననకు అసాధారణముగ ఈశ్వరుఁడు పోకడబెట్టునట్టియనిష్టములం జెప్పుచున్నది. పుణ్యపాపరూపమైన అనిష్టము పూర్వోత్తరాఘములని ద్వివిధమైయున్నది. సదాచార్యసమాశ్రయణా త్పూర్వముచేసినది పూర్వాఘము. పిమ్మట చేసినది ఉత్తరాఘము. అందు పూర్వాఘము సంచితమని ప్రారబ్ధమని ద్వివిధమై యున్నది. సంచితమనఁగా నొకకర్మ తనఫలమును బొందింప సిద్ధముకాగా నాఫలమును బొందనీయక నడ్డమువచ్చు ప్రబలమైన వేఱొకకర్మ. ప్రారబ్ధమనగా ఫలమును పొందింప సిద్ధమైయున్నకర్మ. అట్టి ప్రారబ్ధము, అభ్యుపగతము, అనభ్యుపగతమని ద్వివిధమైయుండును. అభ్యుపగతమనగా నీదేహముచేత ననుభవింపఁదగినది. ఇదియె తత్త

మాన శరీరారబ్ధమనఁబడును. అనభ్యుపగతమనగా దేహాంతరమం దనుభవింపదగిన ఫలమునిచ్చుటకు సిద్ధమైనది. ఇదియె శరీరాంతరారబ్ధమనఁబడును. ఉత్తరాఘమును ప్రామాదికంబనియు బుద్ధిపూర్వకంబనియు ద్వివిధము. అందు భగవద్భాగవతాచార్య విషయములయందు ఉపచారబుద్ధ్యా చేయునట్టి యపచారములును, దురదపుట్టినపుడు స్వాభావికముగ గోకుకొనుట మొదలగు ప్రకృతివాసనలచేత ననువర్తించు కర్మలును, ప్రామాదికోత్తరాఘములక్రిందఁ చేరును. చేయకున్న లోకమందొక యపవాదము నిరూపింతురేయను భయముచేతను, మనలనుజూచి లౌకికులువిడుచుకొన్న వాండ్రకు వినాశము కలుగునే అనెడు కృపచేతఁజేయు నిత్యనైమిత్తిక కర్మములును, రజస్తమస్సులచేతఁ గలంగి త్యక్తోపాయములయం దన్వయించుటయును, సకృదనుష్ఠానము తప్ప పునరనుష్ఠానము సహించని ప్రపత్తిస్వభావము తెలియక కలంగి అనిష్టనివృత్త్యర్థముగఁ గాని ఇష్టప్రాప్త్యర్థముగగాని ఉపాయబుద్ధ్యా తిరుగాజేయు ప్రపత్తియును (అనగా పునశ్శరణాగతియనుట.) బుద్ధిపూర్వకోత్తరాఘముల క్రిందచేరును. లోకసంగ్రహార్థముగఁ జేసిన ట్లభినయించిన కర్మనుగూడ అఘముక్రిందఁ జేర్పఁదగునాయనిన - పిచ్చివాఁడు ప్రాప్తమైన యొకమార్గమునఁబడి తద్ద్వారముగ నొకగ్రామముచేరినట్లు లోకసంగ్రహార్థముగనేకాని, శిష్య పుత్రోజ్జీవనార్థముగనేకాని యెట్లయిన విడిచిన యుపాయములయం దన్వితుడైనపు డవి తత్తత్ఫలానుభవములకుఁ ద్రోవఁజూపకమానవు. కాన చేసినపుడవి యుత్తరాఘములక్రిందఁ జేరుననుటకు సంశయములేదు. ‹‹నావిరతోదుశ్చరితా న్నాశాంతో నాసమాహితః । నాశాంతమానసోవాపి ప్రజ్ఞానేనైనమాప్నుయాత్॥ అను వాక్యములకు విరోధించకుండ ‹‹ అపిచేత్పాతకంకిఞ్చి ద్యోగీకుర్యాత్ప్రమాదతః । యోగమేవ నిషేవేత నాన్యమ్‌యత్నమ్‌సమాచరేత్›› అని యోగులకు ప్రాయశ్చిత్తము విధించుట చేత ఉపాసకునకు సంచితము విద్యచే నశించును. ప్రామాదికోత్తరాఘము ఈశ్వరుని క్షమకు విషయమైపోవును. ప్రారబ్ధమును బుద్ధిపూర్వకోత్తరాఘమును ప్రాయశ్చిత్తము చేసికొనకున్న ననుభవించియే తీరవలయును, ‹‹ ఆర్తానామాశుఫలదా సకృదేవకృతాహ్యసౌ । దృప్తానామపిజన్తూనాం దేహాంతరనివారిణీ॥ ప్రారబ్ధేతరపూర్వపాపమఖిలం ప్రామాదికంచోత్తరం । న్యాసేనక్షపయన్నభ్యుపగత ప్రారబ్ధఖండంచనః । ధీపూర్వోత్తరపాప్మనామజననా జ్ఞాతేపితన్నిష్కృతేః । కాటిర్యేసతిశిక్షయాప్యనఘయత్ క్రోడీకరోతిప్రభు.›› అనిచెప్పినప్రకారము దృప్తుండైన ప్రపన్నునకు అకృతప్రాయశ్చిత్తమైనపుడు అభ్యుపగత ప్రారబ్ధమును బుద్ధిపూర్వకోత్తరాఘంబును అనుభవైక వినాశ్యంబు - ఉపాయమహిమచేత సంచితానభ్యుపగత ప్రారబ్ధములకు వినాశము. ప్రామాదికోత్తరాఘము ఈశ్వరుని వాత్సల్యమునకు విషయమై నశించును. ఆర్తుఁడైన ప్రప

న్నిరియొక్క శేషించిన పూర్వోత్తరాఘములన్నియు విభక్తమొనర్చి భూషించినవారి యందుఁ బుణ్యములును దూషించినవారియందుఁ బాపములును పంచి సర్వమును ఉపాయభూతుఁడైన ఈశ్వరుఁడు నిర్హేతుకకృపచేత నశింపఁజేయును.—«యద్బ్రహ్మకల్ప నియతానుభవేప్య నాశ్యంతత్కిల్బిషం సృజతిజంతురిహక్షణార్ధే। ఏవంసదాసకలజన్మ సుసాపరాధం క్షామ్యస్యహోతదభి సంధివిరామమాత్రాత్” తస్య పుత్రాదాయముప యంతి సుహృదస్సాధుకృత్యాం। ద్విషంతఃపాపకృత్యాం। తస్యప్రియాజ్ఞాతయస్సుకృ తముపయంత్య ప్రియాదుష్కృతం” ఇత్యాదిక మిచట ననుసంధించవలయును.—«తదధిగమ ఉత్తరపూర్వాఘయో రశ్లేషవినాశౌ తద్వ్యపదేశాత్ ఇతరస్యాప్యేవ మసంశ్లేషః పాతేతు” అని పూర్వోత్తరాఘములను పుణ్య పాపములకు అశ్లేషవినాశము చెప్పి « భోగేన త్వితరేక్షపయిత్వా థసమ్పద్యతే” అని ప్రారబ్ధ మనుభవముచేతే వినాశన మగునని చెప్పిరేయనిన «ఆరబ్ధకార్యాక్ » «వర్తమానమ్ వర్తిష్యమాణంచ” అని ఉడ యవరులు శ్రీగద్యయం దానతిచ్చిన ప్రకారము ప్రారబ్ధమందును బుద్ధిపూర్వకమైన ఉత్తరాఘమందును శోకములేనపు డనుభవించవలసివచ్చు నింతియకాని శోకహేతు వైనదంతయు సర్వశబ్దమం దన్వితమై ప్రపత్తిచేత క్షమియింపఁబడునని తెలియవల యును. ఆశ్లేషమనఁగా ఉత్పత్తికాఁగల శక్తియొక్క ప్రతిబంధకము. వినాశమనఁగా నుత్పన్నశక్తియొక్క నాశము. ప్రపత్తి ప్రారబ్ధాదులకు వినాశని యనిచెప్పుటకు «మా శుచః” యను పదమే ప్రమాణముగానున్నది.—« సాధనమ్భగవత్ప్రాప్తౌ సఏవేతి స్థిరామతిః। సాధ్యభక్తిస్మృతాసైవ ప్రపత్తిరితిగీయతే। ఉపాయో భక్తిరేవేతి తత్ప్రాప్త్యాయాతుసామతిః। ఉపాయభక్తిరేతస్యాః పూర్వోక్తైవగరీయసీ।। ఉపా యభక్తిఃప్రారబ్ధః వ్యతిరిక్తాఘనాశినీ।సాధ్యభక్తిస్తుసాహన్త్రీ ప్రారబ్ధస్యాపిభూయసి” ఇత్యాదుల నిచట ననుసంధించ వలయును.—అర్జునుఁడు భగవత్ప్రపన్నుఁ డయ్యును పాశుపదుఁడై స్వవర్ణధర్మమయిన యుద్ధమందుఁ బ్రవర్తించినట్లు ప్రపన్నులయిన వారు ను వారివారి వర్ణాశ్రమోచిత ధర్మములను యధావిధినాచరించుచు కార్యార్థ మితర దేవతోపాసకులుగను ఉండవచ్చునాయనిన - అది యెంతమాత్రమైనఁ గూడదు, అర్జు నుఁడు దేహమందాత్మబుద్ధియు ఆభాసబంధువులయందు లౌల్యమునుకలవాఁడై ఈశ్వ రుని తిరుఁవుళ్లమును కనిపెట్టక యుద్ధమున కభిముఖుఁడు కాకుండుటంజూచి శ్రీకృష్ణభ గవానులు వానిద్వారముగఁ బ్రజాక్షయంబొనర్చుటకు మొదటఁజేసినసంకల్పము నిర్వికల్పమైసాగునట్లు కేవలము ముముక్షువులకొఱకైన చరమశ్లోకమును అర్జునునకు మనస్స మాధానము చేయుటే యొక వ్యాజముగాఁగొని బయలుపరచె నింతియెకాని అర్జునునకు మోక్షమిచ్చు తలంపుచేతఁగాదు, అట్టిసంకల్పము లేకపోవుటచేతనే యుద్ధముముగించిన

౭౬. (మోక్షయిష్యామి).

౭౭. ముక్తనాప్ముడిపణ్ణక్కడవేన్.

౭౮. ణిచ్చాలే, నానుమ్వేణ్డా, నీయుమ్వేణ్డా, అవై తన్నడైయే విట్టుప్పోగ్గాణెన్గిఱాన్.

---

౭౬. 1 అనంతరము నాలుగవపదమైన 2 "మోక్షయిష్యామి" ని ఎత్తుకొని అర్థము సాయించుచున్నారు.

౭౭. ఆ పదమునకు అర్థమును ఆనతిచ్చుచున్నారు. "ముక్తనాం బడి" ఇత్యాదిగా అనఁగా, (ఈ సర్వపాపములనుండిన్ని) విడువబడిన వానిగా చేయగలను అని యీపదమున కర్థము.

౭౮. 3 ఇకను 'ణిచ్' ప్రత్యయమునకర్థము ఆనతిచ్చుచున్నారు, "ణిచ్చాలే" ఇత్యాదిగా. అనఁగా (ఇష్యామి) అనుపదమందుండు

---

మతికొంతకాలమునకు అర్జునుడు పూర్వము సాయించిన అర్థములను స్మృతికిగోచరమగునట్లు పునః కటాక్షించుమని కోరినపుడు అయ్యర్థముల నట్టెదాఁచివేసి ఉత్తరగీతలు సాయించిరి. కాన, చరమశ్లోక పూర్వార్థమందుఁ జెప్పినట్లు సర్వధర్మములను దేవతాంతరాదులను వాసనారుచులతో విడిచి స్వరూపయుక్తముగ ఈశ్వరుఁడే గతిగ మ్యములని అధ్యవసించియుండువానికిఁగదా ఉత్తరార్థమం దీశ్వరకృత్యముగఁ జెప్పఁబడిన సర్వపాపవిమోచనము కలుగును; పతివ్రతకానిదానికి సద్గతిలేనట్లు ధర్మములవిడుపే అంగముగాఁగల ప్రపత్తియే లోపపడినపుడు పురుషార్థమును దదనుసారమయ్యే యుండును. ఉపాయభూతుఁడగు నీశ్వరునకు రక్షకత్వపూర్త్యర్థము జ్ఞానశక్త్యాదులు పుష్కలముగా నుండవలసినట్లు అధికారపూర్త్యర్థము చేతనునియందు ఉపాయాంతర పరిత్యాగమును సిద్ధోపాయ పరిగ్రహమును పుష్కలముగా నుండవలయును.

1 అనంతరము-సర్వపాపేభ్యః అనుపదమునకు అర్థమును ఆనతిచ్చినతరువాత,

2 మోక్షయిష్యామి - (మోచయామి)అని పోగొట్టు తాను అనిచెప్పక (మోక్షయిష్యామి) విడువబడినవానిగా చేయగలను అనుటవల్ల పాపఫలమును యిచ్చువాఁడను నేనుకాబట్టి నేను అనుగ్రహించినయెడల అవి ఉండవు అని అర్థము.

3 ఇకను మోక్షయిష్యామి అనుపదమునకర్థము సాయించినతరువాత.

౭౯. ఎన్నుడైయ నిగ్రహాఫలమాయ్ వన్దవై నానిరజ్గినాల్ కిడక్కుమో వెన్గై.

ణిచ్ ప్రత్యయముచేత, స్వయముగా తానుచేయువాడు గాక, ఒకరిచేత చేయించేవాడై విడిపించగలను అని అర్థము. ఇందువల్ల 1 నేనున్ను యీపాపనివృత్తికి ఒకయత్నమున్ను చేయవలసినది లేదు 2 నీవున్ను దీనికి ప్రార్థించవలసినది లేదు; నీవు నన్ను ఆశ్రయించిన 3 రాజకులమాహాత్మ్యముచేత పాపములు నిన్ను చూచి స్వయముగాభయపడి, (కానో వారుజ్గిర్ ఇజ్జణ్డిలమాల్) “అడవియందు దాగిపోయినదో, కనుపడలేదు, ఆశ్చర్యము!” అనినట్టు పోయినమార్గము తెలియనట్టు, తనంతటనే విడిచిపోవునుసుమీ! అని ఈసూత్రార్థము.

౭౯. 4 ఈరీతి ఆనతిచ్చినందుకు తాత్పర్యమును వెల్లడిచేయుచున్నారు “ఎన్నుడైయ” ఇత్యాదిగా. అనఁగా, పాపములు, కుప్పలో ఆముదపుచెట్టుపుట్టివృద్ధియై పామువలె కంఠమునుపట్టునది కాదుగదా? చేతనుడు చేసిన 5 కర్మములు క్షణములోనశించునవి దవుటచేత అప్పుడేనశించిపోవును, జ్ఞానసంకోచమువల్ల తానుచేసిన కర్మములను చేతనుడు మఱచిపోవును, స్వతఃసర్వజ్ఞుడనై ఒకటినిన్ని విడువక తెలుసుకొని కర్మపరిపాకకాలములందు పుణ్యపాపముల కనుగుణముగా సుఖదుఃఖములను అనుభవింపచేయుచున్న నాయొక్క నిగ్రహరూపపాపములు

1 నేనున్ను - పాపనివర్తకుడైన నేనున్ను, (2) నీవున్ను - పాపనివృత్తిని అపేక్షించుచున్న నీవున్ను; (3) రాజకులమాహాత్మ్యముఁ అనగా, లోకములో నొకడు రాజగృహమునకు పోకరాకలుకలిగియుండి, అందువల్ల వీడు రాజుకు మిక్కిలి అంతరంగుడని చూచువారలు గౌరవించునపుడు వీనిశత్రువులు (రాజుప్రయత్నమున్ను వీనియపేక్షలేకనే) వదలిపోవునట్టువలె ఈ యధికారికిన్ని భగవదాశ్రయణమాహాత్మ్యముచేత పాపములు వదలిపోవునని భావము.

4 ఈరీతి - మనయిద్దరియొక్క ప్రయత్నము లేకనే పాపమునివృత్తించునుఅని;
5 కర్మములు - పుణ్యపాపములు;

౧౦. అనాదికాలమ్ పాపఙ్గళైక్కణ్డు నీపట్టపాట్టై అన్వైత్తాన్ పడుమ్బడి పణ్ణుకిఱేన్.

౧౧. ఇని ఉన్ కైయిలుమున్నైక్కాట్టిత్తారేన్, ఎన్నుడమ్బిలఙ్ఞ

---

ఆ నిగ్రహమునకు విరోధియైన అనుగ్రహమును నేనుచేసినపుడు అవి 1 మరలయుండునా? ఉండదు అని యీసూత్ర తాత్పర్యము.

౧౦. ౭౮ వ సూత్రములో తనంతటవిడిచిపోవును అనే స్థలమందుగల ఈశ్వరాభిప్రాయమును అనతిచ్చుచున్నారు. "అనాదికాలం" ఇత్యాదిగా. అనఁగా, అనాదియైనకాలమంతయు దుఃఖములనుకలుగచేయుచున్న పాపములువచ్చి పైబడినట్లయిన, ఆపాపములను చూచి నీవు పడినభయమంతయు నన్నాశ్రయించిన 2 రాజకులమాహాత్మ్యముగల నిన్నుచూచి (ఆపాపములే) కడుపుకాలి, భయపడి వణికేటట్టు చేయుచున్నాను. (ఆపాపములు స్వయముగా వదలిపోయేటట్టుచేయడమనగా ఈపాపములు మనకు లోగడవుండి నశించెను అని తోచనట్టు పోగొట్టుట. అనఁగా, ఈపాపము స్మృతికివచ్చినప్పటికిన్ని తనయొక్క స్వభావసిద్ధమైన భగవదనన్యార్హ శేషత్వ స్వరూపమునుచూచి స్వప్నమందు చూచినట్లు 3 ఈపాపములు శరీరసంబంధముచేత ఆగంతుకమై మధ్యవచ్చిపోయెను అని యుండుటయున్ను, స్మృతిచేతను దుఃఖము అనువర్తించక యుండుటయున్ను అని తనిచరమ రహస్యమందు యీ పిళ్ళైలోకాచార్య స్వాములే అర్థము సాయించియున్నారు, దానిని యిచ్చట అనుసంధించతగ్గది.)

౧౧. మోక్షయిష్యామి (విడిపించగలను) అను ఉత్తమపురుషమం

---

1 మరల - అనుగ్రహించినతరువాత,

2 రాజకులమాహాత్మ్యముగల - ప్రపన్నుడయిన,

3 ఈపాపములు,- స్వరూపవిరోధులయిన అహంకార, మమకార హేతువై కలిగిన పాపములు.

కైక్కా నానే పోక్కిక్కొళ్ళేనో.

దు తాత్పర్యవిషయభూతమైన ఒక అర్థవిశేషమును సాయించుచున్నారు. 'ఇని' యిత్యాదివాక్యముచేత. అనఁగా, ప్రపన్నుఁడగుపర్యంతము మనకార్యమును చేసుకొనుటకు మనమేతగుదుమని నీవు అహంకారివై తిరిగినందున, 1 తనకార్యమును తానే చేసుకొనుచున్నాఁడని ఉండినమాత్రమేగాని, నాకునీవు శరీరతయా శేషభూతుఁడనితెలిసి 2 నాయందు సమస్తభరములను వుంచినతరువాత నీయొక్క పాపవిమోచనకు ప్రయత్నము నీవే చేసికొనుమని నీస్వాతంత్ర్యములో నిన్నువదలిపెట్టను; నాకు 3 శరీరమవుటచేత నీయొక్క అజ్ఞానమనే మాలిన్యమును 4 శరీరిఅయిన నేనే పోగొట్టుకోనా? అని సూత్రార్థము.

ఇచ్చట చేతనుని శరీరముగాను, (సర్వేశ్వరుడైన) తన్ను శరీరిగాను ఆనతిచ్చినందువల్ల యత్నఫలిత్వములు రెండున్ను సర్వశక్తుఁడైన తనవని సూచింపించుటకుగాను. కనుక నీకువిరోధులైన పాపములయందు నశించనిది ఒకటియులేదని తాత్పర్యము.

విరోధినివృత్తియు, ఇష్టప్రాప్తియు రెండును పురుషార్థముగాయుండగా ఇచ్చట పాపరూపవిరోధి నివృత్తిమాత్రము చెప్పుటకు హేతువేమి యనగా 5 విరోధినివృత్తిని యొకదాన్ని చెప్పినట్టయితే

1 తనకార్యము.........మాత్రమేగాని అనగా నాకు సంబంధము శక్తియు లేకకాదు, నీయందు స్వప్రవృత్తిరూప ప్రతిబంధకమున్నందున యూరకయుండవలసినదని భావము.

2 నాయందు............తరువాత అనగా నీరక్షణమును నాయధీనముచేసిన తరువాత.

3 శరీరమవుటచేత – భోగస్థానమవుటచేత.

4 శరీరి అయిననేనే – భోక్త అయిననేనే.

5 విరోధినివృత్తిని.........చెప్పలేదు – అనగా కేవలవిరోధినివృత్తియు పురుషార్థముకాదు, కేవల అభిమతలాభము పురుషార్థముకాదు. విరోధినివృత్తిపూర్వక అభీ

ఇతరమైన అభిమతసిద్ధి స్వతః ప్రాప్తించుటచేత దాన్ని యిచటచెప్ప లేదు: లేక శ్రీ-భ-గీ. అధ్యాయము-౧౮. శ్లో-౬౫ లో ‟మామేవై ష్యసి” (నన్నేపొందగలవు) అని లోగడ ఆనతిచ్చిన భక్త్యుపాయము నకు చెప్పినఫలముకాక ఈప్రపత్త్యుపాయమునకు వేరుఫలము లేనందున చెప్పలేదనిన్ని భావించవచ్చును. అయితే విరోధినివృత్తిని మాత్రమే ఫలముగానిచటఁ జెప్పుటేమనిన ఆ 1 విరోధి యతి ప్రబలమైనదిగాన తన్నివృత్తిమాత్రము చెప్పబడెను.

విరోధి నివృత్తించినట్టయితే ఫలము స్వతస్సిద్ధముగా కలుగుట చేత ప్రత్యేకముగా చెప్పవలసినది లేదని శ్రియఃపతిప్పడియందు సంగ్ర హముగానున్ను, 'పరందప్పడి - తనిశ్లోకము అను గ్రంథములయందు విస్తారముగానున్ను ఆనితిచ్చియుండు శంకాపరిహారములు ఇచ్చట అనుసంధించవలయు.

---

మతలాభమే పురుషార్థముగనుక విరోధినివృత్తిని చెప్పగానే అభిమతసిద్ధికూడా స్వయ ముగా కలుగునని భావము.

(పరత్వరహస్యమ్ పుట ౧౧౬.) మలయోగత్తాలే మఱ్ఱుజ్జిన మాణిక్యత్తై అఱ్ఱు క్క-అక్క-డైత్తాల్ తన్నడైయే తద్గతమాన ఒళి ప్రకాశిక్క-మోపాలె, ఇవనుక్కు-మ్ అవిద్యాదికళాలే తిరోధానజ్ఞళైయ క్క-ళ్ళికైయాలే, స్వాశ్రయమాన అపహతపా ప్మత్వాదికళైయ తన్నడైయే ప్రకాశిక్క-మిఱే; అకైయాలే విరోధినివృత్తియిఱే అపేక్షితమ్. అన్దప్రాధాన్యమ్ తోన్ఱ విరోధినివృత్తియై చ్చొల్లుకిఱతు.

1 విరోధి అతిప్రబలము అనగా, భక్తియోగనిష్ఠునకు బుద్ధిపూర్వకమైన పూ ర్వాఘము, ప్రామాదికమైన ఉత్తరాఘముమాత్రము నశించును. అంతమాత్రమేగాక ఆర్తప్రపన్నునికి అన్నిప్రారబ్ధకర్మములున్ను, దృప్తప్రపన్నునికి అభ్యుపగతప్రారబ్ధము తప్ప యితరపూర్వాఘములన్నియు నశించును. అభ్యుపగతమనగా నీదేహముచేత ననుభ వింపఁదగినది. దీనివివరము ౭౪-వ సూత్రముక్రింద ౮౨ - పుటలో వ్రాసియున్నది. అచ్చట చూడుడు.

ర౨. (మాశుచః).

ర౩. నీయుం కార్యత్తిలే యధికరియావై యాలుమ్, నానుం కార్యత్తిలే యధికరిత్తుక్కొణ్డు పోరుకైయాలుమ్ ఉనక్కు శోకనిమిత్తమిల్లైకాణెన్ఱు అవనుడైయ శోకనివృత్తియై పణ్ణికొడుక్కిఱార్.

(ఇందువల్ల ఈశ్వరునికి ఈయధికారివిషయములో, స్వప్రాప్తి విరోధిపాపనివర్తకత్వమ్, (తి-వాయ్. ౧-౧౦-౯.) ‹‹తమర్ కళ్ కూట్ట వల్వినైయైనాశమ్ శెయ్యుమ్" అనునట్లు అద్వారకమేగాని, ఉపాయాన్తరములు, దేవతాంతరములువలె (‹‹తి-వాయ్,౧-౧-౫) ‹‹ఇత్తైయవరవరవర్ వితివళియడైయనిన్ఱనర్ ” అనురీతి సద్వారకము గాదని తాత్పర్యము.)

ర౨. అనన్తరము చరమపదమును ఎత్తుకొనుచున్నారు ‹మాశుచః' అని. మాశుచః అనగా శోకించకుము అని ప్రతిపదము.

ర౩. దీనికిఅర్థము సాయించుచున్నారు ‹‹ నీయుం కార్యత్తిలే ” ఇత్యాదివాక్యముచేత.అనగా (అజ్ఞుడవై అశక్తుడవై అప్రాప్తుడవైన) నీవు నీయొక్క ఇష్టానిష్టప్రాప్తి పరిహారరూపమైన కార్యమందు యత్నించువాడవైతే మనకార్యమునకు ఏసాధనముచేయుదుమని మనస్సు కలఁగి శోకించుటతగును, (సర్వజ్ఞుడనై, సర్వశక్తుడనై, ప్రాప్తుడనై యుపాయముగా స్వీకరించబడ్డ) నేను నీకార్యమందు యత్నించకనుం

(ఉత్తరార్థమందలి మూడుపదములచేత నివర్తకస్వరూపమును, నివర్త్యాశ్రయమును, తద్నాహుళ్యతయునుచెప్పి - మోక్షయిష్యామి అను నీపదముచేత నివృత్తియు నివృత్తిప్రకారమునుజెప్పబడెను. ‹‹అహమ్" అను శబ్దమునకు మోక్షయిష్యామి అను క్రియనున్ను ‹‹త్వా" అను శబ్దమునకు మాశుచః అను క్రియనున్ను అన్వయించుకోవలెను. అప్పుడు ఉపాయవస్తువైన సర్వేశ్వరుని కృత్యమున్ను ఆశ్రయించు అధికారికృత్యమున్ను చెప్పినదగును.)

ూర. నివర్తక స్వరూపత్తైచ్ఛొల్లి, నివర్త్యజగ్గళునై్నవద్దు మేలిడా

డినట్టయితే, మనకార్యమందు (సర్వజ్ఞత్వాది గుణవిశిష్టుడై నాచేతను పాయముగా స్వీకరించబడ్డ) ఈ సర్వేశ్వరు డుపేక్షించినవాడై యున్నాడు మనము యేరీతి నుజ్జీవించగలమని శోకించతగును. అట్లుకాక యత్నము, ఫలము రెండున్ను లేకయున్న, నీస్వరూపపారతంత్ర్యము ను తెలిసి (నీవు) నిన్ను రక్షించుకొనుట అనేకార్యమందు ప్రయత్నించకపోవుటచేతనున్ను, నిన్ను రక్షించడమందు యత్నఫలములు రెండున్ను నాదిగాతలచతగిన స్వామియైన (నేను) నీయందు ప్రతిబంధకము (అనగా ఉపాయాంతరములు) నివృత్తించుటచేత నిన్ను రక్షించడమందు యత్నించుకుంటూ వచ్చుటచేతను, నీకు దుఃఖించుటకు కారణము లేదుసుమీ, అని లోగడ శోకావేశముకలవాడై యున్నవాని (అర్జునుని) యొక్క శోకనివృత్తి చేయుచున్నాడని యీసూత్రార్థము.

ఈ వాక్యమువల్ల (అహమ్-త్వా) అను పదములచేత చెప్పబడ్డ రక్షకరక్ష్యభూతులైన 1 యిరువురియొక్క స్వభావములను 2 అనువదించుకొని శోకనివృత్తిని చేసినప్రకారమును ఆనతిచ్చినవారైరి.

ూర. 3 ఇకను 4 పాపనివర్తకుడైన తనయొక్కయు తనచేత 5 నివర్తించతగిన పాపములయొక్కయు స్వభావములనుచెప్పి 6 శోకమును నివర్తింపజేసినప్రకారమును ఆనతిచ్చుచున్నారు. (నివర్తకస్వరూ

1 ఇరువుర్లయొక్క స్వభావము-చేతనేశ్వరులయొక్క రక్ష్యరక్షక స్వభావము.

2 అనువదించుకొని - ఒకడుచెప్పినదాన్ని యనుసరించిచెప్పుట.

3 ఇకను అనగా (అహంత్వా) అనుపదములను కటాక్షించి మాశుచః అనుపదమునకు అర్థమానతిచ్చిన పిమ్మట.

4 పాపనివర్తకుడైన తనయొక్క - అహంశబ్దార్థము. 5 నివర్తించతగిన పాపములు - సర్వపాపేభ్యః అనుశబ్దార్థము. 6 శోకమును నివర్తింపజేసినప్రకారం - మాశుచః శబ్దార్థము.

తెన్నుళొల్లి, ఉనక్కు శోకనిమిత్తమిల్లైకాణెన్గిఱార్.

రా౫. ‹‹ఎత్తినాలిడర్క్కడక్కిడత్తి యేమ్బొనెఞ్జమే” ఎన్గిఱార్.

---

పత్తై' ఇత్యాదివాక్యముచేత. అనఁగా ‹అహమ్' అని సర్వజ్ఞత్వాది గుణములతోకూడుకొని విరోధినివర్తకుఁడైన తనస్వరూపమును చెప్పి, ‹త్వాసర్వపాపేభ్యో మోక్షయిష్యామి' అని ణిచ్ ప్రత్యయముచేతను నివర్తింపబడే పాపములు నిన్నుచూచి స్వయముగా భయపడి పరుగెత్తిపోవునుగాని నన్నేయుపాయముగా స్వీకరించిననిన్ను 1 సమీపించి పైబడదు అనేవిషయముచెప్పి, తరువాత మాశుచః (దుఃఖించక) అనుటచేత 2 ఈప్రకారమైనతరువాత నీకు శోకించుటకు హేతువులేదని యీసూత్రార్థము.

రా౫. ఈ శరణాగతుని యందున్న విరోధిని పోగొట్టుటకుగాను తాను దీక్షితుడై యుండేస్థితిని తెలియపరిచి వీనియొక్క దుఃఖమును పోగొట్టడమును పెద్దలయొక్క వచనమును ఉదాహరణముగా చేసి ఆనతిచ్చుచున్నారు. 3 ‹‹ఎత్తినాల్” ఇత్యాదివాక్యముచేత. అనఁగా,తిరు

---

1 సమీపించిపైబడదు . సమీపించి ఫలమునిచ్చి కష్టపరచదని భావము.

2 ఈప్రకారమైన తరువాత అనగా నన్నేఉపాయముగాపట్టిన నిన్ను పాపములతిక్రమించక వుండినతరువాత అనిభావము.

3 తి-చ-వి-పా-౧౧౫. అత్తనాకి యెన్నైయాకి యాళుమెమ్బిరానుమాయ్ । ఒత్తొవ్వాతపల్పిఱప్పొళిత్తు నమ్మైయాట్కొళ్వాన్ । ముత్తనార్ముకున్దనార్ పుకున్దునమ్ముళ్ మేవినార్ । ఎత్తినాలిడర్క్కడల్ కిడత్తియేఴైనెంజమే॥

ముత్తనార్ - సంసారగంధలేశములేనివాఁడై, ముకుందనార్ - ముక్తిభూమిప్రదుఁడైనవాఁడు, ఒత్తొవ్వాత - ఒకొటొకటికి అధికభేదమైన, పల్పిఱప్పొళిత్తు-అసంఖ్యాతమైన జన్మపరంపరలను పోగొట్టి, నమ్మై - నిత్యసంసారులైన మనలనుకొని, ఆట్కొళ్వాన్ - నిత్యసూరులుచేయు కైంకర్యమును చేయించుకొనుటకు, అత్తనాకి - హితప్రవర్తకుఁడైన తండ్రియై, అన్నైయాకి - ప్రియముచేయుతల్లియై, ఆళుమ్ - కైంకర్యప్రతిసంబంధియైన, ఎమ్బిరానుమాయ్ - నాస్వామియై, నమ్ముళ్ పుకున్దు - నిగ్రహ

౨౬, పాపఙ్గళై నాన్ పొఱుత్తుపుణ్యమెన్ఱు నినైప్పిడానిఱ్క నీ శోకిక్కక్కడవైయో.

---

మఱ్ఱైశెప్పినాన్ తమ మనస్సునుచూచి సర్వేశ్వరుఁడు చేతననియందున్న విరోధినిపోగొట్టి కైంకర్యమును అంగీకరించుటకుగాను పూనుకొని 1 వచ్చి ప్రవేశించియుండేరీతిని ఆనతిచ్చి ఇకను యెందుకుగాను నీవు దుఃఖసముద్రమందు మునుగుచున్నావు అని సాయించిన ప్రకారము, సర్వేశ్వరుడున్ను 2 ఇప్పుడు ఈచేతనునియందున్న అన్నిపాపములనున్ను నివర్తింపచేయుటకుగాను తాను పూనుకొన్న విషయమును తెలియపరిచి 3 ఇకను ఎందుకుగాను దుఃఖించుచున్నావని అర్జునుని చూచి ఆనతిచ్చుచున్నాడని యీసూత్ర తాత్పర్యము.

౨౬. ఈచరిత్ర్యయతాత్పర్యమును సాయించినతరువాత ఈచేతనునియొక్క శోకము తిరిగిసంభవించక పోగొట్టుటకు హేతువైన ఒకభగవదభిప్రాయ విశేషమును ఆనతిచ్చుచున్నారు "పాపఙ్గళై" ఇత్యాది వాక్యముచేత. అనఁగా నీవుచేసినపాపములను ముందుగా నాయొక్క క్షమకు విషయముచేసి (అనగా క్షమించి), అంతమాత్రమేకాక తిరిగి

---

మానస విషయభూతులైన మనమనస్సులోప్రవేశించి, మేవినార్ - అభేదముగా కలసియున్నాడు. (ఇట్లుండగా) ఏఱ్ఱుక్కనైక్కమే - జ్ఞానములేనిమనస్సా! ఎత్తినాల్ - ఏహేతువుచేత, ఇదర్క్కుడల్ కిడత్తి-దుఃఖసాగరములో మాణిగియున్నావు? అని ఈపాశుర ప్రతిపదము.

1 వచ్చిప్రవేశించి - హృదయములో ప్రవేశించి.

2 ఇప్పుడు అనగా ఉపాయాంతర పరిత్యాగ పూర్వక సిద్ధోపాయ స్వీకారానంతరము.

3 ఇకను అనగా సర్వేశ్వరుడైన నేను హేయప్రత్యనీకుడనై, యుభయవిభూతిప్రధుడనై, వత్సలుఁడై, సుశీలుఁడై, సర్వవిధబంధువై, స్వామియై, విరోధినివర్తకుఁడనై, నీవల్ల కైంకర్యములను యంగీకరించువాడనైయుండగా.

నీయందు నాకున్న వాత్సల్యముచేత 1 "శెయ్తకుఱ్ఱంనఱ్ఱమాకవే కొళ్" 2 "శెయ్తారేల్ నన్ఱుశెయ్తార్" (చేసినపాపములను పుణ్యముగానే అంగీకరించును, 3 పాపమును చేసినవారైతే పుణ్యమేచేసిరి)

1 తి-చ-వి-పా - ౧౧౧. వైత్తునిన్నై వల్లవా పళ్ళిత్తవర్కు మాతిల్ పోర్ । శెయ్తునిన్న శెఱ్ఱత్తీయిన్ వెన్దవర్క్కుమ్ వన్దునై । ఎయ్తలాకు మెన్బరాతలాలెమ్మాయనాయినేన్ । శెయ్తకుఱ్ఱమ్ నఱ్ఱమాకవే కొళ్ ఞాలనాతనే॥ ప్ర. ప. నిన్నైవైయ్తు - స్తోత్రార్హుడైన నిన్నుదూషించి; వల్లవాపళ్ళిత్తవర్క్కుమ్ - నీయొక్కదూత్యసారథ్య నవనీతచౌర్యాదులను నీచవృత్తిగాభావించి దూషించిన శిశుపాలాదులకున్ను మాతిల్ పోర్ శెయ్తు - ఎదురులేనియుద్ధముచేసి, నిన్న శెఱ్ఱత్తీయిన్ - నీకోపాగ్ని వల్ల, వెన్దవర్క్కుమ్ - దగ్ధమైన వాలిమొదలైనవార్లకున్ను, ఉన్నై - సర్వాధికుడైన నిన్ను, వన్దుఎయ్తలాకుమెన్బర్ - సమీపించి పొందవచ్చునని ఋషులు వ్రాక్కుచ్చిరి. ఆతలాల్ - ఆకారణమునుపట్టి, ఎమ్మాయ - ఆశ్రితులపరాధములను క్షమించుటకు హేతువైన దయాకాఙ్క్షాద్యాశ్చర్య గుణములను మాకు ప్రకాశింపజేసినవాడా! ఞాలనాతనే - జగత్తుకు నిరుపాధిక శేషియైనవాడా! నాయినేన్ - అనన్యగతికుడై నీచేతిని ఎదురుచూచుచుండు వాడనైననేను, శెయ్తకుఱ్ఱమ్ - ప్రామాదికముగాచేసిన పాపమును, నఱ్ఱమాకవేకొళ్ - గుణముగా అంగీకరించవలయును.

2 పెరియా - తి. ౪-౯-౨. తన్నడియార్ తిఱత్తకత్తు త్తామరైయాళాకిలుమ్ శితకురైక్కుమేల్ । ఎన్నడియారతుశెయ్యార్ శెయ్తారేల్ నన్ఱుశెయ్తా రెన్బర్ పోలుమ్ । ఇత్యాదిగా, ప్ర. ప. తామరైయాళాకిలుమ్-పురుషకారభూతురాలైన పెరియపిరాట్టిగారే, తన్నడియార్ తిఱత్తకత్తు - శేషియు, ఉపాయము, ఉపేయముగాతన్నే ఆశ్రయించి యుండువారి విషయముగ, శితకు ఉరైక్కుమేల్ - వారి దోషములను లెక్కించిచెప్ప ప్రారంభించినప్పటికిన్ని, ఎన్నడియార్ - నాకు శేషభూతులైనవారు, అతు - (పేరుచెప్పనుకూడ శంకించదగిన) ఆదోషములను, శెయ్యార్ - ఒకప్పుడున్ను చేయరు, శెయ్తారేల్ - క్షమించుటకు నేనున్నాననే భావముతో ప్రామాదికముగా చేసినవారైనట్టయితే, నన్ఱుశెయ్తార్-అవిగుణముగదా, ఎన్బర్ పోలుమ్-అని చెప్పునట్టి కొన్ని ఉదాసీనవచనములు పెరాట్టిని ఎదిరించి మాట్లాడునట్టివారివలె అని ప్రతిపదము.

3 పాపమును చేసినవారైతే పుణ్యమేచేసిరి అనగా, సర్వేశ్వరుఁడు దోషభోగ్యత్వరూపవాత్సల్యము కలవాడవుటచేత ఆశ్రితులందు దోషములుండినను భోగ్యముగా నంగీకరించువాడనుట.

అన్నట్లు ఆపాపములను పాపమనిదలచక పుణ్యమనితలంచుచుండగా ఇకను నీవు దుఃఖించగలవా అని భావము.

ఇట్లు ఉత్తరార్థములోని అయిదుపదముల చేత, ఉపాయభూతుఁడైన సర్వేశ్వరునియొక్క స్వరూపమును అహమ్ శబ్దముచేతను, నివర్తించతగిన పాపములకు ఆశ్రయమైన చేతనస్వరూపమును త్వా అను పదముచేతను, నివర్తింపబడవలసిన పాపములను సర్వపాపేభ్యః అను పదముచేతను, ఆపాపములు తనంతటనే నివృత్తించే ప్రకారమును మోక్షయిష్యామి అనుపదముచేతను, పాపనివృత్తికార్యమైన శోకనివృత్తిని మాశుచః అనుపదముచేతను ప్రతిపాదించడమైనది.

---

“మాశుచః” అను యీపదముచేత శోకనివృత్తిని జెప్పుచున్నారు.—సాపాయములై స్వరూపవిరుద్ధములై యుండువానిచే సాధ్యంబగు నితరోపాయములను విడువవలెననియు, స్వరూపానురూపమై నిరపాయమైన సిద్ధసాధనమును స్వీకరించవలయునని యును జెప్పుటచేత శోకమునకు నిమిత్తములేదని తాత్పర్యము. వ్రజయను విధివలె మాశుచః యనునదియు విధియగుటచేత స్వీకారమువలె శోకనివృత్తియు కర్తవ్యము. గాన ప్రపన్నునకు యావత్ఫలప్రాప్తి నిర్భరత్వానుసంధానముకలిగి నిర్భయుఁడైయుండుటే కర్తవ్యమైయున్నది. స్వీకారమునకు మునుపు శోకించుచుండిన నధికారి సిద్ధిలేనట్లు స్వీకృతోపాయుఁడైన వెనుక శోకించినట్లయిన ఫలసిద్ధిలేకపోవును. దుష్కరములై స్వరూపవిరుద్ధములైన సాధనాంతరముల సంబంధము, సుకరమై స్వరూపానురూపమైన ఉపాయసంబంధములేమి, అట్టిఉపాయము కోరికతోయుండుట, ఫలసిద్ధిలో ఆలస్యము, అట్టి ఉపాయస్వీకారములోని కష్టము, ఉపాయముయొక్క అశక్తత, స్వీకర్తాయొక్క ఉపాయాన్తరరాహిత్యము, ప్రతిబంధకబాహుళ్యము, వాటినివృత్తిలో అశక్తతగదా శోకకారణములు, “సర్వధర్మాన్పరిత్యజ్య” అని దుష్కరములైన సాధనాంతరములను సవాసనగాత్యజించమని విధించుటచేతను; “మామేకంశరణంవ్రజ” అని సులభమైన సాధనమును స్వీకరించమని చెప్పుటచేత స్వరూపానురూపమైన సాధనస్వీకారము కలుగుటచేతను; “మామ్” అని అట్టి ఉపాయము నిరుపాధికవత్సలుఁడు, సర్వస్వామి, శీలవంతుఁడు, పరమకారుణికుఁడు అనుటచేతను; “ఏకమ్” అని వాని నిరపేక్షత్వము చెప్పుటచేతను; “శరణమ్” అని ఫలప్రదములో విళమ్బరాహిత్యమును చెప్పుటచేతను ;

ఇకను ,,ఈ చరమశ్లోకమునకు అర్థమైన సర్వధర్మములనువదలి సర్వేశ్వరునే ఉపాయముగాపట్టుటయందు యొకనికి రుచికలుగుట కష్టమనిన్ని, ఈ శ్లోకమునకు ఈశ్వరస్వాతంత్ర్యమందు తాత్పర్యమనిన్ని' ఈ త్యాగస్వీకారములందు నమ్మకముకలుగుట దుర్లభమనిన్ని, సర్వేశ్వరుఁడు ఆరంభములోనే ఈ చరమశ్లోకమును ఉపదేశించకపోయినందుకు కారణమునున్ను, వేదపురుషుఁడు ఉపాయాంతరములను విధిం

---

,,వ్రజ" అని స్వీకారము వాక్కాయకములకు నొప్పితగులునని మానసవ్యాపారమును మాత్రమే చెప్పుటచేతను, ,,అహమ్" అని సర్వజ్ఞుఁడై, సర్వశక్తుఁడై, అవాప్తసమస్తకాముఁడై, స్వామియై, పరమకారుణికుఁడై యుండువాడనుటచేతను; (వాటిలో సర్వజ్ఞత్వమువల్ల ఇష్టప్రాప్తి అనిష్టనివారణచేయు జ్ఞానముకలవాడనన్ని, సర్వశక్తిత్వమువల్ల అనిష్టనివృత్తి ఇష్టప్రాప్తిచేయుటకు అశక్తతలేనివాడనిన్ని, అవాప్తసమస్తకామత్వమువల్ల పూర్ణుడనిన్ని, స్వామిత్వమువల్ల మనకార్యముచేయుటకు బాధ్యపడినవాడనిన్ని, పరమకారుణికత్వమువల్ల కార్యముచేసునోచేయడో అని సందేహించక తప్పకకార్యముచేయువాడనిన్ని, చెప్పుటచేత) ఉపాయము విరోధినివృత్తి పూర్వకముగ ఫలప్రధానముచేయ సమర్థమౌటచేతను, ,,త్వా" అని ఆకిఞ్చన్యము చెప్పుటచేత రక్షకాంతర అన్వయమువల్ల ఉపేక్షించునభయము లేనందుచేతను, ,,సర్వపాపేభ్యో మోక్షయిష్యామి" అని విరోధ్యంశమందు శేషించునది యొకటియులేనందుచేతను, విరోధిపోవునో పోదోయని సంశయింపఁబనిలేనందుచేతను, సర్వాఘమోక్షమే ఫలముగ జెప్పుటచేతను, ప్రతిబంధకనిశ్శేషమగుటచేతను, నీమేలును కోరియున్న నేను విరోధినిరసనసామర్థ్యముకలవాడనుటచేతను, ప్రాప్తుండైయుండు నేను సాంసారికసకలదురితములను సవాసనగాఁ బోగడబెట్టి నిరతిశయానందయుక్తుఁడగునట్లు చేసెదనని చెప్పుటచేతను, ఎంతమాత్రముశోకింపంబనిలేదు. ,,మోక్షయిష్యామి" అని అది తనంతటవదలిపోవును అనుటవల్ల నివృత్తిలో అశక్తతలేమిని చూపబడుచున్నది. కలవాఁడు కృషిచేయును, కర్షకుఁడు ఫలమునుభుజించును, ఫలియయిననాఁడు ఫలాలాభమందు శోకించును. ఇట్టివెవ్వియు నీకులేనందున శోకించవలదు. నాస్వరూపమును జూచినను నీస్వరూపమునుజూచికొనినను శోకింపఁబనిలేదుగాన నిర్భరుఁడవై యుండుము. ఇంకశోకించితివేని నీస్వరూపమును నాప్రభావమునుగూడ భ్రష్టుచేసినవాఁడ వగుచున్నావని సాయించుచున్నారు. ప్రపత్తినిర్భరత్వానుసంధాన శిరస్కమగుటచేత నిర్భరత్వానుసంధానము సదాకర్తవ్యమని తాత్పర్యము.

దుష్కరత్వాది దోషదూషితమైన సాధనములనువదలి, వత్సలుఁడై, స్వామియై, సుశీలుఁడై, సులభుఁడై, నిరపేక్షుఁడై, పరమాప్తుడై, నిరవధిక దయాళుడైయుండు నన్ను స్వీకరించుటవల్లనున్ను «సకృదేవంప్రపన్నస్య కృతంస్యాదిహ్యతే» అని నన్నే నిరపేక్షోపాయముగాపట్టిననీకు కర్తవ్యాంశము లేనందుచేత, సర్వజ్ఞత్వాది గుణవిశిష్టుడైన నేను అజ్ఞానాదిగుణములతో కూడియున్న నీయొక్క అవిద్యాది సకలపాపములున్ను మరల కలుగకుండునట్లు పారదోలి, అసంకుచితమైన అనుభవ కైంకర్యములలో అన్వయింపజేసి ఆనందనిర్భరుడగునట్లు చేయుచున్నానని చెప్పుటచేత యేవిధములోను శోకించుటకు హేతువులేదని భావము.

పరన్దరమాస్యమ్ - «త్వా» ఎన్ఱు నిర్దేశిత్త అధికారియినుడైయ కృత్యాంశత్తై చ్చొల్లుకిఱతు (మాశుచః) ఎన్ఱు. నిరపాయోపాయ భూతనాననాన ఉన్నుడైయ విరోధినివృత్తి పూర్వకమాన అభిమతసిద్ధియై సాధిత్తుత్తరక్కడవనాగ ఏఱిట్టుకొణ్డిపెన్ప్ప సాపాయమాన సాధనాన్తరజ్గళినుడైయ దుష్కరత్వాదికళై అనుసన్ధిత్తు శోకిక్కక్కడవైయల్లై; అన్దసాధనవిశేషజ్గళై యొజ్ఞియ నిరపాయోపాయమిల్లాతవన్నో ఉనక్కు శోకిక్కవేండువతు. అవతారన్ఱిలిట్టు ఎన్నై ఆశ్రయిక్కైయాలుమ్ శోకిక్కవేణ్డా; ఆశ్రయణీయనాననాన వత్సలనాకైయాలే ఉన్నుడైయదోషమ్ కణ్డుశోకిక్కవేణ్డా; సులభనాకైయాలే దుర్లభనెన్ఱు శోకిక్కవేణ్డా; సుశీలనాకైయాలే ఉన్నుడైయ శిఱుమైకణ్డు శోకిక్కవేణ్డా; సర్వస్వామియాకైయాలే అప్రాప్తనెన్ఱు శోకిక్కవేణ్డా; అవాప్తసమస్తకామనాకైయాలే ఉన్నుడైయ అపూర్తికణ్డు శోకిక్కవేణ్డా; సర్వశక్తియాకైయాలే ఉన్నుడైయ అశక్తికణ్డు శోకిక్కవేణ్డా; నిరుపాధికబన్ధువాకైయాలుమ్, పరమదయావానాకైయాలుమ్ «కార్యమ్ శెయ్యుమో? శెయ్యానో?» ఎన్ఱు శోకిక్కవేణ్డా; సర్వపాపవిమోచకనాకైయాలుమ్ శోకిక్కవేణ్డా; ఉన్నైప్పార్త్తాలుమ్ శోకిక్కవేణ్డా; ఎన్నైప్పార్త్తాలుమ్ శోకిక్కవేణ్డా; విరోధియైప్పార్త్తాలుమ్ శోకిక్కవేణ్డా; నీ ఎన్పక్కల్ సర్వభరన్యాసమ్పణ్ణుకైయాలే ఉన్నైప్పార్త్తాలుమ్ శోకిక్కవేణ్డా; నాన్ సర్వజ్ఞత్వాది గుణవిశిష్టనాకైయాలే ఎన్నైప్పార్త్తాలుమ్ శోకిక్కవేణ్డా; విరోధియాకిఱతు - ఎన్నుడైయ నిగ్రహరూపమాకైయాలే «పోక్కుత్తోమ్» ఎన్న తీరుమ్, ఆకైయాలే విరోధియైప్పార్త్తాలుమ్ శోకిక్కవేణ్డా; నీయుమ్ ఇప్పడి ఎన్పక్కలిలే న్యస్తభరనాయ్, విరోధియుమ్ ఇప్పడి దుర్లభమానపిన్బు శోకమ్ అనుపత్తిక్కుమాకిల్, నీయుమ్ ఎనక్కన్త్రియిలే, నానుమ్ ఉనక్కన్త్రియిలే, ఉన్నైయుమ్ «ననమేయమ్» ఎన్నప్పణ్ణి, ఎన్నైయుమ్ «క్షమామి» «నక్షమామి» ఎన్నప్పణ్ణి

పాపమ్ మూర్ధాభిషిక్తమాయిరుక్క, శోకియాతే అనాదికాలమ్ ఆస్సైక్కట్రత్తిలే యిరుక్కత్తాయాయ్ పోన్ద, అజ్ఞానత్తోపాతిపోరుమ్; కిం బహునా,—నాఙ్ ఉన్ కార్యత్తుక్కు క్కడవనాయిరుక్క, నీశోకిప్పతియాకిల్ ఉఙ్ కార్యత్తుక్కు నీయే కడవై యామిత్తనై."

ఇచ్చట ప్రసంగాత్ శరణాగతిలక్షణమును, దానికంగములను, శరణాగతినిష్ఠుని నిర్భరత్వమును కొంత వివరించబడుచున్నది.

శరణాగతికి, న్యాసమని, ప్రపత్తియని, ఉపాయస్వీకారమని నామాంతరములు గలవు.

శరణాగతిలక్షణము.

"అహమస్మ్యపరాధానా మాలయోకించనోగతిః । త్వమేవోపాయభూతోమే భవేతిప్రార్థనామతిః । శరణాగతిరిత్యుక్తా సాదేవేస్మిఙ్ప్రయుజ్యతామ్" అని:—

"అహమస్మ్యపరాధానామాలయః" అనుటవల్ల స్వదోషానుసంధాన పూర్వకముగా, "అకించనః" అని నాయందు భగవత్ప్రాప్తికి సాధనంబనఁదగిన దొక్కటియు లేదు, "అగతిః" నాకు వేరుదిక్కు లేదు. "త్వమేవోపాయభూతోమే భవేతిప్రార్థనామతిః శరణాగతిః" నీవేనాకుపాయభూతుఁడవు గమ్మని ప్రార్థించుబుద్ధియే శరణాగతి అనే యర్థము చెప్పబడినవి.

శరణాగతికంగములు. "ఆనుకూల్యస్యసంకల్పః ప్రాతికూల్యస్యవర్జనం । రక్షిష్యతీతివిశ్వాసో గోప్తృత్వవరణంతథా । ఆత్మనిక్షేపకార్పణ్యే షడ్విధాశరణాగతిః"॥

(1) ఆనుకూల్యస్య సంకల్పమనగా—ఆనుకూల్యము ప్రియత్వము—సర్వభూతహితరూపమైన మహాగుణము:—విరోధికిన్ని హితముచేయునట్టి జ్ఞానవిశేషము. "ఆనుకూల్యమిదంప్రోక్తం సర్వభూతానుకూలతా" సర్వభూతంబులకు ననుకూలంబుగా నుండుటయే యానుకూల్యమని ప్రపన్నపారిజాతములో సాయించియున్నారు.

(2) ప్రాతికూల్యస్యవర్జనమనగా, అతిప్రవృత్తి వ్యవసాయనివృత్తి - తనకుశక్తియుండినను స్వప్రయత్నము మిక్కిలిప్రతికూలమని తలచు జ్ఞానవిశేషము. స్వశక్తియుండినను పెరుమాళ్లశక్తినే యెదురుచూచి స్వశక్తినివదలియుండిన పిరాట్టివలె నుండుట. "హింసాద్యపాయవిరతిః" అని పరహింసమొదలగు అపాయముకృత్యములను మానుట ప్రాతికూల్యవర్జనమని ప్రపన్నపారిజాతములో సాయించియున్నారు. అపాయమనగా శ్రీవచనభూషణ దివ్యశాస్త్రమందు సాయించిన "జ్ఞానిగళుక్కపాయమ్" అనే ప్రాపకాంతరమే యిచ్చట అపాయశబ్దార్థముగా గ్రహించవలయు. స్వతంత్రప్రవృత్తి పరతంత్రస్వరూపనాశకముగాన.

(3). రక్షిష్యతీతివిశ్వాసః అనగా రక్షకుఁడు మనలను రక్షించుటయందు సందేహము లేదనేనమ్మకము. ఇట్టినమ్మకము రక్షకునియందుగల గుణములనుపట్టి కలుగును. "శక్తేస్సూపసదత్వాచ్చ కృపాయోగాచ్చశాశ్వతాత్ । ఈశేశితవ్యసంబంధా దనిదం ప్రథమాదపి" అని ప్రపన్నపారిజాతములో సాయించిన గుణములని ఎఱుగవలయును. (శక్తేః) అనుటవల్ల ఆశ్రితకార్యాపాదకమైన శక్తియును, (సూపసదత్వాత్) అనుటవల్ల ఆశ్రయణసౌకర్యాపాదకమైన సౌశీల్యమును, (కృపాయోగాచ్ఛాశ్వతాత్) అనుటవల్ల రక్షణమునకు ముఖ్యహేతువైన పరదుఃఖాసహిష్ణుత్వమును, (ఈశేశితవ్యసంబంధాదనిదంప్రథమాదపి) అనుటవల్ల కార్యముచేయునని నిర్భరుడైవుండుటకు హేతువైన స్వస్వామిసంబంధమును తెలియజేయబడియున్నది.

(4) గోప్తృత్వవరణమనగా నాకు నీవు రక్షకుఁడవుగమ్మని ప్రార్థించుట, లేక అనిష్టనివృత్తిపూర్వక ఇష్టప్రాప్తికి అవ్యవహితోపాయముగ స్వీకరించుట.

(5) ఆత్మనిక్షేపమనగా ఆత్మాత్మీయమైన సమస్తభరములున్ను సర్వేశ్వరుని తిరువడిగళయందు సమర్పించుట,

(6) కార్పణ్యమనగా దీనత్వము. "దైన్యంకార్పణ్యముచ్యతే" అని దైన్యమును కార్పణ్యముగా చెప్పబడియున్నదీ. కృపాజనక కృపణవృత్తి నిరతత్వం.

ఈవిధమైన శరణాగతి శ్రుతియందు ఆత్మయాగముగ వర్ణించఁబడియున్నది. ఎట్లనిన, "తస్యైవంవిదుషోయజ్ఞ స్యాత్మాయజమానశ్శ్రద్ధాపత్నీ శరీరమిధ్మమురోవేది ర్లోమానిబర్హి ర్వేదశ్శిఖాహృదయం యూపఃకామ ఆజ్యమ్మన్యుః పశు స్తపోగ్నిశ్శమయితా దక్షిణావాగ్ఘోతాప్రాణ ఉద్గాతా చక్షురధ్వర్యుర్మనో బ్రహ్మశ్రోత్ర మగ్నీద్యావద్ధ్రియతేసాదీక్షాయ దశ్నాతియత్పిబతి తదస్యసోమపానమ్ యద్రమతె తదుపసదోయత్సఞ్చరత్యుపవిశ త్యుత్తిష్ఠతేచ సప్రవర్గ్యోయన్ముఖ న్తదాహవనీయో యదస్యవిజ్ఞాన న్తజ్జుహోతియత్సాయ మ్ప్రాతర త్తితత్సమిధోయ త్సాయమ్ప్రాతర్మధ్యన్దినఞ్చతాని సవనానియే అహోరాత్రే తేదర్శ పూరణమాసౌయే అర్ధమాసాశ్చ మాసాశ్చతే చాతుర్మాస్యా నియఋతవ స్తే పశుబన్ధాయే సంవత్సరాశ్చ పరివత్సరాశ్చతే హర్గణా స్సర్వవేదసంవా ఏతత్సత్రమ్ యన్మరణ న్తదవభృథ ఏతద్వై జరామర్యమగ్నిహోత్రగ్ం సత్రమ్యఏవమ్ విద్వానుదగయనే ప్రమీయతే దేవానామేవ మహిమానఙ్గత్వా ఽఽది త్యస్య సాయుజ్యఙ్గచ్ఛత్య థయోదక్షిణే ప్రమీయతేపితృణామేవ మహిమానఙ్గత్వా చంద్రమసస్సా యుజ్యఙ్గచ్ఛత్యేతౌ వై సూర్యాచన్ద్రమసో ర్మహిమానౌ బ్రాహ్మణోవిద్వానభిజయతి తస్మాద్బ్రహ్మణో మహిమానమాప్నోతి తస్మాద్బ్రహ్మణో మహిమానమిత్యుపనిషత్") ఇట్లనిశ్రుతి "యే అహోరాత్రే" అనునది మొదలు "యన్మరణం" అను

దానివలన శరణాగతిని యజ్ఞముగాను యీయజ్ఞమునకు మరణమే అవభృథముగాను గావలసినవిషయములన్నియుఁ జెప్పుచున్నది. "కర్తవ్యమ్‌సకృదేవహాన్తకలుషమ్ సర్వాన్తరోనకృతిః బ్రహ్మేశాదిసుదుర్లభమ్ పదమపిప్రాప్యమ్మయార్థాగతిః । విశ్వాసప్రతిబన్దిచిన్తనమిదమ్ పర్యస్యవిన్యస్యతామ్ । రఙ్గాధీశరమాపతిత్వసుభగమ్ నారాయణత్వన్తవ" "ఏతర్హి హావావనతపతికిమహం సాధునాకరవమ్ కిమహమ్ పాపమకరవమితి" అనిచెప్పినట్లు శరణాగతిజ్ఞానముకలవానికి ఏమేమిపుణ్యపాపములు జేసితిమోయనిబుద్ధిపీడించదు; "తస్మాన్న్యాసమేషాన్తపసామతిరిక్తమాహుః" అనగా ధ్యానపర్యంతమైన అన్నితపస్సులకును న్యాసమతిరిక్తమనుట. న్యాసమనునది శ్రీమంతుఁడగు నారాయణుని తిరువడిగళ్లయందుఁ జేసిన ఆత్మాత్మీయాఖిల భరసమర్పణమాటచేతను శ్రియఃపతినే శరణాగతుఁడు తనయొక్క సర్వయోగక్షేమభారమునిగ ననుసంధించి నిర్భరత్వానుసంధానముచేయవలయును. వ్రజయను స్వరూపోచిత కార్యమువంటిదే మాశుచః యనునదియును గాన సిద్ధసాధన స్వీకృతుఁడు కానివానికి ఉపాయసిద్ధి లేనట్లు స్వీకరించినవెనుక నిర్భరుఁడైయుండనివానికి ఫలసిద్ధిలేదు. శరణాగతుఁడైన తనమందే అనాదికాలార్జిత కర్మమూలమైన జన్మముతీరి మోక్షములభించవలయునేగాని సామాన్యులవలె దేహత్యాగ మెప్పుడు కలుగునోయని కాచియుండుటయు ఇహమందున్నకాలమందు ఈశ్వరకృపచేఁ పాత్రత కలిగినందున ఆరోగ్యస్థితియందుండక రోగపీడపడుచుండుటయు భగవద్భాగవతాచార్యకైంకర్యముల నుపయోగించునట్లు ఐశ్వర్యములేక లేమికలిగియుండుటయుఁగూడునాయనిన, ఈశ్వరుఁడు తనవస్తువు నేమిచేసిన చేయునుగాక ననియుండు చరమాధికారికి వెంటనేశరీరము విడిచిపోవలయుననెడిత్వర ప్రపత్తికాలమందుండ కుండుటచేతను, ఆచార్యులయొక్కయుఁ దదీయులయొక్కయు కైంకర్యముచేసికొనుచువారితోఁగూడి భగవద్గుణానుభవము చేయవలయునని యపేక్షించి యుండుటచేతను, భగవద్భాగవతాచార్య సన్నిధికలిగి తనకునివాసమైయున్న స్థలమే పరమపదమనునట్లు అప్రాకృతదృష్ట్యా అనుభవమై యుండుటచేతను, అధికారులు ఇహమందుండుటవలన వారిపురుషకారముగాని మతికొందఱు చేతనులు తనకభిముఖులగుదురనియు, ఆశ్రయించిన సూంతనాత్మలు తమజ్ఞానానుష్ఠానములను వీరియుపదేశముచేత చక్కపరచుకొందురనియు, ఆశ్రయించినవెంటనే స్థూలమువిడిచెనేని నాలోకమందు శిష్యాచార్యవ్యవస్థ లేకపోవుటయుగాక యెవ్వరునాశ్రయించరనియు నీశ్వరుఁ డెంచియుండుటచేతను, ప్రపన్నులను గూడ కొంతకాలము ఐహికమందుంచుననుటకు సంశయములేదు. ఈదేహము దుఃఖకరమనితోచినపుడే విడువనిచ్ఛయించనివాఁడు సుఖముకనుపించెనేని విడువనిచ్ఛయించుఁడనియు, ఇచటనే నిత్యసుఖంబిచ్చిన నిత్యవిభూతి లీలావిభూతులకుండు తారతమ్యము చెడుననియు,

చుటకు హేతువనున్నూ, ఉపాయాంతరములను స్వరూపేణ వదలుటలో దోషము లేదనిన్ని, కర్మజ్ఞానాదులు ఆకారాంతరములుగా (కైంకర్యాదిరూపముగా) అనుష్ఠించబడుచున్నదిగనుక 1 స్వరూపేణ విడువబడినవి కావు అనిన్ని, పురుషార్థమునకు సాధనము భగవత్ప్రసాద మనిన్ని, పురుషార్థలాభమునకు ఈ చేతనునియందు అవశ్యం కావలసిన అంశములు నిషేధించక యుండుటయు, యాచించుటయనిన్ని, సర్వేశ్వరునికి యీచేతనునియొక్క సుకృతమనిష్టమనిన్ని, అన్నిధర్మములను వదలి సర్వేశ్వరునే ఉపాయముగా ఆశ్రయించినట్లయిన ఆసర్వేశ్వరుండు ప్రాప్తిప్రతిబంధక సర్వపాపములను నివర్తింపచేసి స్వప్రాప్తినికలుగచేసును అనే అర్థమందు 2 ఆస్తిక్యాదులుకలవారై యుజ్జీవించుట, అవి లేనియెడల నశించుట యింతియేగాని వేరుగతి లేదనిన్ని, 3 మహావిశ్వాసము లేనివాడు ఈ చరమశ్లోకార్థమందు శ్రవణాది సంబంధము

జేతనునిహితవునే చింతించునట్టి ఈశ్వరుఁడు లీలావిభూతి మర్యాద చెడకుండ రోగములు కలిమిలేములును కృపచేయుచుండును. ఇదియేను గాక ఆయురారోగ్యైశ్వర్యములు ఇచ్చటనే కలిగినపుడు ఐహికభోగమునువిడిచి తన్ను మరవకుండుట దుర్లభంబగునని యెంచి పరమదయాళుండగు నీశ్వరుండు, సుకుమార దేహియగు రాజపుత్రునకు అల్పదేశమునకు పట్టాభిషేకం బొనర్చుటకు ముందుపవాసముంచి శరీరమునకు నలుకువబెట్టినవిధముగా, పరమపదమందు మహదతిశయమై నిత్యమై అత్యద్భుతములైన సుఖానందాద్యైశ్వర్యములను కృపచేయుటకుముందు నిదచరమదేహంబౌటను దీనియనుభవ కాలమందు లేమి మొదలగునవి యేమికటాక్షించినా కటాక్షించును, ఇది ఈశ్వరకృపాఫలమే గాని వేరొండుకాదు. సాధారణజ్ఞాననిష్ఠునకే యీలోకసుఖదుఃఖములు సమములై కలలోఁ దోచినట్లుండఁగా నిర్భరుండగు చరమాధికారికి కలిమిలేములును రోగాదులును నిందాస్తోత్రములును ఇట్టివన్నట వెలుగునకుఁజీకటికనపడనట్టు తోఁచనేతోఁచదని తెలియవలయును. అర్జునవ్యాజముగ శ్రీకృష్ణభగవాన్లు సమస్తచేతనులుజ్జీవించునట్లు బయలుపరిచినయిట్టియర్థములగర్భీకరించియుండునది యీ చరమశ్లోకము.

1 స్వరూపేణ విడువబడినవి–చేయకనే విడువబడినవి. 2 ఆస్తిక్యాదులు–ఇందులోని అదిశబ్దమువల్ల రుచివిశ్వాసములని తెలియదగ్గది. 3 మహావిశ్వాసము–వ్యవసాయము.

౮౭. ఉయ్యక్కొణ్డార్ విషయమాక ఉడైయవ రరుళిచ్చెయ్‌త వార్తైయై స్మరిప్పతు.

---

కలవాడైతే వినాశపర్యంత మవుననిన్ని, ఈ చరమశ్లోకార్థమునకు అధికారులు తన్నిష్ఠులై యుండగలవారనిన్ని క్రమముగా సాధించి ముగించుచున్నారు.

౮౭. వాటిలో ప్రథమమందు ఈ త్యాగపూర్వక స్వీకారమందు ఒకనికి రుచికలుగుట దుర్లభమని నిరూపించుటకుగాను ఒక వృత్తాంతము ఆనతిచ్చుచున్నారు "ఉయ్యక్కొణ్డార్ విషయమాక" ఇత్యాదిగా. అనఁగా చిదచిదీశ్వర తత్వములయొక్క స్వరూపనిర్ణయముచేసిన 1 ఉయ్యక్కొండార్ అనువారు సాధనాంతరమైన భక్తియోగమందు నిష్ఠులైయుండినందున వారిని ప్రపత్తినిష్ఠులుగా చేయవలెనని వారికి యీ చరమశ్లోకార్థమును ఆనతిచ్చినసమయమున, అతను, అర్థస్వరూపము 2 భోగ్యముగానున్నది, అయినను భక్తియోగమునువదిలి యీ ప్రపత్తిచేసుటకు తగినరుచి నాకు లేదనిచెప్పఁగా, ఎంబెరుమానార్లు, "విద్వాంసుఁడగుటవల్ల అర్థమునకు సమ్మతించితివి, 3 భగవదనుగ్రహము లేనందున రుచిపుట్టలేదు." అని ఆనతిచ్చిన శ్రీసూక్తిని తలచవలయునని యీ సూత్రార్థము.

---

1 ఉయ్యక్కొండార్-శ్రీమన్నాధమునుల శిష్యులు ఉయ్యక్కొండార్ కాదు; వారిపేరును పెట్టుకొని ఉడైయవర్ కాలంలోయుండిన భక్తినిష్ఠులైన ఒక విద్వాంసులు. వీరుపాయాంతర నిష్ఠులలోనొకరు.

2 భోగ్యము - ఎంబెరుమానుకు శరీరతయా శేషమైన ఈ ఆత్మ ఉపాయాంతరములనువదలి వానినే ఉపాయముగా స్వీకరించుట అను అర్థము స్వరూపమునకు అనుగుణముగా వుండుటవల్ల భోగ్యము.

3 భగవదనుగ్రహము లేనందున ఉపాయాంతరములరుచి వదలదాయెను. అదివదలనందున ఉపాయాంతరనిష్ఠులకు భగవత్ప్రాప్తియు లేదని భావము.

౮౮. ఇతుక్కు ఈశ్వరస్వాతన్త్ర్యత్తిలే నోక్కు.

౮౯. "ఇతుతాననువాదకోటియిలే" ఎన్ఱు వఙ్గిప్పురత్తునమ్బివార్తై.

---

౮౮. ఇకను, ఈ చరమశ్లోకమునకు ఫలానిషయమందు తాత్పర్యమని సాయించుచున్నారు "ఇతుక్కు ఈశ్వరస్వాతంత్ర్యత్తిలే నోక్కు" అనువాక్యముచేత. అనఁగా 1 శాస్త్రములన్నిన్ని యొకయెత్తున్ను, 2 తాను ఒకయెత్తుగానున్న ఈ చరమశ్లోకమునకు, శాస్త్రములచేత విధింపఁబడిన సాధనాంతరములైన అన్నిధర్మములను సవాసనగా విడిపించి, ఈ చేతనునికి స్వయంనిరపేక్షసాధనమై, స్వప్రాప్తికి ప్రతిబంధకిములైన అన్నిపాపములను పడద్రోసి స్వప్రాప్తిని కలుగఁజేయునట్టి అన్ని వ్యాపారములనున్ను తలంచినట్లు చేయగల సర్వేశ్వరునియొక్క 3 నిరంకుశ స్వాతంత్ర్యమందు తాత్పర్యమని యీ సూత్రార్థము.

౮౯. ఇకను ఈ త్యాగపూర్వక స్వీకారమందు నమ్మకము కలుగుట దుర్లభమని ఆనతిచ్చుచున్నారు "ఇతుతాన్" ఇత్యాదివాక్యముచేత. అనఁగా, ఈశ్లోకము 4 అనువాదముయొక్క కోటియందు

---

1 శాస్త్రములన్నిన్ని యొకయెత్తు - అనగా శాస్త్రములన్నిటియందు దేహవిశిష్టుడైన ఆత్మవిషయమందు తాత్పర్యమనిన్ని,

2 తానుయొకఎత్తు అనగా దేహసంబంధములేని శుద్ధాత్మస్వరూపమందు తాత్పర్యమని భావము.

3 నిరంకుశస్వాతంత్ర్యము - అరాజకమైన పట్టణములో రాజునుఏర్పరచుటకు ఏనుగవద్ద పుష్పమాలికనిచ్చి పంపినవుడు ఆయేనుగ ఒకబిచ్చగాని మెడలో మాలికను వేసినను వానిని ఆక్షేపించక అందరున్ను రాజుగా సంగీకరించుటవలె, తానుచేయు కార్యమునకు అడ్డులేని స్వాతంత్ర్యము.

4 అనువాదముయొక్క కోటి - జ్ఞానములేక నమ్మకముకలిగిన తరువాత (అర్జునునికి) చెప్పినశ్లోకము.

౯౦. అర్జునన్ కృష్ణనుడైయ వానైత్తొழిల్ కళాలుమ్, ఋషికళ్ వాక్యజ్గళాలుమ్, కృష్ణన్ తన్ కార్యత్తిలే అధికరిత్తుక్కొండు పోరుకై

---

చేరునని 1 ఆప్తతములైన 2 వంగిపురత్తునంబిగారు సాయించిన శ్రీ మాక్తి అని భావము. (శరణాగతికి సిద్ధమైనవానికే చరమశ్లోకము చెప్పవలసినదని వంగిపురత్తునంబిగారి శ్రీసూక్తి.)

౯౦. అనువాదమనుటకు హేతువును సాయించుచున్నారు "అర్జునన్" ఇత్యాదిగా. అనగా, ఈ ప్రపత్త్యుపాయమునకు అధికారియైన అర్జునుడు బాల్యముమొదలు కృష్ణునియొక్క 3 అఘటితఘటనాసామర్థ్యమును ప్రకాశింపజేయుచున్న అతిమానుష వ్యాపారములచేతను న్ను, 4 "ఏష నారాయణః శ్రీమాన్ క్షీరార్ణవనికేతనః। నాగపర్యఙ్క

---

1 ఆప్తతములు - ప్రపన్నాగ్రేసరులు.

2 వంగిపురత్తునంబి - ఉడైయవరుల అంతరంగశిష్యులలో నొకరు.

3 అఘటితఘటనాసామర్థ్యము - సముద్రములో మునిగి చనిపోయిన సాందీపునిబిడ్డను తెచ్చియివ్వడము, చనిపోయిన బ్రాహ్మణబిడ్డలు నలువురుని తెచ్చియివ్వడము, గోవర్ధనమెత్తడము మొదలగునవి.

4 హరివంశే, ౧౧౩-౬౭ (ఏష నారాయణ ఇతి.) ఈశ్రీకృష్ణుడు శ్రీమన్నారాయణుఁడే. క్షీరసముద్రమందు నివసించువాఁడు. తనపరుషైన తిరువనంతాళ్వానును(బలరాములను) ముందుగాపంపి, మధుర అను పట్ణమును గూర్చివచ్చినవాడని తాత్పర్యము. (ఏషః) అని ఆశ్రయణీయుడగుటకు ఇచ్చటివారితో సజాతీయుఁడై అవతరించి దృష్టికి విషయభూతుడుగానుండు విభవమును చూపుచున్నాడు. వీడు ఎవడనగా [శ్రీమాన్ నారాయణః] శ్రియఃపతియైన నారాయణుడనుచున్నాడు. "ఏషః" అని సౌలభ్యమును న్ను, "నారాయణః" అని పరత్వమునున్ను చెప్పబడుచున్నది. "శ్రీమాన్" అని వైరెంటికి కారణమైన పిరాట్టిసంబంధము చెప్పబడుచున్నది. "క్షీరార్ణవనికేతనః" అని దేవతలకార్యము చేయుటకుగాను ఏతెంచినచోటును చెప్పబడుచున్నది "నాగపర్యఙ్కముత్సృజ్య" అని శంబిమూర్తిపిరానున్ను తానున్ను ఇచ్చటవచ్చి అవతరించిన ప్రకారమును చెప్పబడుచున్నది. "హి" అని ఈ అర్థములోని ప్రసిద్ధతను చూపుచున్నది.

యాలుమ్, ఇవనే నమత్కృత్తజ్ఞ మెన్తు తుణిస్దపిన్బు తనై ఒప్పరిల చ్చొల్లుకై యూలే.

---

ముత్స్రజ్య హ్యాగతో మధురాపురీమ్"॥ 1 ,,పుణ్యా ద్వారవతీతత్ర యత్రా స్తే మధుసూదనః। సాక్షాద్దేవః పురాణో౽సౌ సహిధర్మస్సనాతనః। యత్రనారాయణో దేవః పరమాత్మాసనాతనః। తత్రకృత్స్న జ్జగత్పార్థ తీర్థాన్యాయతనానిచ"॥ 2 ,,యేచవేదవిదోవిప్రా యేచాధ్యాత్మవిదోజనాః। తేవదన్తిమహాత్మానం కృష్ణంధర్మంసనాతనమ్॥" 3 ,,పవిత్రాణాంహిగోవిన్దః పవిత్రంపరముచ్యతే। పుణ్యానామపిపుణ్యో౽సౌ మఙ్గళానాఞ్చమంగళమ్"॥ 4 ,,కృష్ణఏవహిలోకానా ముత్పత్తిరపిచాప్యయః। కృష్ణస్యహికృతేభూత మిదంవిశ్వంచరాచరమ్"॥ అనిన్ని ఈ మొదలైన ఉత్కృష్ట అపకృష్ట తత్వస్వరూపములను వున్నట్లు తెలిసి

---

1 (పుణ్యాద్వారవతీతి) భార. ఆర - ౮౮-౫౯-౫౪. తా॥ ఏస్థలమందు శ్రీకృష్ణుఁడువున్నాడో ఆద్వారక పుణ్యకరమైనది అనగా ప్రాప్యప్రాపకము. ఏలననగా, శ్రీకృష్ణుడు అనాదియైన ధర్మస్వరూపుడై, పురాతనుడైన ఆసర్వేశ్వరుడే; ఓ అర్జునా! ఏస్థలమందు సనాతనుఁడై, సర్వాన్తర్యామియై, శ్రీమన్నారాయణుడైన శ్రీకృష్ణుడువున్నాడో ఆస్థలమందు సమస్తజగత్తున్ను, సమస్తతీర్థములున్ను, సమస్త దేవాలయములున్ను కలవు.

2 (యేచవేద ఇతి) భార. అర - ౮౮-౫౬. తా॥ ఏబ్రాహ్మణులు వేదార్థజ్ఞానము కలవారో, యెవరైతే వేదాన్తజ్ఞానము కలవారో వారందరు శ్రీకృష్ణుని సర్వాన్తర్యామిగానున్ను, అనాదిధర్మ స్వరూపుడు గానున్ను చెప్పుచున్నారు.

3 (పవిత్రాణామితి) భార. అర - ౮౮-౫౭. తా॥ శ్రీకృష్ణుడు పవిత్రకరమైన వస్తువులకు మిక్కిలి పరిశుద్ధినికలుగచేయువాడుగాను, పుణ్యప్రదములైన వస్తువులకు పుణ్యముకలుగ చేయువాడుగాను, మంగళకరమైన వస్తువులకు మంగళప్రదుడుగాను చెప్పబడుచున్నాడు.

4 (కృష్ణఏవహి ఇతి). భార. సభా - ౫౮-౫3. తా॥ కృష్ణుఁడే లోకములకు సృష్టి స్థితి సంహారకర్త, స్థిరచరరూపముగా కనుబడు అన్నిభూతములున్ను కృష్ణునికి శేషము.

౯౧. పుఱమ్బు విఱన్దతెల్లా మివన్నిజ్ఞై చ్చోతిక్కైక్కాక.

---

కొనినవారలైన మహాఋషుల వాక్యములచేతను, బాల్యముమొదలు పట్టణమందు వసించినకాలమందున్ను, వనవాసకాలమందున్ను తారతమ్యములేక శ్రీకృష్ణుఁడు తనకార్యమందు పూనికతో రక్షించుచుకుంటూవచ్చుటచేతను, „వీడుచెప్పిన ఉపాయములన్ని మనకుపాయము గాదు వీడేమనకుపాయము” అని నమ్మినతరువాత 1 „అయితే నన్ను ఆశ్రయించు” అని చెప్పుటచేతను అనువాదమని యీ సూత్రార్థము. 2 (అనువాదమనగా ఒకచోట సిద్ధమైన అర్థమును మరియొకచోట యేదోనొకప్రయోజనముగా చెప్పుట).

౯౧. ఈ ఉపాయమును ప్రథమములోనే ఉపదేశించనందుకు హేతువును సాయించుచున్నారు, „పుఱమ్బు” ఇత్యాదిగా. అనఁగా

---

1 అయితే-కర్మజ్ఞానాదు లుపాయములుకావు నేనేఉపాయమనినమ్మినవాడవైతే.

ఈసూత్రమునకు దొడ్డయాచార్యర్ కృపచేసిన అరుంబదము:—

„స్వరూపవిరోధిత్వాదికళాలే ఉపాయాన్తరత్యాగముమ్, స్వరూపానురూపత్వాదికళాలే తదేకోపాయత్వముమ్ ప్రాప్తమాకైయాలే విధిక్కుప్రయోజన మిల్లామైయాలే, ఇరణ్డుమ్ అనువాదమెన్ఱు వఙ్గిపురత్తునమ్బి యరుళిచ్చెయ్యువర్. తిరుమన్త్రత్తిల్ మధ్యమపదమాననమస్సాలే అనన్యశరణత్వమ్ స్వరూపమెన్ఱఱిన్దపోతే తాదృశస్వరూపవిరోధికళాన ఉపాయాన్తరఙ్గళ్ త్యాజ్యఙ్గళెన్ఱు తోన్ఱియిరుక్కైయాలుమ్, అనన్యశరణత్వ స్వరూపానురూపమాక అవనే ఉపాయమెన్ఱు ప్రతిపత్తిపిఱక్కైయాలుమ్, నమఃపద విహితఙ్గళాన త్యాగస్వీకారఙ్గళిరణ్డైయుమ్ చరమశ్లోకత్తిలే శొల్లుకైయాలే చరమశ్లోకమ్ ఇరణ్డుక్కుమ్ అనువాదమెన్ఱిఱు. ఆనాల్, పిళ్ళైలోకాచార్యర్ ఇరణ్డైయుమ్ ఇఙ్గువైధమాక వరుళిచ్చెయ్వానెన్నిల్; త్యాగస్వీకారంగళిరణ్డుమ్ నమఃపదత్తిలే రాగప్రాప్తమాయిరున్దతే యాకిలుమ్, సామాన్యతః త్యాగస్వీకారంగళుక్కు విధిప్రవర్తకమాకైయాలే, అతుతానుళ్ళతు చరమశ్లోకత్తిలే యాకైయాలే, ఇవ్విడత్తిలే ఇరణ్డుమ్ వైధమెన్ఱు పిళ్ళైలోకాచార్యరరుళిచ్చెయ్కిఱార్.”

2 అనువాదము రెండువిధములు - శబ్దానువాదము, అర్థానువాదమని. ఇచ్చట చెప్పు అనువాదము అర్థానువాదమని యెఱుఁగదగ్గది.

1"యచ్ఛ్రేయస్స్యాన్నిశ్చితం బ్రూహితన్మే శిష్యస్తేహం శాధిమాం త్వాంప్రపన్నమ్" అనిచెప్పిన యీఅర్జునునికి ఉపాయోపదేశముచేయుట కుప్రారంభించినసమయములో ఈయుపాయమును ప్రథమములో నుప దేశించక ఉపాయాన్తరములను విస్తారముగా, నేకరీతిగానిలిచ్చియుప దేశించినదంతయు, ఈ ఉపాయాన్తరములే ముఖ్యమని విశ్వసించియుం డునో లేక ఆ ఉపాయాంతరములయొక్క, దుష్కరత్వ, స్వరూప విరు ద్ధత్వాది దోషదర్శనములచేత ఈ ప్రపత్త్యుపదేశమునకు ఉపాయాంత రములనువదలి 2 అనన్యగతికుఁడైన అధికారి యగునా అని వీనియొక్క 3 మనస్సును పరిశోధించుటకుగాను అని యీసూత్రార్థము.

---

1 భ-గీ. అ-౨. శ్లో-౭. [యచ్ఛ్రేయస్స్యానితి] యత్-ఏది, శ్రేయః - శ్రేయ స్కరము, స్యాత్-అగును, (ఇతి) అని, (త్వయా) నీచేత, నిశ్చితమ్ - నిశ్చయింపఁబడు చున్నదో, తత్ - దానిని, మే - నాకు, బ్రూహి - చెప్పుము, అహమ్ - నేను, తే- నీకు, శిష్యః - శిష్యుఁడను, (తతః-ఆకారణమువలన) త్వామ్ - నిన్ను, ప్రపన్నమ్ - శరణునొందిన, మామ్ - నన్ను, శాధి - శిక్షించుము (నియమింపుము.) తా॥ నాకుయేది నిశ్చయముగా శ్రేయస్కరమో అటువంటి ఉపాయమునుచెప్పుము, దేవరవారికి శిష్యు డైనందున దేవరవారిని ప్రపత్తిచేసిన నన్ను శిక్షించవలెను.

2 అనన్యగతికుఁడైన యధికారి - సాధనాంతరములనువిడిచి అకించనుడై దేవ తాంతరములను వదిలి అనన్యగతికుడైన అధికారి. ఇందువల్ల, అ ప్తతముడైన పరమపురు షుఁడు దుష్కరములైన ఉపాయాంతరములనున్ను, వాటివల్ల కష్టపడి ఆరాధనచేయ బడు అగ్నీంద్రాది దేవతాంతర్యామియైన ఈశ్వరుని ఆరాధ్యునిగా ఉపదేశించి వాటి యొక్క దుష్కరత్వాదులనున్ను, అగ్నీంద్రాదుల దురారాధననుచూచి వాట్లవల్ల ఆయా దేవతాంతర్యామిని ఆరాధించుటనువిడిచి అసాధారణ దివ్యమంగళవిగ్రహముతో కూడియుండువాడును సుఖముగా ఆరాధించతగిన వాడైననన్నే ఉపాయముగా స్వీక రించు అధికారి అనిభావము.

3 వీనిమనస్సును పరిశోధించుటకుగాను అనుటవల్ల స్వతః సర్వజ్ఞుడైన ఈశ్వరు నికి హృదయశోధనముచేయుట వాని సర్వజ్ఞత్వమునకు హానికలుగదా అనిన కలుగనే రదు. ఏలననగా, లోకములో షడాచార్యపద నిర్వాహకులనుగురించి " పరీక్ష్యవివిధో

౯౨. వేదపురుషన్ ఉపాయాన్తరఙ్గళై విధిత్తతు, కొణ్డిప్పశువుక్కు త్తడికట్టివిడువారైప్పోలే అహఙ్కార మమకారఙ్గళాల్ వన్దకళిప్పఱ్ఱు స్వరూపజ్ఞానమ్ పిఱప్పిక్కైక్కాక.

౯౨. అయితే సర్వేశ్వరుఁడుదా యీ రీతిని మనస్సును శోధించుటకుగాను ఉపాయాంతరములను ఉపదేశించెను, వేదపురుషుఁడు ఉపాయాన్తరములను విధించడమునకు హేతువేమి? అనగా దానికికారణమును సాయించుచున్నారు. "వేదపురుషన్" అని ప్రారంభించి. అనఁగా 1 ఆప్తతముఁడైన వేదపురుషుఁడు, 2 విజ్ఞాయప్రజ్ఞాంకుర్వీత" 3 "ఓమిత్యాత్మానంధ్యాయథ" 4 "ఆత్మానమేవలోకముపాసీత" 5 "ఆత్మావాఅరే ద్రష్టవ్య శ్శ్రోతవ్యో మన్తవ్యోనిదిధ్యాసితవ్యః" ఈ మొదలగువాటిచేత ఉపాయాంతరములను మోక్షసాధనముగా విధించడము-దొంగతనముగా పైరుమేసి తిరుగుచున్న పశువుకు, (ఆప్రకారము మేయడము మాన్పుటకుగాను) కంఠమందు కఱ్ఱను కట్టివిడుచువారివలె, అహంకారమమకారములకు వశ్యుఁడై గర్వించి తిరుగుచున్న యీ చేతనునికి (అనేకజన్మసహస్రములయందు చాంద్రాయణాది వ్రతములచేతను, ఆత్మజ్ఞానముచేతను యోగముచేతను అన్నట్లు) కాయక్లేశరూపమైన కర్మానుష్ఠానము, ఇంద్రియజయము, మొదలైన దుష్క-

సాధ్యైః" అని శిష్యహృదయపరీక్షజ్ఞాపనార్థముగా శాస్త్రిముచెప్పియుండుటవల్ల ఆయనుష్ఠానమును ఈశ్వరుడున్ను గీతాచార్యుడగుటవల్ల అనుష్ఠించినాడు.

1 ఆప్తతముఁడు అనఁగా చేతనరక్షణార్థముగా యథార్థమును వ్యక్తముగా ఉపదేశించువాఁడు.

2 విజ్ఞాయ......త - తెలిసిభక్తిచేయవలసినది.

3 ఓమిత్యా......థ - ఓం అని ఆత్మనుధ్యానించుడు.

4 ఆత్మాన......సీత - ఆత్మనే ఫలముగా ఉపాసనచేయవలసినది.

5 ఆత్మావా......తవ్యః - ఓశిష్యుఁడా, ఆత్మనే చూడతగినవాడు, వినతగినవాడు, మననము చేయతగినవాడు, ధ్యానముచేయతగినవాడు.

౯౩. సన్న్యాసి మున్బుళ్ళవఱ్ఱై విడుమాప్పోలే ఇవ్వళవు పిఱన్ద వన్ ఇవఱ్ఱైవిట్టాల్ కుఱ్ఱమ్ వారాతు.

౯౪. ఇవన్తా నివైతన్నై నేరాకవిట్టిలన్.

---

రవ్యాపారముల చేతను సంకోచించి ఆగర్వముపోయి, భగవత్పారతన్త్ర్యమనే స్వరూపజ్ఞానము పుట్టుటకుగాను అని యీసూత్రార్థము.

[ఉపాయాంతరములను ఉపదేశించడము, అహంకార మమకారవశ్యులై గర్వించి తిరుగుచున్న యీచేతనులకు ఈ ఉపాయాంతరానుష్ఠానముచేత రజస్తమోగుణములు నివర్తించి సత్వవృద్ధికలిగి భగవత్పారతంత్ర్యరూప స్వరూపజ్ఞానము కలుగుననే అభిప్రాయముచేత (వేదపురుషుడు ఉపాయాంతరముల విధించినాడు) అని భావము.]

౯౩. ఉపాయాంతరములను స్వరూపజ్ఞానము కలుగుటకుగాను వేదపురుషుడు విధించినట్లయిన లోగడచెప్పినప్రకారము స్వరూపజ్ఞానోదయమునకు హేతువైన ఈ ఉపాయాంతరములను విడిచినట్లయితే భగవంతునికి వీనియందు ప్రీతిలేకపోవడమనే దోషమురాదా అనఁగా రాదు అని సాయించుచున్నారు "సన్న్యాసిమున్బుళ్ళవఱ్ఱై" ఇత్యాది వాక్యముచేత. అనఁగా, సన్న్యాసాశ్రమమును పరిగ్రహించినవాడు పూర్వాశ్రమధర్మములను విడుచునటువలె, ఇతరోపాయములు స్వరూపవిరోధులు, దుష్కరములు, తెలుసుకొనుట కష్టమైనవి, అగుటచేత సిద్ధోపాయమందు ప్రవేశించుటకుతగిన 1 అత్యంత పారతంత్ర్య జ్ఞానపరిపాకముగలవాడు ఈయుపాయాంతరములను విడిచినట్లయిన దోషముకాదని యీసూత్రార్థము.

౯౪. ఈ యుపాయాంతరములు ఆకారాంతరములచేత అనుష్ఠానరూపసంబంధముకలిగి యుండుటవల్ల అత్యంతపారతంత్ర్య జ్ఞానముకల

---

1 అత్యంతపారతంత్ర్యజ్ఞానము - ఈశ్వరునికి మనము శరీరముగా శేషభూతులు గనుక పరతంత్రులమే అనేజ్ఞానము.

వాడున్ను ఈ ఉపాయాంతరములను స్వరూపేణ (చేయకనే) వదలిపెట్టుటలేదనే విషయమును సాయించుచున్నారు «ఇవై తాన్» ఇత్యాది వాక్యముచేత. అనఁగా, సాధనాంతరపరిత్యాగ పూర్వకముగా సిద్ధోపాయమును పరిగ్రహించిన యీ అధికారి కర్మజ్ఞానాదులు అనే ఈ యుపాయములను అనుష్ఠించకనే విడిచియుండడని యీసూత్రార్థము.

1 ౫౩.౫౪ మూలసూత్రములలో «ఇవర్గళ్ విట్టాల్ కుర్రమ్ వారాతు» «ఇవస్తానివైతన్నై నేరాకవిట్టిలన్» అనువాక్యములను పైవారిగా చూచినపక్షమందు పరస్పరవిరోధముగా నగుపడును. వాస్తవ్యార్థము అట్లులేదు. అధ్యవసాయభేదమును సూచింపుచున్నవి. (విడక్కడవనల్లన్) విడవతగినవాడుకాడు అనిసాయించక (విట్టిలన్) విడవడు అని ఆనతిచ్చుటవల్ల అధికారిభేదము సూచితము. ఇవర్గళ్ విట్టాల్ అనుచోట ఇవర్గళ్ అనుపదము దేవతాంతరశేషమై, ప్రయోజనాంతర బుద్ధితో, సామాన్యశాస్త్రిమర్యాదననుసరించి లోకసంగ్రహాదులయందు ఆనృశంసప్రేరితులై, ఉపాయబుద్ధితోచేయు కార్యములను చూపుచున్నది. ఇవైతన్నై నేరాకవిట్టిలన్ అనుచోట ఇవైతన్నై అనుపదము దేవతాంతరశేషములేక, ప్రయోజనాంతర బుద్ధిరాహిత్యముతో, (౩౯-వ పుట ౫ మొదలు ౨౦-వ పంక్తివరకు) చూపినప్రకారము శరణాగతనుక్కు లోకసంగ్రహాదికళ్ లపేక్షైయిల్లామైయాలే అవనుక్కు ప్రయోజనమన్ను. ఇని భగవత్ప్రీతియే పరమప్రయోజనమ్» ఇత్యాదిగా సాయించబడియుండు రీతిగా) విశేషశాస్త్రినిష్ఠులై లోకసంగ్రహ ఆనృశంసాదులందనన్వితులై స్వయంప్రయోజనముగా, ఉపేయబుద్ధితో చేయుకార్యములని భావము. ఈకార్యము నే కర్మమనిన్ని, అట్టికర్మను అంగముగాకలిగిన జ్ఞానమనిన్ని, ఈరెంటికి అంగిఅయిన భక్తిప్రపత్తులను ౫౬-వ సూత్రములో చెప్పబడుచున్నవని యెఱుగవలెను. ఈగ్రంథములోని ౩౦-మొదలు ౩౯-పుటవరలో సాయించియుండు విశేషశాస్త్రిధర్మములనున్ను ఈచోట అనుసంధించతగును.)

ఇట్లుగాక, మర్యాదానాంచలోకస్య కర్తాకారయితాచసః అనిన్ని, ఆజ్ఞాచ్ఛేదీ మమద్రోహీ అనువాక్యములనుగొని భగవదాజ్ఞారూప కర్మల ననుష్ఠించవలయుననియు, లోకములో శాస్త్రిమర్యాదను కాపాడుటకు కర్మలననుష్ఠించవలయుననిన్ని కొందరు చెప్పుచున్నారు. అట్లయినఎడల సాధనాంతరములన్నియు భగవదాజ్ఞా రూపములైన శాస్త్రిములుగానే యుండుటవల్ల అవి విడువవలసినది కాకపోవును: అప్పుడు ఈశ్వ

౯౫. కర్మమ్ కైఙ్కర్యత్తిలేపుకుమ్; జ్ఞానమ్ స్వరూపప్రకాశత్తిలే పుకుమ్; భక్తి ప్రాప్యరుచియిలేపుకుమ్; ప్రపత్తి స్వరూపయాథాత్మ్య జ్ఞానత్తిలేపుకుమ్.

౯౫. స్వరూపేణ విడువకపోవుటకు కారణమును ఆనతిచ్చుచున్నారు "కర్మమ్" అని ప్రారంభించి. అనఁగా, తనవర్ణాశ్రమమునకు తగినట్లు ఈ ప్రపన్నుఁడు అనుష్ఠించు విహితకర్మము సాధనమని తలచక, దయచేతను ఇతరులుజ్జీవించుటకుగాను అనుష్ఠించుటచేతను సర్వేశ్వరునికి మిక్కిలిప్రీతిని కలుగచేయునది అగుటచేత ఆప్రీతికికారణముగాచేయు కైంకర్యమందంతర్భవించును. 1 "నుణ్ణఱివు" అన్నట్లు, భగవదనన్యార్హ శేషత్వరూపజ్ఞాన పూర్వకముగా 2 పరస్వరూపమును సాక్షాత్కరించుటకు హేతువైన సూక్ష్మజ్ఞానము 3 త్యాజ్యమైన ఉపాయత్వబుద్ధి నివర్తించగానే స్వస్వరూపజ్ఞాన పూర్వకముగా ఆశ్రయింపబడే పరస్వరూపముయొక్క ప్రకాశమందంతర్భవించును. 4 "భక్త్యాత్వనన్యయాలభ్యః" అనినట్లు భగవత్ప్రాప్తికిసాధనమైన భక్తియోగము, సాధనమనుబుద్ధినశించగానే భోజనమునకు క్షుత్తువలె ప్రాప్యమైన కైంకర్యమునకు పూర్వక్షణమందు అనువర్తించవలసిన రుచి

రునివల్లనే ఏర్పరచబడ్డ విశేషశాస్త్రము నిరర్థకమగును. ఇందునుపట్టే ఈశ్లోకార్థ శ్రవణానుష్ఠానములకు "అధికారికళ్ నియతర్" అని ౧౦౧ - వ సూత్రములో సాయించియున్నారు.

1 తి-వా-మొ-౭-౧. నుణ్ణఱివు-సూక్ష్మజ్ఞానము అనగాఅనన్యవిషయమైనజ్ఞానము,

2 పరస్వరూపము - నిరుపాధిక శేషిత్వ రూపస్వరూపము.

3 త్యాజ్యమైన - భ్రాంతిమూలమగుటచేత త్యాజ్యమైన.

4 శ్రీ-భ-గీ. ౧౧-౫౪. భక్త్యాత్వనన్యయాలభ్యః - అన్యవిషయముకాని భక్తిచేతను పొందతగినవాఁడను.

కర్మయోగమువల్ల రజస్తమోనివృత్తిపూర్వకమైన సత్వముతలయెత్తి, అందువల్ల జ్ఞానయోగముకలిగి అది భక్తిరూపముగా పరిణమించి అది దర్శనసమానాకారమై స్వ

౯౬. ఒరుఫలత్తుక్కు అరియవట్రైయుమ్, ఎళియవట్రైయుమ్ ఉపదేశిక్కైయాలే ఇవై ఇరణ్డుమొழிయ భగవత్ప్రసాదమే ఉపాయమాకక్కడవతు.

యందంతర్భవించును. సిద్ధోపాయస్వీకారమనే ప్రపత్తి చరమశ్లోకపూర్వార్థమందున్న ఏకపదముచేత చెప్పబడినట్లు ఉపాయత్వబుద్ధినివర్తించగానే, అచిత్తువలె అత్యంత పరతంత్రుడగుటచేత నుపాయాంతరశూన్యమైయున్న చేతనస్వరూపముయొక్క యాథాత్మ్యజ్ఞానమందు అంతర్భవించునని యీ సూత్రార్థము.

౯౬. శాస్త్రములందు భగవత్ప్రాప్తిసాధనములుగా చెప్పబడ్డ భక్తిప్రపత్తులు రెంటినిన్ని సాధనములుకావని నిరాకరించిన ముముక్షువుకు ఫలసాధనము ఇట్టిదని సాయించుచున్నారు, "ఒరుఫలత్తుక్కు" అనిప్రారంభించి. అనగా భగవత్ప్రాప్తి అనే పురుషార్థమునకు 1 "జన్మాంతర సహస్రేషు తపోజ్ఞానసమాధిభిః । నరాణాం క్షీణపాపానాం కృష్ణేభక్తిః ప్రజాయతే॥" అన్నట్లు అనేకజన్మములందు కలిగినజ్ఞానాదులనే అంగముచేతను సాధింపబడుదగుటచేత దుర్లభమైయున్న భక్తిమార్గమునున్ను, (సర్వధర్మాన్ పరిత్యజ్య) సకలప్రవృత్తులను ముందుగానివర్తించి, ఒకేతూరి అనుష్ఠించవలసినదగుటచేత సులభమైయున్న ప్రపత్తిమార్గమునున్ను ఉపదేశించుటచేత ఉపాయములందున్న 2గౌరవ

రూపయాథాత్మ్యజ్ఞానము కలిగినతరువాత ఈశ్వరుడేఉపాయమని అధ్యవసించినపిమ్మట స్వరూపానురూపమైన పరార్థకైంకర్యము లభించునని సంప్రదాయము. భక్తిసాధనమైనపుడు కర్మజ్ఞానములు అంగములగును. ప్రపత్తిసాధనమైనతరువాత కర్మము కైంకర్యమై, జ్ఞానభక్తులు దానికుపకరణమైయుండును. స్వరూపజ్ఞానపూర్వకముగా ప్రాప్యరుచి తలయెత్తినవాడుగదా కైంకర్యములో అన్వయించడము.

1 [జన్మాంతరేతి] అనేక జన్మాంతరములయందుచేసిన కర్మజ్ఞానభక్తులచేతను నశించిన పాపములుగలచేతనులకు శ్రీకృష్ణునియందు దర్శనసమానాకార భక్తి కలుగును.

2 గౌరవము — అధికము.

౯౭. పేఱ్ఱుక్కు వేణ్డువదు విలక్కామైయు మిరప్పుమ్.

౯౮. చక్రవర్తితిరుమకన్ పాపత్తోడే వరిలు మమైయు మెన్ఱాన్,

---

1 లాఘవములందు తాత్పర్యములేక భక్తిప్రపత్తులనే 2 వ్యాజముచేత ఫలమునుయిచ్చుచున్న ఆసర్వేశ్వరునియొక్క అనుగ్రహమే ప్రధానమగుటచేత, భక్తిప్రపత్తులు రెండుకాక సర్వేశ్వరునియొక్క అనుగ్రహమే 3 ఉపాయముకాగలదని యీసూత్రార్థము.

(ఇందువల్ల మన్కరోపాయమువల్ల సాధ్యమైన ఫలమును మకరోపాయసాధ్యమని చెప్పునపుడు ఈరెండున్ను సాధనముగాదు ఈశ్వరానుగ్రహమే ప్రధానసాధనమని తాత్పర్యము.)

౯౭. భక్తిప్రపత్తులు సాధనములుకాక భగవత్ప్రసాదమే సాధనమైనను ఈచేతనునియందు పురుషార్థసిద్ధికి ఒక అధికారము వుండవలసినదిలేదా అనగా వుత్తరము ఆనతిచ్చుచున్నారు "పేఱ్ఱుక్కు" అని ప్రారంభించి. అనగా తనయత్నముచేత వాడు (ఈశ్వరుడు) చేయు రక్షణమును 4 నిషేధించకయుండుటయు, అది పురుషార్థమగుటకు హేతువైనప్రార్థనయుపురుషార్థసిద్ధికి చేతనునియందు అవశ్యమువుండవలసినది అని యీవాక్యార్థము.

౯౮. నిషేధించమియు, ప్రార్థనయుగాక యీ చేతనునియందు కొన్నిసుకృతములు వుండినట్లయిన పురుషార్థసిద్ధి కలుగదా అనుశంకను పరిహరించుటకుగాను ఆసుకృతము ఉపాయభూతుడైన సర్వేశ్వరునికి అనిష్టము అనేవిషయమును సాయించుచున్నారు 5 "చక్రవర్తితిరుమకన్" అనిప్రారంభించి. అనగా 6 "రామో విగ్రహవాన్ ధర్మః"

---

1 లాఘవము - అల్పత్వము. 2 వ్యాజము అనగా మోక్షమునకు నియతముగా పూర్వవర్తిఅయి, ఉపాయమువలె కనుబడి మోక్షకారణము కాక యుండుట.

3 ఉపాయము=ఫలసాధనము. 4 నిషేధించకయుండుట-అడ్డగించకవుండుట.

5 చక్రవర్తితిరుమకన్=శ్రీరాములు. 6 రా, అయో, 32, ౧, రామోవిగ్రహవాన్ ధర్మః= శరీరపరిగ్రహముచేసిన ధర్మ స్వరూపమైన శ్రీరాములు, అనగా విభవ

ఇవర్ పుణ్యత్తైప్పోకట్టు వరవేణుమెన్నార్.

౯౯. ఆస్తికనా ఇవ్వర్థత్తిల్ రుచివిశ్వాసజ్గళుడైయనాయుజ్జీవిత్తల్

---

అను చక్రవర్తితిరుమకన్, 1 "యదివారావణస్స్వయమ్" అని పాపిష్ఠుడైన 2 రావణుడైనను పిలుచుకొనిరండు అనిచెప్పుటవల్ల, పాపము పురుషార్థసిద్ధికి హేతువుగా తలంచుటకు వీలులేనందున 3 పాపముతోటివచ్చినను చాలునని ఆనతిచ్చెను. 4"కృష్ణంధర్మంసనాతనమ్" అను శ్రీకృష్ణుఁడు అన్నిధర్మములను పరిత్యజించి రమ్మనుటచేత పురుషార్థసిద్ధికి హేతువుగాతలచుటకు మూలమైన పుణ్యమునువదలి రావలసినదనుచున్నాడు. కాబట్టి సహాయాంతర సంసర్గము సహించని యుపాయభూతునికి సుకృతమనిష్టమని యీసూత్రార్థము.

౯౯. ఈశ్లోకార్థజ్ఞానము కలవాఁడు ఆస్తికుఁడై యుజ్జీవించుట లేక నాస్తికుఁడై నశించుటతప్ప మధ్యమస్థితిలేదు అనే విషయమును పూర్వాచార్య వచనముచేత తెలియపరుచుచున్నారు "ఆస్తికనాయ్" ఇత్యాదిగా. అనఁగా, ఈశ్లోకార్థశ్రవణాది సంబంధముకలవాడు భగవత్ప్రీభావముచేత ఈశ్లోకార్థము సత్యమని విశ్వాసము కలవాఁడై, యీ అర్థమందురుచియు ఇదితప్పదు అనే నమ్మకముకలవాఁడై యుజ్జీవించుట,

---

రూపములో శరీర పరిగ్రహముచేసిన సాక్షాద్ధర్మమైన శ్రీరాములు.

1 రా, యు. ౧౯, 3౫ యదివారావణస్స్వయమ్=లోకములను శోకింపచేయువాడవుటవల్ల రావణుడని పేరుకలవాడు స్వయముగా వచ్చినను. 2 రావణః=రావయతీతి=రావణః, అను వ్యుత్పత్తివల్ల దుఃఖము కలుగజేయుటను చూపఁబడుటచేత పాపిష్ఠుఁడైనరావణుడు అని సాయించిరి.

3 పాపముతోటి వచ్చినను అనుటవల్ల పాపముతోటి రావడమే లేదు వచ్చిన యెడల అలభ్యలాభమని తాత్పర్యము. 4 భార, సభా, ౨౯. ౨3.

(పాపము తన నిరపేక్షోపాయమునకు భంజకము కాక ప్రకాశమగుటవల్ల పాపముతోటి వచ్చినను చాలునన్నాడు. పుణ్యము ఎంతమాత్రముండినను అది ఉపాయభూతుని నిరపేక్షత్వ భంజకముగాన దాన్ని వదలిరమ్మని చెప్పినాడని యెరుగవలయు)

నాస్తికనాయ్ నశిత్తలొళియ నడువిల్ నిలై యిల్లై ఎన్ఱు భట్టర్ క్కు ఆచ్చా రరుళిచ్చెయ్ తవార్తై.

౧౦౦. వ్యవసాయమిల్లాతవనుక్కు ఇతిలన్వయమ్ ఆమ! త్తిల్ భోజ నమ్మోబ్బలే.

అట్లు గాక, 1 శాస్త్రములన్నిన్ని భక్త్యుపాయ ప్రతిపాదకంబైనం దున అవి యొక విధముగానున్ను, ఈ చరమశ్లోకము ఆశాస్త్రము లకు ప్రతికోటియై 2 యొక విధముగానుండుటవల్ల ,, ఈరీతి సకలవే దాన్తవిరోధిగానుండు ఉపాయముకూడా ఒకటికలదో" అని శాస్త్రార్థ విశ్వాసములేనివాడై ఈఅర్థమును ఆదరించక నశించుటయేగాని 3 మధ్యమస్థితి లేదని సకలశాస్త్రవిత్తములైన భట్టరుగారికి వారి ఆచా ర్యులగు ఎంబార్లు సాయించిన శ్రీసూక్తి అని యీసూత్రార్థము.

౧౦౦. విశ్వాసము లేనివానికి ఈశ్లోకార్థమందు శ్రవణాది సంబం ధము కలిగిన ఎడల నశించుటకు హేతువగునని సదృష్టాంతముగా సా యించుచున్నారు ,, వ్యవసాయమ్" ఇత్యాదిగా. అనగా ఈశ్లోక మందుచెప్పిన ఉపాయాంతర త్యాగపూర్వక సిద్ధోపాయ స్వీకారము నకు తగిన మహావిశ్వాసము లేని వానికి ఈశ్లోకార్థమందు కలిగేసంబం ధము అజీర్ణదశలో భోజనము మరణహేతువైనట్లు వినాశహేతువై పర్యవసించును అని యర్థము.

---

1 శాస్త్రములనిన్ని = వేదాంతములనిన్ని ; 2 యొకవిధముగా = ప్రపత్త్యుపాయ ప్రతిపాదకముగా; 3 మధ్యమస్థితి = ఐశ్వర్యకైవల్యప్రాప్తి.

కర్మాద్యుపాయములలో ఫలసంగ కర్తృత్వత్యాగము చేసుటవల్లనున్ను, ఈశ్లో కార్థములో నమ్మకము లేనందువల్లనున్ను ఐశ్వర్య కైవల్యములు లేదని భావము. లేక ముముక్షుత్వము కలిగినపుడే కామ్యకర్మములు విడువబడిన దగుటచేత ఐశ్వర్య కైవల్య ములు లేవనిన్ని చెప్పవచ్చును.

౧౦౧. ,,విట్టుశిత్తర్ కేట్టిరుప్పర్" ఎన్గిఱపడియే అధికారికళ్ నియతర్.

౧౦౨. ,,వార్తైయఱివర్" ఎన్గిఱపాట్టుమ్, ,,అత్తనాకి" ఎన్గిఱపాట్టుమితుక్కర్థమాక వనుసన్ధేయమ్.

---

౧౦౧. ఈశ్లోకార్థమునకు అధికారులు ఎట్టివారు అనేవిషయమును సాయించుచున్నారు ,,విట్టుశిత్తర్" ఇత్యాదిగా. అనగా, 1 ,,శెమ్మైయుడైయ తిరువరఙ్గర్ తామ్ పణిత్తమెయ్మ్మై ప్పెరువార్తై విట్టు శిత్తర్ కేట్టిరుప్పర్" అని మనోవాక్కాయ కర్మములచేత ఏకరీతియైన వ్యాపారము కలవారై, ఆస్వభావమును అనుష్ఠాన పర్యంతము నడిపించుటకు శ్రీరంగమందు శయనించియుండు వాడు తానే అర్జున వ్యాజముచేత తిరుత్తేరునందు నిలచి ఆనతిచ్చిన యథార్థమై, అతిశయించినదై, సులభమైన ,,నన్నే ఉపాయముగా అధ్యవసించు" అను శ్రీసూక్తిని పెరియాళ్వార్లు విని తన్నిష్ఠులై యుందురు అని చెప్పినరీతిగా ఈ చరమశ్లోకమునకు అధికారులు ఈచరమశ్లోకార్థమును వినినయెడల యిందులో చెప్పిన ప్రకారము నిష్ఠకలవారై యుండువారు అని యీ సూత్రార్థము.

౧౦౨. ఈచరమశ్లోకార్థ నిష్ఠులైన ఆళ్వార్లయొక్క దివ్యసూక్తులలో ఈచరమశ్లోకమునకు అర్థముగా అనుసంధింపబడే పాశురములను ఆనతిచ్చి యీశ్లోకార్థమును ముగింపు చేయుచున్నారు ,,వార్తైయఱివర్" ఇత్యాదిగా. అనగా, ,,వార్తైయఱివర్ పోర్త పిఱప్పోడు

---

1 నా - తి. ౧౧.౧౦. [శెమ్మై] ఇత్యాది. శెమ్మైయుడైయ = మనోవాక్కాయకములు ఏకరీతిగానుండు, తిరువరఙ్గర్ తామ్ - అళ్గియమణవాళర్, పణిత్త - సాయించినదై, మెయ్మ్మై - యదార్థమై, పెరు - గొప్పదియైన, వార్తై - ,,సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకంశరణంవ్రజ। అహంత్వాసర్వపాపేభ్యో మోక్షయిష్యామిమాశుచః" అను శ్రీసూక్తి, విట్టుశిత్తర్ - పెరియాళ్వార్, కేట్టు - శ్రవణముచేసి, ఇరుప్పర్ - తన్నిష్ఠులై యుందురు; తమ్మైయుకప్పారై - తమ్మును కొనియాడువారిని, తామ్ - తాము, ఉకప్పర్ - తాముకొనియాడుదురు, ఎన్ను మ్శొల్ - అనులోకోక్తి, తమ్మిడైయే - తమవద్దనే, పొయ్యానాల్ - అబద్ధమైపోయినయెడల, ఇని - ఈలోకములో, శాతిప్పార్ ఆర్ - ఈప్రకారము చేయతగ్గదికాదు అని నియమించతగ్గవారెవరు? ఒకరున్ను లేరనిభావము.

నోయొదు మూహ్పోడిఅప్పవై పేర్తప్పిరుమ్తున్బమ్ వేరఅనీక్కతణ్ తాళిన్ కీళ్ చ్చేర్తవణ్ శెయ్యుం శేమత్తై యెణ్ణిత్తెళివుత్తు మాయవ త్తాకళన్ఱియావరో" అని "మామేకం శరణం వ్రజ, సర్వపాపేభ్యో మోక్షయిష్యామి" అని ఆనతిచ్చిన దివ్యసూక్తిని తెలిసినవార్లు, పశిని కాయ పట్టుపురుగును మూసుకొన్నటువలెనే యీ ఆత్మను అంతటా కప్పుకొనియుండే జన్మములతోటిన్ని, ఆజన్మములు ప్రవేశించు స్థలమందే ప్రవేశించగలవైన వ్యాధులతోటిన్ని, ఆవ్యాధిలోనైనా కొన్నిరోజులు వెళ్ళనివ్వక పిడుగుపడినట్టు వచ్చు వార్ధిక్యముతోటిన్ని ఆ వార్ధికముతోనైనను వుండనివ్వక ఈచేతనుని కనిష్టమైన మరణమున్ను అనే వీటిని, ఉపాయజ్ఞులైన సమర్థులు ఉన్నతమైన గోడను పడద్రోయునటువలె పడతోసి, ఆ జన్మాదులు నశించిన తరువాత రాగలదైన కైవల్యమను మహాదుఃఖమును సవాసనగా పోగొట్టి, పాదరేఖవలె తనయొక్క తిరువడికళ్ కిందచేరేటట్టుచేసి, పునరావృత్తి నశించేటట్టు ఆసర్వేశ్వరుడు చేయు క్షేమములను అనుసంధించి నిశ్చయజ్ఞానము కలవారు, తమకు ఆశ్రయించతగినవాడై, విరోధినివర్తకుడై ఆశ్చర్యభూతుడైన సర్వేశ్వరునికి తప్ప మరియొకరికి దాసభూతులవుదురా? అని నమ్మాళ్వారానతిచ్చిన 1 "వాళ్ళైయెళిపవర్" అను పాశురమునున్ను, ముక్తుడై, ముకుందుడైన సర్వేశ్వరుడు, సమానముగానున్ను, భిన్నముగానున్ను వున్న అనేకములైన జన్మములను నివృత్తింపించి మనలను దాసులుగా అంగీకరించుటకుగాను తండ్రియై, తల్లియై, స్వామియై, మన కుపకారకుడై, మనలో ప్రవేశించి నిత్యవాసముచేసెను. జ్ఞానములేని ఓమనసా! యే హేతువుచేత దుఃఖసముద్రమందు మునుగుచున్నావు? అని హేయగుణములకు విరోధి అగుటచేత సంసారగంధస్పర్శములేనివాడై, ముక్తిఅనే నిత్యవిభూతిని యిచ్చు సర్వేశ్వరుడు అన్ని దేహములయందున్న ఆత్మలన్నియు జ్ఞానస్వరూపులగుటచేతను అజ్ఞానమనే ఆకారముచేతను సమములై, దేవాది శరీరభేదములచేత భిన్నములైయున్న అనేకవిధములైన జన్మములను పోగొట్టి నిత్యసంసా

1 తి.వా. ౪-౫-౧౦.

రులైయున్న మనవద్ద నిత్యసూరులవద్ద చేయించుకొను కైంకర్యమును చేయించుకొనుటకై 1 హితమునే ప్రవర్తింపచేయుచున్న తండ్రిగానున్ను 2 ప్రియముచేయుచున్న తల్లిగానున్ను, కైంకర్యమును అంగీకరించగల మనస్వామిగానున్ను, ఈప్రకారము సర్వవిధబంధువై మనయొక్క 3 అపకృష్టత్వమునున్ను, తనయొక్క ఆధిక్యమునున్ను చూడక, మనయొక్క సర్వభారమునున్ను మనప్రార్థనలేకనే తానే పైనవేసుకొని చేయువాడుగా హేయమైన మనలో ప్రవేశించి అభేదముగా నిత్యవాసము చేయుచున్నాడు. జ్ఞానహీనమైన ఓమనసా! మనయొక్క హితమును తెలుసుకొనుటకు మనము సర్వజ్ఞులమా, వాడు అజ్ఞుడా? హితమును ప్రవర్తింపజేసుకొనుటకు మనము శక్తులమా, వాడు అశక్తుడా? కార్యముచేసుకొనుటకు మనము అర్హులమా, వాడు అర్హతలేనివాడా? తనయాధిక్యమును చూడక తగ్గినవాడుగా నిలచి యుపకరించువాడైయుండగా యేహేతువుచేత నీవు దుఃఖసముద్రమందు పడియున్నావు అని తిరుమళిశైప్పిరాన్ ఆనతిచ్చిన 4 ‘‘అత్తనాకి’’ అను పాశురమున్ను ఈచరమశ్లోకమునకు అర్థముగా ననుసంధించవలయునని యీ సూత్రార్థము.

కాగా ఈశ్లోకముచేత సిద్ధోపాయ స్వీకారమునకు అంగముగా త్యాజ్యములైన మోక్షసాధన 5 ధర్మవిశేషములను(సర్వధర్మాన్)అను పదముచేతను, ఆధర్మముల 6 త్యాగప్రకారమును(పరిత్యజ్య)అను పదముచేతను,ఆధర్మములను త్యజించిన తరువాత ఆశ్రయింపబడు సర్వేశ్వరుని

---

1 హితమనగా _ పరలోకసుఖకరమైన వ్యాపారము. 2 ప్రియము _ తత్కాలసుఖకరవ్యాపారము. 3 అపకృష్టత్వము . నైచ్యము. 4 తి_చ. వి. ౧౧౪.

5 ధర్మములనిచెప్పక ధర్మవిశేషములనిచెప్పడము ముముక్షువైనపుడే కామ్యకర్మములన్నియు త్యాజ్యములైనవిగనుక ఇకను త్యాజ్యముకావలసినది మోక్షఫలసాధనములేగాన వాటిని ధర్మవిశేషములని చెప్పబడుచున్నవి. 6 త్యాగమును అనిచెప్పక త్యాగప్రకారమును అనుటచేత. త్యాగము,తామస రాజస సాత్వికములని త్రివిధముగా యుండుటవల్ల వాటిలో అజ్ఞానమువల్లకలుగు తామసత్యాగమున్ను, అశక్తివల్లకలుగు రాజసత్యాగమున్ను స్వీకారాంగముకానందున, ఇకను వుండునది సాత్వికత్యాగమే గాన అది జ్ఞానమూలమై ‘‘స్వరూపపురుషార్థవిరోధిగాన ఇవి మనకు ఉపాయములు

యొక్క సౌలభ్యాదికల్యాణగుణయోగమును(మామ్)అనుపదముచేతను, ఆగుణములుగల సర్వేశ్వరుఁడు ఇతరసహాయమును అపేక్షించని నిరపేక్షుడని (ఏకం) అనుపదముచేతను, నిరపేక్షుఁడైన సర్వేశ్వరునికి గల ఉపాయత్వమును (శరణం) అను పదముచేతను, ఆ నిరపేక్షవస్తువును ఉపాయముగా స్వీకరించుటను (వ్రజ) అనుపదముచేతను, అట్లు స్వీకరింపబడిన ఉపాయభూతుఁడైన సర్వేశ్వరుని జ్ఞానశక్త్యాది గుణయోగమును(అహం)అనుపదముచేతను,ఆకల్యాణగుణములు గల సర్వేశ్వరునియందు న్యస్తభరుడైన అధికారిని (త్వా) అను పదముచేతను, ఈ ఉపాయనిష్ఠునికి విరోధియైన పాపసమూహములను (సర్వపాపేభ్యః) అనుపదముచేతను, 1 ఆపాపములను నివర్తింపించే ప్రకారమును (మోక్షయిష్యామి) అనుపదముచేతను, ఆ పాపములను నివర్తింపచేయుచున్న సర్వేశ్వరుని యాశ్రయించిన అధికారికిగల 2 నైర్భర్యమును (మాశుచః) అనుపదముచేతను చెప్పబడినదాయెను.

---

"కావు" అని ఉపాయముగా అనుష్ఠించమియే సాత్వికత్యాగముగనుక త్యాగప్రకారమని చెప్పబడెను. 1 పాపములను నివర్తింపించుట అనిచెప్పక నివర్తింపించేప్రకారము అనుటవల్ల రక్ష్యరక్షకభూతులైన చేతనేశ్వరుల యిద్దరిప్రయత్నములులేకనే పాపములు తనంతటనే విడిచిపోవుప్రకారము అనిభావము. 2 నైర్భర్యము-పూర్తి; నైర్భర్యశబ్దము పూర్తికి అర్థమగునాయనిన; "నిర్గతోభరోయస్మాత్, సః - నిర్భరః, తస్యభావః - నైర్భర్యమ్" అయినది. భరమనగా స్వరక్షణేస్వాన్వయమై, అదినివర్తించినవాడు నిర్భరుఁడై, వానిధర్మము నైర్భర్యమై, అదికలిగినతరువాత యీ అధికారికి ఫలించునది, సర్వజ్ఞుడై, సర్వశక్తియై, నిరుపాధికశేషియైన ఈశ్వరుని నిరుపాధికరక్షణముగనుక, పాపాంశములో కొన్నినివర్తించకవుండునట్టి అపూర్తిన్ని, ప్రాప్యాంశములో కొన్ని ప్రాప్తించని అపూర్తిన్ని, ఫలముపొందుటలో కాలతామసము నే అపూర్తిన్ని లేనందున విరోధినివృత్తిలో పూర్తియు, అభిమతసిద్ధియందు పూర్తియు, కాలతామసములేని పూర్తిని చూపించుచున్నది,

యశ్చక్రేమఙ్గళాశాస్తిం మనోజ్ఞవరయోగినః । ప్రణమామిదయాక్రాంతం పరవాదిభయఙ్కరమ్॥ ౧॥ శ్రీమతేరమ్యజామాతృ మునీన్ద్రాయమహాత్మనే । శ్రీరఙ్గవాసినేభూయాన్నిత్యశ్రీర్నిత్యమఙ్గళమ్॥ ౨॥ పత్యుర్గశ్రియఙ్గపదాబ్జాభ్యాం ప్రయుఙ్క్తానాయమఙ్గ

